## సదాశివ సమారంభాం


గురు దక్షిణామూర్తి


గురు వేదవ్యాస మహర్షి


గురు శుక మహర్షి


గురు నారద మహర్షి


గురు వాల్మీకి మహర్షి


గురు శ్రీకృష్ణ

## శంకరాచార్య మధ్యమాం


గురు దత్తాత్రేయ


గురు బాబాజి


గురు గౌతమ బుద్ధ


గురు ఆదిశంకరాచార్య


గురు రామానుజాచార్యులు


గురు జ్ఞానేశ్వర్


గురు రవిదాస్


గురు కబీర్ దాస్


గురు చైతన్య మహా ప్రభువు


గురు నానక్


గురు రాఘవేంద్ర స్వామి


గురు వీరబ్రహ్మేంద్ర స్వామి


యోగి వేమన

## అస్మదాచార్య పర్యంతాం


గురు త్రైలింగ స్వామి


గురు లాహిరి మహాశయ


గురు రామకృష్ణ పరమహంస


అమ్మ శారదా దేవి


గురు వివేకానంద


గురు సాయిబాబా


గురు అరబిందో


గురు రమణ మహర్షి


గురు యోగానంద


గురు భక్తివేదాంత ప్రభుపాద


గురు మళయాళ స్వామి


గురు విద్యాప్రకాశానందగిరి


గురు చంద్రశేఖర పరమాచార్య

## వందే గురుపరంపరాం..







"ఉచిత గురుకుల విద్య ఫౌండేషన్" ద్వారా విలువలు, నైపుణ్యాలతో కూడిన విద్య ఉచితంగా + సులభంగా + ఆకర్షణీయంగా + నాణ్యతతో కూడి అందించే సేవా కార్యక్రమంలో బాగంగా ఈ పుస్తకాన్ని భారత ప్రభుత్వపు వెబ్ సైట్( డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా) నుంచి సేకరించి అందిస్తున్నాము. ఇందుకు మేము వారికి కృతజ్ఞత తెలియచేసుకుంటున్నాము.

సాయి రామ్ వారి సేవల విస్తరణలో బాగంగా ఈ ఫౌండేషన్ స్థాపించబడినది. ఈ స్వచ్ఛంద సంస్థ ద్వారానే అన్ని సేవలు అందించబడును. ఇటువంటి పుస్తకాలు మీరు వ్రాసినట్లయితే (లేక) సేకరిస్తే మాకు తెలియచేయండి. మేము ప్రతి విద్యార్థికి ఉచితంగా అందేలా చేస్తాము, తద్వారా ఉన్నత విలువలు, నైపుణ్యాలు కలిగిన విద్యార్థులను మన దేశానికి అందించవచ్చు. మాతో కలిసి నవ భారత నిర్మాణ కార్యక్రమంలో పనిచేయుటకు, భాగస్వామ్యం అగుటకు ఆసక్తి ఉంటే సంప్రదించగలరు.

ఈ గ్రంధాలను ఉచితంగా ఆన్ లైన్ లో చదువుటకు, దిగుమతి(డౌన్లోడ్) చేసుకొనుటకు గల మార్గాలు:

1) భారత ప్రభుత్వపు వెబ్ సైట్: http://www.new.dli.ernet.in
2) ఉచిత గురుకుల విద్య ఫౌండేషన్ వెబ్ సైట్ : www.freegurukul.org
3) సాయి రామ్ వెబ్ సైట్ : https://sites.google.com/site/sairealattitudemanagement
4) మొబైల్ ఆప్: Free Gurukul

గమనిక: భక్తి,జ్ఞాన,ధర్మ ప్రచారార్ధం ఉచితంగా eBook రూపంలో భారత ప్రభుత్వపు డిజిటల్ లైబ్రరీ సహాయంతో ఇవ్వడం జరిగింది. ఇది లాభార్జన దృష్టిలేని ఉచిత సేవ. ఈ సేవలో అంతర్జాలంలోని(ఇంటర్నెట్) లైసెన్సు / కాపీరైటు అభ్యంతరాలు లేనివి అనుకొన్న పుస్తకాలను గ్రహించటం జరిగినది. అనుకోకుండా ఏవైనా అభ్యంతరకరమైనవి ఉన్నచో మాకు తెలుప మనవి, వాటిని తొలగించగలము అని మనవి చేసుకొంటున్నాము.

Website: www.freegurukul.org Mobile App: Free Gurukul email: support@freegurukul.org
Facebook: www.facebook.com/freegurukul Help Line / WhatsApp: 904 202 0123

" మన లక్ష్యం: విలువలు, నైపుణ్యాలతో కూడిన విద్య అనేది ఉచితంగా + సులభంగా + ఆకర్షణీయంగా + నాణ్యతతో కూడి అందరికి అందించబడాలి "

ఉచిత గురుకుల విద్య ఫౌండేషన్ – Free Gurukul Education Foundation

సర్వం పరమాత్మ పాద సమర్పణమస్తు

## భారత ప్రభుత్వపు వెబ్ సైట్ - డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా

## http://www.new.dli.ernet.in

Digital Library of India: Inc ×

www.new.dli.ernet.in

# Digital Library of India

Hosted by: Indian Institute of Science, Bangalore in co-operation with
CMU, IIIT-H, NSF, ERNET and MCIT for the Govt. of India and 21 major participating centres.

Home | Vision | Mission | Goals | Benefits | Content Selection | Current Status | People | Funding | Copyright Policy | FAQ | RFP

Books Journals Newspapers Palm-Leaves (Manuscripts)

Title: Ramayanam
Author:
Year: to
Subject: Any Subject
Language: Telugu
Scanning Centre: Any Centre

Clear | Search

Presentations and Report
Statistics Report
Status Report
Feedback | Suggestions | Problems | Missing links or Books

Click here for PDF collection
DLI MIRROR at IUCAA Data Center PUNE

DLI

For the first time in history, the Digital Library of India is digitizing all the significant works of Mankind.

Click Here to know More about DLI New!

| Books | Journals | Newspapers | Manuscripts |
|---|---|---|---|
| Rashtrapati Bhavan<br>CMU-Books<br>Sanskrit<br>TTD,Tirupathi<br>Kerala Sahitya Akademi | INSA | Times of India<br>Indian Express<br>The Hindu<br>Deccan Herald<br>Eenadu<br>Vaartha | Tamil Heritage Foundation<br>AnnaUniversity NEW! |

**Title Beginning with.**

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

**Author's Last Name**

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

**Year**

| 1850-1900 | 1901-1910 | 1911-1920 | 1921-1930 | 1931-1940 | 1941-1950 | 1951- |
|---|---|---|---|---|---|---|

**Subject**

| Astrophysics | Biology | Chemistry | Education | Law | Mathematics | Mythology | Religion | For more subjects... |
|---|---|---|---|---|---|---|---|---|

**Language**

| Sanskrit | English | Bengali | Hindi | Kannada | Marathi | Tamil | Telugu | Urdu |
|---|---|---|---|---|---|---|---|---|

# అతి విశిష్టం ఈ దానం!

స్వామి వివేకానంద

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.

రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, ఐవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!



ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014



# మహాభారతము

## వచనము

## భీష్మపర్వము


ఇది

శ్రీ మంత్రి లక్ష్మీనారాయణశాస్త్రిగారిచే

వ్రాయబడి

శ్రీ జయంతి జగన్నాథశాస్త్రిగారిచే

సంస్కరింపఁబడినది



పబ్లిషర్సు :

కొండపల్లి వీరవెంకయ్య అండ్ సన్సు

శ్రీ సత్యనారాయణ బుక్ డిపో

రాజమండ్రి

1956

# విషయసూచిక



# శ్రీ మహాభారతము

## వచనము

## భీష్మపర్వము

దేవా! హరిహరనాథా! జనమేజయమహారాజు అధికవినయు భక్తులు గలవాడై వైశంపాయనమునీంద్రుని జూచి యిట్లనెను. మహాత్మా! వైశంపాయన మునీంద్రా! ముందు చెప్పినప్రకారము కౌరవపాండవులు జయకాంక్షచేత యుద్ధము చేయదలచి తమతమ సైన్యములను దీసుకొని కురుక్షేత్రమందు నిలిచిరని చెప్పితివి. ఆకౌరవులును పాండవులును తమతమ భుజాబలములచేత యేప్రకారము యుద్ధముచేసిరో అది చెప్పవే యని యడిగెను. ఇట్లు జనమేజయుడు అడుగగా అప్పుడు వైశంపాయన మునీంద్రుడు సంతోషించి జనమేజయుని జూచి యిట్లనెను.

జనమేజయమహారాజా! ముందుచెప్పిన ప్రకారము కౌరవ సైన్యములును పాండవసైన్యములును బయలువెడలి పుణ్యభూమి యగు కురుక్షేత్రమందు దిగియుండి యుద్ధమునకు కాలు ద్రవ్వుచుండెను. అట్లుండగా హస్తినాపురమందుండెడి ధృతరాష్ట్రుడు తనకొడుకులగు దుర్యోధనాదులయొక్క చెడ్డతనమునకు దుఃఖించి ఒంటరిగా కూర్చుండి సంజయునితో చెప్పుకొని విచారపడుచుండెను. ఆ సమయమందు మూడుకాలముల విషయములు తెలిసిన వేదవ్యాస మహామునీంద్రుడు అక్కడికి వచ్చెను. వేదవ్యాస మహామునిని ధృతరాష్ట్రమహారాజు పూజించెను. ఆదివ్యజ్ఞానియగు వ్యాసమునీంద్రుడు తన కొడుకగు ధృతరాష్ట్రుని జూచి యిట్లనెను. ధృతరాష్ట్రుడా!

జ్ఞానములనిచ్చితిని. గనుక నీవు వెళ్ళి కురుక్షేత్రమందు కౌరవ పాండవులకు జరుగు మహాయుద్ధమును చక్కగా చూచి యిక్కడికి వచ్చి యీ ధృతరాష్ట్రునకు చెప్పుము. అని వేదవ్యాస మునీంద్రుడు ధృతరాష్ట్రునకు భారతయుద్ధ క్రమమును చెప్పుటకు సంజయుని నియమించి ధృతరాష్ట్రుని జూచి వేదవ్యాస మునీంద్రుడు యిట్లనెను.

పుత్రుడా! ధృతరాష్ట్రా! ఇప్పుడు భూమియందుండు సకల జనులును నశింపవలసిన క్షయకాలము వచ్చియున్నది. అట్లు నశించు నిమిత్తము యీ భారతయుద్ధము ప్రాప్తించినది. గనుక యిందుకు నీవు దుఃఖించక ధర్మమెక్కడుండునో అక్కడే జయము కలుగునని నిశ్చయించి చింత లేకుండుము. నేనును కౌరవ పాండవులయొక్క కీర్తిని ప్రకాశింపజేసెదను. అని వ్యాసమునీంద్రుడు ధృతరాష్ట్రుని వీక్షించి యిట్లనెను. కుమారా! ధృతరాష్ట్రా! అనేక ఉత్పాతములు లోకమందు కనబడుచున్నవి. జనక్షయము కొరకు అట్టి ఉత్పాతములు గలిగెనని తెలిసికొనుము. ఆ కలిగిన ఉత్పాతములను చెప్పెద వినుము. ఆకాశమందు మేఘములు లేకనే ఉరుములు కలుగుచున్నవి. ఏనుగులును గుఱ్ఱములును విశేషముగా కండ్లయందు నీళ్ళు కార్చుచున్నవి. మృగముల కడుపులనుండి పక్షులుపుట్టుచున్నవి. పసువులు మృగములను యీనుచున్నవి ఒక్కొక స్త్రీ గర్భమందు నలుగురైదుగురు బిడ్డలు పుట్టుచున్నారు. ఆ పుట్టిన బిడ్డలు పుట్టిన తోడనే ఆడుకొనుచు కలకలధ్వని కలుగునట్లు నవ్వుచున్నారు. ఇట్టి విపరీత కార్యములను అనేక స్థలములయందు చూచుచున్నాము. మరియు సూర్యుడుదయించునపుడును, అస్తమించునపుడును సూర్యబింబమునకు నల్లనికాంతి గలుగుచున్నది. మరియు ఆ సూర్యబింబము చుట్టును భయమును కలిగించు కబంధరూపములు కనబడుచున్నవి. (శిరస్సులేని మనుష్యరూపము కబంధమందురు) చంద్రబింబమందలి

మార్గమందు ప్రవర్తింపజేయుటకు నేను శక్తుడను గాను. నాయందు ప్రభుశక్తి లేదు. గనుక నాయందు దప్పిదము లేదు అనువిషయమును తాము యోచించి యీ మాటను చెప్పవద్దు. నా పుత్రులకును పాండవులకును సంధి కలుగు కాలము తప్పిపోయెను. కార్యములును మించిపోయెను. ఇకను నేను సంధి చేయలేను. అని ధృతరాష్ట్రుడు చెప్పగా వ్యాసమునీంద్రు డిట్లనెను.

ధృతరాష్ట్రుడా! ఆ విషయ మంతయు తెలిసినది. ఇక నావలన నీవు వినవలసినవిషయమేమైన నున్న యెడల అడుగుము. అని వ్యాస మునీంద్రుడు చెప్పగా ధృతరాష్ట్రు డిట్లనెను. తండ్రీ! వ్యాసమునీంద్రా! నా కుమారులగు దుర్యోధనాదులకును పాండవులకును జరుగబోవు యుద్ధమందు గెలుపును తెలుపుచుండు నిమిత్తము లున్న యెడల చెప్పుమని యడుగగా వేదవ్యాసమునీంద్రు డిట్లనెను. ధృతరాష్ట్రా! యుద్ధమందు గెలుపును తెలుపు నిమిత్తములు కొన్ని తోచుచున్నవి, అవి చెప్పెదను వినుము. హోమకాలములయందు అగ్నిహోత్రములు మంచి సువాసనలతో ప్రదక్షిణపు మంటలచేత ప్రకాశించు చున్నవి. భేరీ మొదలగు వాద్యములు గంభీరశబ్దములను గలిగి మ్రోయు చున్నవి. మంచి చల్లనిగాలి అనుకూలస్పృశమనోహరములను కలిగించుచు విసరుచున్నది. ఇవి మొదలగు కొన్ని శుభనిమిత్తములు కనబడుచున్నవి. ఈ నిమిత్తములవలన ఆ పాండవ కౌరవులలో ఒక పక్షమువారికి జయము కలుగగలదు. ఆ కౌరవ పాండవులలో యీ పక్షమువారికి సైన్యము అధికమనియు ఆ పక్షమువారికి సైన్యము కొంచమనియు యోచింపరాదు. సైన్యబలపూర్ణము లెట్లున్నను బలాబలములవలన గెలుపు ఓటములను నిశ్చయింపగూడదు. యుద్ధమందు గెలుపు ఓటములను దైవాధీనములై యుండును గనుక పెద్దలగువారు యుద్ధము చేయకూడదని చెప్పుదురు. ఇక నేను వెళ్ళి

వచ్చెదను. అని వేదవ్యాసమునీంద్రుడు ధృతరాష్ట్రునితో చెప్పి తనురీతిని అంతర్ధానము పొందెను. వ్యాసమునీంద్రుడు వెళ్ళినపిమ్మట ధృతరాష్ట్రుడు కొంతసేపు విచారమును పొంది నిట్టూర్పును విడిచి సంజయుని జూచి యిట్లనెను. సంజయుడా! యీ భూమినిమిత్తమై ప్రాణములనైనను లక్ష్యపెట్టక అతిభయంకరములైన యుద్ధములను రాజులు చేయుచుందురు. పూర్వపు రాజులును యీ ప్రకారముగానే యీ భూమినిమిత్తము భయంకరములగు యుద్ధములను చేసి యున్నారు. ఈ భూమియందెంత రుచికలదో తెలియదు. మహా మునులయొక్క సాంగత్యమువలన జగత్స్వరూపమంతయు నీకు తెలిసే యుండును. గనుక యీ భూమియొక్క స్వరూపాది పద్ధతి యంతయు నాకు చక్కగా తెలుపుము. అని యిట్లు ధృతరాష్ట్రుడు సంజయుని అడుగగా సంజయుడు ధృతరాష్ట్రునితో యిట్లనెను. ధృతరాష్ట్ర మహారాజా! భూమియొక్క స్వరూప మంతయు నే నెరిగినంతవరకు చెప్పెదను వినుము.

ధృతరాష్ట్రమహారాజా! జంగమ స్థావరరూపమైన చరాచర ప్రపంచమంతయు ప్రత్యేకముగా యీ భూమియందే పుట్టుచున్నది. ఆ పుట్టిన ప్రపంచమంతయు యీ భూమియందే పెరుగుచున్నది. వృద్ధిపొందుచున్నది. కడపట ఆ ప్రపంచమంతయు యీ భూమియందే నశింపుచున్నది. గనుక సకల చరాచర ప్రపంచమంతయు యీభూమి పైననే ఆధారపడియున్నది. అదిగాక మరియొక విశేషమును చెప్పె దను వినుము. ఆకాశమునకు శబ్దమొక్కటే గుణము. వాయువునకు శబ్దస్పర్శములు రెండును గుణములు. అగ్నికి శబ్దస్పర్శ రూపములు మూడును గుణములు. జలమునకు శబ్దస్పర్శ రూపరసములు నాలు గును గుణములు. భూమికిశబ్దస్పర్శ రూప రస గంధము లను అయిదు గుణములు కలిగియున్నవి. గనుక సకల భూతలములకంటె భూమి

గుణ్యాధిక్యత కలిగియున్నది. ఆ కారణముచేత తక్కిన నాలుగు భూతములకంటె యీ భూమియను మహాభూతము శ్రేష్ఠమైనది. ఈ భూమి వుండు పద్ధతిని వినగోరితివేని చెప్పెదను వినుము.

## సంజయుడు ధృతరాష్ట్రునకు భూ పరిమాణము చెప్పుట

ధృతరాష్ట్రమహారాజా! భూమికి మధ్యప్రదేశమందు మేరు పర్వతము గలదు. ఆ మేరుపర్వతమునకు బంగారు కొండయను పేరు కలదు. ఆ మేరుపర్వతమునకు దక్షిణపుదిక్కున ఒక నేరేడుచెట్టు కలదు. ఆ నేరేడుచెట్టునకు సుదర్శనమను పేరుగలదు. ఆనేరేడుచెట్టు రెండువేల ఏడువందల యోజనములు పొడవుగలిగి అధికమగు వెడల్పుగలిగి యున్నది. ఆ నేరేడుచెట్టునందు రసముతో కూడిన తియ్యని పెద్ద నేరేడుపండ్లు సర్వకాలములందును ఫలించుచుండును. ఆ నేరేడుపండ్లు సర్వదా క్రిందరాలును. భూమిమీద పడుచుండుట చేత గొప్పధ్వని కలుగుచుండును. అట్లు వ్రాలిన నేరేడుపండ్లన్నియు పగిలి, పండ్లయందుండు రసము అంతయు పొంగి నదీరూపముదాల్చి ప్రవహించుచుండును. ఆ నేరేడుపండ్లయొక్క రసరూపమైన మహానది మేరుపర్వతమును చుట్టుకొనుచు, ప్రదక్షిణముగా ప్రవహించుచు వుత్తర కురుభూములయందు ప్రవేశించి సముద్రమందు కలియుచున్నది. నేరేడుచెట్టునకు జంబూవృక్షమని పేరుగలదు గాన ఆ నది జంబూ నదియని చెప్పబడును. జంబూనది ప్రవహించిన ప్రదేశము లన్నియు బంగారు మయములై యున్నవి. గనుకనే బంగారమునకు జంబూ నద మందురు.

ధృతరాష్ట్ర మహారాజా! ఆ జంబూనదియందుండు జలమును త్రాగిన మనుష్యులకు ముదిమియు, వ్యాధియు, శ్రమయు. ఆకలి దప్పులును కలుగవని చెప్పుదురు. ఆజంబూనదికి పడమట దిక్కున

జంబూషండ మను మహాసరస్సుగలదు. ఆసరస్సునందు తామరలు పెరిగి అరణ్యమువలె నుండును. ఆజంబూషండమను సరస్సువిశాలమై సముద్రమువలె నుండును. దీనికంతకు జంబూవృక్షముకారణము. ఈ ద్వీపమందు ఆజంబూవృక్ష మున్నందున యీద్వీపము జంబూద్వీప మందురు. చుట్టును సముద్రజలముచేత చుట్టబడియున్న భూ ప్రదేశము నకు ద్వీపమందురు. ఆజంబూవృక్షమునకు సుదర్శనమను పేరుగలదు. గాన యీద్వీపమునకు సుదర్శనద్వీపమని పేరుకలదు. అట్టి జంబూ ద్వీపము ఉప్పునీళ్ళసముద్రముచేత చుట్టబడియున్నది. ఆజంబూద్వీప మందు పొడవుగా తూర్పుపడమరలకు రెండుదిక్కులను ఉప్పునీళ్ళ సముద్రము అనుకొనియుండును. మేరుపర్వతమునకు దక్షిణపుదిక్కున నిషధపర్వతమును, దానికివతల ప్రక్కగా హేమకూటపర్వతమును దాని కివతలగా హిమవత్పర్వతమును, యిట్లు మూడు ముఖ్యపర్వత ములు గలవు. ఈ మూడుపర్వతముల యందును సిద్ధసాధ్యచారణ గణములు సంచరింపుచుందురు. ఈపర్వతములు రత్నమయములగుచు మనోహరములై యుండును. మేరుపర్వతమున కుత్తరపుదిక్కున నీల పర్వతమును దానికవతల శ్వేతపర్వతమును దాని కవతల శృంగ వంతమను పర్వతమును యిట్లు మూడు ముఖ్యపర్వతములు గలవు. ఈ మూడుపర్వతములును రత్నమయములై మనోహరము లగుచు సిద్ధసాధ్యచారణాది దేవగణములచేత సేవింపబడుచుండును. హిమవ త్పర్వత హేమకూటపర్వత నిషధపర్వతములకు వుత్తరపుదిక్కు గాను, నీలపర్వత, శ్వేతపర్వత, శృంగవంతపర్వతములకు దక్షిణపు దిక్కుగాను మేరుపర్వతమున్నదని తెలుసుకొనుము. సకలభూమికిని సకలపర్వతములకును మేరుపర్వతము నడుమ నున్నందున ఆమేరు పర్వతము తామరాకునడుమనుండు తామరదుంపవలె నున్నది. ఆ మేరుపర్వతము బంగారుమయముగాను రత్నమయముగాను మహో

మహిమచేత ప్రకాశించుచున్నది. మేరుపర్వతముయొక్క వెడల్పు పదియారువేల యోజనములు కలిగియున్నది. మేరుపర్వతముయొక్క పొడవు యెనుబదినాలుగువేల యోజనములని మహామునులును దేవతలును లెక్కించియున్నారు.

ధృతరాష్ట్రమహారాజా! ఈప్రకారముగా నుండు మేరుపర్వతము భూమండలమునకు నట్టనడుమనం దున్నది. మేరుపర్వతమందు దేవతలును దేవమునులను, గంధర్వకింపురుషాది దేవయోనులును దేవేంద్రుడు మొదలగు అష్టదిక్పాలకులును, బ్రహ్మదేవుడును, ఆయా ప్రదేశములయందు పుణ్యావర్తనములచేత మహాసుఖములను అనుభవింపుచుందురు. మేరుపర్వతముయొక్క వుత్తరపుదిక్కున ఒక శిఖరము క్రిందనుండు రేలచెట్ల వనమందు పార్వతీసమేతముగా శివుడు విహరించును. ఆ శివుని చుట్టును సిద్ధగణములు సర్వదా సేవించుచు చుట్టుకొనియుందురు. ధృతరాష్ట్రమహారాజా! యీజంబూద్వీపము తొమ్మిదిఖండములుగా యేర్పరచబడి వర్షములను పేర్లచేత వ్యవహరింపబడు దేశములను చెప్పెదనువినుము. 1 ఈ జంబూద్వీపమున కుత్తరపుదిక్కున ఉప్పునీటిసముద్రమునకును శృంగవంతపర్వతమునకును నడుమనుండు దేశము ఐరావతవర్ష మనబడును. 2 శ్వేతపర్వతమునకును శృంగవంతపర్వతమునకును నడుమనుండు దేశము హైరణ్మయవర్ష మనబడును. 3 నీలపర్వతమునకును శ్వేతపర్వతమునకును నడుమనుండు దేశము రమవర్షమందురు. 4 నీలపర్వతమునకును మేరుపర్వతమునకును నడుమగల దేశమున కవర్షమనబడును. 5 మేరుపర్వతమునకు తూర్పునగల దేశము భద్రాశ్వవర్ష మందురు. 6 మేరుపర్వతమునకు పడమరనుండు భూభాగము కేతుమాలావర్షమని చెప్పబడును. 7 నిషధపర్వతమునకును హేమకూట పర్వతమునకును నడుమనుండు దేశము హరివర్షమనబడును. 8 హేమకూట

పర్వతమునకును హిమవత్పర్వతమునకును నడుమగల దేశము కింపు రుషవర్షమందురు. 9 హిమవత్పర్వతమునకు దక్షిణముగనుండు దేశ మంతయు భారతవర్షమని చెప్పబడును. యీరీతిగా ఉప్పునీటి సము ద్రమునకు మధ్యనుండు జంబూద్వీపము తొమ్మిదివర్షములుగా వ్యవ హరింపబడుచున్నది మనముండుభూమి భారతవర్షమని చెప్పబడును. ఈ భారతవర్షమున కుత్తరపుదిక్కున నివసించు జనులకు అధికబల బుద్ధిశక్తులును, ఆరోగ్యమును. ఆయుర్వృద్ధియును, సౌఖ్యమును, పుణ్యకర్మాధిక్యతియును కలిగి యుండును గనుక యీ భారతవర్షపు భూమియందు ఉత్తరపుదిక్కుకు పోనుపోను అధికపుణ్యభూమియని తెలిసికొనుము. అని సంజయుడు చెప్పగా ధృతరాష్ట్రుడు విని యిట్లనెను.

సంజయా! సకల ద్వీపములయొక్కయు, సకల సముద్రము యొక్కయు ప్రమాణములను ఆయాద్వీపసముద్రములుండు క్రమ మును చక్కగా తెలియునట్లు చెప్పుము. అని ధృతరాష్ట్రుడడుగగా సూతపుత్రుడగు సంజయుడు ధృతరాష్ట్రునితో నిట్లనెను. ధృత రాష్ట్రమహారాజా! జంబూద్వీప విష్కంభము పరిమితి యెనుబది నాలుగువేల ఆరునూరు యోజనములుండును. దీనికి రెండింతలుఉప్పు నీటిసముద్రపరిమితి యగును. ఆ వుప్పునీటి సముద్రపరిమితికి రెండిం తలు చెరకునీటిసముద్ర పరిమితియగును. ఆ చెరకునీటిసముద్ర పరిమి తికి రెండింతలు కల్లుసముద్రపరిమితి యుండును. ఆ కల్లుసముద్రపరిమి తికి రెండింతలు నేతిసముద్ర పరిమితికలదు. ఆనేతి సముద్ర పరిమితికి రెండింతలు పెరుగుసముద్ర పరిమితికలదు. ఆపెరుగుసముద్ర పరిమితికి రెండింతలు పాలసముద్ర పరిమితిగలదు. ఆపాలసముద్రమునకు రెండిం తలు మంచినీటిసముద్రపరిమితిగలదు ఈరీతిగా ఏడుమహాసముద్రము లయొక్క పరిమాణవిష్కంభ యోజనములు ఒకటికొకటి రెట్టింపు

గలిగియుండును. విష్కంభయోజనమనగా చతుర్వుయోజనమగును. యోజనమనగా ఆమడయగును. జంబూద్వీప పరిమితి విష్కంభ యోజనములకు రెండింతలు ప్లక్షద్వీప పరిమితియగును. ప్లక్షద్వీప పరిమితికి రెండింతలు శాల్మలద్వీప పరిమితియుండును. ఆశాల్మలద్వీప పరిమితికి రెండింతలు క్రౌంచద్వీప పరిమితిగలదు. ఆక్రౌచంచద్వీపపరి మితికి రెండింతలు కుశద్వీప పరిమితిగలదు. ఆకుశద్వీప పరిమితికి రెం డింతలు శాకద్వీప పరిమితియగును. ఆశాకద్వీప పరిమితికి రెండింతలు పుష్కరద్వీప పరిమితియగును. ఆయాద్వీపములకును ఆయామహా సముద్రములకును ముందుచెప్పిన లెక్కప్రకారము యేర్పడినవిష్కంభ పరిమాణ యోజనములను చెప్పెదను వినుము. జంబూద్వీపము యొక్క విష్కంభయోజనములు 80,.600. ఉప్పునీటిసముద్రపు విష్కంభప్రమాణ యోజనములు 1. 61, 200. ఈజంబూద్వీపము ఆవుప్పునీటిసముద్రముచేత చుట్టుముట్టియుండును. ప్లక్షద్వీపముయొ క్కవిష్కంభప్రమాణ యోజనములు 161200. చెరుకునీటిసముద్రము యొక్క విష్కంభప్రమాణ యోజనములు 322400. ఆప్లక్షద్వీప మాచెరకునీటి మహాసముద్రముచేత. చుట్టును చుట్టబడియుండును. శాల్మలద్వీపముయొక్క విష్కంభప్రమాణ యోజనములు 322400. కల్లుసముద్రముయొక్క విష్కంభప్రమాణ యోజనములు 644800. ఆశాల్మలదీప మాకల్లుసముద్రముచేత చుట్టును చుట్టబడియుండును. క్రౌంచద్వీపముయొక్క విష్కంభ ప్రమాణ యోజనములు 644800. నేతిసముద్రముయొక్క విష్కంభప్రమాణ యోజనములు 1289600. ఆక్రౌంచద్వీప మానేతిసముద్రముచేత చుట్టబడియుండును.కుశద్వీపము యొక్క విష్కంభప్రమాణ యోజనములు 1289600. పెరుగుసము ద్రముయొక్క విష్కంభప్రమాణ యోజనములు 2579200. కుశ ద్వీప మాపెరుగుసముద్రముచేత చుట్టును చుట్టబడియుండును. శాక

ద్వీపముయొక్క విష్కంభప్రమా యోజనములు 2579200. పాల. సముద్రముయొక్క విష్కంభప్రమాణ యోజనములు 5158400 శాకద్వీపముపాలసముద్రముచేత చుట్టునుచుట్టబడియుండును. పుష్కరద్వీపముయొక్క విష్కంభప్రమాణ యోజనములు 5158400 మంచినీళ్ళసముద్రముయొక్క విష్కంభ ప్రమాణయోజనములు 10316800. ఆపుష్కరద్వీప మా మంచినీళ్ళసముద్రముచేత చుట్టబడియుండును,

ధృతరాష్ట్రమహారాజా! యీ ప్రకారముగా సప్తద్వీపములయొక్కయు సప్తమహాసముద్రములయొక్కయు స్వరూపప్రమాణములను మహామునులవలన నేనువినినరీతిగా నీకుచెప్పితిని ఈ సప్తద్వీపములును, యీసప్తమహాసముద్రములును ఒకటివెంబడిఒకటి క్రమముగా నున్నవని తెలిసికొనుము. జంబూద్వీపమందువలెనే తక్కిన ఆరుదీవులయందునుగూడ అనేకపర్వతములు, అనేక నదులు కలిగియున్నవి గనుక జంబూద్వీపమువలెనే తక్కిన ఆరుదీవులునుగూడ అనేకవిషయములచేత పొగడదగియున్నవి. ఆ ఆరుద్వీపములునుఅనేకదేశవిభాగములుకలిగి క్రమముగా ఒకటికంటె మరియొకటి గుణవిశేషములయందు అధికములై యుండును. ఈ చెప్పినప్రపంచమునంతయు సృష్టించుటకును రక్షించుటకును సంహరించుటకును శ్రీమన్నారాయణమూర్తి ప్రభువుగానుండును. ఆనారాయణమూర్తి పాలసముద్రమునందు వుత్తరపుదిక్కున బంగారుమయమైన మనోహరమగు నొకబండియందుండి విహరించుచుండును. ఆబండి యెనిమిదిచక్రములుగలిగి అధిక బలశక్తివంతమై యుండును. ఆబండి మనోవేగముగలిగి యుండును. ఆమనోహరమైన బండియందు శ్రీమన్నారాయణమూర్తి వినోదముకొరకు నివసించి వైకుంఠుడను ప్రసిద్ధనామమును పొంది విహరించుచుండును. అని సంజయుడు చెప్పగా ధృతరాష్ట్రుడు

విని యిట్లనెను. సంజయా! యీభారతవర్షమందు కౌరవపాండవులు అత్యాశగలవారై ఒకరితోనొకరు యుద్ధముచేయుటకు ప్రయత్నించి యున్నారు గనుక ఆ కౌరవపాండవులు పరమలోభగుణవంతులు. వీరి నంటిలుబ్ధులు మరియెక్కడను కనబడరు. అతనిధృతరాష్ట్రుడు చెప్పగా సంజయు డిట్లనెను.

ధృతరాష్ట్రమహారాజా! పాండవులు అత్యాశనుగలిగియుండ లేదు. నీకొడుకగుదుర్యోధనుడుఅధికలుబ్ధబుద్ధిగలవాడు. దుర్యోధనుడు శకునిమాటలనువిని దుర్మార్గమందు ప్రవర్తించినందునయుద్ధము సంభ వించినది. గనుక నీకొడుకగు దుర్యోధనునియందే లోపమున్నదిగాని ధర్మాత్ములైన పాండవులయందు యెంతమాత్రమునుగూడ లోపము లేదు. కొన్ని దేశముల రాజులు నీతో స్నేహము గలిగియున్నం దున తమతమ దేశములను తాము దక్కించుకొనుటకును పాండవు లను గొప్పగా గెలిచితిమని చెప్పుటకును మీకు సహాయముగా వచ్చియున్నారు. ఇప్పుడు యుద్ధముచేయువారిని గురించి విచారపడ నవసరములేదు. పూర్వపు రాజులు యీ భూమినిమిత్తమై యీరీతి గానే యుద్ధముచేసి భూమియందు అక్కడ అనేకులు పడిచచ్చిరి. ఈ ప్రకారమే యుద్ధముచేసి జయించి పూర్వపురాజులగు భగీరథ. రఘు, యయాతి, నహుషులు మొదలగువారు కీర్తివంతులై సామ్రాజ్యలక్ష్మిని అనుభవించిరి.

## సంజయుడు ధృతరాష్ట్రునకు భారతవర్షమునగల విశేషములు చెప్పుట

ధృతరాష్ట్రమహారాజా! రాజులగువారు యీ భారతవర్ష మందు గల మహాదైశ్వర్యమునకు ఆశపడియుందురు. అట్టి ఆశచేత యుద్ధములు చేయుచుందురు. భారతవర్షమందుగల విశేషములను

చెప్పెదవినుము. 1 మలయపర్వతము 2 శుక్తిమంత పర్వతము 3 వింధ్యపర్వతము 4 పారియాత్ర పర్వతము 5 మహేంద్రపర్వతము 6 ఋక్షవంతము 7 సహ్యాపర్వతము ఇట్లు భారతవర్షమందు కుల పర్వతములు యేడుగలవు. ఈ యేడుపర్వతములయందును నానా విధములైన మణులయొక్క గనులును బంగారుగనులును అనేక ములు గలవు. ఈ కులపర్వతము లేడును గాక అనేకములైన వుప పర్వతములు యీ భారతవర్షమందుగలవు. ఆవుప పర్వతములయందు యినుమును రాగియు తగరము వెండి బంగారములు పుట్టెడు గనులు అక్కడక్కడ అనేకములు గలవు. ఈ గనులవలన బహుధనములు కూర్చవచ్చును. రాజగువాడు శక్తివంతుడై తెలివిగలిగి ధర్మ మార్గమందు ప్రవర్తించినయెడల వెండి బంగారము మొదలగు ధన ములను కొండలవలననే అధికముగా సంపాదింపవచ్చును. ఈ భారత వర్షమందుగల మహానదులను చెప్పెదను వినుము 1 గంగా నది 2 తుంగభద్ర 3 వేత్రవతి 4 వేగవతి 5 కృష్ణవేణి 6 పెన్న 7 యమున 8 తమస 9 కావేరి 10 గోదావరి 11 నర్మద 12 బహుద 13 సరయువు 14 శతద్రువ 15 వితస్త 16 విపాశ 17 తామ్రపర్ణి 18 విశ్వామిత్ర అను నీపదునెనిమిది భారతవర్షమందు గల మహానదులు. ఈమహానదులేకాక అనేకములైన వుపనదులు యీ భారతవర్ష మందుగలవు. ఈ నదులవలన భూములు ఫలించుటచేత రాజునకు అధికధన ధాన్య సమృద్ధిగలిగియుండును. ఈ భారతవర్షమందు అక్క డక్కడ అనేకములగు గొప్పఅడవులు గలవు. ఆ యడవుల వలన బహుధనములు లభించు వుపాయము లనేకములున్నవి. గనుక రాజునకు నేర్పుతో గూడిన బలశక్తియున్నయెడల అరణ్యముల వలన బహువిధములచేత ధనములు లభించగలవు. ఇక నీ భారతవర్ష మందుగల దేశములను చెప్పెదను వినుము.

1 పాంచాలము 2 పాండ్యము 3 బర్బరము 4 వత్సము 5 మత్స్యము 6 మగధము 7 మళయాళము 8 కళింగము 9 కుళింగము 10 కుకురువు 11 టెంకణము 12 కొంకణము 13 త్రిగర్తము 14 సాముద్రము 15 సాళ్వము 16 శూరసేనము 17 సుధేష్ణము 18 సుహ్మాకాశము 19 కురువు 20 కరూశము 21 కోసలము 22 యవనము 23 యుగంధరము 24 ఆంధ్రము 25 సింధువు 26 చేది 27 చోళము 28 పుళిందము 29 పుండ్రకము 30 పాండ్యము 31 ఆభోరము 32 సోవీరము 33 సౌరాష్ట్రము 34 మహారాష్ట్రము 35 విదేహము 36 విదర్భము 37 ద్రవిళము 38 దశార్ణము 39 కర్ణాటము 40 గౌళాంగము 41 వంగము 42 మరాటము 43 లాటము 44 బాహ్లీకము 45 బహుదానము 46 కిరాతము 47 కేకయము 48 కుంతి 49 కాశ్మీరము 50 గాంధారము 51 కాంభోజము 52 కేగశము 53 ఘోటము 54 ఘూర్జరము 55 కుంతము 56 లావంతికము 57 అనూపము మొదలగు అనేక దేశములు గలవు. ఈ దేశములు సకలధనాదిసంపదలను కలిగించు గుణవిశేషములచేత ప్రకాశించుచు పురుషార్థములగు ధర్మార్థకామములకు కారణములై మనోహరములై యుండును.

ధృతరాష్ట్రమహారాజా! రాజులగువారు దేశవృత్తాంతములను తెలిసికొని రక్షించుచు జనులయందు కృపగలిగి న్యాయము తప్పక నేర్పరితనముచేత సకలపన్నులను తీసికొనుచు రాజ్యమును పరిపాలించుచు కీర్తిని పొందవలయును. అటువంటి రాజులకు యీ భూమి కామధేనువువంటిదై కోరినసంపదల నన్నిటిని యిచ్చుచుండును. గనుక సైన్యబల భుజాబలము గల రాజులు తమకెంత రాజ్యమున్నను చాలునని తృప్తిబొందరు. అట్టిరాజులు తండ్రియనియు, బిడ్డలనియు, అన్నదమ్ములనియు తలచక యెటువంటివారిమీదకైనను

పండుతీసికొనపోయి యుద్ధముచేసి భూమినితీసికొందురు. గనుక ఓ ధృతరాష్ట్ర మహారాజా! యీభూమికొరకు కౌరవపాండవులును కొట్టుకొనుటకు ప్రయత్నించుచున్నారు. ఇది కూడనికార్యము కాదు. ఈరెండు పక్షములవారిలో దైవము యేపక్షమందు నిలిచియుండెనో ఆపక్షమువారికి యీభూమి లభింపగలదు. నీవిక దుంఖింపకుము. అని సంజయుడు చెప్పగా ఆమాటను ధృతరాష్ట్రుడు విని యిట్లనెను. సంజయుడా! నీవిక కౌరవులైన నా పుత్రాదులకును పాండవులకును జరుగబోవు భారతయుద్ధమును చూచుటకు వెళ్ళుము అని ధృతరాష్ట్రుడు సంజయునితో చెప్పి తగు మర్యాదతో సంజయుని పంపెను. అంతట సంజయుడు కురుక్షేత్రమునకు వెళ్ళి కౌరవపాండవులకు జరిగిన భారతయుద్ధ క్రమమంతయు చక్కగా చూచి పదియవ దినముయొక్క రాత్రియందు హస్తినాపురమునకు వచ్చెను. ఆ సంజయుడట్లువచ్చి ధృతరాష్ట్రుని గృహములోనికిబోయి తగు మర్యాదతో ధృతరాష్ట్రుని సంజయుడు చూచెను. ధృతరాష్ట్రుడు తన కొడుకులయొక్క చెడునడవడికకు విచారపడుచు దుఃఖించుచుండెను. ఆసమయమందు ధృతరాష్ట్రునిదగ్గర విదురుడును గాంధారియు మరి కొందరు స్త్రీలును ఉండిరి. సంజయుడంతట ధృతరాష్ట్రుని పాదముల మీదపడి పెద్దగొంతెత్తి యేడ్చుచు భీష్ముడు యుద్ధమందు పడిన పాటును చెప్పుచు యేడ్చుచుండెను. ఆ యేడ్పు తోడనే సంజయుడు ధృతరాష్ట్రునితో నిట్లుచెప్పెను.

ధృతరాష్ట్రమహారాజా! తనయుద్ధభటులకందరికిని భీష్ముడు ఆధారుడై యుండును. ఆ భీష్ముడు నేడు బాణములను ఆధారముచేసి కొని ఆబాణముల పాన్పుమీద పండుకొనియున్నాడు. భీష్ముడుపరశురాముని జయించిన ఘనుడగాడు. ఆభీష్ముడు నేటిదినమందు శిఖండిచేత జయింపబడెను. భీష్ముని నమ్మి పూర్వము దుర్యోధనమహారాజు బాధ

మూడి ఆజూడనుందు గెలిచెను. ఇక్ష్వాకు యుద్ధమును జూచుచుండతడు ఓడిపోయెను. భీష్ముని సింహనాదధ్వనివంటి మాటలచేత శత్రువులు భయపడి క్రిందబడుచుండు. భీష్ముడే నేడు క్రిందబడెను. భీష్ముడనుసూర్యుడు పదిదినములు యుద్ధముచేసి పాండవసైన్యము లను చీకట్లను క్రమముగా తన తీక్ష్ణబాణములను కాంతులచేత క్షీణింపజేసి యీదిన మందు అస్తమించెను. ఈపదిదినములలో భీష్ముడు పదివేలమంది రాజులను సంహారించెను. భీష్ముడీదినమందు శిఖండిచేత క్రిందబడెను. భీష్ముడు కేవలము నరసింహమూర్తియని చెప్పదగునుగాని కేవలము మనుష్యమాత్రుడనుటకు వీలుపడదు. నరసింహమూర్తితో సమానుడగు భీష్మునిధనుస్సునోరు, బాణములు తీక్ష్ణమునైన కోరలు, యినుప బాణములు గోళ్ళు, మిక్కిలి తీక్ష్ణమైనకత్తి నాలుక, వీనితో నరసింహమూర్తివలె శత్రువులకు మహాభయము కలిగించుచుండును. గనుక భీష్ముడు కేవలమును మనుష్యమాత్రుడని చెప్పరాదు. ప్రళయకాల రుద్రమూర్తివంటి మహాబలపరాక్రమవంతుడైన భీష్ముడు యీదినమందు బలహీనుడైన శిఖండిచేత భూమిమీదపడెను. కాలపరిపక్వమును తప్పించుకొనుటకు యెంతవారికైనను సాధ్యముకాదు. అని సంజయుడు దుఃఖించుచు పెద్దగా ఏడ్చుచు భీష్ముడు యుద్ధమందు పడెనని చెప్పగా ఆమాటలను ధృతరాష్ట్రుడువిని మూర్ఛిల్లి క్రిందపడెను. అక్కడుండువారంతట చల్లని జలబిందువులను చల్లుటచేతను చల్లనిగాలి మొదలగు వుపచారములు కలుగించుటచేతను ఆధృతరాష్ట్రుని మూర్ఛనుపోగొట్టిరి. కొంతసేపటికి ధృతరాష్ట్రుడు తెలివిగల మనస్సుతో గద్గదస్వరముతో యేడ్చుచు కన్నీరు కార్చుచుండెను.

## ధృతరాష్ట్రుడు భీష్ముని మరణమును విని విలపించుట

జనమేజయమహారాజా! ధృతరాష్ట్రుడు ఏడ్చుచు భీష్మునితలచుకొనుచు యిట్లని దుఃఖించెను. అయ్యో! దైవమా! సకలదేవర్షా

పసులును ఒక్కసారేవచ్చి తనమీదపడినను భీష్ముడు వారందరిని యుద్ధమందు చిక్కపెట్టుటకు సమర్థుడు. అట్టిమహాశక్తివంతుడగు భీష్ముడు శిఖండియొక్క బాణములచేత నశించెను. ఇక నేమని చెప్పవచ్చును. దైవమా! ఆ భీష్ముడు చక్కగా వర్షించు గొప్పమేఘమువంటివాడు. ఆ భీష్మమేఘమునకు తాటిచెట్టు పెక్కెముయొక్క కాంతులు మెరుపులవంటివి. ఆభీష్మునియొక్క ధనుస్సునందలి అల్లెత్రాటివలన కలుగుశబ్దము ఉరుములవంటివి. భీష్ముడను మహామేఘము తీక్ష్ణములైన బాణవర్షముకురిపి శత్రుసైన్యములను కాల్చిచ్చును నశింపజేయుచుండును. అయ్యో! దైవమా! కాలస్వభావమేమని చెప్పను? ఆభీష్ముడను మహామేఘమును శిఖండియను చెడుగాలితాకి నశింపజేసెను. హా శీ! భీష్మా! పాండవులను మహాసముద్రము పొంగివచ్చినప్పుడు నీవొకతీరవలె నాపుదునని, నిన్ను ఆశ్రయముచేసికొనిన సైన్యములు బ్రతుకుననియు తలచియుంటిని. నీవిప్పుడు శిఖండియను నీచమైన చిన్నగుంటనీటిచేత ఆక్రమించబడి మునిగిపోతివి. అయ్యో! దైవమా! ఇక నేనేమిచేయుదును? భీష్ముడు మహాసముద్రమువంటివాడు ఆభీష్మమహాసముద్రమునకు భీష్ముని శౌర్యబలపరాక్రమముగల వీరరసము నీటివంటిది. భీష్మునియొక్క ప్రసిద్ధమైన మహాబాహుశక్తి మొసళ్ళు మొదలగు భయంకరములగు జంతువులవంటిది. భీష్మునియొక్క గదాటెక్కెములు సముద్రమునందుండు పర్వతములు. భీష్ముని బాణపరంపరలు సముద్రము మొక్కలువంటివి. ఆ భీష్మమహాసముద్రమును మెట్టువంటి సమర్థులైనను యుద్ధమందు దాటుటకైనను ఈదుటకైనను శక్తివంతులుకాజాలరు. శిఖండి ఆభీష్మ సముద్రమును యెట్లుదాటుటకు సమర్థుడాయెనో తెలియవలెను. నేనేమి చేయుదును. ఓరీ! శిఖండీ! పూర్వముపరశురాముడుఅంబయనుకన్యకను భీష్ముని తమ్మునకు ఇప్పించి వివాహము చేయించునిమిత్తము భీష్మునిదగ్గ

రకమువచ్చి చెప్పెను. భీష్ముఁ డందులకు సమ్మతింపలేదు. పరశురాముఁడు కోపాగ్నిచే ప్రళయకాలరుద్రునివలె మండిపడుచు యిరువదియొక్క-దినములపర్యంతము భీష్మునితో యుద్ధముచేసి తుదకు ఓడిపోయెను. అట్టిభీష్మునిచంపుటకై నీవు పాండవులపక్షముచేరి భీష్మునిబడగొట్టితివి.

ఓరీ శిఖండి! ఔరా! నీవు మొనగాడవైతివి. నేనిక ఏమి చేయుదును దైవమా! మహాత్ముఁడగు భీష్మునకుగల ఆ శౌర్యమును ఆ బలమును, ఆ మంచిగుణ స్వభావములను, ఆ పరాక్రమమును, ఆ యుద్ధభయంకరమును, ఆ పరిశుద్ధ వ్రతమును విశేషముగా నమ్మి యుంటిని. ఎటువంటి గుణ బల పరాక్రమములు మరియొకనికి లేవని తలచియుంటిని. అటువంటి భీష్ముఁడిప్పుడు శిఖండిచేత నశించెను, ఇక నేమి చేయుదును. అని ధృతరాష్ట్రుడు అనేకవిధములుగా తనకు తానే చెప్పుకొనుచు దుఃఖించి సంజయుని అరచేతిని తన చేతితో నిమురుచు యిట్లనెను.

సంజయుడా! నాతండ్రియగు భీష్ముడు యుద్ధమందు పడి నప్పుడు అడ్డమువచ్చెదమని యెవరునురాలేదా! అట్లు భీష్ముడు పడి నప్పుడు పదునొకండు అక్షౌహిణుల సైన్యములును శత్రువులతో పోరాడక భీష్ముని శత్రువులకు నప్పగించి చూచుచుండెనా? మన శత్రుసైన్యము లన్నియు భీష్మునొక్క-నే గెలువజాలరని నిశ్చయించి తిమి. భీష్ముని పాండవ సైన్యములు గెల్చెనా! ద్రోణుడును, కృపు డును, అశ్వత్థామ, శల్యుడు మొదలగు మహారథికులు భీష్మునకు సహాయమురాక ఏమైరి? శిఖండియు పాండవులును భయంకరముగా భీష్ముని చుట్టుకొనినప్పుడు నా పుత్రులగు దుర్యోధనాదులు భయపడి తమ తాతయగు భీష్ముని విడచి అడవికి వెళ్ళిరేమో తెలియదు. మనవారింతమంది యుండగా భీష్ముడు శిఖండిచేత చావవలసిన కారణ మేమి! ఇక నేనేమి చేయుదును?

సంజయా ! భీష్ముడు చచ్చినపుడే తక్కిన సైన్యములన్నియు చచ్చినవని తలచెదను. భీష్ముడు కౌరవకులమునకును గురుజనులకును పూజ్యుడు. నిర్మల చిత్తముగలిగి మిక్కిలి పుణ్యమూర్తియై యుండును. అట్టి భీష్ముని చంపి పాండవులు రాజ్యమేలుటకు సమ్మతించిరి. వారికి దైవసహాయమున్నది. ఈ పద్ధతిని యోచించగా అధర్మము ధర్మమును కీడుపఱచి తాను అభివృద్ధిని పొందునట్లున్నది. పాండవులు ఆ భీష్ముని చంపి రాజ్యమును తీసికొన నిశ్చయించుట మిక్కిలి క్రూర కార్యమగును. మననిమిత్తమై ఆ భీష్ముడు యుద్ధమందు చచ్చెను. భీష్ముడు చచ్చుటకు మనము సమ్మతించి రాజ్య సంపదలకొరకు పాండవులతో యుద్ధము చేయదలచితిమి. గనుక భీష్ముని చంపుటవలన పాండవులకంటె మన కధిక పాపము సంభవించినది. అన్నికులములకంటె రాచకులము మిక్కిలి క్రూరము. ఈ రాచకులమందు పుట్టరాదు. అని ధృతరాష్ట్రుడు సంజయునితో అనేక ప్రసంగము చేసెను.

సంజయా ! భీష్ముడు లేనందున యీ దినమందు నా సైన్యము మగడులేని విధవస్త్రీవలె నుండును. నేడు భీష్ముడు లేనందున నాకు మారులగు దుర్యోధనాదులెంత దుఃఖించిరో తెలియదు. భీష్ముడు లేనందున యికనెవ్వరు యెట్లుకాగలరో తెలియదు. సంజయా ! రాజులమనియు మంత్రులమనియు పేర్లుపెట్టుకొనిన దుర్యోధన దుశ్శాసన శకుని కర్ణ మొదలగు జూదరులు భీష్ముడు చచ్చినపిమ్మట తమ మనస్సులయందేమి తలంచిరో, యేమని చెప్పుకొనిరో తమకు యిక మీదట యుద్ధమునకు యెవరిని ఆధారముగా జేసికొనిరో చెప్పుము. అని ధృతరాష్ట్రుడు సంజయునితో చెప్పి అతనిచేతిని విడిచి యిట్లనెను. సంజయా ! ఏ విధమైన యుద్ధముచేత పాండవులు భీష్ముని [illegible] చెప్పుము. ఈ పదిదినములును కౌరవ పాండవసైన్యము

లలో యేవిధమైన వ్యూహములు యేర్పరచిరో చెప్పుము. ఆ రెండు పక్షములవారిలో ఎవ్వరెవ్వరు యెప్పుడెప్పుడు, ఏయేమేమి కార్యములను చేసిరో చెప్పుము. ఈ పదిదినములలో భీష్ముడేరీతిగా యుద్ధము చేసెను? అతడు తుద కేరీతిగా మరణించెనో ఆ విషయమంతయు స్పష్టముగా నాకు తెలియునట్లు చెప్పుము. సంజయా! భీష్ముడు చచ్చెనని నా చెవులారా వింటిని. ఇక నెట్టువంటి కఠోరపు మాటలనైన నా చెవులు వినగలవు. ఈ దుర్మార్గమునకు నేను మూలకారణుడను. అట్టి నేను యెట్టి కఠోరపు వాక్యములనైనను వినుటకు సమర్థుడను. యుద్ధక్రమ మంతయు స్పష్టముగా నాకు తెలియునట్లు చెప్పుము. అని ధృతరాష్ట్రుడు సంజయుని అడుగగా సంజయు డిట్లనెను.

ధృతరాష్ట్రమహారాజా! నీవు చెప్పినట్లు నీ అవివేకమువలననే పాండవుల కిన్నికష్టములు కలిగినవి. నీవు పూర్వము పాండవుల చేత జూదమాడించి వారిని అడవిపాలు చేసితివి. అందువలన నీకిపుడు యుద్ధమందుకీడువాటిల్లినది. కీడు చేసినవారికి కీడుకలుగుట ఆశ్చర్యము కాదు. ఇక నీవు కీడనక మేలనక నేను చెప్పెడి యుద్ధక్రమమును వినుము. నీవు నావలన యీ యుద్ధక్రమమును వినదలచియే యుద్ధమును జూచుటకు నన్ను పంపితివి. నేను యుద్ధభూమికి వెళ్ళి వేదవ్యాసమహామునియొక్క కృపవలన నాకు గలిగిన దివ్యజ్ఞానమువలన యుద్ధక్రమమంతయు చూచివచ్చినాను. ఆ దివ్యజ్ఞాన మహిమవలన యీ పదిదినములనుండి నేను జూచినది అక్కడ జరిగినది అగు యుద్ధమును స్పష్టముగా చెప్పెదను వినుము. అని సంజయుడు చెప్పగా ధృతరాష్ట్రుడు యిట్లుచెప్పెను. సంజయా! నీవు చెప్పినట్లు వేదవ్యాస మహామునిపాదములకు నమస్కరించి అతడు నీకు యిచ్చిన దివ్యజ్ఞానముచేత భారతయుద్ధ క్రమమంతయు చక్కగా చెప్పుము. అని ధృతరాష్ట్రుడు చెప్పగా సంజయు డిట్లనెను. ధృతరాష్ట్రమహారాజా!

గొప్పదైన నల్లని దేహము మేఘమువలె ప్రకాశింపగా కాంతివంత మగు కర్రను చేతియందు ధరించినట్టియు బంగారు కాంతిని కలిగి యున్న జడలను ఆభరణముగా గలిగియున్నట్టియు సకల వేద శాస్త్రార్థములను నిస్సంశయముగా ప్రకాశింపజేయునట్టియు కృష్ణాజిన మునే వస్త్రముగా ధరించినట్టియు భారతవంశమును వృద్ధిపొందించి నట్టి వేదవ్యాసమహామునిని సేవించెదను. అని సంజయుడు చెప్పి వేదవ్యాసమహామునిని చిత్తమందు నిలుపుకొని వ్యాసునకు నమస్క- రించి సంజయుడు ధృతరాష్ట్రుని జూచి యిట్లనెను. ధృతరాష్ట్ర మహారాజా! వేదవ్యాసముని నాకు యిచ్చిన దివ్యజ్ఞానముచేత ఆ భారతయుద్ధభూమియందు నేను చూచినట్టియు వినినట్టియు నాదివ్య బుద్ధికి ప్రకాశమైనట్టి భారతయుద్ధ క్రమమంతయు ప్రారంభము మొదలు అంత్యమువరకు చెప్పెదను వినుము.

## సంజయుడు ధృతరాష్ట్రునకు భారతయుద్ధము చెప్పబూనుట

ధృతరాష్ట్రమహారాజా! నీవు ననుభారతయుద్ధమును చూ చుటకు పొమ్మని చెప్పినందున నేను ఆరాత్రియందు కురుక్షేత్రమందు మనసైన్యములుండు చోటునకు యుద్ధభూమికి వెళ్ళితిని. మనసైన్యము లనుదాటి తగురీతిని నీకుమారుడగు దుర్యోధనమహారాజుండెడి నగరు వంటి శిబిరమున ప్రవేశించితిని. అప్పుడు దుర్యోధనునిదగ్గర భీష్ముడు మొదలగు కౌరవులును కొంతమంది తగినరాజులును కూర్చొనియుం డిరి. అంతట నేను దుర్యోధనునకు కనబడితిని. దుర్యోధనుడు నన్ను జూచి ఆదరించెను. నేను దుర్యోధనుని సేవించుచుంటిని. పిమ్మట యుద్ధవిషయమైనమాటలుజరిగెను. ఆసమయమున దుర్యోధనమహా రాజు దుశ్శాసనునిజూచి యిట్లనెను. దుశ్శాసనా! పాండవులతో మనకు యెప్పుడు యుద్ధముజరుగునోయని బహుకాలమునుండి కర్ణ

పెట్టికొనియుంటిమి. అదియిప్పుడు తటస్థించెను. గనుక మనమిప్పుడు చేయదగిన ముఖ్యమైన కార్యమును చెప్పెదను వినుము. మనకండ శకును యీ భీష్ముడు ఆధారుడు. ఈ భీష్ముని మనము యేవిధముగా నైనను రక్షింపుచుండవలయును. మనమీ భీష్ముని రక్షింపుచుండిన యెడల యీ భీష్ముడాయుద్ధమందు మనశత్రువులను అందరిని చంప గలడు. మనలనందరను యీ భీష్ముడు రక్షించుననిమనమునమ్మియుం డగా సర్వదా ఆభీష్మునిమనము రక్షింపవలసినపని యెట్లు అంటివేని చెప్పెదనావిషయమును వినుము. ఈ విషయమును మనవారందరును ముఖ్యముగా వినవలయును. ఈవిషయమును అందరును వినునట్లుగా యిప్పుడు చెప్పెదను వినుము.

ఈ మహాత్ముడగు భీష్ముడు సత్యవ్రతుడు. ఈ భీష్ముడు తన యెదుట పడినవారినందరిని చంపివేయగలడు. ఒక శిఖండినిమాత్రము చంపజాలడు. ఇట్లని యీ భీష్ముడు మన ఉద్యోగసమయమందు మన తో చెప్పి యున్నాడు. గాన మనమందరము యీ భీష్మునకు శిఖండి వలన అపాయము లేకుండునట్లు రక్షింపుచుండవలయును. మహాబలము గల సింహమైనను యేమరి నిద్రించి నపుడు అట్టిసింహమును కాపా డెడివారు లేనియెడల ఆసింహమును నక్క చంపగలదు. అటువలెనే యీ భీష్ముని మనము వెన్నంటియుండి కాపాడనియెడల శిఖండి వీనిని చంపగలడు. గాన మనమీ భీష్ముని సర్వదా రక్షింపుచుండవల యును. ఈభీష్ముని శిఖండిచంపినయెడల నిద్రించెడు పెద్దపులిని గొఱ్ఱె చంపిన విధమగును. ఆ కారణమువలన మనసైన్యము యీ భీష్ముని రక్షించునట్లు చేయవలయును. మీరందరును యెక్కడ జూచినను శిఖండితో యుద్ధముచేయుచుండవలయును. అని దుర్యోధనుడు సభ వారందరు వినుచుండగా భీష్ముని రక్షించునట్లు దుశ్శాసనునితో చెప్పి సభనుండి లేచివెళ్ళి ఆరాత్రియందు నిద్రించెను. అంతట తెల్లవారిన త్తోడనే దుర్యోధనుడు ఛడవవాళ్ళను పిలిపించి యిట్లనెను.

ఓ పాండవ వారలారా! మీరు వెళ్ళి సేనాపతులతోను, భటులు తోను తమ తమ సైన్యములను తీసికొని యుద్ధమునకు బయలు దేరునట్లు చెప్పుడు. అని దుర్యోధనుడు పాండవవాళ్ళతో చెప్పి పంపెను. అప్పుడు పాండవవారలు శీఘ్రముగా వెళ్ళి ఆయా సేనాని పతుల తోను భటులతోడను దుర్యోధనుడు చెప్పిన ప్రకారము చెప్పిరి. అంతట మన సైన్యములన్నియు చతురంగబలములతో యుద్ధమునకు సేనలు ప్రయత్నమునుగలిగి యుండెను. మన సైన్యములో నుండు వారలు, శంఖదుందుభి మొదలగు మంగళవాద్యములను మ్రోయించునట్లుగాను ఆయా వాద్యములను సిద్ధముచేయునట్లుగాను తగిన పరిజనులతో చెప్పుచుండిరి. ఆ చెప్పెడు మాటలు గంభీరధ్వని కలిగియుండెను. కట్టివేసెడు స్థలములయందు వుంచిన యేనుగులు ఘీంకారమ్ములు చేయుచుండెను. రథములకుకట్టు నిమిత్తము విప్పినగుఱ్ఱములు సకిలించుచుండెను. గుఱ్ఱములను కట్టుటకు లాగు రథములయొక్క గాండ్లయందు యినుప యిరుసుల ధ్వనులధికముగాయుండెను. కొమ్ములవారలు ఒకరినొకరు పెద్ద ధ్వనికలుగునట్లు పిలుచుకొనుచుండిరి. ఈ చెప్పిన ధ్వనులన్నియు చేరి మన శిబిరములయందు మహాధ్వని కలిగియుండెను. అప్పుడు మన శిబిరములు చంద్రోదయకాలమందు మ్రోయుచుండు సముద్రమును తిరస్కరింపుచుండెను. అట్టి సమయమందు సూర్యోదయ మాయెను. అట్లు సూర్యోదయమైన తోడనే మన సైన్యములన్నియు చతురంగ బలములతో యుద్ధమునకు బయలువెడలి నడచుచుండెను. ధృతరాష్ట్ర మహారాజా! అట్లు వెళ్ళుచుండగా యేనుగులకు బంగారు మయములైన భూషణములు అలంకరింపబడి యుండెను, అట్లు వెళ్ళుచుండు యేనుగుల గుంపులు కొండలవలె నుండెను, గుఱ్ఱపు దండులలోని గుఱ్ఱముల ధ్వనులు, సకిలింతలు, సముద్రపు తరంగముల ధ్వనులవలె

చుండెను. అప్పుడు బారులుతీరి వరుసగా వెళ్లుచుండు గజములు గ్రామములవలె నుండెను.

అప్పుడు వెళ్లుచుండు భటులు కఠినముగా మాట్లాడుచు రాక్షసుల గుంపులవలె నుండిరి. ఆ సమయమున కౌరవసైన్యమను మహాసముద్రమునకు భీష్ముడు పరిపూర్ణ చంద్రునివలె ప్రకాశింపు చుండెను. భీష్ముడు కట్టుకొనిన వస్త్రమును రథమును గుఱ్ఱము లును ధనస్సు, తాటిచెట్టుగల టెక్కెము, ఇవి యన్నియు అధిక మైన వజ్రకాంతులచేత వ్యాపించబడి ప్రకాశింపుచు బంగారు మయ ములై యుండెను. భీష్ముని టెక్కెయు, రత్నకాంతులచేత ప్రకా శింపుచు బంగారు మయమై యుండెను. భీష్ముడు తెల్లని గొడుగు పెద్దది వేసికొని ఆ చంద్రునివలె ప్రకాశింపుచు గర్వముతో బయలు వెడలి యుద్ధమునకు నడుచు చుండెను. ద్రోణాచార్యుడు అరుగువంటి బంగారు మయమైన టెక్కెముచేత ప్రకాశింపుచు అధిక తేజస్సు చేత భ్రమింపజేయుచు యుద్ధమునకు బయలువెడలి వచ్చుచుండెను. కృపాచార్యుడు గోవృషభము వంటి బంగారు మయమైన టెక్కెము చేత ప్రకాశింపుచు యుద్ధమునకు వచ్చుచుండెను అశ్వత్థామ సింహ పుచ్ఛకవంటి మణులచేత ప్రకాశింపు చుండు టెక్కెముచేత ప్రకా శింపుచు యుద్ధమునకు బయలుదేరి వచ్చుచుండెను. శల్యుడు రత్న కాంతులచేత ప్రకాశింపుచుండు అరటి వృక్షమువంటి టెక్కెముచేత ప్రకాశింపుచు యుద్ధమునకు బయలువెడలెను. ఈ టెక్కెములు వారి వారి రథముల కొనలయం దమర్చబడి యుండెను. ఇట్లు పైనచెప్పిన వారందరును తమతమ టెక్కెములు గల రథములమీద యెక్కి తమ తమ చతురంగ బలములను తగురీతిని నడిపించు కొనుచు యుద్ధము చేయుటకు ఉత్సాహము గలవారై తగురీతి నొకరి కొకరు మాట్లాడు కొనుచు నవ్వుకొనుచు వచ్చుచుండిరి.

ధృతరాష్ట్రమహారాజా! అనేక సైన్యములతో నుండెడి శక్తిగల వారందరును యుద్ధమునకు తగిన సవరణలతో తమతమ చిహ్నముల చేత ప్రకాశించుచు గర్వమదములు గలవారై యుద్ధమునకు బయలు వెడలి వచ్చుచుండిరి. వారెవ్వరనగా చెప్పెద వినుము. కృతవర్మ అధికములగు చతురంగ బలముగల యాదవసైన్యము తనను సేవించుచుండగా యుద్ధపు ఉత్సాహముతో బయలు వెడలి వచ్చుచుండెను. సైంధవుడు తన బంధుసమూహముతో గూడినవాడై యుద్ధము చేయుటకు అధిక ఉత్సాహముతో వచ్చుచుండెను. సైంధవుని వెంబడి అధిక రథములుగల గొప్ప సైన్యము నడచి వచ్చుచుండెను. విందానువిందులును కళింగదేశపు ప్రభువును భగదత్తుడును వీరలు నీ సైన్యమందుండి భటుల కండ్లకు పండుగవంటి ఉత్సవము కల్పించుచు ఉప్పొంగిన శరీరములు గలవారై. వారి వెంబడి అధికమైన గర్వము గల భటులు, పర్వతములవంటి యేనుగులగుంపులు, రథములు, గుఱ్ఱపుదండులు అధికముగా నడచుచు వచ్చుచుండెను. శకుని తన కుమారులతోడను, తన తమ్ములతోడను, గుఱ్ఱపుదండులతోడను, అధికమగు సైన్యములతోడను. బయలుదేరి వచ్చుచు అధికోత్సాహముగలిగి యుండెను. అప్పుడు తనతో అధిక కాల్బలము వచ్చుచుండగా బాహ్లికుడు దేవేంద్రునివలెనే నిర్విచారముతో యుద్ధమునకు వచ్చుచుండెను. ఆ బాహ్లికుని వెంబడి అధికశూరుడగు సోమదత్తుడు అధిక బాహుబల గర్వముచేత ప్రకాశించు భూరిశ్రవసుడును తమతమ చతురంగ బలములను తీసికొని వెళ్ళుచుండిరి.

ధృతరాష్ట్రమహారాజా! కాంభోజదేశపు రాజగు సుదక్షిణుడనువాడు తన చతురంగబలములను తీసికొని మహావిభవముతో యుద్ధమునకు బయలు వెడలి వచ్చుచుండెను. కోసలదేశపు రాజగు బృహద్బలుడనువాడు, మహిష్మతీపట్టణ రాజగు నీలుడనువాడు

త్రిగర్త దేశపు రాజగు సుశర్మయనువాఁడు రాక్షసరాజులగు అలంబస హలాయుధులను వారిద్దరును సాల్వ సౌవీర శూరసేన ఆభీరయవన నాతి అనేక రాజ్యముల రాజులును తమతమ చతురంగబలములతో యుద్ధమునకు బయలు వెడలి వచ్చుచుండిరి. ధృతరాష్ట్రమహారాజా! యీ చెప్పిన వారందరును తమతమ చతురంగబలముతోకూడిన వారై తమతమ టెక్కెములచేత ప్రకాశింపుచు నానావిధములైన భూషణములచేత ప్రకాశింపుచు నానావిధ భూషణములచేత అలంకరింపబడినవారలై యుద్ధముచేయుటయందు అత్యాశగలవారై వెళ్ళుచుండిరి. ఈ రీతిగా పది అక్షౌహిణుల సైన్యము యుద్ధమునకు బయలు వెడలి వచ్చుచుండెను. పదునొకండవ అక్షౌహిణీసైన్యము దుర్యోధనమహారాజు వెంబడి వచ్చుచుండెను. అప్పుడు దుర్యోధనుఁడు దేదీప్యమానముగా ప్రకాశింపుచు భూషణములచేత అలంకరింపబడిన గొప్ప యేనుగుమీఁద యెక్కి వచ్చుచుండెను. దుర్యోధనుడు తెల్లని గొడుగులచేత ప్రకాశింపుచు సురటీలయందుగల భూషణములయందు చెక్కబడిన వజ్రములయొక్క వెలుతురుచేత ప్రకాశింపుచు వచ్చుచుండెను. దుర్యోధను డనేక రత్నకాంతులచేత దేదీప్యమానముచే ప్రకాశించు సర్పమువంటి టెక్కెముగలిగి యుండెను. దుర్యోధనుని రెండుప్రక్కలయందు దుశ్శాసనుడు, దుర్మర్షణుడు, వివింశతి, వికర్ణుడు మొదలగు తమ్ములందరును తమతమ వాహనములచేతను గొడుగులచేతను ప్రకాశించుచు తమతమ టెక్కెములనుగలిగి వచ్చుచుండిరి. ఈ ప్రకారము దుర్యోధనునియొక్క పదునొకం డక్షౌహిణుల సైన్యములును కూడుకొని పాండవులతో యుద్ధము చేయుటకు వచ్చుచుండెను. ఆసైన్యములు ధనుస్సులచేతను, గదలచేతను, దుడ్డుకర్రలచేతను, ఈటెలచేతను, మంగలి కత్తులవంటి కత్తులచేతను, ముసలాయుధములచేతను, యినుప దుడ్డుకర్రలచేతను, తోమరాయు

ధముల చేతను, గండ్రగొడ్డండ్ల చేతను, ముసలయష్టి శక్తుల చేతను, తోమరములు మొదలగు సకలవిధములైన ఆయుధశస్త్రముల చేతను బంగారుమయములగు కవచముల చేతను నానావిధములగు రంగులు గల చొక్కాయిల చేతను మణుల గుంపుల చేత శోభింపబడిన నానా విధములగు టెక్కెముల చేతను, నిండి మిగుల భయంకరముగా నొప్పు చుండెను. అప్పుడు ఆ కౌరవ సైన్యము తామర పుష్పములకొలను వలెనుండెను. భూషణములయందు చెక్కబడిన వజ్రముల కాంతులు కొలనుయందుండు హంససమూహములవలె నుండెను. భూషణముల యందుండు ఇంద్రనీల మణుల కాంతులు సరస్సునందుగల తామర పుష్పముల పొదనుండు తుమ్మెదలగుంపువలె నుండెను. భూషణముల యందుండు మాణిక్యముల కాంతులు సరస్సునందుండు తామర పత్ర ములవలె నుండెను. ధృతరాష్ట్రమహారాజా! ఆ ప్రకారము కౌరవ సైన్యములు బయలువెడలి యుద్ధమునకు వచ్చుచుండగా ఆ సమయ మందు భీష్ముడు సకలరాజులను దగ్గరకు పిలిచి యిట్లనెను.

## భీష్ముడు నిజయోధులకెల్ల నుత్సాహముగా దెగువచెప్పుట

రాజులారా! రాజులకు యుద్ధము స్వర్గద్వారమువంటిది. ఇంత వరకు మహారాజులగు వారనేకులు యుద్ధములు చేసి ఆ యుద్ధముల యందు స్వర్గమునకు వెళ్ళి, మహాసౌఖ్యవంతులై యుండిరి. రాజులగు వారు యుద్ధమందు చచ్చినను, గెలిచినను నిస్సంశయముగా స్వర్గ లోకప్రాప్తిని పొందుచున్నారు. ఆ కారణముచేత మీరందరును ప్రాణ ములకు భయపడక తెంపుగలిగి యుద్ధము చేయవలెను. రాజులారా! రాజులగువారికి గృహములయందు రోగములవలన చచ్చుటకంటె మరియొక అధికమైన పాపము కనబడదు. గనుక మనము యుద్ధ భటులమై తెంపుగలిగి యుద్ధముచేసి ఆ యుద్ధమందు చచ్చితిమేని

విక్షేపమును బొందినట్లు పరమసుఖమును పొందుదుము. అని భీష్ముడు సకల రాజులతో చెప్పగా ఆ రాజులందరును ఆ మాటలు విని తమ తమ శౌర్య సాహసములను భీష్మునకు దెలిసి అధికమగు తెంపు గలిగి ప్రవర్తించెదమని భీష్మునితో చెప్పి బాసలుచేసి తమతమ సైన్యములలోనికి వెళ్ళిరి. ఆసమయమందు భీష్ముడు శకునిని జూచి అతనితో యిట్లనెను.

శకునీ! నేను యుద్ధము చేసినంత పర్యంతము కర్ణుడు తన పుత్ర మిత్ర సహోదర మంత్రులను యుద్ధమునకు రానివ్వడట. తానును నేను యుద్ధముచేయు పర్యంతము యుద్ధమునకు రాడట. ఈరీతిగా యిదివరకు కర్ణుడు చెప్పియున్నాడు. ఆ కర్ణుని మాటను దుర్యోధనుడు విని కర్ణుడు బలవంతుడైనందున బలశక్తిని వెనుక చూపవలెనని తెంపుచేసి యితరులను మొదట యుద్ధమునకు పంపు చున్నాడనని తలచి పుష్పించెను. దుర్యోధనుడట్లు పుష్పించి కర్ణుని విశేషముగా పొగడెను. అని భీష్ముడు శకునితో చెప్పి చెప్పుచుండగా ఆమాటలను దుర్యోధనుడు విని సంతోషచిత్తముగలవాడై తన తమ్ములును తానును భీష్ముని చుట్టుకొని యిట్లనెను. తాతా! భీష్మా! మిక్కిలి దట్టమైయుండునట్లుగా సొగసుగలిగి యుండునట్లుగా ఒక వ్యూహమును యేర్పరచుము. అని దుర్యోధనుడు చెప్పగా భీష్ముడు మానుషవ్యూహమును యేర్పరచెను. అట్లేర్పరచి ఆ వ్యూహము నకు భీష్ముడును ద్రోణుడును వారివారి టెక్కెముల చేత ప్రకాశింపుచు పడమర తట్టు ముఖముగలవారలై ముందర యుండిరి.

ఆ వ్యూహమునకు కుడిప్రక్క కృపాచార్యుడును అశ్వత్థామ యునుండిరి. ఆవ్యూహమునకు యెడమప్రక్క కృతవర్మ శల్యులిద్దరునుండిరి. ఆవ్యూహమునకు వెనుకతట్టు బాహ్లికుడును సోమదత్తుడును భూరిశ్రవసుడును వీరుముగ్గురుండిరి. ఆవ్యూహమునకు నడిమి ప్రదేశమందు తనతమ్ములందరితో కూడుకొని దుర్యోధనరాజుండెను. ఆదుర్యోధనుని ముందర వైపు సంశప్తకులను పేరుచేత ప్రసిద్ధి జెందిన

సుశర్మ మొదలగు పదివేలమంది రథిక శ్రేష్ఠులుండిరి. ఆసంశప్తకులందరును అర్జునుని చంపెదమనియు లేక అర్జునిచేత చచ్చెదమనియు యీకా ర్యముతప్ప మరియొక కార్యమును చేయమనియు ప్రతిజ్ఞలు చేసియుం డిరి. ఆసంశప్తకులు దుర్యోధనుని ముందవైపుగలరు. ఆవ్యూహము నకు తక్కినస్థలములయందు తక్కినయోధవీరులుండిరి. ఈప్రకారము గా భీష్ముడు నియమించి మానుషవ్యూహమును యేర్పరచెను. ఆ మానుషవ్యూహముయొక్క స్వరూపమును చెప్పెదను వినుము. ఆసైన్యములకడ్డముగా యేనుగులనుంచిరి. ఏనుగుల కడ్డముగా రథ ములను నిలిపిరి. రథములకడ్డముగా గుఱ్ఱములను నిలిపిరి. గుఱ్ఱముల కడ్డముగా ధనుస్సులను ధరించినవారలను నిలిపిరి. ఈరీతిగానిలిచియుం డుట మానుషవ్యూహమందురు. ఈవ్యూహమును భీష్ముడు తయారు చేయించెను. ఈవ్యూహమునకు పూర్వోక్తప్రకారము భీష్మ ద్రోణా దులు నాలుగుప్రక్కలను నిలిచియుండిరి. ఈమానుషవ్యూహమును అందరుచూచి యిటువంటి దృఢమైన వ్యూహమును యిదివరకెప్పు డైనను చూడలేదనియు చెప్పుకొనుచు ఆశ్చర్యపడుచుండిరి.

ధృతరాష్ట్రమహారాజా! యుద్ధభూమియందు మనకౌరవసై న్యము పడమరముఖముగానుండి యుద్ధముచేసెను. పాండవసైన్యము మనసైన్యమునకు యెదుట తూర్పుముఖముగానుండి యుద్ధముచేసెను ఈవిషయమును నీవు తెలుసుకొనుము. ఈఘోరతయుద్ధమునుచూచుటకు దేవతలును దేవఋషులును స్వర్గమందుండెడి పూర్వపుమహారాజు లును నానావిధములైన విమానములమీద యెక్కినవారలై వచ్చి ఆకాశమందుండిరి.

## పాండవయోధులు యుద్ధమునకు వెడలుట

ధృతరాష్ట్రమహారాజా! భీష్ముడు యుద్ధభూమియందైన నరులకెల్ల అసాధ్యమైన మానుషమను దృ...
శత్రువులు పరులు లక్షిత జేశించుటకు అసాధ్యమైన మానుషమను దృ

వ్యూహమును యేర్పరచిన విధమునంతయు వింటివిగదా! ఇకను పాండవులవృత్తాంతమును చెప్పెదను వినుము. మనవారు మానుష వ్యూహమును ఏర్పరచకమునుపే అదివరకు ఆకురుక్షేత్రమందు శిబిరములలో నివసించియుండు పాండవసైన్యములు బయలువెడలి యుద్ధభూమికి వచ్చుచుండెను. ఆ సైన్యములయందుండు నల్లగొడుగుల కాంతులు ఏనుగుయొక్క మదజలమునకు ముసురుకొనిన తుమ్మెదగుంపుల కాంతికంటె అధికముగానుండెను. గుర్రములయొక్క గొరిసెలవలన లేచినదుమ్ము ఆకాశమందుండు అప్సరస్త్రీలయొక్క ముంగురులయందుచేరియుండెను. ఆ సైన్యములయందుగల టెక్కెములయందుగల రత్నకాంతులు సూర్యకిరణములకంటె అధికప్రకాశము కలిగియుండెను. నానావిధములైన వాద్యధ్వనులచేత సకలపర్వతములయందును ప్రతిధ్వనులు కలిగియుండెను. రథముల ధ్వనులచేతను గుర్రముల సకిలింతలచేతను ఆకాశము భయంకరశబ్దముగలదిగాను మనోహరధ్వనిగలదిగాను గజ్జెలు మెండలగువాని ధ్వనిచేత ఝుణఝుణఅనుధ్వనిమయమైయుండెను. మంచిరథికులయొక్క బాణములకాంతులు సకలదిక్కులను ప్రకాశింపజేయుచుండెను. ఆ సైన్యములతో ధర్మరాజాసమయమందు తాను కురుక్షేత్రమందు దిగియున్న శిబిరములోనుంచి బయలువెడలి యుద్ధభూమికి వచ్చుచుండెను. అధికమైన మదగర్వములచేతను ముఖమునకు క్రొత్తకాంతి కలుగుచుండగా అధికమగు కాల్బలముతో భీముడు బయలువెడలెను.

భీముడు తాను ధరించిన భూషణముల కాంతిచేతను గదమొదలగు ఆయుధములయొక్క భయంకరకాంతులచేతను విచిత్రముగా ప్రకాశించుచుండెను. భీముడు మిక్కిలి గొప్పవగు స్తంభములవంటి తన చేతులను చమత్కారముగా త్రిప్పుచు యుద్ధభూమికి వచ్చెను. అర్జునుడు బయలువెడలి యుద్ధభూమికివచ్చెను. అర్జునుని

దివ్యరథముయొక్క కాంతిసమూహములు దేదీప్యమానముగ ప్రకాశించు పద్మరాగ ప్రభలతోయున్నట్లుండెను. అర్జునుని దివ్యరథమునకు పూన్చియుండు దివ్యములగు గుఱ్ఱముల దేహకాంతులు గొప్ప వజ్ర కాంతుల గుంపులో యున్నట్లుండెను. అర్జునుని దివ్యరథముయొక్క నొగలమీద కూర్చుండిన కృష్ణుని నల్లని దేహకాంతి ఇంద్రనీలమణుల కాంతులవలె నుండెను. అర్జునుని పుచ్చముయొక్క కొనయందున్న కోతియొక్క శరీరపు కాంతులు గరుడపచ్చల కాంతులవలెనుండెను. శాంతిమహా గంభీరగుణములు తనకు స్వభావములై యున్నందున అర్జునుడు పర్వతమువలె ప్రకాశింపుచుండెను. అర్జునుని బాణముల పొదులయందు ప్రకాశించు దివ్యబాణముల కాంతులు శ్రేష్ఠములైన రత్నములకాంతులవలె నుండెను. ఆ విధముగా అర్జునుడు బయలుదేరినపుడు అధికమైనసైన్యము రథసమూహములతో అర్జునుని సేవింపుచు వచ్చుచుండెను. అర్జునుని దేవదత్త మను శంఖధ్వని సకలవాద్య ధ్వనులకంటె అధికముగా మ్రోగెను.

ధృతరాష్ట్రమహారాజా! అప్పు డర్జునుని చూడగా నల్లని మేఘమువలె నుండెను. అతని గాండీవమను ధనుస్సు ఇంద్రధనుస్సువలె నుండెను. అర్జునుని శిరస్సునందుండు దివ్యకిరీటపు కాంతులు మెరుపులవలె నుండెను. గాండీవమునకు కట్టిన అల్లెత్రాటియొక్క ధ్వని ఉరుములవలె నుండెను. అర్జునుని దేహమందుండు నల్లని కాంతి నల్లని మేఘమువలె నుండెను. ఈ ప్రకారముగా మహావిభవముతో అర్జునుడు కురుక్షేత్రమందు యేర్పరుపబడియున్న తమ శిబిరమునుండి బయలువెడలి యుద్ధభూమికి వచ్చుచుండెను. నకుల సహదేవులు అధికమహిమ గలిగినట్టి భయంకరములైన వాహనములమీద యెక్కి యుద్ధభూమికి వచ్చిరి. నకులసహదేవుల వెంబడి నానావిధములైన సమ్మర్దపుదండులును యుద్ధక్రీడయం దధికోత్సాహముగల మహాసైన్య

ములు సంతోషముతో వచ్చుచుండెను. అట్లు వచ్చుచున్న నకుల సహదేవులను చూచి రాజసమూహము లమితానంద చిత్తులైరి. నకులసహదేవులు వచ్చునపుడు యుద్ధసంబంధమగు విషయములను ముచ్చటించుచుండిరి. అధికమైన ఉత్సాహముతో వారు యుద్ధ భూమిని ప్రవేశించిరి. అభిమన్యుడును, ద్రౌపదీయులును మదించిన యేనుగుల గుంపువలె యుద్ధభూమిని ప్రవేశించిరి. వారివెంబడి గుర్రపుదండులును మిక్కిలి వేగముగా నడచుచు చమత్కారగతుల చేత భూమిని క్షోభింపజేయుచు వచ్చుచుండెను. అభిమన్య ద్రౌపదీ యులకు తమ భుజబలదర్పములు ముఖమున తాండవించుచుండెను. అభిమన్య ద్రౌపదీయులు యుద్ధమందు అధికవుత్సాహ సాహస ధైర్యాదిగుణములు గలవారై దుర్యోధనాదులయందు క్రోధచిత్తము లతో వచ్చుచుండిరి. ఈప్రకారముగా ద్రౌపదీయులగు ప్రతివింధ్యు డును శ్రుతసోముడును బయలుదేరి తమతమ చతురంగబలములతో యుద్ధమునకు వచ్చుచుండిరి. ద్రౌపదీయులగు ప్రతివింధ్యుడును, శ్రుత సోముడును, శ్రుతకీర్తియు, శతానీకుడును, శ్రుతసేనుడును, సుభద్రా తనయుడగు అభిమన్యుడును పాండవసైన్యములను కాపాడుట కాధా రముగా నడచుచుండిరి. వారినిజూచి పాండవబలము లధికముగా సంతోషించిరి.

ద్రుపదరాజు యేనుగుల సందడిచేత నొప్పుచుండు గొప్ప సైన్యముతో మదగర్వములు గలిగి యుద్ధభూమికి వచ్చుచుండెను. విరాటరాజు తన కుమారులతోడను తమ్ములతోడను గూడుకొని అహంకార గర్వ శౌర్యములు గల సైన్యములచేతను సేవింపబడుచు యుద్ధమునకు వచ్చుచుండెను. సాత్యకి యాదవసైన్యములు వెంబడి వచ్చుచుండగా అధికోత్సాహముతో వచ్చుచుండెను. వీరభటులు భీష్మ తమ ప్రతాపవాక్యములను చెప్పుకొనుచు వెంబడిరాగా చేకి

తానుడు యుద్ధమునకు వచ్చుచుండెను. వీర రథికులును శిఖండియు ఒకరి కొకరు గర్వపుమాటలను చెప్పుకొనుచు మెగతాళిచేసికొనుచు అధికోత్సాహముచేత యుద్ధమునకు వచ్చుచుండిరి. మాగధ సహ దేవుడు సముద్రమువంటి మహాసైన్యమును నడిపించుకొనుచు యుద్ధ మునకు వచ్చుచుండెను. మాగధ సహదేవుని సైన్యములో మ్రోగిన ధ్వనులవలన దిక్కులు చెవుడు గలిగినట్లాయెను. ఆసైన్య ధ్వనులకు ఆమాగధ సహదేవుడు అలంకరింప బడినట్లుండి యుద్ధమున కత్యు త్సాహ సంతోషములు గలిగి వచ్చుచుండెను. వాని వెంబడి వాని తమ్ముడు ప్రకాశ మానమగు నానావిధాయుధములను ధరించి వచ్చు చుండెను. మహాబల పరాక్రమ శౌర్యాది గుణములుగల ధృష్ట కేతుడు తన తమ్ముని వెంటబెట్టుకొని తన బల శౌర్యముల చేత పరు లను శోషింప జేయునట్లు శోపింపజేయుచు వచ్చుచుండెను. ధృష్ట కేతుడు తన సైన్యములకు మహోత్సాహ గర్వములు గలుగునట్లు పిలుచుచు పాండవులకును పాండవ సైన్యములకును కండ్ల పండువుగా బయలుదేరి యుద్ధభూమికి వచ్చుచుండెను. యమధర్మరాజు దేహము వంటి దేహముగల ఘటోత్కచుడు తన రాక్షస సైన్యములచేత సేవింపబడుచు కొండవంటి గొప్పదేహము గలిగి వచ్చుచుండెను. ఘటోత్కచుడు గాఢాంధకారమువంటి నల్లని దేహముగలిగి యుండెను. ఆ భయంకర రూపమునకు తోడుగా మిక్కిలి భయ మును కలిగించు రెండుకోరలు ఆ ఘటోత్కచునకు కలిగియుండెను. ఘటోత్కచుని చేతియందు ఒక శూలాయుధమున్నది. ఆశూలా యుధపు కాంతులు ఆకాశమందు వ్యాపించుచుండెను.

పాండ్యరాజును, అయిదుగురు కేకయ రాజులును, శైబ్యు డును, కాశి, కరూశాది అనేక దేశపురాజులును, తమ తమ చతు రంగ బలములను తీసికొని యుద్ధమునకు గావలసిన సదుపాయములు

లతో యుత్సాహవంతులై తమ తమ శిక్కులచేత ప్రకాశిం పుచు యుద్ధభూమికి వచ్చుచుండిరి. ఈరీతిగా ఏడు అక్షౌహిణులుగా చేరిన పాండవ సైన్యమునకు ముఖమునకు తిలకమువలె ధృష్టద్యు మ్నుడు ముఖ్య సేనానాయకుడై సైన్యమునకు ముందునడచు చుండెను. ధృతరాష్ట్ర మహారాజా! ఆ ధృష్టద్యుమ్నుని శరీరము మిక్కిలి బలిసి అధిక బలము గలిగి వీరసమేతమగు మనుష్యాకారము దాల్చి నట్లుండెను. అతని దేహమంతయు బంగారు తీగవలె ప్రకా శించు పీరరేఖ గలదు. ఆధృష్టద్యుమ్నుని రథము దివ్యరథ శ్రేష్ఠము వలె దేదీప్యమానముగా ప్రకాశింపు చుండెను. ఆ రథమునకు కట్టిన గుర్రములు అధికముగా ప్రకాశింపు చుండెను. ఆ ధృష్టద్యుమ్నుని ధనుస్సు బంగారువలె ప్రకాశింపుచుండెను. అతని శిక్కేము మిక్కిలి ప్రకాశమానమై యుండెను. ఈరీతిగా పాండవ సర్వసేనాధి పతియైన ధృష్టద్యుమ్నుడు అధికముగా సర్వవిధముల చేతను ప్రకా శింపు చుండెను. అతడు యీ చెప్పబడిన యేడక్షౌహిణుల పాండవ సైన్యములకు ముందరయుండి తానుముందు నడచుచు సైన్యములను తన వెనుక నడిపించెను.

ధృతరాష్ట్రమహారాజా! ఆ పాండవుల సైన్యములు నడచున పుడు సాకుతోచిన విధమును చెప్పెదనువినుము. సైన్యముల అలజ డికి భూమియందు దుమ్ము లేచుట చేత భూమిపలచదనమునుబొంద కుండ రాజులయొక్కయు, సైన్యములయొక్కయు బంగారు ఆభరణ ములు రాపిడిగలుగుటవలన రాలుచున్న బంగారపుపొడి యాదుమ్ము లేచినప్రదేశమంతయురాలి భూమి నెప్పటిస్థితియం దుంచుచున్నదని చెప్పుమాట నిజమైనదిగా కనుపించుచున్నది. యుద్ధమందు సైనికులు పడుశ్రమకు దేహములందు చెమటపోయకుండ, వారిరొమ్ములనున్న భూషణముల కాంతులు కాయు వెన్నెలహరించుచున్నదని చెప్పుటలో

అసత్యము లేకుండెను. భేరీభాంకారధ్వనుల చేత భూమియందుండు నీరు అంతయు యెండిపోయి భూమియంతయు పగిలిపోకుండునట్లు ఏనుగులు ఘీంకరించుచు తమతొండములద్వారా తుంపుర్ల నీటిచేత భూమినితడిపి యథాస్థితియందుంచుచున్నవని చెప్పుమాట యెంతయువాస్తవమైనదిగా తోచుచున్నది. గర్వము నేత్రములను చాటుపరచును అనువిషయము నిజమని తేలుచున్నట్లు గొడుగుల కాంతి ఆకాశమందుండు దేవతల నేత్రముల పర్యంతము వ్యాపించియుండెను. ధృతరాష్ట్రమహారాజా! పాండవసైన్యములు యుద్ధభూమికి వచ్చినప్పుడు దిక్కులన్నియు అదరునట్లు భూమివడకజొచ్చెను. ఈరీతిగా మహాభయంకరముగా సకల భూతములకును వెరపుగల్పించుచు పాండవసైన్యములునడిచి కురుక్షేత్రమందు శ్రేష్టమగు భూమియైన శమంతకపంచకమునకు సమీపముగానున్న ప్రదేశమును చేరెను. ఆ సమయమున ధర్మరాజునకు కుడికన్నదరుట మొదలగు కొన్ని శుభసూచకములు తోచెను. ఆసమయమునసే ఏనుగుల మదజలముతోగూడిన భటులు దేహములయందుపూసికొనిన కస్తూరి సుగంధాది పరిమళములతోగూడిన చల్లనిగాలి అనుకూలముగా వీచుచుండెను. ఇదిచాలా ముఖ్యమైన శుభసూచకము. ఇందులకు ధర్మరాజు సంతసింపుచుండెను. ఆసమయమున సంతోషముతో భీమార్జున నకులసహదేవులను ద్రుపద విరాటులు మొదలగు నానాదేశపు రాజులును సంతోషచిత్తులై సకలజనులతో కూడి ధర్మరాజుచుట్టు కొలుచుచుండిరి. ధర్మరాజు తూర్పుదిక్కునకు ముఖముంచి కౌరవసైన్యములకు చక్కగా యెదురుగానిల్చియుండి తమసైన్యము లన్నిటిని క్రమముగా లెక్కించుటకు వీలగునట్లు తనపక్షపువారి నందరిని సంజ్ఞలు గురుతులు కల్పించి తనపక్షపువారలతో యిట్లనెను.

రాజులారా! యీ భారతయుద్ధమందు మనము జయమును పొంది సకలరాజ్యమును మనముతీసికొనగలము. ఇదినిశ్చయము.

ఇంపుల కేసంశయమును లేదు. గనుక మనకవశ్యము జయముకలుగును గావున మీరారు నా పక్షమందు నిలిచియుండుడు. అని ధర్మరాజు చెప్పగా రాజులందరునువిని వారందరును ధైర్యమును ఉత్సాహమును ప్రోత్సహించుమాటలను చెప్పి ధర్మరాజుపక్షమందు తాముండు నట్లు ప్రతిజ్ఞలుచేసి తమతమ శంఖములను వూదిరి. అంతట రాజులందరును తమతమ సైన్యములలోనికి వెళ్ళిరి. ధర్మరాజు తనకొరకై తెచ్చిన ఫలహారములను పుష్పములను పండ్లను, కర్పూర కస్తూరికాది వస్తువులను ఆ రాజులకు యిచ్చుచుండెను. అని సంజయుడు ధృతరాష్ట్రమహారాజుతో చెప్పగా ధృతరాష్ట్రుడా సంజయునిజూచి యిట్లనెను. సంజయుడా! మనకౌరవసైన్యము మిక్కిలిగొప్పదై యుండెను పాండవులసైన్యము కొంచెమైయుండెను. ఇటులుండియుకూడ పాండవులు అనుమానములేక మనసైన్యములమీదకు యేధైర్యమున వచ్చిరో చెప్పుము అని ధృతరాష్ట్రుడు అడుగగా సంజయు డిట్లనెను. ధృతరాష్ట్రమహారాజా! ఆవిషయమునుకూడ చెప్పెదను వినుము. యుద్ధభూమికివచ్చిన ధర్మరాజు కౌరవసైన్యమునుచూచి కొంతసేపు తలవంచుకొని అర్జుననిజూచి యిట్లనెను.

## ధర్మరాజునకు అర్జును డుత్సాహమును కలిగించుట

తమ్ముడా! అర్జునా! మనసైన్యముకంటె కౌరవసైన్యము గొప్పదిగా కనబడుచున్నది. కౌరవసైన్యములో భీష్ముని టెక్కెము తాటిచెట్టునంటి గురుతుగలిగి ముందరివైపు భయంకరముగా కనబడుచున్నది చూడుము అని ధర్మరాజు అర్జుననితో చెప్పగా అర్జునుడు చిరునవ్వునవ్వి ధర్మరాజు ముఖమునుచూచి విశేషముగా మాటలు చెప్పుటకు యిష్టములేక అధికగంభీర మనస్సుతో నిట్లనియెను.

అన్నా! ధర్మరాజా! మునుపు ఒకానొక దినమందు నారద మునీంద్రుడు చెప్పినమాటలను చెప్పెదవినుము. అధర్మమందు ప్రవ

ర్తించెడివారికి అధికముగా సైన్యబలమున్నను అట్టిసైన్యమును శత్రుసైన్యము కొంచెమున్నను గెలుచును. అని నారదుడు చెప్పియున్నాడు. ఈరీతిగనే భీష్మద్రోణులయెదుట పూర్వము నాకు వేదవ్యాసమునీంద్రుడు చెప్పియున్నాడు. గనుక దుర్యోధనుడు అధర్మమందు ప్రవర్తింపుచున్నాడు. అట్టి దుర్యోధనునకు అధికసైన్యమున్నను మన సైన్యము కొంచెమైనను మనము గెలువగలము. ఆవిషయ మట్లుండనిమ్ము. భీముని గదాసంచారమునకు శత్రుసైన్యము నిలువలేదు. భీముని గదాయుద్ధశక్తి మనుష్యులకు సాధ్యముగానిది. ధృష్టద్యుమ్న శిఖండి మొదలగు పాంచాలురు అద్భుత పరాక్రమశౌర్యవంతులై యున్నారు. విరాటుడు శంఖుడు మొదలగు మత్స్యదేశపు రాజభటులు శత్రువులకు భయంకరులగుదురు. సాత్యకి చేకితానుడు మొదలగు యోధవీరులు నీకు విజయమును కలిగించుటకు సమర్థులై యున్నారు. అభిమన్యుడు ఘటోత్కచుడు మొదలగు కుమార సమూహము లోకమును అతిక్రమించిన మహాబలశౌర్యధైర్యవంతమై యున్నది. మరియు నీ కటాక్షము నాయందున్నందునను నన్ను కృష్ణుడు రక్షింపబూనుటచేతను నా గాండివమను ధనస్సునకు రెక్కలు కలిగినట్లున్నది. తన బలమును తాను యెరుగని యేనుగువలె నీ బలమును నీ వెరుగవు. ఆ దేవేంద్రాది అష్టదిక్పాలకులైనను నిన్ను జయింపలేరు. నీవు కోపించినయెడల యెవ్వరెవ్వరు యేప్రకారము నశించెదరో యిట్లు చూడుము. అని యిట్లు అర్జునుడు చెప్పగా నా మాటలన్నియు ధర్మరాజు విని చింతను విడిచి తెలివితెచ్చుకొని అర్జునునితో యిట్లనెను.

తమ్ముడా! అర్జునా! కౌరవులు తమ సైన్యమునకు మానుష వ్యూహమును యేర్పరచి యున్నారు. ఆ వ్యూహమునకు సరియైన నాగ్గసు కల వ్యూహమును మన సైన్యమునకును యేర్పరచుము అని

ధర్మరాజు అర్జునునితో చెప్పగా అర్జునుడు ధృష్టద్యుమ్నుని పిలిచి యిట్లనెను ధృష్టద్యుమ్నుడా! మన సైన్యమునకు అచలమను గొప్ప వ్యూహమును యేర్పరచుము. అని అర్జునుడు చెప్పగా ధృష్టద్యుమ్నుడు వెళ్ళి పాండవసైన్యములకు అచలమను వ్యూహమును అమర్చెను. ఆ యచలవ్యూహమునకు ముందిరివైపు పూర్వదిక్కున ధృష్టద్యుమ్నుడును, అభిమన్యుడు, ఘటోత్కచుడు మొదలగు కుమారులును నకుల సహదేవులును వున్నవారై భీమునిచేత రక్షింపబడుచుండిరి. ద్రుపదుడు మొదలగు కొందరు రాజులు తమతమ బంధువులతోటి తమతమ సైన్యములతోటి చేకితానుని సహాయముగా నుంచుకొని ఆ యచలవ్యూహమునకు దక్షిణపుతట్టున నిలిచియుండిరి. విరాటుడు మొదలగు కొందరు రాజులు తమతమ బంధువులతోటి తమతమ సైన్యములతోటి, సాత్యకిని సహాయముగా నుంచుకొని ఆ యచల వ్యూహమునకు వుత్తరపుతట్టున నిలిచియుండిరి. అచలవ్యూహమునకు నడుమ కొండలగుంపులవలె నుండు యేనుగులసంఘముతో ధర్మరాజు రథముమీద వుండెను. ఆ ధర్మరాజు రథముమీద మిక్కిలి తెల్ల గొడుగులును సురటీలును ప్రకాశింపుచుండెను. ఆ ధర్మరాజు బ్రాహ్మణులకు వస్త్రములును బంగారముల నిచ్చుచు బ్రాహ్మణులు దీవించు విజయదీవనలను వినుచుండెను. అచలవ్యూహమునకు ముందువైపు శిఖండి నిలిచియుండి అర్జునునిచేత రక్షింపబడుచుండెను. ఆ శిఖండి భీష్మునకు యెదుటనుండి మదగర్వముచేత నిక్కుచుండెను. అచల వ్యూహమునకు వెనుకప్రక్కనుండు పడమటితట్టు మాగధ సహదేవుడును ధృష్టకేతుడును వీరిద్దరున్నవారలై భుజగర్వముచేత విజృంభించి నిలిచియుండిరి. ఈప్రకార మాపాండవుల అచలవ్యూహము మనోహరముగాను అతిభయంకరముగా నుండెను.

ధృతరాష్ట్రమహారాజా! ఆ పాండవ సైన్యము సముద్రమువలె భయంకరమై యుండెను. ఆ సైన్యమందుండు రథములు సమ్ము

ద్రము నడుమనుండు దీవివలె నుండెను. పెద్దపెద్ద యేనుగులు సముద్రమందుండు పర్వతములవలె నుండెను. ఆ సైన్యమందుండు గుర్రపు ౘారులు సముద్రమందుగల అలలవలె నుండెను. ఆ సైన్యమందుండు వీరభటుల చేతులు సముద్రమందుండు మొసళ్ళు మొదలగు క్రూరజంతువులవలె నుండెను. ఈరీతిగా పాండవ సైన్యము మహాసముద్రమువలె తోచుచుండెను. ధృతరాష్ట్ర మహారాజా! కౌరవ పాండవుల రెండు సైన్యములలో సకల రథికులయొక్క టెక్కెముల కాంతులకంటె అర్జునుని కోతిగురుతుగల టెక్కెము మిక్కిలి అధికముగా ప్రకాశింపుచుండెను. ఆ అర్జునుని టెక్కెమునందుగల తేజస్సు రెండు సైన్యములయందుగల సకల తేజస్సులను మరుగుపరచి అధికముగా ప్రకాశింపుచుండెను. రెండు సైన్యములలో నుండు భటులు యర్రగా నుండునట్టియు, తెలుపు నలుపు వర్ణములుగల కవచములను తొడిగికొని ఆవుల మందలోనుండు ఆబోతుయెద్దులవలె కేకలు వేయుచు భయమును కలిగింపుచుండిరి. ధృతరాష్ట్రమహారాజా కొన్ని దేశముల బలములును రాజులును దుర్యోధనుని పక్షముగా వచ్చి చేరియుండిరి. కొన్ని దేశముల రాజులును బలములును పాండవుల పక్షముగా వచ్చి చేరియుండిరి. గాన సమస్తదేశముల యుంస్థముడు సైన్యములన్ని యుద్ధమునకు వచ్చియుండెను. సమస్త భూప్రజలును బాలురు వృద్ధులు తప్ప మిగత వారందరును భారతయుద్ధములో పాల్గొని తమతమ పక్షముల విజయలక్ష్మిని కోరుచుండిరి. అప్పుడా కౌరవ పాండవ సైన్యములు భూమి పొట్ట పగిలినట్లు కనబడెను. అని సంజయుడు చెప్పగా ధృతరాష్ట్రు డిట్లనెను. సంజయుడా! పాండవ కౌరవుల రెండు సైన్యములలో యే సైన్యమందు మదగర్వములను గల్గియుండెనో చెప్పుమని యడుగగా సంజయు డిట్లనెను.

ధృతరాష్ట్రమహారాజా! కౌరవ పాండవసైన్యములోనుండు రెండుపక్షముల వారును ఒకరికంటె మరియొకరు మిక్కిలి గర్వించి ఒకరి కొకరు యుద్ధము చేయుటకు అతిభయంకరముగా దూకతలచు చుండిరి. కౌరవ పాండవ సైన్యములు రెండును గర్వించి యున్నవి అయినను కృష్ణార్జునులు పాండవసైన్యములో వున్నందున పాండవ సైన్యము కౌరవ సైన్యముకంటె సకల విషయములను అధికమైనట్లు నాకు కనబడెను. పాండవ సైన్యములోనుండు ఏనుగు లకుమదజలధారలు యింకిపోయెను. అందువలన తుమ్మెదలకు వుత్సాహము తప్పెను దుర్యోధనుడు యుద్ధవిషయమైన తెంపువదలక యుద్ధముచేయుటకై మహా విభూతితో ప్రకాశింపు చుండెను. పాండవులును, కృష్ణుడును సరసముగావచ్చి యుద్ధముచేయుటకు ప్రయత్నించిరి గాని విరోధము కలిగి వచ్చినట్లు కనబడలేదు. ఆ సమయమునందు కృష్ణుడు పాంచజన్యమను శంఖమును, అర్జునుడు దేవదత్తమను శంఖమును చక్కగా పూరించిరి, ఆ పూరించిన రెండు శంఖముల శబ్దములనువిని పాండవ సైన్యము లమితోత్సాహముగాను సంతోషముగా నుండెను. ఆశంఖ ధ్వనులను కౌరవసైన్యమందుగల యోధులువిని భయపడిరి. కౌరవ వ్యూహమందు ఆకాశమునుండి నెత్తురువాన కురిసెను. కౌరవవ్యూహ మందు అశుభసూచక నిమిత్తములు కలిగెను. అట్లు దుర్నిమిత్తము లగుట నాకు వింతగాతోచలేదు. భీష్మ ద్రోణ కృపా శ్వత్థామలు ప్రతినిత్యము యుద్ధమునకు బయలుదేరునపుడు అవశ్యముగా పాండవులకు జయముకలుగవలెనని తలచు చుందురు. పుణ్యాత్ములగువారు యిట్లు తలంచుటచేత కౌరవవ్యూహమందు అశుభసూచక నిమిత్తములు కలిగెనని తెలుసుకొనుము ఆవిషయ మటుండనిమ్ము. ఆదుశ్శకునములకు నీకొడుకులగు దుర్యోధన దుశ్శాసనాదులు భయపడక తమ వాద్యములను మ్రోయించునట్లు వుత్తరువుచేసిరి. కౌరవసైన్యమందు వాద్యములు అధికముగా మ్రోగెను. రెండుసైన్యములును యుద్ధక్రీ

డకు పుత్సాహము గలిగియుండెను. వారమిత శౌర్యసాహసములతో పుప్పొంగుచున్న పద్ధతిచూడగా ప్రళయకాలమందు రెండుసముద్రములు పుప్పొంగి కదలిభూమిమీద పడునట్లు భయమును కలిగింపుచుండెను. ఆసమయమున రెండుసైన్యములు ఒకరికొకరు ఒకయేర్పాటును చేసికొనిరి. ఆయేర్పాటును చెప్పెదను వినుము యుద్ధముచేయుచున్నను, తగురీతిని మాటలాడెడి సమయమందును, యేమరియున్నప్పుడును. అట్టియోధునిమీద బాణము వేయకూడదు. ఆయుధపు దెబ్బతగిలి మూర్ఛిల్లినప్పుడు అట్టివాడు తన కెంత శత్రువైనను చంపరాదు. ఎంతశత్రువైనను నిరాయుధుడై యున్నప్పుడు అట్టివానిని చంపరాదు. యుద్ధముచేసి పారిపోవుచున్నపుడు అట్టివాడు తన కెంత శత్రువైనను చంపరాదు. లనతో యుద్ధము చేయుటకు సమ్మతించక వెళ్లెడివానిని చంపరాదు. యుద్ధముచేయుటచేత బలశక్తి తగ్గి భయపడియున్న యెడల అట్టివాడు తనకెంత శత్రువైనను చంపరాదు. అని ఆరెండు సైన్యముల రథికులును యేర్పాటుచేసికొనిరి ఆయేర్పాటును అంపరును సమ్మతించిరి. నానావిధములగు రంగులుగల ఆసైన్యములు రెండును ఒకటియెదుట మరియొకటి హెచ్చుతగ్గు సమరూపములైన ధైర్యముచేత వికసించిన పుష్పవనమువలె తోచుచుండెను. ఆభారత యుద్ధమును చూడవలెనను వేడుకచేతవచ్చిన దేవగంధర్వాదులందరును, ఆకాశమందుండి యెప్పుడెప్పుడు యుద్ధము ప్రారంభమగునో యెప్పుడుచూతుమోయని అవసరమనస్సులు గలిగియుండిరి. కౌరవ పాండవసైన్యములలోనుండు శ్రేష్ఠరథికులు ఒకరికొకరు తాకి యుద్ధము చేయుటకు ప్రయత్నింపుచుండిరి.

## ధర్మరాజు పాదచారియై భీష్మునియొద్దకు బోవుట

ఆసమయమున యుద్ధమందుత్సాహముగల ధర్మరాజు మిక్కిల ప్రకాశింపుచున్న తనదేహమందుగల కవచమునువిప్పి సకల ఆయుధ

ములతో ఆకవచమును తనరథముమీంద పెట్టి క్రిందకుదిగి రెండుచేతులు ముడుచుకొని యెవ్వరితో పలుకక, మాటలాడక భూమిపై పాదచారయై నడచుచు భీష్ముడున్న దిక్కునకు వెళ్ళుచుండెను. ధర్మరాజు నడుచుచు కౌరవసైన్యములోనికి వెళ్ళుచుండగా అందరునుచూచిరి. భీమార్జున నకులసహదేవులును, కృష్ణ సాత్యకులును, మరికొందరు బంధుస్నేహసంబంధులగు రాజులును, ధర్మరాజుయొక్క అభిప్రాయము నెరుగక జిజ్ఞాసగలవారై తాము తమ రథములనుంచి క్రిందకుదిగి శీఘ్రముగా నడిచివెళ్ళి ధర్మరాజును కలిసికొని అతని వెనుకనే వెళ్లుచు భీము డిట్లనెను.

అన్నా! ధర్మరాజా! మేమందరముండగా నీవిట్లు వొంటరిగా పాదచారుడవై వెళ్ళుటకు కారణమేమియని భీముడడిగెను. అన్నా! ధర్మరాజా! యుద్ధమునకు సిద్ధముచేయించిన సైన్యమును విడచి యిట్లువెళ్ళుట బాగగునా అని అర్జునుడడిగెను. అన్నా! ధర్మరాజా! శత్రువులయెదుట యెగతాళి కలుగునట్లు సైన్యముగల బలహీనునివలె యిట్లు వెళ్ళవచ్చునా? అని నకులుడడిగెను. ధర్మరాజా! యుద్ధమునకు సర్వప్రయత్నముచేసి యుద్ధముచేయుటకువచ్చి యిప్పుడు మన కపకీర్తి గలుగునట్లు నీవు వెళ్ళుట మంచిదగునా? అని సహదేవుడడిగెను. అని యీరీతిగా భీమార్జున నకుల సహదేవులడుగగా ఆమాటలకు ధర్మరాజొక మాటైనను ఒకమాటయైనను బదులుచెప్పక భీష్ముడున్న కౌరవసేనవైపు వెళ్ళుచుండెను. కృష్ణుడు నవ్వుచు భీమార్జున నకుల సహదేవులతో యిట్లనెను.

భీమార్జున నకులసహదేవులారా! యీ ధర్మరాజుయొక్క అభిప్రాయమును నేను యెఱుగుదును. ధర్మరాజు కౌరవసైన్యములోనికి వెళ్ళి భీష్మ ద్రోణ కృపశల్యులకు నలుగురకును నమస్కరించి వారి అనుజ్ఞనుపొంది యుద్ధముచేయవలెనను తలంపుతో

యిట్లు వెళ్ళుచున్నాడు; పెద్దలఅనుమతిని పొంది యుద్ధముచేసిన యెడల నిశ్చయముగా జయముకలుగునని పెద్దలు చెప్పుదురు. ధర్మరాజువెళ్ళి భీష్మ ద్రోణ కృప శల్యులఅనుమతిని బొందుటమేలు. అని కృష్ణుడు చెప్పగా ఆమాటలను ధర్మరాజువెంబడి వెళ్ళినవారలు విని వారు బదులుమాటాడక అక్కడనిలిచియుండి భయముగలవారై చిత్తరువులవలె నిలిచి చూచుచుండిరి.

కృష్ణార్జున భీమ నకుల సహదేవు లైదుగురునుధర్మరాజుతో నడిచివెళ్ళిరి. ధర్మరాజు భీష్మునిరథము దగ్గరకు వెళ్ళుచుండగా కౌరవసైనికులందరును అధికగర్వము గలవారై మెడలెత్తుకొని ధర్మరాజును చూచుచుండిరి. ఆసమయమున కౌరవసైన్యములోని యుద్ధవీరులు కొందరు ధర్మరాజు భయపడెను గదాయని చెప్పుకొనుచుండిరి. కొందరితడు భయపడుటకు కారణమేమైయుండును అని చెప్పుకొనుచుండిరి. ఇంతకష్ట మీ ధర్మరాజునకిప్పుడు యేమికలిగెనని కొందరు చెప్పుచుండిరి. భీమార్జున నకుల సహదేవ అభిమన్యు సాత్యకి విరాట ద్రుపద ధృష్టద్యుమ్న శిఖండి మొదలగు మహారథికులుండగా ధర్మరాజు యిట్లు భయపడవలసిన కారణమేమియని చెప్పుకొనుచుండిరి. కొందరు ధర్మరాజు యుద్ధమునకు భయపడెడనియు యేతలంపుననో వచ్చుచున్నాడనియు చెప్పుకొనిరి. కౌరవసైన్యములోని రథికులీరీతిగా తమలోతాము మాట్లాడుకొనుచుండిరి. భీష్ముని దగ్గరకు వెళ్ళు ధర్మరాజును పాండవసైనికులు చూచి యిట్లు చెప్పుకొనసాగిరి. ధర్మరాజు మానవంతుడు. ధర్మరాజు భీష్మునిదగ్గరకు వెళ్ళుచున్నాడు ధర్మరాజు భీష్మునితో యేమిచెప్పునో తెలియదు. భీష్ముడు ధర్మరాజును యేవిధముగా సన్మానించెనో తెలియదు, కృష్ణార్జునులు యేమని చెప్పుదురో తెలియదు. భీమ నకుల సహదేవులు భీష్మునితో యేమిమాటలాడుదురో తెలియదు. పాండవులీ

విధముగా భీష్మునిదగ్గరకు పోవుటకు కారణమేమైయుండునో తెలి యదు. అని పాండవసైనికులు చెప్పుకొనుచు చింతాక్రాంతులై అనేకవిధములుగా ధర్మరాజు వెళ్ళుటను గురించి చెప్పుకొనుచుండిరి. పాదచారియై వెళ్ళిన ధర్మరాజు నానావిధ ఆయుధములచేత యుద్ధము చేయదలచి యున్న కౌరవ వ్యూహము లోనికి ప్రవేశించి తన తాతయగు భీష్ముని దగ్గరకుబోయి ఆ భీష్ముని పాదములకు సాష్టాంగ నమస్కారముచేసి వంగి భీష్మునితో యిట్లనెను.

తాతా! భీష్మా! నీకు యెదురుగానిలిచి నేను యుద్ధము చేయదలచి యున్నాను. అందుకు ముందుగా నీయనుజ్ఞ పొందవలె నని వచ్చినాను గనుక నీచేత నేను దీవననుపొంది వెళ్ళితినేని శత్రువు లను గెలువగలను. అని ధర్మరాజు చెప్పగా నామాటలను భీష్ముడు విని ధర్మరాజునిజూచి యిట్లనెను. మనుమడగు ధర్మరాజా! అయ్యో! నీవిట్లురాక యుద్ధముచేసిన యెడల నిన్ను శపింపదలచితిని. వచ్చితివి గనుక మంచిదయ్యెను. నీశత్రువులను గెలువుము. నీపక్షముగా నేను యుద్ధముచేయుట తప్ప వరమెద్దయినను అడుగుము ఇచ్చెదను. అని భీష్ముడు చెప్పగా ధర్మరాజు యిట్లనెను. తాతా! భీష్మాచార్యా! నీవు దుర్యోధనుని తట్టు యుద్ధముచేయుము. నాకు మేలుకలిగించు కార్యమును నీమనస్సునందు తలచుచుండుము అని ధర్మరాజు యీ వరమును అడుగగా భీష్ముడు ధర్మరాజు అడిగిన వరమునకు సమ్మతించి అట్లనే చేసెదనని చెప్పి ధర్మరాజుతో యిట్లనెను.

ధర్మరాజా! నీవు యిప్పుడు నన్ను వరమడిగిన ప్రకారము చేసెదను. అయ్యో! నీమనస్సునగల తలంపేదియో చెప్పుము. అని భీష్ముడడుగగా ధర్మరాజు యిట్లనెను. తాతా! భీష్మా! నిన్ను యుద్ధమందు గెల్చువుపాయమును నాకు బోధింపుము అని ధర్మరాజు అడుగగా భీష్ముడు నవ్వుచున్న ముఖముగలవాడై ధర్మరాజు

కిట్లనెను. ధర్మరాజా! దేవతలైనను నాతోయుద్ధముచేసి నన్ను యుద్ధమందు గెలువజాలరు. అని భీష్ముడు చెప్పగా ధర్మరాజిట్లనెను. తాతా! భీష్మా! నిన్ను దేవతలైనను యుద్ధమందు గెలువజాలరు. నిన్ను గెల్చు వుపాయమును చెప్పుమని వేడుకొనుచున్నాను. అని ధర్మరాజు ప్రార్థింపగా భీష్ముడు మనుమనియందు కృపగలిగి ధర్మరాజుతో యిట్లనెను.

ధర్మరాజా! చుట్టరిక ముండు నామనస్సు ప్రవేశించినను, నామనస్సును కరిగించి ప్రార్థించినను, నాచేతియందు బాణముండు పర్యంతము నన్ను యుద్ధమందు గెల్చుటకు యెవ్వరికిని సాధ్యము గాదు. నేను నా నేర్పరితనమును విడిచి తీక్ష్ణబాణమును ముట్టక నేను పట్టిన బాణమును క్రిందపడచితినేని అప్పుడు నన్ను చంపవచ్చును. అంత పర్యంతము నన్ను ఆదేవతలైనను గెలువజాలరు. గనుక నీవు అడుగక వెళ్ళుము. నన్ను గెల్చుటకు యిది సమయముగాదు. మరియొకసారి శీఘ్రకాలములోనే నావద్దకురమ్ము. అట్లు వచ్చినప్పుడు నన్ను గెల్చువిధమును నీకు చెప్పెదను. అని భీష్ముడు చెప్పగా భీష్మునిమాటలను ధర్మరాజు శిరస్సునందుంచుకొని అధికమైన సంతోషముతో నమస్కరించి భీష్ముని అనుజ్ఞను పొంది సెవుస్సుదిగా వెళ్లెను.

## ధర్మరాజు గురుకృప శల్యులచేత యుద్ధమున కనుజ్ఞాతుడగుట

అట్లు భీష్మునిదగ్గరనుంచి అవతలికి వెళ్ళుచున్న ధర్మరాజు వెంబడి కృష్ణార్జున భీమ నకుల సహదేవులును వెళ్ళుచుండిరి. ధర్మరాజు కృష్ణునితోగూడిన తన తమ్ములందరును తన వెంబడి వచ్చుచుండగా ద్రోణాచార్యుని దగ్గిరకు వెళ్ళి అతని పాదములకు నమస్కరించి అతని వలన యుద్ధము చేయుటకు అనుజ్ఞపొంది ద్రోణు

నితో యిట్లనెను. మహాత్మా! ద్రోణాచార్యవర్యా! యుద్ధమందు నాకు జయము కలుగునట్లుగా దీవింపుము. అని ప్రార్థించగా అపుడు ద్రోణాచార్యుడు ధర్మరాజుతో యిట్లనెను.

ధర్మరాజా! సాక్షాత్తుగా విష్ణుదేవుడగు కృష్ణుడు నీకు మంత్రియైయుండగా జయముకలిగెడి నిమిత్తము దీవించుమని యితరులను నీవు ప్రార్థించవలసిన పనిలేదు. ఏపక్షమందు ధర్మముండునో ఆపక్షమందు కృష్ణుడుండును. ఏపక్షమందు కృష్ణుడుండునో ఆపక్షము వారికి అవశ్యముగా జయము కలుగగలదు. అని ద్రోణాచార్యుడు ధర్మరాజుతో చెప్పగా ధర్మరాజు ద్రోణునిజూచి యిట్లనెను. మహాత్మా! ద్రోణాచార్యా! నిన్ను చంపు నుపాయమేదియో ఆ వుపాయమును నాకుచెప్పవేయని ప్రార్థించగా అప్పుడు ద్రోణాచార్యు డిట్లనెను, ధర్మరాజా! నా చేతియందు ఆయుధముండు పర్యంతము ఆ దేవతలైనను నన్ను జయింపజాలరు. నేను ప్రాయోపవేశముచే బాణములను తాకక విడిచినపుడు నన్ను చంపుటకు సమర్థుడైన వాడు చంపవచ్చును. మిక్కిలి కీడుగల మాటను మిక్కిలి నమ్మదగిన వాడు నాతో చెప్పినపుడు అట్టి మిక్కిలి దుఃఖపుమాటను నేను వినిన యెడల ఆ సమయమందు నేను బాణములను తాకక విడిచెదను. అప్పుడు నన్ను శత్రువులు చంపవచ్చును. అని ద్రోణాచార్యుడు చెప్పెను. ధర్మరాజు కృపాచార్యుని వద్దకు వెళ్లెను. అతని వెంబడి కృష్ణ భీమార్జున నకుల సహదేవులును వెళ్ళిరి. ధర్మరాజు కృపాచార్యునకు సాగిలపడి నమస్కరించి యిట్లనెను.

మహాత్మా! కృపాచార్యా! నేను యుద్ధము చేయదలచి యున్నాను. నాకు యుద్ధమునకు అనుజ్ఞనిచ్చి నాకు యుద్ధమున జయముకలుగునట్లు చేయుము. అని ధర్మరాజడుగగా కృపాచార్యు డిట్లనెను. ధర్మరాజా! నీవు యుద్ధము చేయుటకు అనుజ్ఞనిచ్చితిని

నీకు యుద్ధమందు జయముగలుగును. అని కృపాచార్యుడు దీవించగా ధర్మరాజు కృపాచార్యుని చంపు వుపాయమును అడుగదలచి స్పష్టముగా అడుగజాలకుండెను. కృపాచార్యుడు ధర్మరాజు అభిప్రాయమును యెరిగి యిట్లనెను. ధర్మరాజా! నేను చచ్చువాడను గాను. నేను చిరకాల జీవిని. నీవు యుద్ధమందు గెలువుము. అని కృపాచార్యుడు చెప్పగా వాని అనుమతినిపొంది శల్యునిదగ్గరకు వెళ్లెను. అతని వెంబడి కృష్ణ భీమార్జున నకుల సహదేవులును వెళ్ళిరి. ధర్మరాజు శల్యునకు నమస్కరించి అతనివలన యుద్ధము చేయుటకు అనుజ్ఞను పొంది యిట్లనెను.

మామా! శల్యుడా! నాకు యుద్ధమందు జయము గలుగునట్లు దీవింపుము. నీవు కర్ణునకు సారథివగుటచే కర్ణుని తేజస్సును దూషించి అతని వుత్సాహమును చెరచి అతనిని చిక్కుపరచవలయును. ఇట్లు నాకు వరమిమ్ము. అని ధర్మరాజు వరమును కోరగా శల్యుడు ధర్మరాజుతో యిట్లనెను. ధర్మరాజా! నీవు కోరినప్రకారము వరమిచ్చితిని, ఈవిషయమును నీ వుద్యోగసమయమందు యిదివరకే కోరియున్నావు. గనుక నేను అవశ్యముగా కర్ణుని తేజస్సును దూషించి దూషణ వాక్యములచేత కర్ణుని వుత్సాహమును మంచి యుద్ధసమయమందు భంగపరచెదను. నీవుయుద్ధమందు గెలువుము అని శల్యుడు చెప్పగా ధర్మరాజు శల్యుని అనుమతిని పొంది మరలెను. ఈప్రకారముగా ధర్మరాజుభీష్మ ద్రోణ కృప శల్యులవలన యుద్ధమునకు అనుమతిని పొంది మరలిన సమయమందు కర్ణుడు ఆ కౌరవ పాండవుల సైన్యములను చూడవలెనను వేడుకచేత వచ్చి కౌరవ సైన్యములో ఒకతట్టు నిలిచి చూచుచుండెను. ఆ సమయమందు కృష్ణుడు కర్ణునిదగ్గరకు వెళ్ళి పూర్వము చూచినప్రకారమే స్నేహపు మర్యాదను జరిపి యిట్లనెను. కర్ణా! నీవు భీష్మునిమీద

కోపించుకొని భీష్ముడు పడువరకు యుద్ధమందు ప్రవేశించవట. అట్లు ప్రవేశించని పక్షమున భీష్ముడు చచ్చువరకు నీవు పాండవుల పక్షమున కొంత యుద్ధక్రీడను వేడుకనిమిత్తమై జరుపగూడదా! అని కృష్ణుడు చెప్పగా ఆమాటలను కర్ణుడు విని కృష్ణుని యెప్పటివలె మర్యాదచేసి యిట్లనెను. కృష్ణా! నేను భీష్మునిమీద కోపించుకొని నందున భీష్ముడు యుద్ధము చేయువరకును యుద్ధమునకు నేను రాకుండుట తగునుగాని పాండవుల పక్షముగా యుద్ధము చేయరాదు. నేను దుర్యోధనునకు యిచ్చిన ప్రాణమును యితరులయందు ఉపయోగింప తగునా! అని కర్ణుడు చెప్పగా ఆమాటలను కృష్ణుడు విని సంతోషించి మరలివచ్చి పాండవులతో చేరెను. ఈప్రకారము ధర్మరాజు కౌరవ సైన్యములోనుంచి బయలుదేరి కౌరవ సైన్యముయొక్క తూర్పు గట్టునకు వచ్చి ఆపైపు ముఖముంచి నిలుచుని పెద్ద కంఠ ధ్వనితో అందరు వినునట్లుగా యిట్లనెను.

కౌరవ సైనికులారా! మీసైన్యములోనుండు వారెవ్వరైనను మాపక్షమునకు రాదలచినయెడల అవశ్యముగా రావచ్చును. ఇట్లు వచ్చినవారిని నా తమ్ములవలెనే చూచి నేను ప్రీతితో గౌరవించి పోషించెదను. ధృతరాష్ట్రమహారాజా! యీరీతిగా ధర్మరాజు మిక్కిలి పెద్దగా అరచి చెప్పగా ఆమాటలను నీ పుత్రుడగు యుయుత్సుడు విని నేను నీ పక్షమునకు వచ్చెదను నన్ను కలుపుకొనుమని ధర్మ రాజుతో చెప్పెను. అంతట ఆమాటను ధర్మరాజువిని సంతోషించిన మాటలను యుయుత్సునితో చెప్పెను. అప్పుడు యుయుత్సుడు, దుర్యోధనాదులు చేసిన చెడుకార్యములను చెప్పుచు, దుర్యోధనాదులను దూషించుచు, పాండవుల గుణములను పొగడికొనుచు తన సేనను నడిపించికొనివచ్చి ధర్మరాజు సైన్యములోనికి చేరెను. పాండవుల సైన్యములందు తప్పెట్లు మొదలగు వాద్య విశేషములు మ్రోగు చుండెను. ధృతరాష్ట్రమహారాజా! యుయుత్సుడు నీకు సవతిపెండ్లాము కుమారుడు. యుయుత్సుడు నీ పుత్రులగు దుర్యోధనాదులతో

స్నేహము కలిగి యుండెదనుగదా! ఆవిషయము నట్లుండనిమ్ము. యుయుత్సు డధిక సంతోషముతో ధర్మరాజు పక్షము చేరగా ధర్మరాజు సంతోషముతో వానిని మిక్కిలి గౌరవించి అనేక వుపచారములచేత వానిని సంతోషపెట్టెను. ధర్మరాజు యుయుత్సున కుత్సాహమును పరమానందమును కలిగించి తన రథముమీదకు పోయి యుద్ధచిహ్నమగు కవచమును ధరించి ధనుస్సును బాణములపొదిని తీసికొనెను. పాండవ సైన్యమం దధిక సంతోషమును గలిగించు వాక్యధ్వనులును, నాలుగు విధములగు వాద్యములును అధికముగా మ్రోగెను. ఆసమయమున ధర్మరాజుయొక్క తమ్ములును తక్కిన రాజులును తమతమ రథము లెక్కి చెప్పబడిన తమతమ స్థానములయందు నిలువగా ఆ పాండవుల అచల వ్యూహము పూర్వప్రకారమే యుద్ధసన్నాహముతో నుండెను. ఆసమయమున పాండవ కౌరవ సైన్యములలోని వారందరును పాండవులు పూర్వము పొందిన అవమాన కష్టములను చెప్పుకొనుచు దుఃఖించుచుండిరి. కొందరు సంధి నిమిత్తమై ధర్మరాజు చేసిన ప్రయత్నమును చెప్పుకొని మెచ్చుకొనుచుండిరి. కొందరట్లు మెచ్చుకొని యుద్ధకాలమందు ధర్మరాజు భీష్మ ద్రోణ కృప శల్యుల అనుమతిని బొందుటకు అతని గుణములను వర్ణించుచు అతనియందు ప్రేమగలిగి యుండిరి. అని సంజయుడు ధృతరాష్ట్రునితో చెప్పగా ధృతరాష్ట్రుడు సంజయునితో యిట్లు అనెను.

# భగవద్గీతా ప్రారంభము.

## అర్జున విషాదయోగమను ప్రథమాధ్యాయము

సంజయుడా! నాకుమారులగు దుర్యోధనాదులును పాండవులును అట్లు యుద్ధముచేయదలచి తమతమ సైన్యములతో పుణ్యభూమియగు కురుక్షేత్రమందు నిలిచియుండి అటుపిమ్మట యేమిచేసిరో

చెప్పుము, అని ధృతరాష్ట్రుడు అడుగగా సంజయుండిట్లనెను. ధృత రాష్ట్రమహారాజా! నీకొమరుడగు దుర్యోధన మహారాజు యుద్ధమునకు సిద్ధమైయుండు పాండవసైన్యవ్యూహమును జూచి ద్రోణాచార్యుని దగ్గరకు వెళ్ళి యిట్లనెను. మహాత్మా! ద్రోణాచార్యా! నీశిష్యుడగు ధృష్టద్యుమ్నునిచేత వ్యూహరూపముగా నేర్పరచబడిన గొప్పదగు పాండవసైన్యమును చూడుము, ఆపాండవసైన్యమందు భీమార్జును లతో సమానమగు యుద్ధశూరులను చెప్పెదవినుము. యుయుధాను డును, విరాటుడును, ద్రుపదుడును, ధృష్టకేతుడును, చేకితానుడును, కాశీరాజును, పురుజిత్తుడును, కుంతిభోజుడును, శైబ్యుడును, యుధా మన్యుడును, ఉత్తమౌజుడును, అభిమన్యుడును, ద్రౌపదీపుత్రులగు ప్రతివింధ్య, శ్రుతసోమ, శ్రుతకీర్తి, శతానీక, శ్రుతసేనులును, వీ రందరును మహారథికులగుదురు. ద్రోణాచార్యా! మన సైన్యమం దుండు మహారథికులను చెప్పెదనువినుము. నీవును, భీష్ముడును, కర్ణుడును, కృపాచార్యుడును, సమితింజయుడును, అశ్వత్థామయు, వికర్ణుడును, భూరిశ్రవుడును, సైంధవుడును మరికొందరు మహా శూరులును మహారథికులై నానావిధములైన ఆయుధయుద్ధమందు సమర్థులై దివ్యాస్త్రసంపన్నులైయున్నారు. వీరందరును నానిమిత్తమై ప్రాణములను విడువదలచి నాపక్షముగా యుద్ధముచేయుటకు వచ్చి యున్నారు. ఈమనసైన్యము పాండవసైన్యమువలె సమర్థవంతముగా ప్రకాశించుటలేదు. యీమన మహాసైన్యమంతయు మన భీష్మునిచేత రక్షింపబడుచున్నది. ఆపాండవసైన్యమంతయు సమర్థవంతముగా ప్రకాశించుచు భీమునిచేత రక్షింపబడుచున్నది. మీరందరునుయుద్ధ సమయమున భీష్ముని రక్షింపుచుండవలయును. మీరంద రేవైపు యుద్ధముచేయుచున్నను సర్వదా భీష్మునివైపుచూచుచు భీష్ముని కాపాడుచుండవలయును. అని దుర్యోధనమహారాజు ద్రోణాచార్యు

నితో చెప్పగా ద్రోణుఁ డేమాత్రపుపని యంతదూరము చెప్పునటేనా
యని దుర్యోధనునితో చెప్పెను. ఆమాటలను భీష్ముడు విని దుర్యో
ధనునకు సంతోషము కలిగింపదలచి సింహనాదముచేసి తన శంఖ
మును పెద్దధ్వని కలుగునట్లుగా పూరించెను. (యుద్ధమందు శత్రువు
లకు భయముకలుగునట్లు పెద్దధ్వనిని కలుగచేయు అరపునకు సింహ
నాదమందురు) భీష్ముడట్లు శంఖమును పూరించినతోడనే కౌరవ
సైనికులందరును తమతమ శంఖములను పూరించిరి. అప్పుడు కౌరవ
సైన్యములో పటపటమని భేరీలును. చిన్నతప్పెటలు. పెద్దతప్పెటలు,
పూరకము మొదలైన వాద్యములును ఒక్కపెట్టున మిక్కిలి అధిక
ముగా మ్రోగెను. అప్పుడు కలిగిన మహాధ్వని మిక్కిలి అధికమై
యుండెను ధృతరాష్ట్రమహారాజా! ఇకను పాండవ సైన్యములోని
విశేషములను చెప్పెదను. సావధానచిత్తముతో వినుము. శీఘ్రముగా
పాండవసైనికులు కౌరవసైన్యములో కలిగిన శంఖభేరీ వాద్యధ్వను
లను వినిరి. అప్పుడు తెల్లని దివ్యములగు రథాశ్వములను పూన్చి
యున్న గొప్ప రథముమీదనుండి కృష్ణార్జునులు తమ దివ్యశంఖము
లను పూరించిరి. ఆశంఖముల పేర్లను చెప్పెదను వినుము. కృష్ణుడు
తన దివ్యశంఖమగు పాంచజన్యమును పూరించెను. అర్జునుడు తన
దివ్యశంఖమగు దేవదత్తమును పూరించెను. ఆకృష్ణార్జునుల శంఖ
ధ్వనులను విని భీముడు పౌండ్రమను తన మహాశంఖమును పూరిం
చెను. ధర్మరాజు అనంతవిజయమను తన శంఖమును పూరించెను.
నకులుడు సుఘోషమను తనశంఖమును పూరించెను సహదేవుడు
మణిపుష్పకమను తన శంఖమును పూరించెను. కాశీరాజు, శిఖండి
ధృష్టద్యుమ్న విరాట సాత్యకి ద్రుపదద్రౌపదేయులను అభిమన్యు
ఘటోత్కచులు మొదలగు యుద్ధవీరులందరును తమతమ శంఖము
లను ప్రత్యేకముగా పూరించిరి. అంత మహాధ్వని కలిగెను. ఆధ్వని

చేత దుర్యోధనాదుల గుండెలు పగులునట్లుగా అదరెను. ఆమహాధ్వని చేత భూమ్యాకాశములు రెండును ప్రతిధ్వని కలిగియుండెను. ధృతరాష్ట్రమహారాజా! అర్జునుడు యుద్ధసన్నద్ధులై యున్న దుర్యోధనాది కౌరవసైనికులను చూచి వారిమీద బాణములను వేయదలచి తన గాండీవమను దివ్యమహాధనుస్సును తీసికొని అల్లెత్రాటిని సవరించి తన సారథియైన విష్ణుదేవుడైన కృష్ణభగవంతునితో ఇట్లనెను.

మహాత్మా! కృష్ణా! బాణములను వేయుటకు తగినసమయము ప్రాప్తించియున్నది. ఇపుడు యుద్ధముచేయుటకు వచ్చినవారి నందరిని నేనుచూచి యెవ్వరితో యుద్ధము నేను చేయదగియుండునో తెలిసికొనవలయును. మనతో యుద్ధము చేయదలచినవారందరును ఇక్కడికివచ్చియున్నారు. వీరందరును దుర్మార్గుడైన దుర్యోధనునివలన యుద్ధమందు అభిలాష కలిగియున్నారు. గనుక నేను యేయే రథికులతో యుద్ధము చేయదగియుండునో తెలిసికొనవలయును. గాన మనరథమును యీరెండు సైన్యముల మధ్యప్రదేశమునకు తోలుకొని వెళ్ళి ఆమధ్యప్రదేశమందు నిలుపుము. అని అర్జునుడు కృష్ణునితో చెప్పెను. ధృతరాష్ట్రమహారాజా! అర్జునుడు చెప్పగా కృష్ణుడు దివ్యరథమును తోలుకొనిపోయి ఆకౌరవపాండవుల సైన్యములకు రెంటికి మధ్యప్రదేశమందు భీష్మద్రోణులు మొదలగు మహారథికుల యెదుట నిలిపి అర్జునునితో యిట్లనెను. అర్జునా! రెండుసైన్యములకు నడుమ మనరథమును నిలిపితిని. కౌరవసైన్యములోనుండు మహారథికవీరులగు భీష్మద్రోణులు మొదలగువారిని యుద్ధసన్నద్ధులై వచ్చిన సకలదేశపురాజులను కౌరవులగు దుర్యోధనాదు లందరిని చక్కగా చూడుము. అని కృష్ణుడు చెప్పగా అర్జునుడు కౌరవపాండవసైన్యములలో నున్న జనులందరిని చక్కగా చూచెను. ఆరెండుసైన్యములలోవారును అర్జునునకు వరుసచేత కొందరు తండ్రులైయుండిరి.

కొందరు తాతలై యుండిరి. మరికొందరు గురువులు, మేనమామలు, అన్నదమ్ములు, కొడుకులు, మనుమలు, స్నేహితులు, మామలు, ఆప్తమిత్రులుగానుండిరి. ఈప్రకారముగా ఆకౌరవపాండవసైన్యములలోని జనులందరును అర్జునునకు బంధుజనులై యుండిరి. ఆబంధుజనులను అర్జునుడుచూచి వారియందు పరమకృపగలవాడై దుఃఖమనస్సుతో కృష్ణునితో యిట్లనెను. కృష్ణా! సర్వసిద్ధమైన యుద్ధమునకు సిద్ధమైన యీరెండుసైన్యములలో నుండు నాబంధుజనమును చూచితిని. వీరి నందరిని చూడగా నామనస్సున కధికదుఃఖము కలుగుచున్నది. ఆదుఃఖమువలన నాసకలేంద్రియములును అధిక బలహీనములైనవి. నాముఖము వాడిపోయినది. నాకు గల అధికదుఃఖముచేత నాశరీరము బలహీనమై వణకుచున్నది. నాదేహమందు గల వెంట్రుకలన్నియు నిక్కపొడుచుకొని యున్నవి. నాచేతిలోనుండి గాండీవముజారి క్రిందపడుచున్నది. నాదేహము దుఃఖపరితాపముచేత దహించినట్లున్నది. నేను నిలిచియుండుటకు శక్తిలేనివాడనైతిని. నా మనస్సు గిరగిర తిరుగుచున్నట్లున్నది.

కృష్ణా! అశుభసూచకములగు నిమిత్తముల నేకములు నాకిప్పుడు కనబడుచున్నవి. నాబంధుజనులను యుద్ధమందు చంపుటచేత నాకుమేలుకలుగనేరదు. నాకుయుద్ధమందు విజయమక్కర లేదు. నాకు రాజ్యమైనను రాజ్యసుఖములైనను పనిలేదు. కృష్ణా! ఏజనుల నిమిత్తమై రాజ్యభోగసౌఖ్యములు కోరబడెనో ఆజనులందరును తమ తమ ప్రాణధనములను యుద్ధమందు విడచుటకు యిక్కడికివచ్చి యున్నారు. ఈవచ్చిన నాబంధుజనులందరును యుద్ధమందు చచ్చిన యెడల పిమ్మట నాకురాజ్యముతో నైనను భోగములచేత నైనను, బ్రతుకుటచేతనైనను ప్రయోజనము లేదు. ఈయుద్ధమునకువచ్చిన రెండుసైన్యములలోని జనులందరును నాకుగురువులుగాను తండ్రులు

గాను పుత్రులుగాను, తాతలుగాను, మేనమామలుగాను, మామలు గాను, మనుమలును, బావమరదులును, సంబంధజనులగు వియ్యం కులుగాను వున్నారు. వీరందరు నామీదకు యుద్ధమునకువచ్చి నన్ను అక్రమముగా కొట్టినను వీరిని నేను చంపుటకు యిష్టపడను. మూడు లోకముల రాజ్యసామ్రాజ్యమును కలిగించుకొను నిమిత్తమునకైనను నాబంధుజనులుగానుండిన యీసైనికులను నేనుచంపజాలను. గనుక యీస్వల్పరాజ్యముకొరకు నాబంధుజనులను చంపుటకు యెంతమాత్ర మైనను ప్రయత్నించను. కృష్ణా! దుర్యోధనాది దుర్మార్గులను చంపుటచేత మనమనస్సులకు ప్రీతికలుగకపోవుటయేగాక మనకు అధికపాపము ప్రాప్తించగలదు. గనుక బంధువులతోగూడియుండు యీ దుర్యోధనాదులను మనముచంపరాదు. మనబంధుజనులను మనముచంపుకొనుటచేత మనమెప్పటికిని సుఖవంతులముకాజాలము. మనము యీదుర్యోధనాదులకును బంధుజనులమగుదుము. ఈ దుర్యో ధనాదులు రాజ్యమందుగల లోభగుణముచేత అవివేకులై యుద్ధ మందు తమబంధుజనులను చంపుకొనుటకు ప్రయత్నించియున్నారు. గనుక దుర్యోధనాదులు మనమీదికి యుద్ధమునకు వచ్చిరని తలచక మనము యుద్ధమును మానుకొనవలయును.

కృష్ణా! అయ్యో! మనమిప్పుడు యుద్ధముచేసినయెడల ఈ రెండుసైన్యములలోనుండు బంధుజనులందరును యుద్ధమందు చత్తురు. మనకు కులక్షయము నశింపజేసిన పాపముకలుగును. ఈసైన్యములలో నుండెడి మనమిత్రులను మనము చంపుటచేత మిత్రద్రోహమను మహాపాపము మనకుసంప్రాప్తమగును. అయ్యో! ఇటువంటి మహా పాపమును సంపాదించుటకు మనము ప్రయత్నపూర్వకముగా వచ్చి తిమి. ఇట్లు పాపముకలుగునని మనమదివరకు యెరుగకుండుటకు కారణమేమో తెలియలేదు. అయ్యో! ఇంతపాపమును కలిగించు

మిప్పుడు యుద్ధముచేసిన యెడల రాచకులము నశించును. రాచకుల క్షయమగుచుండగా అనాదిగనుండెడి రాచకులధర్మములన్నియు నశించును. రాచకులధర్మములు నశించినతోడనే సకలకులధర్మములును నశించి అధర్మము వృద్ధికాగలదు. అధర్మము వృద్ధియగుచుండగా కులస్త్రీలు దుర్మార్గపుకార్యములయందు ప్రవర్తించి దుష్టలగుదురు. స్త్రీలు దుష్టలైనప్పుడు వర్ణసంకరమగును. అట్టివర్ణసంకరముచేత నరకము ప్రాప్తించగలదు. ఆపాపకర్మఫలమగు నరకము కులక్షయము చేసినవారికిని ఆకులమునకును కలుగగలదు. కృష్ణా! కులక్షయమగుచుండగా పితృదేవతలకు పిండప్రదానములును తిలోదకప్రదానములు మొదలగు క్రియలును నశింపగలవు గనుక రాచకులక్షయమగుటచేత యీచెప్పినదోషమువలన వర్ణసంకరమగును. వర్ణసంకరమగుటచేత శాశ్వతములైన జాతిధర్మములును కులధర్మములును చెడిపోవును. కులధర్మములను చెరచినవారికి సర్వదానరకప్రాప్తి కలుగుచున్నదని. పెద్దలవలన మనమువినియున్నాము. అయ్యో! ఆహా! మనమురాజ్యమందుగల లోభముచేత మనబంధుజనులనందరిని యుద్ధమందు చంపబూనికిమి. ఆహా! మహాపాపకర్మమును చేసికొనుటకు సిద్ధముగావచ్చితిమి, కృష్ణా! నాబంధుజనులగు వీరిమీద నేను బాణమును వేయను. బాణమును తాకను. నిరాయుధుడనైయుండెదను. అట్లు నేను నిరాయుధుడనైనను దుర్యోధనాదులు ధనుర్ధరులై నామీద బాణములువేసి నన్నుచంపినను అదినాకు మేలగును. ధృతరాష్ట్రమహారాజా! ఈ ప్రకారము యుద్ధభూమియందు అర్జునుడు కృష్ణునితోచెప్పి అధికమగు దుఃఖముగలమనస్సుగలవాడై ధనుర్బాణములనువిడచి రథమునందు చతికిలబడియుండెను.

ఇది శ్రీకృష్ణార్జున సంవాదరూపమును, బ్రహ్మవిద్యా యోగ
శాస్త్రమును నగు శ్రీభగవద్గీతోపనిషత్తునందుఅర్జున
విషాదయోగమను ప్రథమాధ్యాయము.

# ద్వి తీ యా ధ్యా య ము

ధృతరాష్ట్రమహారాజా! ఆ ప్రకారముగా బంధుజనులను యుద్ధమందు చంపజాలక పరమకృపచేత కన్నీరుకార్చుచు దుఃఖాగ్ని వలన పరితపించుచుండ అర్జునుని శ్రీకృష్ణభగవంతుడుచూచి యిట్లనెను. అర్జునా! యుద్ధమునకు సర్వసిద్ధమైనప్పుడు నీకు పిరికితనము కలిగెను. పిరికితనము పండితులయందు కలుగనేరదు. పిరికితనము స్వర్గమును పొందనివ్వక అపకీర్తిని కలుగజేయుచు. ఇపుడు నీకింత దుఃఖమ యెందులకు కలిగెను? ఈ పిరికితనమును విడువుము. ఈపిరికితనము నీయందుండ తగదు. అర్జునా! ఈ పిరికిగుణము నీచమైనది బుద్ధిబలమును పోగొట్టును. గనుక యీ పిరికిగుణమును విడిచి దుఃఖించక యుద్ధమునకులెమ్ము అని భగవంతుడు చెప్పగా అర్జును డిట్లనెను. కృష్ణా! మహాత్ములగు భీష్మద్రోణులు పూజింప దగినవారు. భీష్మద్రోణులమీద నేను బాణములు వేయుటకు సమ్మతింపను. భీష్మద్రోణులు నాకు గురువులు ఆ గురువులను చంపక లోకమందు భిక్షమెత్తుకొని జీవించినను అది మేలగును. గురువులైన భీష్మద్రోణులను చంపినయెడల మనకు గలుగు సకలరాజ్య సౌఖ్యములను రక్తమయములతో సమానము లగును. ఈ విషయమై ఎట్లుచేయవలెనో తెలియలేదు. కృష్ణా! యుద్ధముచేసినయెడల వారలను మనము గెల్తుమో -మనలను వారు గెల్తురో, ఆవిషయము మనమిప్పుడు యెరుగజాలము. కౌరవులను జంపి రాజ్యమును తీసికొనవలెనని యిదివరకు మనము తలచియుంటిమి. ఇప్పుడు ఆకౌరవులందఱును తమతమ సైన్యసహాయములతో ఘాడ్ఢ యిక్కడికి వచ్చియున్నారు, వారియందు నాకు కృపాబుద్ధి

కలిగియున్నందున ధర్మమార్గమును తెలియని వాడనై నిన్ను అడుగుచున్నాను. కృష్ణా! నీకు నేను శిష్యుడను. నిన్ను ఆశ్రయించితిని. నన్ను శిక్షించుము. ఇప్పుడు నేను యుద్ధముచేయుట ధర్మమో, యుద్ధముచేయకుండుట ధర్మమో నిశ్చయించి నాకుచెప్పుము. ఈ రెండు విధములలో యేవిధమువలన నాకు మేలుకలుగునో ఆవిధమును చక్కగా యోచించి నిశ్చయించి చెప్పి నన్ను రక్షింపుము. దుఃఖాగ్ని చేత నామనస్సు మొదలగు యింద్రియములకు కలిగిన శుష్కత్వము సర్వలోక రాజ్య ప్రాప్తికలిగినను పోజాలదు. దేవలోకాధిపత్యము నాకిప్పుడు లభించినను నాయింద్రియములకు కలిగిన శుష్కత్వము నివర్తింపదని నాకు తోచుచున్నది. ధృతరాష్ట్ర మహారాజా! యీ రీతిగా అర్జునుడు కృష్ణునితో చెప్పి యుద్ధము చేయనని ఊరకుండెను. భగవంతుడైన కృష్ణుడు కలకలనవ్వుచు రెండు సైన్యముల నడుమ యుద్ధభూమి యందు దుఃఖించుచున్న అర్జునునితో యిట్లనెను.

అర్జునా! భీష్మద్రోణాదుల విషయమై నీవుదుఃఖింపరాదు. వారు ఆత్మస్వరూపముచేత నిత్యులగుదురు. దుఃఖింపదగని భీష్మాదులగురించి అవివేకముచేత దుఃఖింపుచున్నావు. ఇది మూఢత్వము. బుద్ధిమంతుని వలె కొన్నిమాటలను చెప్పితివి. ఆత్మవిషయమైన జ్ఞానముగలవారు పండితులని చెప్పబడుదురు. అట్టి పండితులగువారు చచ్చువారు నిమిత్తమైగాని బ్రతికియుండు జనుల నిమిత్తమైగాని దుఃఖింపరు. గనుక దుఃఖింపదగని భీష్మ ద్రోణాదులను గురించి నీవు దుఃఖింపుచున్నావు. ఆ హేతువుచేత నీవు మూఢుడవేగాని పండితుడవుగావు. అర్జునా! అనేక దేహములు కలిగి నశించినను నేనెప్పటికి నశించెడివాడను కాను. నీ కనేక దేహములు కలిగి నశింపనున్నను నీవు యెప్పటికి నశించెడివాడవు కావు. ఈయుద్ధమునకు వచ్చిన రాజులు మొదలగు

జనులందరును వారివార దేహములు నశించినను వారు నశించెడి వారు కారు. సకల దేహములయందును ఆత్మయొకడే నిత్యుడై సర్వదా వికారములేక యుండును. గనుక మనమందరము వాస్తవ రూపమగు మన ఆత్మస్వరూపముచేత యిదివరకు గతించిన కాల మందును యిప్పుడును యిక రాబోవు కాలమందును నిత్యులమై యున్నాము. సకల జంతువులకును నీకును నాకును వాస్తవస్వరూ పము ఆత్మయేకాని దేహము కాదు. ప్రతిదేహమునకును మొదట బాల్యావస్థయు, పిమ్మట యౌవనావస్థయు, ముసలితన మను అవస్థయు యీ మూడవస్థలును క్రమముగా ప్రాప్తించుచున్నవి. ఆ మూడవస్థ లును ఒకటొకటి విరోధ స్వభావములను గలిగియుండును. ఆయా అవస్థగుణములు దేహమునందుండునేగాని ఆ దేహమందుండు ఆత్మకు కలుగజాలవు. బాల్యావస్థ నశించినపుడు దేహమందుండు ఆత్మకు నాశము కలుగుటలేదు ఒక దేహమునకు మూడవస్థలు ప్రాప్తించి నట్లు దేహము ద[illegible] ఆత్మకు మరియొక దేహప్రాప్తి కలుగు చున్నది. ఈ విష[illegible] పండితుడు మోహమునుపొంది దుఃఖించడు. అర్జునా! సకల [illegible] లును శ్రోత్రత్వక్చక్షుర్జిహ్వాఘ్రాణము లను అయిదు జ్ఞానేంద్రి[illegible] ను శబ్దస్పర్శరూపరసగంధములను అయిదు యింద్రియవిష[illegible] కలిగియున్నవి. ఆ ఇంద్రియవిషయములును ప్రతిజంతువున[illegible] రవిషయ సుఖదుఃఖములను కలిగించు చుండును. [illegible] విషయములకు కొంతకాలములో నాశ మున్నందున [illegible] లగును. గనుక విషయసుఖదుఃఖములు కలిగినప్పుడు [illegible] మనస్సులను పొందియుండరాదు. ఆకలుగు సుఖదుఃఖము[illegible] వకాని చిత్తవికారమును పొందకుండుట మంచిదగును

అర్జునా ! సుఖదుఃఖములు కలిగినప్పుడు సమబుద్ధి కలిగి చిత్త వికారము లేని ధైర్యవంతుడు మోక్షభావమునకు సమర్థుడు. అర్జునా ! సత్తుఅనియు అసత్తుఅనియు రెండువిధములైన పదార్థములు లోకమందు స్ఫురించుచున్నవి. ఆ రెంటిలో సత్తు అనునది ఆత్మ యనబడును. అసత్తు అనునది దేహేంద్రియాది సకలదృశ్య ప్రపంచ మగును. సత్తుఅను వస్తువునకు నాశ మెప్పటికిని లేదు. అసత్తు అను పదార్థమునకు యెప్పుడును సత్యస్వరూపము లేదు. యీరీతిగా అసత్తు సత్తులకు భేదనిర్ణయము కలిగియున్నదని తత్వజ్ఞానులు సిద్ధాంతము చేసియున్నారు. అసత్తుఅను వస్తువు యెప్పటికైనను నాశములేనిది. ఆసత్తను వస్తువే విష్ణువందుడు. ఆ విష్ణువను పరబ్రహ్మముచేత యీ సర్వప్రపంచము వ్యాపింపబడియున్నది. ఆ విష్ణువను పరబ్రహ్మమే యీ దేహమందుండి ఆత్మయను పేరుచేత వ్యవహరింపబడుచున్నాడు. గనుక నాశములేని యీఆత్మకు నాశము కలిగించుటకు యెవ్వడైనను సమర్థుడు కాడు. అర్జునా ! స్వప్నమందు కనబడిన మాయా దేహము వలె యీ నాశవంతములైన దేహములు ... వ్యాపైన ఆత్మకు గల్గుచున్నదని వివేకులగువారు చెప్పి... . గనుక యీ దేహములను నశింపజేయుటచేత నిత్యు... ... యేవిధమైన లోపము కలుగజాలదు. అందువలన ... ము చేయుము. అర్జునా ! ఆత్మ ఇతరులను చంపుననియు, ... ను చంపుదు రనియు తెలియు మనుజులు ఆత్మస్వరూపంస ... గారు కాజా లరు. ఆత్మ ఇతరులచేత చంపబడునదియు ... చంపు నదియు కూడ కాదు. అర్జునా ! యీ ... ఆత్మ అవయవములేని స్వరూపుడగుటచేతను ... యెప్ప టికి పుట్టుకలేనివాడును, యెప్పటికిని చా... యెప్పటికిని క్షీణింపనివాడును యెప్పటికి వృద్ధియను ... యెప్ప

టికిని మరియొక విధముగా పరిణమించని వాడును అగును; ఆత్మకు యేకాలమందైనను యేవిధమైన వికారము కలుగజాలదని తెలుసుకొనుము. సర్వకాలములయందును ఆత్మ ఒక్కటేవిధముగా అఖండ సత్యజ్ఞానానంద స్వరూపుడై నిర్వికార నిర్గుణుడై ప్రకాశింపుచుండును. అర్జునా! యీ దేహములయందుండు ఆత్మ ముందు చెప్పిన ప్రకారము నాశములేనివాడనియు నిత్యుడనియు, జననమరణాది వికారము లేనివాడనియు, యిట్లని ఆత్మస్వరూపమును యెరిగిన పురుషుడు విద్వాంసుడనబడును. ఆ విద్వాంసుడును దేహేంద్రియాదులచేత యుద్ధాది లోకవ్యవహారములను చేయుచున్నను, ఆ విద్వాంసుడు ఒకనిని చంపిన వాడును, చంపింపజేసినవాడును కాడని యెరుంగుము. ఆ విద్వాంసుడు తన స్వరూపమగు చిదాత్మను యెరిగి యున్నందున అతని దేహేంద్రియములు చేసిన హింసాది కర్మలు ఆ విద్వాంసుల నంటజాలవని తెలియవలయును. యీ కర్మములను నేను చేసితినని యు, చేయుచున్నాననియు, చేసెదననియు, నేను చేసిన పుణ్యపాప కర్మలకే ఆయాఫలములు నాకు లభించుననియు యిట్టి తలంపు లజ్ఞానికుండునేగాని జ్ఞానియగు విద్వాంసుని మనస్సునందు కలుగజాలవు. అట్టి అభిమాన రూపమగు తలంపులు గలవాడు ఆయాకర్మలచేత బంధింపబడుచుండును. అట్టిఅభిమాన రూపమగు తలంపులులేక తన ప్రారబ్ధ వశమున యుద్ధాది సకలవ్యవహారములను చేసినను అట్టి విద్వాంసుడు కర్మబద్ధుడు కాడని నిశ్చయముగా తెలిసికొనుము. గనుక యీ సకలదేహములయందుండు ఆత్మయెప్పటికిని నాశనము లేదని తెలిసికొని నీవు యుద్ధమునకు లెమ్ము. అర్జునా! లోకమందు మనుష్యుడు చినిగిన వస్త్రములను విడిచి క్రొత్తవస్త్రములను ధరించినట్లు యీ దేహమందుండు ఆత్మ తన కర్మవశమువలన చెడిన దేహములను విడచి క్రొత్తవియగు యితర దేహములను పొందుచుం

మును. అర్జునా! యీ దేహముల యందుండు నిర్వికారమైన ఆత్మను శస్త్రాస్త్రములేవియును ఛేదింపజాలవు. అగ్నిహోత్రుడు దహింపజాలడు. నీళ్ళు తడుపజాలవు. గాలి శుష్కింప చేయజాలదు. గనుక యీ ఆత్మ శస్త్రాస్త్రములచేత ఛేదింపబడనివాడును అగ్నిచేత దహింపబడనివాడును నీళ్ళచేత తడుపబడనివాడును. గాలిచేత శోషింపబడనివాడును అగును. ఆ హేతువుచేత యీ దేహముల యందుండు ఆత్మ సర్వకాలముల యందును నిర్వికారుడై ఒక్కటే విధముగా నుండుటచేత నిత్యుడనబడును. నిత్యుడగుటవలన సర్వవ్యాపియగును. సర్వగతుడగుట వలన స్థిరముగా నుండువాడగును. స్థిరుడగుటవలన కదలని వాడగును. నిశ్చలుడగుట వలన అనాదిగా నుండువాడగును.

అర్జునా! సర్వేంద్రియములచేతను యెరుగబడని వాడగుట వలన అవ్యక్తుడనబడును. యీ ఆత్మ యిటువంటి వాడసి మనస్సుచేత చింతించుటకు సాధ్యముకానివాడు. ఆత్మ వికార మెన్నటికిని లేనిది, అర్జునా! యీ సకలదేహములయందుండు ఆత్మ యిటువంటిదే అని తెలుసుకొనుము. పిమ్మట భీష్మ ద్రోణాది బంధుజనులను గురించి దుఃఖింపకుము. ఇట్లు నిత్యుడైన ఆత్మవికారమైన మనస్సుతో చేరి జననమరణములను పొందుచుండునని నీవు తలంచితివేని ఆపక్షమందైనను భీష్మాది బంధుజనులను గురించి నీవు దుఃఖింపకుము. తెల్లముగా చెప్పెదను వినుము. వికారమగు మనోసంబంధము వలన ఆత్మకు జనన మరణములు సర్వదా కలుగుచున్న పక్షమున పుట్టిన వానికి తప్పక చావుకలుగును. చచ్చినవానికిని మరల జన్మము కలుగును. స్వాభావికముగా జననమరణములను పొందు జనుల నిమిత్తమై నీవు దుఃఖించుటచేత ప్రయోజనము లేదు. నీవిపుడు యుద్ధమందు భీష్మాదులను చంపకున్నను వీరికి స్వాభావికమైన చావు తప్పదు.

గనుక ఆపక్షమందైనను నీవు దుఃఖించినందున లాభము లేదని తెలిసికొనుము.

అర్జునా ! యీ దేహములన్నియు మాయవలన కల్పించబడినవి. గనుక యీ దేహములు పుట్టకముందు కనబడలేదు. చచ్చిన పిమ్మట ఆ దేహములు కనబడవు. మధ్యకాలమందు కనబడుచున్నవి. మొదట కనబడక, పిమ్మట కనబడి, నశించి కనుబడకపోవు దేహములు మిథ్యయని చెప్పబడును. భీష్మ ద్రోణాది బంధుజనుల దేహములనుగురించి నీవుదుఃఖింపకూడదు. అర్జునా ! అనేక సహస్రములగు జనులలో ఒకానొకడు ఆత్మను ఆశ్చర్యముగా జూచుచు ఆశ్చర్యతుల్యుడగు చున్నాడు. అనేకమంది జనులలో ఒకానొకడు ఆత్మను ఆశ్చర్యముగా చెప్పుచుండువాడును ఆశ్చర్యతుల్యుడగుచున్నాడు. అనేకులలో ఒకానొకడు యీ ఆత్మను ఆశ్చర్యముగా వినుచు ఆశ్చర్యతుల్యుడగుచున్నాడు. అట్లువినినను గురుసంస్కారముగాని, శాస్త్రసంస్కారముగాని, శ్రద్ధాభక్తులుగాని లేనందున ఒకడు ఆత్మను వాస్తవముగా యెరింగినవాడు లేడు. అర్జునా ! యీ ప్రకారముగా ఆత్మ మనస్సుచేత చింతించుటకును, సాధ్యముగానిదై యున్నది. గాన యీ సకల దేహములను చంపినను, ఆ దేహములయందుండు ఆత్మ ఒక్కటే యైనందున యెప్పటికిని చంపబడదు. గాని నీవు యీ భీష్మ ద్రోణాది సకల దేహములనుగురించి యెంతమాత్రమును దుఃఖింపరాదు. ఈ ప్రకారము పరమార్థమునుబట్టి విచారించగా దుఃఖమోహములను పొందకూడదని తెలిసెనుగదా ! లోక వ్యవహారమును బట్టి యోచించినను దుఃఖమోహములను పొందరాదని తో స్పష్టమగుచున్నది. ఆవిధమునుకూడ చెప్పెదను వినుము.

అర్జునా ! నీక్షత్రియకులమునకు యుద్ధము పరమధర్మము. క్షాత్రకులమందు బుట్టినవానికి యుద్ధముకంటె అధిక శ్రేష్ఠ మైనో

కలిగించు ధర్మము మరియొకటి లేదు. గనుక యీ భీష్మాదులను గురించి దుఃఖింపరాదు, అర్జునా! యుద్ధమందు చచ్చినవారికి అప్రయత్నముగా స్వర్గలోకప్రాప్తి కలుగుచున్నది: గనుక సౌఖ్యము గోరు రాజులు యిటువంటి ధర్మమును బ్రకటించు యుద్ధమును జేయుటకు ఆశకలిగియుందురు. అర్జునా! ఇపుడు నీవు నీకుల ధర్మమైన ఈ యుద్ధమును చేయనియెడల నీకు అపకీర్తి కలుగును. ఆ అపకీర్తిని యిప్పుడు లోకమందుండు జనులును, యికమీదట పుట్టు జనులును చెప్పుకొను చుందురు. అందువలన నీకు కలిగిన అపకీర్తి లోకమందు శాశ్వతమై యుండును. కీర్తివంతుడై చక్కగా బ్రతికిన వానికి అపకీర్తి కలిగిన యెడల ఆ యపకీర్తి మరణమునకంటె అధిక కష్టమైన దగును.

అర్జునా! నీవిపుడు యుద్ధము చేయనియెడల నీవు యుద్ధమునకు భయపడితివని నీశత్రువులగు దుర్యోధనాదులందరును తలంచెదరు. నీవు మహాయుద్ధశూరుడ వనియు మహాబలవంతుడ వనియు దుర్యోధనాదులచేత గౌరవింప బడితివి. నీవిప్పుడు యుద్ధము చేయని యెడల నిన్ను యిదివరకు మెచ్చుకొనిన వారలే నీసామర్థ్యమును, నిందింపుచు నిన్ను దూషింతురు. నీశత్రువు లందరును పలుకరాని మాటలచేత నిన్ను దూషింపుచుందురు. అంతకంటె అధికమగు, దుఃఖము మరియొకటి కనబడ లేదు. అర్జునా! యుద్ధము చేయవలెనని దృఢనిశ్చయము గలవాడవై లేచి యుద్ధముచేయుము. ఈ యుద్ధమందు నీవుశత్రువులను జయించినయెడల యీరాజ్యసామ్రాజ్య సౌఖ్యములను అనుభవింతువు. యీ ప్రకారముగా నీవు యుద్ధమందు చచ్చినను గెలిచినను కూడ, రెండు విధములచేతను నీకు సౌఖ్యముకలదు. కనుక యుద్ధము చేయుటకొరకు దృఢనిశ్చయము గలిగి లెమ్ము. నీక్షత్రియ కులమునకు ధర్మమైన యుద్ధమును చేయు

నపుడు సుఖదుఃఖములయందు సమానబుద్ధి గలవాడవై రాగద్వేష ములనుంచుకొనుము. లాభనష్టములను జయాపజయములను సమా నముగా తలచుకొని మనోవికారములేని వాడవై యుద్ధముచేయుము. ఈరీతిగా నీవు యుద్ధముచేసినయెడల పాపమును పొందవు.

అర్జునా! సంసార దుఃఖ మోహాదిదోషములను పోగొట్టు పర మార్థమైన ఆత్మ వస్తువివేక విషయజ్ఞానమును నీకు యిదివరకు చెప్పి తిని. ఇకను కర్మయోగ సమాధి యోగముల విషయమై నేనుచెప్పు మాటలను వినుము. ఆత్మవస్తు విషయమగు జ్ఞానమును పొందుటకు కర్మయోగము వుపాయముగా నుండును సర్వసంగములను విడిచి రాగద్వేషాది చిత్త వికారములు లేక కేవలము యీశ్వరుని పూజిం చుట కొరకు కర్మములను చేయుచు కర్మఫలములను అపేక్షింప కుండుటయే కర్మయోగ మనబడును.

అర్జునా! యీశ్వర సమర్పణ పూర్వకముగా కర్మములను చేయుచున్న యెడల యీశ్వరానుగ్రహాది నిమిత్తములవలన ఆత్మ జ్ఞానమును పొంది పుణ్య పాపకర్మ బంధములను విడిపించుకొనగలవు. ఈ కర్మయోగము మోక్షమార్గమగును. మోక్షమార్గమైనకర్మ యోగమందు పైరుపెట్టుట మొదలగు పనులవలె కర్మనాశము కలు గక సిద్ధమైన నియతఫలము కలుగును. యీ కర్మమార్గమందు నియ మము తప్పినను వైద్యభేదమువలన వ్యాధిదోషముకలిగినట్లు దోషము కలుగజాలదు. ఈ కర్మయోగ విషయమైన కర్మానుష్ఠానము కొంచె మైనను జనన మరణ లక్షణ రూపమైన సంసార మహాభయము నుంచి రక్షింపుచున్నది. అర్జునా! మోక్షమార్గమందు నిశ్చయ స్వభావ రూపమగు వివేకబుద్ధి యొక్కటియే సహాయమై యుండును. నిశ్చయ స్వభావమైన వివేకబుద్ధి లేనివారికి అనేక విధ కర్మభేద బుద్ధులు కలిగియుండును. అట్టి వివేకులు కర్మఫల సాధనము లేన

వేదవాక్యములయందు ఆసక్తులై పుష్పించిన వృక్షమువంటిదని, వినుటకు మనోహరమైన వాక్యమును చెప్పెదరు. ఆ చెప్పు వాక్యమును వినుము. స్వర్గభోగ పశుపుత్రాది ఫలములకు సాధనములైన కర్మములను చేయుటకంటె అధికమైన మరియొక పురుషార్థము లేదని చెప్పెదరు. ఇట్టి వాక్యమును చెప్పెడివారలు స్వర్గమే పరమ పురుషార్థమని తలచి కోరికలను స్వభావముగా గలిగియుందురు. అట్టి అవివేకులు భోగైశ్వర్యములను కలిగించు కర్మవిశేష వాక్యములను పూర్వోక్తప్రకారము చెప్పుచుందురు. భోగైశ్వర్యములను కోరుచుండు జనుల చిత్తమందు వివేక ప్రజ్ఞ మరుగుపడి యుండును. అట్టి జనుల మనస్సు సాంఖ్యమందుగాని యోగమందుగాని సమాధియందు నిలువజాలదు. ఆత్మ తత్త్వ విచారణము సాంఖ్యమనబడును. జాగ్రదవస్థయందు బుద్ధిని విషయములయందు పోనివ్వక నిశ్చలముగా నిలుపుట సమాధియగును. అర్జునా! వేదములు ధర్మార్థ కామములను తెలుపుచుండును. ధర్మార్థ కామముల సంసారవిషయములే కాని మోక్షవిషయములు కానేరవు. సంసారవిషయములైన వేదములను ఆశ్రయించినవారలు భోగైశ్వర్యములను కోరుచు కర్మపరులై యుందురు. అట్టివారు సంసారమందే ప్రవర్తింపుచుందురు గాని ఆత్మ తత్త్వజ్ఞానమువలన మోక్షమును పొందజాలరు. నీవు కోరికలేనివాడవు. సంసార సుఖదుఃఖములయందు సమబుద్ధిగలవాడ వగుము. సర్వదా సాత్త్విక గుణమును ఆశ్రయించినవాడ వగుము. లేని పదార్థమును సంపాదించుటయందును. లభించిన పదార్థమును రక్షించుటయందును ప్రయత్నము లేనివాడవగుము ఇష్టపదార్థము లభించుటనపుడు మదించి యుండకుము. తెలివిగలిగి ప్రవర్తింపుము. నీ కుల ధర్మమును నీవు అనుష్ఠింపుచు యీప్రకారము ప్రవర్తింపుచుండుము. అర్జునా! లోకమందు బావి చెరువు మొదలగు జలప్రదేశముల

యందు స్నానపానాది రూపమైన సమాధిని పొందగలవు అని.
ప్రయోజన మంతయు పరిపూర్ణ జల డిట్లనెను.
అటువలెనే కర్మఫలమును కోరక ఆత్మతత్త్వయందున్న స్థితప్రజ్ఞుడు
సకల వేదకర్మముల ఫలమువంటి విజ్ఞానఫలమును యేమని
కర్మఫలమును గోరక యీశ్వరార్పణముగా క్రైవహారము లెట్లు
చేత ప్రయోజనము లేదని తలచవద్దు. ఆత్మజ్ఞాన నిష్ఠ భగవంతు
తము కర్మములను చేయుచు కర్మఫలమును కోరక కామములను
స్మి బొంది
ణము చేయుచుండ వలయును.
చెప్ప

అర్జునా! నీకిపుడు కర్మమందే అధికారమున్నదిగాని క్ష
నిష్ఠయందు అధికారము లేదు. గనుక కర్మములనే చేయుచుండుము.
ఏ అవస్థయందైనను కర్మఫలమును కోరకుండుము. కర్మఫలములను
కోరితివేని ఆ కర్మఫలముల ననుభవించు నిమిత్తము జన్మములు
కలుగుచుండును. కర్మఫలములను కోరనియెడల అట్టి కర్మములను
చేయుటచేత లాభము లేదని కర్మములను చేయకుండరాదు. అర్జునా!
యోగమందున్నవాడవై కేవలముగా యీశ్వరపూజకొరకు కర్మము
లను చేయుచుండుము. అట్లు యోగమందుండి కర్మములను చేయు
నపుడును యీశ్వరుడు నన్ను గురించి సంతోషింపవలయు నను కోరి
కనుగూడ విడిచియుండుము. కర్మఫలమును కోరక యీశ్వరార్పణ
ముగా కర్మములను చేసినయెడల. చిత్తశుద్ధిద్వారా జ్ఞాన ప్రాప్తి
యగుట సిద్ధియనబడును. అట్లు చేయనియెడల జ్ఞానప్రాప్తి కలుగనిది
అసిద్ధియనబడును. ఆసిద్ధి అసిద్ధి యను రెంటియందును సమబుద్ధిగల
వాడవై కర్మములను చేయుచుండుము. సిద్ధి అసిద్ధి అను రెంటియం
దును సమబుద్ధి గలిగియుండుట యోగమనబడును. ఇట్టి యోగ
మందున్న వాడవై కర్మఫలములను గోరక యీశ్వర పూజకొరకు
కర్మములను చేయుచుండుము.

సమబుద్ధిచేత యీశ్వరార్పణముగా
ఎ జ్ఞానసాధనమైనందున శ్రేష్ఠమైనది.
ఎ కోరుచు చేయుకర్మము గొప్పదైనను
ర్మము జనన మరణములను యిచ్చుచుండును.
యమైన సమబుద్ధినైనను తత్త్వవిచారణ రూపమైన
నను ఆశ్రయించి పరమార్థజ్ఞానమును పొందుటకు
పుము. కర్మఫలమును కోరుచు కర్మములను చేసినవారు
ఎ చెప్పబడుదురు. అర్జునా! యోగరూపమైన సమబుద్ధిచేత
ర్మములను చేసినవాడు చిత్తశుద్ధిద్వారా జ్ఞానప్రాప్తి కలిగి సకల
పుణ్యపాపములను విడువగలడు. గనుక నీవు సమత్వరూపమైన
యోగముకొరకు బుద్ధిని ప్రవేశింపజేయుము. కర్మములను చేయుట
యందు యోగబుద్ధి శ్రేష్ఠము.

అర్జునా! ముందు చెప్పినప్రకారము సమబుద్ధి రూపమైన యోగమందుండి కర్మఫలమును కోరక యీశ్వరార్పణముగా కర్మములను చేసినవారు జ్ఞానులై కర్మఫలమైన జన్మబంధమును విడిచి జీవన్ముక్తులై యెప్పటికిని నాశములేని మోక్షమును విష్ణుపరమపదమును పొందుచున్నారు. అర్జునా! ముందుచెప్పినప్రకారము యీశ్వరార్పణరూప కర్మయోగానుష్ఠానముచేత సత్త్వశుద్ధివలన కలుగుబుద్ధి యెప్పుడు లభించబడునని యంటివేని చెప్పెదనువినుము. అర్జునా! నీ బుద్ధి యేకాలమందు అవివేకరూపమైన కాలుష్యమును విడిచి పరిశుద్ధ స్వభావమును పొందునో ఆకాలమందు వైరాగ్యమును పొందగలవు. ఆత్మానాత్మవివేకము లేనిదే అవివేకమనబడును. అట్లు వైరాగ్యము కలిగినపుడు వినదగిన వ్యవహారములు వినుచు ఆయా వ్యవహారములతో కూడియుండు నీబుద్ధి యేకాలమందు స్థిరము గల్గి చలింపక ఆత్మయందుండి అక్కడనుగూడ చలింపకుండునో

ఆకాలమందు వివేకప్రజ్ఞారూపమైన సమాధిని పొందగలవు అని. భగవంతుడైన కృష్ణుడు చెప్పగా అర్జునుడిట్లనెను.

కృష్ణా ! వివేకజ్ఞానరూపమైన సమాధియందున్న స్థితప్రజ్ఞుడు పరులచేత యేమని చెప్పబడును. స్థితప్రజ్ఞుడు తానైనను యేమని భాషించును. స్థితప్రజ్ఞునకు వునికి మొదలైన వ్యవహారము లెట్లు జరుగునో చెప్పుము. అని అర్జునుడడుగగా కృష్ణుడైన భగవంతు డిట్లనెను. అర్జునా! మనస్సున గల సకల సంకల్పకామములను పూర్తిగా విడిచి ప్రత్యగాత్మయైన తనయందే తానుండి తృప్తిబొంది ఆనందించువాడు స్థితప్రజ్ఞుడు. ఇతడు పరులచేత విద్వాంసుడని చెప్పబడును. స్థితప్రజ్ఞుడు దుఃఖములు కలిగినపుడు దుఃఖించక, సౌఖ్యములయందు కోరికనుంచక రాగభయక్రోధములను పొందకయున్న యెడల అప్పుడు మునియని చెప్పబడును అర్జునా! దేహము జీవించుట మొదలగు విషయములయందైనను స్నేహములేక కర్మవశము వలన ప్రాప్తించు సుఖదుఃఖములను పొందియు మనోవికారము లేని వాడు మునియని చెప్పబడును. మునికి వివేకప్రజ్ఞారూపమైన అహం బ్రహ్మాస్మి అను ఆకారము గల జ్ఞానము గలుగగలదు. అర్జునా! మరియు జ్ఞాననిష్ఠయందు ప్రవర్తించు ముని తాబేలు భయముచేత తన అవయవములను తనదేహములోనికి ముడుచుకున్నట్లు తన శ్రోత్రాది జ్ఞానేంద్రియములను శబ్దాది సకలవిషయములనుండి మరలించి మనస్సుయందు చేర్చుకొనియుండును. అట్టిమునికి అహం బ్రహ్మాస్మి అను ఆకారముగల వివేకప్రజ్ఞ కలుగగలదు. అర్జునా! ఆహారము భక్షించక కొయ్యవలె తపస్సుచేయు మూర్ఖునకు విషయములయందు అసక్తి గలుగదు. ఆమూర్ఖుడాహారమును భక్షించిన తోడనే వానికి విషయాసక్తి కలుగును. మునియైనవాడు పరబ్రహ్మము నేనేనని యెరిగినందున వానికి యెప్పటికిని సారమైన విషయాసక్తి కలుగజాలదు. అర్జునా! యోగసమాధిని అభ్యసించుటకు ప్రయత్నము

చేయువాడు మొట్టమొదట జ్ఞానేంద్రియములను తనవశమందుండు నట్లుగా చేసికొనవలయును. అట్లు చేయక సమాధియందు మనస్సును నిలిపినయెడల అట్టివాడు మహాబుద్ధిమంతుడైనను వానిమనస్సును యింద్రియములు చలింపచేసి క్షోభింపజేయగలవు. గనుక ఆ జ్ఞానేంద్రియములన్నిటిని తనవశము చేసికొని సమాధియుక్తుడై నేను ప్రత్యగాత్మయైన వాసుదేవుడ ననియు ఆవాసుదేవునికంటె అన్యుడు గాడనియు తలచుచున్నయెడల అట్టివానికి అభ్యాస బలమువలన జ్ఞానోదయమగును.

అర్జునా! సకలదుఃఖములకు మూలకారణములను చెప్పెద వినుము. విషయములను ఆలోచించువానికి వానియందు ప్రీతికలుగును. ఆప్రీతివలన ఆశ కలుగును. ఆశవలన క్రోధము కలుగును. క్రోధమువలన అవివేకము కలుగును. ఆ యవివేకమువలన తొలుత శాస్త్రాచార్యులవద్దను తాను గ్రహించిన జ్ఞానసంస్కారమను స్మృతి చెడిపోవును. అందువలన బుద్ధినాశము సంభవించును. బుద్ధినాశమగుటవలన పురుషుడు పురుషార్థమునకు అయోగ్యుడగును. అర్జునా! విషయములను ఆలోచించుటవలన యిట్లు సకలదుఃఖములును కలుగుచున్నవి. గనుక మోక్షమును గోరువాడు శ్రోత్రాది జ్ఞానేంద్రియములను తనవశమందు ప్రవర్తింపజేయుచు రాగద్వేషములను విడిచి తన శరీరము జీవించియుండుటకు తగిన అన్నపానాదివిషయములను మాత్రము యింద్రియములచేత అనుభవించు చుండవలయును. ఇంద్రియములచేత విషయములయందు రాగద్వేషములను విడిచి ప్రవర్తింపుచు మనస్సును తనవశమందుంచుకొని ప్రవర్తించును. మనుష్యుడు శుద్ధమనస్సుగలవాడై ఆత్మనిష్ఠను పొందగలడు. ఆత్మనిష్ఠనుపొందుట వలన సకలదుఃఖములును నశింపగలవు. పరిశుద్ధమనస్సు గల మనుష్యునియొక్క బుద్ధి ఆకాశమువలె సర్వవ్యాప్తియై ఆత్మస్వరూపము వలెనే నిశ్చలమగును.

అర్జునా! సమాధి నిష్ఠ లేనివానికి యీ చెప్పబడిన ఆత్మ స్వరూప విషయ నిశ్చలబుద్ధి కలుగజాలదు. సమాధిలేనివానికి ఆత్మ జ్ఞానమందు యిష్టము కలుగజాలదు. ఆత్మజ్ఞానమం దిష్టములేనివానికి శాంతికలుగదు. శాంతిలేనివానికి సుఖములేదు. శాంతిలేనివాని మనస్సు విషయములందు అత్యాశకలిగి యుండును. విషయాసక్తి గలవానికి అణుమాత్రమైన సుఖములేదని తెలుసుకొనుము. దుఃఖమే ఆశయందురు. అర్జునా! శ్రోత్రత్వక్చక్షుర్జిహ్వాఘ్రాణములనెడు జ్ఞానేంద్రియము లయిదును తమతమ విషయములగు శబ్దస్పర్శరూప రసగంధములయందు ప్రవర్తింపుచుండగా మనస్సును సమాధియందు నుంచినయెడల ఆ మనస్సు విషయములయందు సంచరించుచు ఆత్మవివేక ప్రజ్ఞను నశింపచేయును. సముద్రమునందు నడిచెడు ఓడను చెడుగాలి తప్పుత్రోవను పొందించినట్లు పురుషుని విషయములయందు ప్రవర్తింపజేయును. గనుక అర్జునా! జ్ఞానేంద్రియముల నన్నిటిని తమతమ విషయములయందు పోనివ్వక మొట్టమొదట నిగ్రహించి వెనుక మనస్సును సమాధియందు నిలిపినవానికి అహం బ్రహ్మాస్మి అను ఆకారముగల వివేకప్రజ్ఞ కలుగుచున్నది.

అర్జునా! సర్వభూతములకును ఆత్మస్వరూపము కనబడనందున వివేకములేని సర్వభూతములకు ఆత్మ తత్వము రాత్రివంటిదగును. ఆ యాత్మ తత్వము జ్ఞానికి పట్టపగటియందువలె కనబడుచు పగలై యుండును. ఆత్మ తత్వమందు అవిద్యయైనను అవిద్యాకారములైన ప్రపంచమైనను జ్ఞానికి కనపడవు. సర్వభూతములును అవిద్యాకారమైన ప్రపంచమందు వ్యవహరింపుచున్నప్పుడు ఆ ప్రపంచ వ్యవహారమును సర్వభూతములును పగలని తలచియుండును. అదియే జ్ఞానికి రాత్రివలె నుండును. అర్జునా! భూమియందుగల సకల జలములున్ను సముద్రమునందు కలియునట్లు విషయములు స్థిమితప్రజ్ఞ

దున్నను. జ్ఞానియొక్క యిచ్ఛావిశేషము లన్నియు ఆత్మయందు లయించునేగాని జ్ఞానికి మనోవికారమును కలిగింపజాలవు. ఇచ్ఛా విశేషములకు వశముగాని ఆత్మవేత్త మోక్షమును పొందుచున్నాడు. కామసుఖములను ఆపేక్షించువాడు మోక్షమును పొందలేడు. అర్జునా! మోక్షమును కోరువాడు సకల కామములను పూర్తిగా విడువవలెను. దేహము జీవించియుండుటకు తగిన పనులనుమాత్రము చేయుచుండవలయును. అట్టి జీవనకార్యములయందును యిష్టము కలిగియుండరాదు. తన శరీరమును జీవింపజేసికొనుటకు అయినను యిదినాది అను తలంపు యుండరాదు. తాను జ్ఞానవంతు డను నిమిత్తముచేత తన నందఱును గౌరవింపవలెనను అహంకారమును కలిగియుండరాదు. ఇటువంటి బ్రహ్మవేత్త సర్వ సంసార ప్రవాహ దుఃఖముల నన్నిటిని విడిచి కైవల్యమను మోక్షమును పొందుచున్నాడు. అర్జునా! సర్వకర్మ సన్న్యాసియగువాడు క్రమముగా ఆత్మజ్ఞానమును సంపాదించి బ్రహ్మస్వరూపుడగుచున్నాడు. బ్రహ్మజ్ఞానమును పొందినవాడు మోహమును పొందడు. మరణ కాలమందైనను బ్రహ్మజ్ఞానమును పొందినయెడల బ్రహ్మస్వరూపమునగు మోక్షమును పొందగలడు. గాన బ్రహ్మచర్యాశ్రమ మందే సన్న్యసించి జీవించియుండు పర్యంతము జ్ఞాననిష్ఠయందున్న మహాత్మునకు మోక్షము కలుగునని చెప్పవలసిన పనిలేదు. ఆత్మ బ్రహ్మములకు శబ్దభేదమేకాని అర్థభేదము లేదు.

ఇది శ్రీకృష్ణార్జున సంవాదరూపమును బ్రహ్మవిద్యా
యోగశాస్త్రమును నగు భగవద్గీతోపనిషత్తు
నందు సాంఖ్యయోగమను
ద్వితీయాధ్యాయము

# తృతీయాధ్యాయము

అర్జునుడు భగవంతునిజూచి యిట్లనెను. భగవంతుడా! కృష్ణా! కర్మముకంటె జ్ఞానము శ్రేష్ఠమైనదని చెప్పితివి. జ్ఞానము శ్రేష్ఠమగుట నీకు సమ్మతమగునెడల ఘోరమైన యీ యుద్ధకర్మమును చేయుటకు నన్ను నియమింపకుము. ఎందునిమిత్తమై నన్ను యుద్ధము చేయుమని చెప్పితివో తెలియదు. నీవు చెప్పిన వాక్యములకు అర్థము స్పష్టమయ్యె యుండును. మందమైన నాబుద్ధికి నీవుచెప్పిన వాక్యములు సంశయమును కలిగింపుచున్నవి. గనుక జ్ఞానకర్మానుష్ఠానము లగు రెంటిలో దేనిని అనుష్ఠించినయెడల నాకు మేలు కలుగునో దానిని నిశ్చయించి నాకు చెప్పుము. అని అర్జునుడు అడుగగా భగవంతుడిట్లనెను. అర్జునా! పరమేశ్వరుడగునాచేత సృష్ట్యాదియందు సాంఖ్యులగు వేదాంతులకు జ్ఞానయోగమనియు కర్ములకు కర్మయోగమనియు రెండు నిష్ఠలు యేర్పరచబడినవి. గనుక ఆత్మానాత్మ విచారణ పరులగు వేదాంతులు జ్ఞానయోగమును అనుష్ఠింపుచుండవలయును. తత్త్వవిచారణము లేనివారలు శాస్త్రోక్తమైన కర్మయోగమును అనుష్ఠింపుచుండవలయును. అర్జునా! యజ్ఞాదిపుణ్యకర్మలు చేయకుండినంతమాత్రముననే మనుష్యుడు కర్మసన్యాసభావమును పొందజాలడు. పుణ్యకర్మములను చేయుటచేత పాపములు నశించి చిత్తశుద్ధిద్వారా జ్ఞానము కలిగి కర్మశూన్యత్వమును పొందగలడు. గనుక జ్ఞానయోగమును పొందుటకు కర్మయోగము ఉపాయమైయుండును. అర్జునా! ఆత్మానాత్మ వివేకరూపమైన జ్ఞానము లేకనే కేవల కర్మసన్యాసమును చేయుటచేత నైష్కర్మ్యలక్షణమైన ప్రయోజనము కలుగనేరదు, అందుకు కారణమును చెప్పెదనువినుము. మనుష్యుడు ఎంత

వాడైనను ఒకానొక అవస్థయందైనను ఒక క్షణమాత్రమైనను కర్మ
మును చేయకుండువాడు గాడని నిశ్చయముగా తెలిసికొనుము.
ప్రకృతివలన కలిగిన సాత్వికాదిగుణములచేత పురుషుడు సర్వదా ఆ
గుణములకు వశుడై స్వాతంత్ర్యమును విడిచి కర్మములను చేయు
చుండును. ప్రకృతిగుణములు సర్వదా చలింపుచుండును. ఆచలనమే
కర్మమనబడును. గనుక జ్ఞానియొకడు తప్ప తక్కినజను లందరును
ఆప్రకృతి గుణములకు వశులై ప్రతిక్షణమందును కర్మములను చేయు
చుందురు. అర్జునా! వాక్పాణి పాదపాయూపస్థలను కర్మేంద్రియముల
చేత పనులు చేయక కూర్చుండి మనస్సుచేత విషయములను స్మరించు
వాడు దబ్బర ఆచారుడని చెప్పవచ్చును. అట్టివాడు జ్ఞానశూన్యు
డై నందున మూఢుడేయగును. శ్రోత్రత్వక్చక్షు ర్జిహ్వాఘ్రాణములను
జ్ఞానేంద్రియములను విషయసంబంధము లేనట్లు మనస్సుచేత నిగ్ర
హించి కర్మేంద్రియములచేత కర్మయోగమును అనుష్ఠించుచు కర్మ
ఫలమును కోరనివాడు మునుపు చెప్పిన మూఢునికంటె శ్రేష్ఠుడగును.
గనుక అర్జునా! నీ కులాచారమునకు తగిన కర్మమును నీవుచేయుము.
అజ్ఞానముచేత కర్మములను విడుచుటకంటె కర్మములను చేయుట
శ్రేష్ఠము. నీవు బొత్తిగా కర్మమును చేయనియెడల నీదేహమైనను
యెట్లు జీవించియుండును? గనుక కర్మములను విడచుటకంటె
కర్మములను చేయుట శ్రేష్ఠము. కర్మము సంసారబంధమును
కలిగించుననియు అట్టి కర్మములను చేయరాదనియు నీవు తలచితివేని
అంతమాత్రముచేత సంసారము నివర్తింపనేరదు. ఎట్లనగా చెప్పెదను
వినుము.

అర్జునా! యీశ్వరపూజనిమిత్తమై చేసిన కర్మము సంసార
బంధమును కలిగింపజాలదు. ఈశ్వరార్పణము చేయక కర్మఫలమును
కోరుచు చేసెడి కర్మములు సంసారబంధమును కలిగించును. గనుక

నీవు కర్మఫలమును గోరక కర్మములను చేయుచు యీశ్వరార్పణ బుద్ధి కలిగియుండుము. అర్జునా! జ్ఞానములేనివాడు తన కులకర్మ మును విడువరాదు. పూర్వము బ్రహ్మదేవుడు సృష్ట్యాదియందు యజ్ఞ సహితములైన క్షత్రియ బ్రాహ్మణ వైశ్యవర్ణములను మూటిని సృష్టించి యిట్లనెను. బ్రాహ్మణులారా! యజ్ఞముచేత మీరభి వృద్ధిని పొందుడు. యీయజ్ఞము మీకు యిష్టకామభోగములను యిచ్చును. ఎట్లనగా చెప్పెదవినుడు. బ్రాహ్మణ క్షత్రియ వైశ్యు లారా! మీరు యీ యజ్ఞమునుచేసి యజ్ఞముచేత హవిర్భాగ పూర్వకముగా ఇంద్రాదిదేవతలను అభివృద్ధిని పొందింపుడు. అట్లు యజ్ఞముచేత వృద్ధిపొందిన దేవతలు మీకు వర్షము మొదలగు వాని చేత సంతోషము కలిగింపుచుందురు. ఈప్రకారము మీరును దేవత లును అన్యోన్య వృద్ధిరూపమైన సహాయకార్యమును చేసికొనుచుండు టచేత మీరు క్రమముగా విజ్ఞానప్రాప్తిని పొంది కృతార్థులగుదురు. బ్రాహ్మణ క్షత్రియ వైశ్యులారా! మీరు చేయు యజ్ఞములచేత దేవతలును వృద్ధిపొందినవారలై స్త్రీ పశుపుత్రాది సకల యిష్టకామ భోగములను మీకు యివ్వగలరు. ఆదేవతలచేత యివ్వబడిన భోగ ములను తాను అనుభవింపుచు ఆదేవతార్పణము చేయనివాడు దేవ ధనమును అపహరించినదొంగవాడగును. దేవయజ్ఞములు మొదలగు కార్యములను చేసి మిగిలిన అమృతమను అన్నమును భక్షించిన వారలు సకలపాపములచేతను పొరపాటువలన చేయబడిన హింసాది పాపములచేతను విడువబడుదురు. దేవయజ్ఞాది కర్మములను చేయక తను దేహములకు సుఖములను కలిగించుకొని జీవించువారు. తాము పాపాత్ములై పాపములను పక్వముచేసికొని భక్షించినవా రగుదురు, అని బ్రహ్మదేవుడు చెప్పెను.

అర్జునా ! తన కులధర్మమునకు తగిన కర్మమును అవశ్యముగా చేయుచుండవలయును. జగచ్చక్రము ప్రవర్తించుటకు కర్మము హేతువు అది యెట్లనగా చెప్పెదను వినుము. భక్షించిన అన్నము పరిణమించి యింద్రియ రూపమగుటచేత అట్టి యింద్రియమువలన ప్రత్యక్షముగా జంతువులు పుట్టుచున్నవి. వర్షమువలన అన్నము కలుగుచున్నది. యజ్ఞమువలన వర్షము కలుగుచున్నది. యజ్ఞము కర్మమువలన పుట్టుచున్నది. ఋత్విక్కుయొక్క యజమానునియొక్క వ్యాపారము కర్మమనబడును కర్మము వేదమువలన పుట్టినది. కర్మము వేదముచేత ప్రకాశింపబడినది. వేదము పరమాత్మవలన బుట్టినది. ఆ పరమాత్మవలన బుట్టిన వేదము బ్రహ్మవేదమనబడును. అర్జునా ! ఏ సాక్షాత్పరమాత్మవలన నిశ్వాస వాయువువలె సులభముగా వేదముపుట్టెనో ఆ పరమాత్మ సర్వవ్యాపియైనను సర్వ పదార్థములను ప్రకాశింపజేయుచు యజ్ఞవిధియందు ప్రతిష్ఠించబడెను. ఈప్రకారముగా వేదయజ్ఞపూర్వకమైన జగచ్చక్రము యీశ్వరుని చేత ప్రవర్తింపబడుచున్నది. ఈజగచ్చక్రమును లోకమందు కర్మాధికారియగువాడు అనుష్ఠించనియెడల అట్టివాడు పాపజీవనుడగును. పాపాత్ముడు వైదికకర్మానుష్ఠానములను విడిపించి విషయభోగములను యింద్రియములచేత అనుభవించుచు వ్యర్థముగా జీవింపుచున్నాడు. అట్టి పాపాత్ముడు జీవించుటచేత తనకైనను లోకులకైనను యెంతమాత్రమైనను ప్రయోజనములేదు. గనుక కర్మాధికారియగువాడు బ్రహ్మదేవుడైనను కర్మమును చేయవలయును.

అర్జునా! ఆత్మవిచారణ జ్ఞానములేనివాడు అవశ్యముగా కర్మలను చేయుచుండవలెను. అట్లు చేయనియెడల అధిక పాపము కలుగుచున్నది. అర్జునా ! ఆత్మజ్ఞానము కలవాడు యీముందుచెప్పిన కర్మయోగమును అనుష్ఠించవలసిన పనిలేదు. ఆత్మజ్ఞాని యగు సాంఖ్య

డను వేదాంతి ఆత్మజ్ఞాననిష్ఠుడై ఆత్మయందే రమించుచు విషయ సుఖములయందు అపేక్ష లేకయుండును. ఆత్మజ్ఞాని తన స్వరూపమగు ఆత్మసుఖముచేతనే తృప్తిబొందుచు అన్నపానాదులచేత తృప్తి బొందకయుండును. ఆత్మజ్ఞాని యగువాడు యితరపదార్థలాభముచేత సంతోషింపక తనయందే తాను సంతోషింపుచుండును. ఆత్మవేత్త ఆశ లేకయుండును. జ్ఞానియగువానికి చేయదగిన కర్మమొకటియైనను కలిగియుండదు. ఇట్టి జ్ఞానముకలవాడు కర్మమును చేయుటచేత ప్రయోజనములేదు. కర్మములను చేయక విడుచుటలేత దోషము కలుగదు. జ్ఞానియగువానికి బ్రహ్మాదిస్థావరాంతమువరకు గల భూత ములను ఆశ్రయింపదగిన ప్రయోజనములేదు. గనుక అర్జునా! నీవు కర్మఫలమందు ఆసక్తిలేనివాడవై సర్వదా చేయదగిన సంధ్యావంద నాది నిత్యకర్మమును చేయుము. కర్మఫలమును కోరక యీశ్వరార్ప ణముగా కర్మములను చేసినవాడు సత్వశుద్ధిగలవాడై మోక్షమును పొందుచున్నాడు. పూర్వపు విద్వాంసులైన జనకుడు అశ్వపతి మొద లగు రాజులును మోక్షమును పొందుటకు కర్మమార్గమందు ప్రవ ర్తించి సిద్ధిని పొందిరి. జనకాదులు జ్ఞానులై కర్మమును చేసిరని తలచితివేని జనకాదులు తాము తత్వజ్ఞానులై కర్మమును ప్రారబ్ధకర్మ బలమువలన రాజ్యపరిపాలనాది లోకవ్యవహారములను చేయుచు లోకక్షేమమును కలిగించిరని తెలిసికొనుము. రాజ్యాదివ్యవహారము లను చేసిన జనకాదులు కర్మసన్యాసమును చేయకనే సిద్ధిపొందిరి. ఆ జనకాదులు జ్ఞానులు కానపుడు కర్మములను చేసిరని తలచితివేని జనకాదులకు కర్మముచేతనే సత్వశుద్ధిద్వారా జ్ఞానము కలిగెనని తెలుసుకొనుము. జనకాది పూర్వపురాజులు జ్ఞానులు కానందున కర్మములు చేయుచు సంసారమందు ప్రవర్తించిరనియు నేను జ్ఞాని ననియు నేను కర్మములను చేయనని తలచితివేని చెప్పెదనువినుము,

నీవు ప్రారబ్ధకర్మబలము గలవాడైనందున లోకమును చక్క చేయు టయే ప్రయోజనమని తలచి కర్మమార్గమందు ప్రవర్తింపుము.

అర్జునా! చెడుమార్గమందు ప్రవర్తించు జనులను నివర్తింప జేసి మంచిమార్గమందు ప్రవర్తింపజేయుట లోకసంగ్రహ మన బడును. అట్టి లోకసంగ్రహముకొరకైనను నీవు కర్మములను చేయు చుండుము. లోకసంగ్రహమైనను యెందుకు చేయవలెనని యంటివేని చెప్పెదను వినుము. అర్జునా! లోకమందు శ్రేష్ఠుడగు జనులు యేయే కార్యములను జేయుచుందురో ఆయాకార్యములనే సాధారణజను లందరును అనుసరించి చేయుచుందురు. ఆ శ్రేష్ఠుడగు జనుడు లౌకిక వైదికములలో దేనిని ప్రమాణముగా చెప్పునో వాని ననుసరించి సాధారణజను లందరును ఆ ప్రకారముగానే ప్రమాణ నిశ్చయము చేయుదురు. ప్రమాణమనగా సత్యమని తెలియవలయును. అర్జునా! లోకమునకు మేలుచేయుటయందు నీకు సమ్మతిలేనియెడల నే చెప్పు మాటలను వినుము. నేను మూడులోకములందును చేయదగిన కార్యములు పొందబడని పదార్థమునకుగాని పొందదగిన పదార్థము నకుగాని లేవు. నేను భగవంతుడనైనందున సకలైశ్వర్యములును నాకు అక్షయములై యున్నవి. అయినను లోకములకు మేలుకలిగించు నిమిత్తము కర్మములను నేను చేయుచున్నాను. నేను కర్మములను విడిచి ఆదరింపక పోతినేని జనులందరును నావలెనే కర్మములను చేయక విడిచి చెడిపోవుదురు. అది యెట్లనగా చెప్పెద వినుము.

నేను కర్మములను చేయక విడిచితినేని సకలజనులును తమ తమ కులధర్మములగు కృత్యములు విడుచుటచేత ఈలోకము లన్నియు చెడిపోవును. వర్ణసంకరమగును. అట్టి కీడునకును వర్ణసంకరమునకును నేను కర్తను. ఆ కారణముచేత జనులనందరిని చెడుచుటకు నేనే కారణుడ నగుదును. ప్రజలను రక్షించుటకొరకు నేను అవతరించి

చెరచువాడ నగుదును. అప్పుడు నాకు యీశ్వరభాషము కొలిగి పోవును. అర్జునా! నావలెనె నీవైనను మరియొక ఆత్మవేత్తయైనను కృతార్థబుద్ధి కలిగియున్నను మీకుచేయందగిన కర్మములు లేకున్నను మూఢులయందు అనుగ్రహముకలిగి ప్రవర్తించవలయును. గనుక మూఢులగువారు కర్మఫలాసక్తిగలిగి కర్మములను శ్రద్ధచేత చేయుచు కర్మఫలాసక్తిని విడువవలయును. ఆత్మవేత్త యగువాడు లోకమునకు మేలు కలుగుకొరకు పూర్వోక్తప్రకారము కర్మములను చేయుచుండ వలయును. జ్ఞానులగువారు లోకులకు మేలు కలిగించుకొరకు తాము కర్మమార్గమందు ప్రవర్తింపకున్నను అజ్ఞానులకు బుద్ధిభేదమును కలి గింపరాదు. అజ్ఞానులగువారు యీకర్మము నాచేత చేయదగినదనియు యీకర్మఫలము నాచేత అనుభవింపదగినదనియు యిట్టి నిశ్చయ బుద్ధిని కలిగి కర్మఫలాసక్తులై కర్మఫలములను చేయుచుందురు. అట్టి అవివేకులకు జ్ఞానవిషయములైన మాటలనుచెప్పి వారిబుద్ధికి భేదమును కలిగింపరాదు. అర్జునా! జ్ఞానియగువాడు అవివేకులదగ్గరయున్నపుడు తానును చక్కగా కర్మములను చేయుచు అవివేకులచేత కర్మము లను చేయించవలయును. అవివేకి యగువాడు కర్మములయందు ఆసక్తిని గలిగియుండు క్రమమును చెప్పెదను వినుము.

సత్త్వరజస్తమోగుణములయొక్క సామ్యావస్థ ప్రకృతియన బడును. ఆ ప్రకృతివలన సత్త్వరజస్తమోగుణములును దేహేం ద్రియాది కార్యములును, పుట్టియున్నవి. ఆ ప్రకృతి వికారములగు గుణములచేతను దేహేంద్రియాదుల. చేతను సర్వప్రకారములుగా నానావిధములగు లౌకిక వైదిక కర్మలు చేయబడుచున్నవి. కార్య కరణముల గుంపుయగు దేహేంద్రియాదులే నేనని తలచుట * అహం కార మగును. అట్టి దేహేంద్రియాదులే నేనను అహంకారముచేత నావిధమగు మూఢబుద్ధిగలవాడై అజ్ఞానముచేత కర్మములు ఆత్మ

యందున్నట్లు తలచుచు ఆ కర్మములకు నేను కర్తనని మూఢుడు తలచియుండును. గనుక అవివేకియగు వానికి యీ ప్రకారము కర్మ ఫలాసక్తి గలిగియుండును. ఇక వివేకియగు వానిపద్ధతిని చెప్పెద వినుము. వివేకియగు వాడు విద్వాంసుడనబడును. విద్వాంసుడు గుణ ముల సాత్వికాదుల యొక్కయు కర్మముల యొక్కయు స్వరూప భేదములను తెలిసికొని ఇంద్రియ గుణములు విషయములయందు ప్రవర్తింపు చున్నవనియు, ఆత్మప్రవర్తింప లేదనియు, తలచియుం డును. అట్లు తలచి విషయాసక్తినివిడిచి ప్రవర్తించును. అర్జునా! ప్రకృతియొక్క గుణములచేత మూఢులనువారు మేము ఫలము కొరకు కర్మములను చేసెదమని కర్మ ఫలాసక్తి కలిగి యుందురు. అట్టి కర్మ ఫలాసక్తులగు మందబుద్ధి గలవారికి జ్ఞానియగువాడు బుద్ధి భేదములను కలిగింపరాదు. అర్జునా! మోక్షాపేక్ష కలిగి కర్మాధి కారముగల అజ్ఞాని కర్మముల నెట్లు చేయవలెనని యంటివేని చెప్పెద వినుము.

నేను పరమేశ్వరునికి భృత్యునివలె నుండి కర్మములను చేసె దనను వివేక బుద్ధిచేత సకలకర్మములను చేయుచు ఆ కర్మముల నన్నిటిని సర్వేశ్వరుడగు నాయందుంచి కర్మఫలములను కోరకుండ వలయును. సకలకర్మములను నాయందుంచి మమకార భావములేని వాడవై దుఃఖమును విడిచి యుద్ధము చేయుము. అర్జునా! ఆత్మజ్ఞా నము లేనివాడు యీముందు చెప్పినరీతిగా కర్మములను చేయుచుండ వలెను. ఈ పద్ధతి నాకు సమ్మతమైనది. నామతప్రకారము శ్రద్ధగల మనుష్యులు సకల కర్మములను చేయుచు నాకు అర్పణముచేసి పర మేశ్వర లోకగురుడనగు నాయందు అసూయలేనియెడల అట్టి జను లును సకలపుణ్య పాపకర్మములచేత విడువబడుదురు. నేనిపుడు చెప్పిన ప్రకారము అనుష్ఠించక నాయందు అసూయగలిగి ప్రవర్తిం

చిన జనులును సర్వజ్ఞాన విమూఢులను గాను నాశమును పొందిన వారిగాను తెలిసికొనుము. ఏ కారణము వలన నా ఆజ్ఞను జనులు అతిక్రమించెదరని యంటివేని చెప్పెదను వినుము.

అర్జునా! జ్ఞానవంతుడైనను తన పూర్వజన్మ కర్మ ప్రకారము ప్రవర్తింపు చున్నాడు. పూర్వజన్మ కర్మమును అతిక్రమించుటకు యెవ్వరికిని సాధ్యముకాదు. గనుక సకల జంతువులును తమ తమ పూర్వ జన్మ ప్రకారము ప్రవర్తింపుచున్నవి. గనుక నామతమును పాపాత్ములగు వారు అనుష్ఠింపరని తెలుసుకొనుము. అట్లయిన యెడల పురుష ప్రయత్నము వ్యర్థమని యంటివేని చెప్పెదను వినుము. అర్జునా! ప్రతియింద్రియము యొక్క శబ్దాది విషయము యిష్టమైన పుడు రాగము అనగా ఆశకలుగును. ఆ శబ్దాది విషయము తనకు అయిష్టమైనపుడు ద్వేషము కలుగును. సకలేంద్రియముల విషయముల యందును రాగద్వేషములు అవశ్యకముగా కలుగుచుండును. వేదాంత శాస్త్రార్థమును యెరిగిన వివేకియగు వాడు ఆరాగ ద్వేషములకు లోబడడు. ఇట్లు రాగద్వేషములకు లోబడ కుండుటయే పురుష ప్రయత్నము అగును. అర్జునా! పూర్వ జన్మ కర్మ సంస్కారము పురుషుని రాగద్వేష పూర్వకముగా తన కార్యమందు ప్రవర్తింప జేసినప్పుడు పురుషుడు తన కులధర్మమును విడిచి పరధర్మమును అనుష్ఠించును. పురుషుడు తనశాస్త్రార్థ జ్ఞానరూపమైన వివేకశక్తిచేత రాగద్వేషములను నిగ్రహించిన యెడల పురుషుడు శాస్త్రదృష్టిగల వాడై ప్రకృతి వశమును పొందడని తెలుసుకొనుము. గనుక పురుష ప్రయత్నమైన శాస్త్రార్థ జ్ఞానముచేత రాగద్వేషములకు వశమును పొందకుండ నుండవలయును. ఆరాగద్వేషములు మార్గమందు దొంగ లవలె పురుషుడు చేయు మోక్షమార్గ ప్రయత్నమునకు విఘ్నమును కలుగజేయును,

అర్జునా! రాగద్వేషములు కలవాడు శాస్త్రార్థమును మరి యొక విధముగా తలచి పరధర్మము ననుష్ఠింప దగునని తలచును. అట్లుతలచరాదు. తన కులాచారధర్మము చెడ్డదైనను దానినిఅనుష్ఠిం చుటయే శ్రేష్టమగును. పరధర్మము మంచిదైనను పరధర్మము ననుష్టింపరాదు. పరధర్మము ననుష్టించి బ్రతికియుండుటకంటె తన కులధర్మము ననుష్ఠించి తద్వారా చచ్చుట శ్రేష్ఠము. ఏమనగా పర ధర్మము ననుష్టించుటవలన నరకము కలుగునని తెలుసుకొనవలెను. అని భగవంతుడగు కృష్ణుడు చెప్పగా అర్జును డిట్లనెను. మహాత్మా! కృష్ణదేవా! పురుషుడు ఏకారణమున బలవంతుడగు రాజుచేత నియ మింపబడిన వానివలె పాపకర్మమును చేయుచున్నాడో ఆకారణమును చెప్పుము. పురుషుడు తాను యిచ్ఛయించకనేపాపకర్మమును చేయు టకు కారణమేమి? అని అర్జును డడుగగా భగవంతుడగు కృష్ణుడు యిట్లనెను. అర్జునా! సకల దుఃఖములను కలిగించు ఆశత్రువును చెప్పెదను వినుము. కామమనునదియే సర్వలోక శత్రువు. ఈకా మము నిమిత్తముననే సకల జీవులకును, సకల దుఃఖములు కలుగు చున్నవి. ఈ కామమునకు అభ్యంతరము కలిగినప్పుడు యీకామమే ఒకానొక విధమైన క్రోధరూపముగా యేర్పడుచున్నది. గనుక క్రోధ మును కామమేయగును. ఈ కామము రజోగుణము వలన పుట్టిన దగును. కామము గలిగినప్పుడు ప్రతిపురుషుడు ఆశచేత నేను చేయు చున్నానను కర్తృభావము కలుగును. కామము గలిగినపుడు ప్రతి పురుషుడును వ్యవహారములయందు ప్రవర్తింపు చుండును. యీ కామమునకు విషయసంఘములే గొప్ప ఆహారము. అందుచేతనే ఈ కామము మహాపాప స్వరూపము. కామముచేత ప్రేరేపింపబడిన వాడు పాపకర్మములను చేయును. గనుక ఈ సంసారమందు కామ మును మహాశత్రువని తెలుసుకొనుము. అర్జునా! ప్రకాశింపుచుండు

అగ్ని హోత్రము యొక్క తేజస్సు పొగచేత కప్పబడినట్లు, మురికిచేత అద్దముయొక్క స్వచ్ఛత్వము మరుగుపడినట్లును. మావిచేత గర్భము చుట్టబడినట్లును, కామముచేత జ్ఞానము అడ్డగింపబడినది. జ్ఞాని యగువాడు యీ కామముచేత పూర్వము నేను చెడుమార్గమందు ప్రవర్తించితినని దుఃఖించును. ఈ కామము జ్ఞానికి సర్వదా శత్రు వగునేకాని మూఢునకు శత్రువుగాదు. మూఢుడగువాడు కామము తనకు కలిగినపుడు ఆశచేత ఆ కామమును మిత్రునివలె తలచుచు ఆ కార్యమందు దుఃఖము కలిగినపుడు ఆశచేత దుఃఖినైతినని పిమ్మట తలచును. మొదట తలచడు. గనుక కామము జ్ఞానికే నిత్యవైరియగును. ఈ కామము యిచ్ఛయను రూపముచేతను దుఃఖరూపము చేతను తృప్తిలేని స్వభావముచేతను జ్ఞానమునుమరుగు పరుచుచున్నది. అర్జునా! కామ మను శత్రువునకు యింద్రియము లును, మనోబుద్ధులు రెండును ఆశ్రయభూములవలె నున్నవి. ఇంద్రియ మనోబుద్ధుల నాశ్రయించి కామము జ్ఞానమును మరుగు పరచి పురుషుని నానావిధములుగా మోహింప జేయుచున్నది.

అర్జునా! నీవు మొట్టమొదట జ్ఞానేంద్రియములగు శ్రోత్రాదు లను, శబ్దాది విషయములయందు పోనివ్వక జయించి పిమ్మట పాప రూపియగు కామమును విడువుము. అర్జునా! శాస్త్రమువలనను ఆ చార్యుని వలనను, ఆత్మాది పదార్థములను యెరుగుట జ్ఞానమన బడును. ఆత్మాది పదార్థములకు గల అర్థానుభవము విజ్ఞానమన బడును. ఈ జ్ఞాన విజ్ఞానములగు రెంటిని కామము నశింపజేయు చున్నది. అట్టి కామమును మహాశత్రువును నీయంతటనీవే విడువుము. అర్జునా! యీ స్థూలదేహమునకు లోపలనుండు శ్రోత్రత్వక్చక్షుర్జి హ్వాఘ్రాణములు, అను జ్ఞానేంద్రియములైదును సూక్ష్మవస్తువులై వ్యాపిత్వాది స్వభావములను కలిగియున్నవి. అందుచేత స్థూల

దేహముకంటె జ్ఞానేంద్రియము లైదును శ్రేష్ఠములని పండితులు చెప్పుదురు. ఆజ్ఞానేంద్రియములకంటె సంకల్పరూపమైన మనస్సు శ్రేష్ఠమైనది. ఆ మనస్సుకంటె నిశ్చయ భావస్వరూపమైన బుద్ధి శ్రేష్ఠమైనది. బుద్ధికి సాక్షియైనవాడు పరమాత్మ యనబడును. అర్జునా! బుద్ధికి సాక్షియైన పరమాత్మను తెలిసికొని నీమనస్సుచేత నీవే సమాధానము చేసికొని ఆత్మయందు చక్కగా నిలిచి యుండి కామరూపమైన నీశత్రువును విడిపింపుము కామము మహాదుఃఖము కలిగించునది. ఈ కామమును పైనచెప్పిన ప్రకారము ఆత్మనిష్ఠను పొంది నిశ్శేషముగా విడువవలయును.

ఇది శ్రీకృష్ణార్జున సంవాదరూపమును బ్రహ్మవిద్యా
యోగశాస్త్రమును నగు శ్రీభగవద్గీతోపని
షత్తునందు కర్మయోగమునందు
తృతీయాధ్యాయము

---

## చ తు ర్థా ధ్యా య ము

శ్రీ భగవంతుడగు కృష్ణు డర్జునుని జూచి యిట్లనెను. అర్జునా! ఈ రెండు అధ్యాయములయందును చెప్పబడిన సాంఖ్య యోగ కర్మయోగములను పూర్వము సృష్ట్యాదియందు నేను సూర్యునకు చెప్పియున్నాను. ఈ యోగమువలన మోక్షము కలుగుచున్నందున అవ్యయ ఫలమును కలిగించును. జగత్తును పరిపాలించు రాజులకు బలశక్తి కలుగుటకును రాజులు యోగబలముతోఁగూడిన వారలై

బ్రహ్మ క్షత్రియకులములను రక్షించుటకు సమర్థులగుటకును యీ యోగము నేను సూర్యునకు సృష్ట్యాదియందు చెప్పితిని. బ్రాహ్మణ క్షత్రియ కులములను రక్షించినయెడల సర్వజగద్రక్షణము కాగలదు. ఆ సూర్యుడు యీ యోగవిద్యను మనువునకు చెప్పెను. మనువు ఇక్ష్వాకు రాజునకు చెప్పెను. ఈప్రకార మీ యోగవిద్యను క్రమ క్రమముగా రాజర్షులందఱును, అనుష్ఠింపుచుండిరి. ఆయోగము బహు కాల దోషమువలన యిప్పుడు యీ భూలోకమందు నశించినది. అర్జునా! సృష్ట్యాదియందు నేను సూర్యునకు చెప్పిన యోగవిద్యనే యిపుడు నీకు చెప్పితిని. నీవు నాకు భక్తుడవగుటచేతను ప్రాణస్నేహితుడవగుటచేతను రహస్యమైన యీ యోగజ్ఞానమును చెప్పితిని. అని భగవంతుడగు కృష్ణుడు చెప్పగా లోకులకు యిది విరుద్ధమని తోచకుండుటకై ఆవిరోధమును పోగొట్టుటకు చోద్యము చేయువాని వలె అర్జునుడు కృష్ణుని జూచి యిట్లనెను.

కృష్ణా! నీవు వసుదేవుని గృహమందు జన్మించితివి. ఇంతకు పూర్వము సృష్ట్యాదియందు సూర్యుడు కలిగియుండెను. సూర్యుని కొఱకు నీవు యీ యోగజ్ఞానమును చెప్పినట్లును ఆ యోగజ్ఞానమునే యిపుడు నీవు నాకు చెప్పినట్లును నేను నిశ్చయముగా నమ్మజాలను. అని అర్జునుడు చోద్యము చేయునట్లు అడుగగా కృష్ణుడు మూర్ఖులకు గల శంకను పోగొట్టుటకై యిట్లనెను. అర్జునా! నీకును నాకును యిదివరకు అనేక జన్మములు కలిగినవి. నేను నిత్యశుద్ధ బుద్ధముక్త స్వభావము గలవాడనగుటవలన మనకు కలిగిన జన్మముల నన్నిటిని యిపుడు నేను యెఱిగియున్నాను. నీవు పుణ్యపాపములచేత బంధింప బడి యున్నందున నీకు జ్ఞానశక్తి మరుగుపడి యున్నది. అందువలన యిదివరకు మనకు కలిగిన జన్మములు యిపుడు నీకు తెలియలేదు. పుణ్యపాపములు నీకు లేనియెడల జన్మమెట్లు వచ్చినదంటివేని చెప్ప

దను వినుము. అర్జునా! నేను పుట్టుక లేనివాడను. యెప్పటికిని నశిం
పని జ్ఞానశక్తి స్వభావము గలవాడను. బ్రహ్మదేవుడు మొదలుకొని
స్తంభపర్యంతముగల సకల భూతములను శిక్షించెడు యీశ్వరుడనై
యున్నాను. అటువంటి వాడనై యుండి నా స్వకీయమైన వైష్ణవ
మను మాయాశక్తిని నావశము చేసికొని దేహముగలవానిగాను
జన్మముగలిగినట్లుగాను నామాయవలన అవతరింపుచున్నాను. వాస్త
వముగా లోకులవలె నేను పుట్టినది లేదు. ఈప్రపంచమంతయు
మోహింపబడి ఆత్మరూపమగు నన్ను యెరుగకుండెను. ఆ మాయ
యనెడు ప్రకృతిని నేను వశముచేసికొని పుట్టినవానివలె అవతరింపు
చున్నాను. అటువంటి జన్మము యేకాలమందు యెందుకొరకు కలుగు
నని యంటివేని చెప్పెదను వినుము.

అర్జునా! ప్రాణుల అభివృద్ధి నిమిత్తమైనట్టియు, మోక్ష
సాధనమైనట్టియు, వర్ణాశ్రమాది లక్షణ ధర్మమునకు హానికలిగి
నప్పుడు అధర్మము వృద్ధియైనప్పుడు నా మాయచేతనే నన్ను నేను
అవతరింపజేసి కొనుచున్నాను. అర్జునా! ధర్మమార్గమందు ప్రవ
ర్తించు సాధువులను రక్షించుటకొరకు పాపాత్ములను చంపుటకొర
కును, వైదిక ధర్మమును చక్కగా లోకమందు స్థాపించుట కొరకును
ప్రతియుగమునందు నేను పుట్టుచున్నాను. అర్జునా! నా జన్మమైన
మాయారూపమును నేను చేయు సాధురక్షణాది దివ్యకార్యములను
యీశ్వరసంబంధమైన నా స్వరూపమును వాస్తవముగా యెరిగిన
వాడు యీ దేహమును విడిచి మరల జన్మమును పొందక నారా
యణుడగు నన్ను పొంది ముక్తుడగుచున్నాడు. అర్జునా! రాగభయ
క్రోధములను విడిచి యీశ్వరుడగునన్ను అభేదముగా చూచుచుండు
బ్రహ్మవేత్తలు పరమేశ్వరుడగు నన్ను ఆశ్రయించి అనేకులు జ్ఞాన
[illegible] తపస్సుచేత పరిశుద్ధిగలవారై మోక్షరూపమగు నన్ను

పొందిరి. జ్ఞానముచేతనే నన్ను పొందవలయునుగాని యితరతపస్సుల
చేత నన్ను పొందుటకు సాధ్యముకాదు.

అర్జునా! యేజనులు యేయే ప్రకారము యేయే ఫలమ్మును
గోరి నన్ను సేవింపుచున్నారో ఆయా జనులకు ఆయా ఫలమ్ములను
యిచ్చుచు అనుగ్రహించుచున్నాను. అట్టిజనులు మోక్షమును కోర
నందున వారు కోరినప్రకారము కామ్య ఫలములను యిచ్చు
చున్నాను. ఒకనికి మోక్షభావమును కామ్యఫలమును యీ రెండును
ఒక్కసారే కలుగజాలవు గనుక యేజనులు యేకామ్య ఫలములను
కోరుదురో ఆజనులకు ఆఫలములను యిచ్చుచున్నాను. మోక్షాపేక్ష
కలిగి ఆత్మను యెరుగవలెనని నన్ను నుపాసించువారికి జ్ఞానమును
యిచ్చుచున్నాను. జ్ఞానవంతులై మోక్షమును కోరువారికి మోక్ష
మును యిచ్చుచున్నాను. ఆప్రకారమే దుఃఖవంతులై నన్ను ప్రార్థించు
వారలకు దుఃఖములను పోగొట్టుచున్నాను. గనుక ప్రాణులయందు
నేను రాగద్వేషములను గలిగి ప్రవర్తించను. సర్వావస్థలయందు
సర్వదా గల యీశ్వరుడగు నాయొక్క మార్గము ననుసరించి
సర్వప్రకారముల చేతను మనుష్యులు ప్రవర్తింపుచుందురు. ఏఫలా
పేక్షచేత యేకర్మమందు అధికారులై ప్రవర్తింపుచుందురో అట్టి
జనులు మనుష్యులని చెప్పబడుదురు. సర్వజనులకును జ్ఞానమును
నీవు యివ్వక పోవుటకు కారణమేమని యంటివేని చెప్పెదను.
వినుము.

అర్జునా! కర్మఫలసిద్ధిని కోరుచు యీలోకమందు ఇంద్రా
గ్న్యాది దేవతలను గురించి యజ్ఞములను చేయుచున్నారు. భిన్న
దేవతలను గురించి యజ్ఞములుచేసి ఫలములను గోరినవారలకు శీఘ్ర
ముగా యీ మనుష్యలోకమందు కర్మఫలసిద్ధి కలుగుచున్నది.
వర్ణాశ్రమాది కర్మాధికారము మనుష్యలోకమందే యున్నదిగాని మఱి

యొక లోకమందు లేదు. అర్జునా! గుణవిభాగమువలనను కర్మవిభాగమువలనను బ్రాహ్మణ క్షత్రియ వైశ్య శూద్రులను నాలుగు వర్ణములను యీశ్వరుడనగు నేను సృష్టించి యున్నాను. సత్త్వరజస్తమము లగునవి మూడు గుణములు అగును. సత్త్వగుణము ప్రధానముగా గలవారు బ్రాహ్మణులు. ఆబ్రాహ్మణునకు మనోనిగ్రహ మింద్రియనిగ్రహ తపస్సు మొదలగునవి విహిత కర్మలు. క్షత్రియునకు సత్త్వగుణము ప్రధానముగాక రజోగుణము ప్రధానము కలిగి యుండును. క్షత్రియునకు శౌర్యము తేజస్సు మొదలగునవి విహిత కర్మలు. వైశ్యుడు తమఃప్రధానముగాక రజోగుణము ప్రధానముగా కలిగియుండును. వైశ్యునకు పైరుపెట్టుట వర్తకముచేయుట మొదలగునవి విహితకర్మలు. శూద్రుడు రజోగుణము ప్రధానముగాక తమోగుణ ప్రధానమును కలిగియుండును. శూద్రునకు శుశ్రూష వ్యాకృటిరియే విహితకర్మమగును. ఈప్రకారముగా గుణ కర్మ విభాగమువలన నాలుగువర్ణములు పరమేశ్వరుడగు నాచేత సృష్టింపబడెను. ఈ వర్ణభేదము యీ మనుష్యలోకమందు తప్ప యితర లోకమందు లేదు. అర్జునా! యిట్లు వర్ణాశ్రమ ధర్మములను నేను సృష్టించినను అసృష్టికి నేను కర్తనైనను నన్ను అకర్తనుగాను అవికలసాదినిగాను పరమార్థమువలన తెలిసికొనుము.

అర్జునా! నేనుచేసిన సృష్ట్యాదికర్మలు నాకు దేహాదులను కలిగించి నన్ను అంటజాలవు. ఎందుచేతననగా నేనుచేసితినను అహంకార భావము నాకులేనందున ఆ కర్మములు నన్నంటజాలవని తెలిసికొనుము. సంసారులగువారికి నేను కర్తనను అభిమాన మున్నందున, కర్మఫలాపేక్ష గలిగియున్నందునను సంసారులను ఆకర్మములు ఫలత్యాగముచేత అంటుచున్నవి. నేనో సృష్ట్యాది కర్మములు చేసినను ఆకర్మ ఫలాపేక్ష నాకు కలిగియుండదు. గనుక నేను చేసినకర్మ

ములు నన్నంటజాలవు. ఈ ప్రకారము మెవడైనను నేను కర్తనుగా ననియు నాకు కర్మఫలాపేక్ష లేదనియు యీప్రకారము నన్ను ఆత్మ భావముగా నెరిగినయెడల అట్టివానికిని కర్మములు దేహాదులు కలి గింప జాలవని తెలిసికొనుము. ఇట్టితలంపు గలిగి అహంకారములేక కర్మములను చేసినను అట్టివాడు ఆ కర్మములచేత బంధింపబడడు. ఈరీతిగా తెలిసికొని యిదివరకుగల జనకాది ముముక్షువులచేత కర్మములు చేయబడెను.

అర్జునా! నీవును కర్మమే చేయుచుండుము కర్మమును చేయక వూరకుండకుము. ఇపుడు నీవు కర్మమును సన్యసింపకుము నీవు జ్ఞానములేని వాడవైనయెడల మనశ్శుద్ధికొరకు యీశ్వరార్పణముగా కర్మములను సేయుము. ఇదివరకు గల జనకాది ముముక్షువులవలె నే నీవు కర్మమార్గమందు ప్రవర్తింపుము అర్జునా! కర్మమనగా యేది అనియు, అకర్మమనగా యేదిఅనియు ఈ ప్రకారము కర్మ అకర్మల యందు బుద్ధిమంతులగువారు మోహించియున్నారు. కర్మా కర్మ స్వరూపమును నెరింగినయెడల సంసారబంధమునుంచి విడువబడు దువు. గనుక కర్మ అకర్మ స్వరూపమును గురించిన విషయమును నేను చెప్పెదను వినుము అర్జునా! శాస్త్రవిహితమైన కర్మమును బోధింపదగినది. ప్రతిషిద్ధమైన హింసాది కర్మమును బోధింపదగినదే. పనులు సేయక వూరకుండు స్వరూపముగల అకర్మయు బోధింప దగినదే. కర్మ అకర్మ ప్రతిషిద్ధములను మూటియొక్క వాస్తవమును తెలియుట దుర్లభము. గనుక ఆ మూడును బోధింపదగిన వగును. అర్జునా! దేహేంద్రియాదులచేత చేయబడు వ్యాపారము కర్మమని లోకప్రసిద్ధి చెందియున్నది. దేహేంద్రియాదులు కర్మములను చేయు నపుడు ఆత్మ యే కర్మమును చేయనందున ఆకర్మములయందుఆత్మకు అకర్మను నెవడుచూచునో వాడును, దేహేంద్రియాదులు కర్మలను

చేయునపుడు నేను సుఖముగా కూరకున్నానని తోచుసమయమందు నిర్వికారుడైన ఆత్మయందు అకర్మక్రియ తోచినందున అట్టి అకర్మమందు కర్మమున్నదని యెవడు చూచునో వాడును మనుష్యులలో బుద్ధిమంతుడనియు వాడే యోగియనియు, వాడే సకలపుణ్యకర్మములను చేసినవాడనియు తెలిసికొనుము.

అర్జునా! యీప్రకారము కర్మమందు అకర్మను అకర్మమందు కర్మను చూచినవాడు చేయు సకలకర్మలును గూడ కామసంకల్పములు లేనివియగును. అట్టి కర్మాకర్మ స్వరూపమును యెరిగినవాడు జ్ఞానమను అగ్నిహోత్రముచేత తన కర్మముల నన్నిటిని కాల్చివేయును. అట్టివానిని విద్వాంసుడనియు, పండితుడనియు, బుద్ధిమంతుడు చెప్పుదురు. అట్టివాడు కర్మములను చేసినను అభిమాన కర్మఫలాపేక్షను పూర్తిగా విడిచి ఆత్మజ్ఞానముచేత సర్వదా తృప్తిని పొంది విషయములందపేక్ష లేకయుండును. అట్టి కర్మ అకర్మ. తత్వజ్ఞాని లోకవిషయ సౌఖ్యమైన యితరాశ్రయమును విడచును. అర్జునా! అట్టి తత్వజ్ఞాని సకలకర్మములను సన్యసింపక ఒకానొక హేతువుచేత కర్మమార్గమందు ప్రవర్తించినను వాడు కొంచెమైనను కర్మమును చేసినవాడు కానేరడు. అర్జునా! బాల్యమందే ఆత్మజ్ఞానమును పొందినవాడు ఆశను విడిచి ఇంద్రియ మనోనిగ్రహములు గలిగి సకలసాధనములను విడిచి ప్రవర్తింపుచుండును. అట్టిజ్ఞాని తన శరీరముజీవించు నిమిత్తమాత్రప్రయోజనమైన కర్మమును అభిమానము లేకచేసినను పుణ్యపాపకర్మముచేత బంధింపబడడని తెలిసికొనుము. అర్జునా! సర్వకర్మ సన్యాసియగు యతీశ్వరుడు అప్రయత్నముగా లభించిన అన్నాదులచేత తృప్తిబొందును. శీతోష్ణాది సుఖదుఃఖాదులు కలిగినను చిత్తవికారము లేకయుండును. అట్టి సన్యాసి యెవడు కష్టము కలిగించినవానియందును వైరబుద్ధి లేకయుండును.

అట్టి సన్యాసి అప్రయత్నముగా తనకు అన్నాదులు లభించినను లభించకపోయినను మనోవికారము లేక సమబుద్ధి కలిగియుండును. అట్టి జ్ఞాని శరీరస్థితికి ప్రయోజనమైన అన్నపానాదికర్మములను చేసి నను అట్టికర్మలచేత బంధింపబడడు. అట్టిజ్ఞాని నేను అకర్తననియు దేహేంద్రియాదులు తమతమ గుణములయందు ప్రవర్తింపుచున్న వనియు యితరులు నాయందు కర్తృత్వమును ఆరోపింతురేగాని నేను పరమార్థమువలన కర్తనుగాననియు తలచుచు బ్రహ్మాహమను జ్ఞానాగ్నిచేత సర్వకర్మములను దహించి సర్వకర్మవిముక్తుడై మోక్షమును పొందునని తెలుసుకొనుము.

అర్జునా! సర్వవిషయములందును ఆసక్తిలేనివాడును ధర్మాధర్మాది కర్మబంధబుద్ధి లేనివాడును ఆత్మజ్ఞానమం దుంచబడిన బుద్ధి గలవాడును ఇట్టివాడు యజ్ఞముకొరకు కర్మములను చేసినను ఆకర్మములు తమ ఫలసహితముగా నశించునేగాని జ్ఞానికి బంధత్వమును కలిగింపజాలవు. ఎందుచేతననగా చెప్పెదను వినుము. జ్ఞానవంతు డగువాడు లోకులకు మేలుకలిగించునిమిత్తము అజ్ఞాని కర్మములను చేసినపుడు హోమసాధనములైన స్రుక్స్రువాదులను బ్రహ్మస్వరూప మని తలచుచుండును. హోమక్రియయు బ్రహ్మస్వరూపమే నని తలచుచుండును. ఆబ్రహ్మమును కర్మమందు చిత్తైకాగ్ర్యరూపమైన సమాధిచేత పొందదగిన ఫలమును బ్రహ్మమేయగును. అని యిట్లు సర్వము బ్రహ్మమయమని తలచి యెరిగిన బుద్ధిగలవానికి కర్మబంధముకలుగక సకలకర్మములును తమతమ ఫలసహితముగా నశింప గలవు. ఇట్లు సర్వము బ్రహ్మమయమని తెలియచేయు యజ్ఞము జ్ఞానయజ్ఞ మనబడును.

అర్జునా! ఇకను మరికొన్ని యజ్ఞములను చెప్పెదనువినుము. కొందరు కర్మయోగులు యజ్ఞముచేసి ఇంద్రాది దేవతలను ఫలాసక్తి

చేత నుపాసింపుచుందురు. కొందరు బ్రహ్మాత్మైకత్వమును చూచు సన్న్యాసులగు బ్రహ్మవేత్తలు పరబ్రహ్మమును అగ్నిహోత్రముగా భావించుకొని ఆత్మను హోమముచేయునట్లు బ్రహ్మసంస్థముచేతురు. అనగా అంతఃకరణోపాధితో గూడిన ప్రత్యగాత్మను నిరుపాధిక మగు పరబ్రహ్మముతో చేర్చి ఆబ్రహ్మమే నేనని చూచుచుందురని తెలియవలయును. ముందుచెప్పిన జ్ఞానయజ్ఞమునే యిపుడు మరల స్పష్టముగా చెప్పెనని తెలియవలెను.

అర్జునా! మరికొందరు నైష్ఠికులు శ్రోత్రత్వక్చక్షుర్జిహ్వాఘ్రాణములనెడి జ్ఞానేంద్రియములను నిగ్రహించి నిగ్రహమును అగ్నియందు హోమము చేసినట్లు తలచుచున్నారు. మరికొందరు నైష్ఠికులు శబ్దస్పర్శరూపరసగంధములను విషయములను శ్రోత్రాది యింద్రియములను అగ్నియందు హోమము చేయుచున్నారు. అనగా శ్రోత్రాది ఇంద్రియములచేత శబ్దాది విషయములను అవిరుద్ధముగా గ్రహించుటయే హోమముగా తలంచెదరని తెలియవలయును. మరికొందరు శ్రోత్రాది జ్ఞానేంద్రియ కర్మములగు శబ్దస్పర్శాదుల నున్న వాక్కు మొదలగు కర్మేంద్రియములయొక్క కర్మములగు వచనము మొదలగు వానిని. ప్రాణము మొదలగు పదివాయువులయొక్క కర్మములగు బాహ్యగమనము మొదలగువానిని వీనినన్నిటినిజ్ఞానము చేత ప్రకాశింపుచు నిగ్రహింపబడిన మనస్సును అగ్నిగా భావించుకొని ఆ మనోయోగాగ్నియందుంచి హోమము చేసినట్లు తలచుచున్నారు.

అర్జునా! మరికొందరు గంగానది మొదలగు పుణ్యతీర్థముల యందు యజ్ఞబుద్ధిచేత ద్రవ్యమును వినియోగము చేయుదురు. ఇవి ద్రవ్యయజ్ఞము లనబడును. కొందరు కృచ్ఛ్రచాంద్రాయణాది తపస్సులను చేయుదురు. ఇవి తపోయజ్ఞము లనబడును. కొందరు యమ

నియమ ఆసన ప్రాణాయామ, ప్రత్యాహార ధ్యాన ధారణ సమాధు లను అష్టాంగ యోగములను అభ్యసింతురు. ఇవి యోగయజ్ఞము లనబడును. కొందరు యథావిధిగ ఋగ్వేదాది వేదాధ్యయనమును అభ్యసింతురు. ఇవి స్వాధ్యాయ యజ్ఞము లనబడును. మరికొందరు శాస్త్రార్థమును తెలిసికొనుచుందురు. ఇవి శాస్త్రజ్ఞాన యజ్ఞము లన బడును. కొందరు యింద్రియములను జయించి ఆ యింద్రియ నిగ్రహ మను యజ్ఞములను గలిగియుందురు. కొందరు తీక్ష్ణములైన నియమ ములను గలిగి అట్టి నియమములనే యజ్ఞములుగా గలిగియుందురు. అర్జునా! కొందరు అపానమను వాయువుయొక్క వ్యాపారమందు ప్రాణమను వాయువ్యాపారము నుంచుటయే హోమముగా తలచు చున్నారు. ఇట్లు చేయుటయే పూరకమను ప్రాణాయామ మన బడును. కొందరు ప్రాణవాయు వ్యాపారమందు అపానవాయు వ్యాపారముంచి హోమముగా తలంపుచుందురు. ఇట్లు చేయుటయే రేచకమను ప్రాణాయామ మనబడును.

అర్జునా! మరికొందరు ప్రాణాయామ పరాయణులు ప్రాణ వాయువుయొక్కయు అపానవాయువుయొక్కయు గమనమును నిగ్ర హింతురు. ఇదియే కుంభకమను ప్రాణాయామ మనబడును. ప్రాణ వాయు వూర్ధ్వముగానడచి నోటిలోనుంచియు ముక్కురంధ్రముల నుంచియు బాహ్యమునకు వెడలి వచ్చుచుండును. ఇందుకు విపరీత ముగా అధోగమనమునుపొంది అపానవాయువు సంచరింపుచుండును. ఈ రెంటిగతులను నిగ్రహించుటయే కుంభక ప్రాణాయామ మన బడును. అర్జునా! మరికొంద అపరిమితమైన ఆహారముగలవారగుచు తమకు వశములైన ప్రాణాదివాయువులయందు యితరవాయు విశేష ములనుంచి హోమముచేసినట్లు తలంచుచున్నారు. అట్లుంచబడిన వాయువులు జయింపబడిన వాయువులందు ప్రవేశించి యున్నవాని

వత్తె నగుచున్నవి. యీ చెప్పినవన్నియు యజ్ఞములగును. ఈయజ్ఞము
లను చేసినవారలు యజ్ఞము తెలిసినవారని చెప్పబడుదురు. ఈ
యజ్ఞములలో ఒకయజ్ఞమునైనను చేసినవాడు ఆయజ్ఞముచేత సకల
పాపములను నశింపజేసిన వాడగును.

అర్జునా! యీ చెప్పబడిన యజ్ఞములను చేసి మిగిలిన అన్న
మును భక్షించిన వారలు ముముక్షువులైనయెడల కొంతకాలమునకు
పరబ్రహ్మమును పొందుచున్నారు. యీ చెప్పబడిన యజ్ఞములలో
ఒక యజ్ఞమైనను లేనివానికి మరియొక జన్మమందు యీ మనుష్య
లోకమైనను కలుగదు. అట్టివానికి విశేషస్థానము కలుగదని స్పష్ట
మాయెనుగదా! అర్జునా! యీప్రకారము వేదమువలన అనేక
విధములైన యజ్ఞములు పుట్టియున్నవి. అట్లు వేదమందు చెప్పబడిన
యజ్ఞములన్నియు కాయిక వాచిక మానసిక సంబంధములైనవని
తెలిసికొనుము. ఆ యజ్ఞము లన్నియు కర్మమువలన బుట్టినవనియు
అనాత్మ విషయములైనవనియు అజ్ఞానులు అట్టి యజ్ఞమును ఆశ్ర
యింపరనియు ఆత్మ నిర్వికారుడనియు యీ యజ్ఞాది వ్యాపారము
లన్నియు నావి కావనియు నేను నిర్వ్యాపారుడనై సాక్షినైయున్నా
ననియు తెలిసికొనుము. ఇట్లు యెరిగితివేని సంసారబంధమునుండి
విడువబడుదువు. అర్జునా! ద్రవ్యమును సాధనముగా నుంచుకొని
చేయు సకల యజ్ఞములకంటె జ్ఞానయజ్ఞము శ్రేష్ఠమైనది. ద్రవ్య
మయమైన యజ్ఞము కామ్యఫలములను కలిగించుచున్నదనియు
జ్ఞానయజ్ఞము జన్మఫలమును యివ్వదనియు తెలిసికొనుము. గనుక
ద్రవ్యయజ్ఞముకంటె జ్ఞానయజ్ఞము మిక్కిలి శ్రేష్ఠమైనది.

అర్జునా! సకలపుణ్య కర్మములును మోక్షసాధనమైన బ్రహ్మ
జ్ఞానమునందు సమాప్తి పొందుచున్నవి. (జ్ఞానము కలిగిన పిమ్మట
కర్మములవలన ప్రయోజనము లేదు.) అర్జునా! సకల ధర్మములును

జ్ఞానమందు లయించినందున జ్ఞానము మిక్కిలి శ్రేష్ఠమైనది. అట్టి ఆత్మజ్ఞానమును ఆచార్యునివలన తెలిసికొనుము. ఆచార్యునిపొంది అధికవినయముతో నమస్కరించి బంధమెట్లుకలుగునని యు మోక్ష మెట్లుకలుగుననియు జ్ఞానమనునది యెద్దియనియు అజ్ఞానమనునది యెద్దియనియు యిట్లు అడుగుము. గురువునకు శుశ్రూషలు చేయుము. ఇట్లు మంచిస్వభావముచేత గురువులు నీకు జ్ఞానము నుపదేశింప గలరు. అర్జునా! అపరోక్ష జ్ఞానవంతులగు గురువులచేత నుపదేశింప బడిన జ్ఞానము సమర్థవంతమగును. అట్టిగురువులచేత నుపదేశింప బడిన జ్ఞానమును నీవు పొందినయెడల యిప్పుడు నీవు మోహమును పొందినట్లు మరల యెప్పటికిని మోహమును పొందవు. అట్టిజ్ఞానము చేత బ్రహ్మమొదలుకొని స్తంభపర్యంతముగల చరాచర భూతము లన్నియు ఆత్మయగు నీయందున్నట్లుగాను పరమేశ్వరుడగు నాయం దున్నట్లుగాను చూడగలవు. అనగా సకల ఉపనిషత్తుల యందును చెప్పబడిన జీవేశ్వరైక్యమునుచూడగలవని తాత్పర్యము. ఈ జ్ఞాన మునయొక్క మహాత్మ్యమును చెప్పెదనువినుము.

అర్జునా! లోకమందుగల పాపాత్ములకంటె అధికమగు మహా పాపమును చేసినవాడవైనను జ్ఞానమును తెప్పగా చేసికొని ఆపాప సముద్రమును దాటగలవు. అర్జునా! చక్కగా మండుచుండు ప్రదీప్త మైన అగ్నిహోత్రము యెండు కట్టెలను దహించినట్లు జ్ఞాన మను అగ్నిహోత్రము ముముక్షువుయొక్క సకల పుణ్యపాప కర్మములను దహించుచున్నది. అనగా ఫలము కలిగించనట్లు నిర్బీజముగా చేయు చున్నదనుట. అర్జునా! ఆత్మజ్ఞానముతో సమానమైన పరిశుద్ధ పదా ర్థము లోకమందెక్కడను లేదు. అజ్ఞానము కర్మయోగముచే నైనను సమాధియోగముచే నైనను సంస్కరింపబడి యోగ్యతను పొంది బహుకాలముచేత తనంతటతానే మనస్సునందు స్ఫురించుచున్న

అర్జునా! యీ బ్రహ్మజ్ఞానము శ్రద్ధావంతునకు లభించు చున్నది. గనుక జ్ఞానమందు శ్రద్ధగలిగి ఆచార్యులను ఉపాసించుచు విషయములయందు వ్యాపించు యింద్రియములను నిగ్రహించిన వానికి అవశ్యముగా జ్ఞానము లభింపగలదు. జ్ఞానము లభించిన పిమ్మట శీఘ్రముగా మోక్షమును పొందుచున్నాడు. ఈ విషయమునందు సంశయింప దగదు. గనుక ఓ అర్జునా! పరమార్థ దర్శన లక్షణమైన యోగముచేత విడిచిన కర్మములు గలిగినట్టియు జ్ఞానముచేత సకల సంశయములు నశించినట్టియు అహంకారము లేనట్టివానిని సాత్వికాది గుణ చేష్టారూపముచేత చేయబడిన కర్మములు సంసార బంధఫల మును యివ్వజాలవు. గనుక అర్జునా! సంశయము మహా పాపము. ఆ సంశయము అవివేకమువలన పుట్టినదై మనస్సు నందుండును. శోక మోహమును పోగొట్టు ఆత్మజ్ఞానమే తీక్ష్ణమైన కత్తివంటిది, అట్టి జ్ఞానమను కత్తిచేత నీ సంశయమును నీవే నరికివేసి జ్ఞానమునకు ఉపాయమైన కర్మయోగమును అనుష్ఠింపుము. ఇప్పుడు యుద్ధము నకు లెమ్ము.

ఇది శ్రీకృష్ణార్జున సంవాదరూపమును, బ్రహ్మవిద్యా యోగ
శాస్త్రమును నగు శ్రీభగవద్గీతోపనిషత్తునందు
జ్ఞానయోగమను చతుర్థాధ్యాయము.

## పంచమాధ్యాయము

కృష్ణుడు యీ ప్రకారముగా చెప్పినవాక్యములను అర్జునుడు విని భగవంతుడైన కృష్ణునిచూచి ఇట్లనెను. కృష్ణదేవా! అనుష్ఠింప దగిన కర్మములను విడుచుటను మరల చెప్పెదము. కర్మానుష్ఠాన

మార్గమును చెప్పుము. కర్మసన్న్యాస కర్మయోగములలో ఏదిచేసిన యెడల నాకు మేలుకలుగునో అది నిశ్చయించి నాకు చెప్పుము అని అర్జునుడడుగగా భగవంతుడైన కృష్ణుడిట్లనెను.

అర్జునా! కర్మములను సన్న్యసించుటయు కర్మములను అనుష్ఠించుటయు ఈ రెండును జ్ఞానమును పుట్టించుటకు వుపాయము లగుట వలన కర్మ సన్న్యాస కర్మయోగములు రెండును మోక్షము కలిగించునవియగును. అట్లయినను కేవలకర్మసన్న్యాసముకంటె కర్మానుష్ఠానము శ్రేష్ఠమైనది. అర్జునా! కర్మమార్గమందు ప్రవర్తించినను రాగద్వేషాదులను విడిచి సుఖము నపేక్షింపక దుఃఖముకలిగినపుడు ద్వేషించకయుండు కర్మయోగి నిత్యసన్న్యాసియని యెరుగవలయును. కర్మయోగి సుఖదుఃఖాది ద్వంద్వములులేనివాడై అనాయాసముగా సంసార బంధమునుండి విడువబడుచున్నాడు. అర్జునా! సన్న్యాసము సాంఖ్యమనబడును. కర్మానుష్ఠానము యోగమనబడును. ఆసాంఖ్య యోగములు రెండును విరుద్ధములగు భిన్నఫలములను కలిగించునని బాలురగు వారు చెప్పుదురు. పండితులగువారు సాంఖ్యయోగములు రెండును విరుద్ధముగాని మోక్షఫల మొక్కటియే కలుగజేయునని చెప్పుదురు. అర్జునా! సాంఖ్యయోగములగు రెంటిలో యేదియైనను ఒక్కటి అనుష్ఠించినయెడల ఆ రెంటివలన కలిగెడి మోక్షఫల మొక్కటియే కలుగుచున్నది. అర్జునా! జ్ఞాననిష్ఠులగు సన్న్యాసులచేత యేమోక్ష పదము పొందబడుచున్నదో అట్టి మోక్షస్థానము కర్మ ఫలమును అపేక్షింపక ఈశ్వరార్పణముగా కర్మములను అనుష్ఠించు యోగులచేతను జ్ఞానప్రాప్తిద్వారా పొందబడుచున్నది. గనుక ఫలముద్వారా సాంఖ్యయోగములను రెంటిని ఒక్కవిధముగా జూచిన వాడు పరమార్థమును జూచిన వాడగును. గనుక ఆత్మజ్ఞాన ములేక కర్మసన్న్యాసము చేయుటకంటె కర్మానుష్ఠానము శ్రేష్ఠమైనదని తెలుసుకొనుము. పరమార్థ యోగము సాంఖ్యమేగాని కర్మముకాదు.

అర్జునా! సన్యాసమను జ్ఞానయోగము పరమార్థమగును. అట్టియోగమును పొందుటకు కర్మయోగము వుపాయమైయుండును. కర్మయోగమును విడిచి జ్ఞానయోగమును పొందుటకష్టము. కర్మయోగముతో గూడికొని ఈశ్వర స్వరూపమును చింతించువాడు పరమార్థజ్ఞాన నిష్ఠారూపమగు పరబ్రహ్మ ప్రాప్తిలక్షణమైన సన్యాస యోగమును శీఘ్రముగా పొందుచున్నాడు. అర్జునా! జ్ఞానప్రాప్తికి వుపాయమైన కర్మయోగమును అనుష్ఠించువాడు సమబుద్ధిరూపమైన యోగముతో గూడియుండవలయును. పరిశుద్ధ మనస్సుగలిగి యుండవలయును. దేహేంద్రియములను జయించి బ్రహ్మాది స్తంభ పర్యంతములగు సకల భూతములయందును తాను ఆత్మరూపముగానున్నట్లు చూచుచుండవలయును. ఇట్టి స్వభావములు కలవాడు కర్మములచేత బంధింపబడక ముక్తుడగును. జ్ఞానియైనను లోకానుగ్రహము కొరకు పూర్వోక్త స్వభావములు గలిగి కర్మములను చేసినయెడల అట్టి కర్మబద్ధుడు కాడని తెలిసికొనుము.

అర్జునా! జ్ఞానియగువాడు కర్మములను చేసినను, కొంచెమైనను చేయలేదని తలచుచుండును. జ్ఞానియగువాడు చూచుచును వినుచును తాకుచును వాసన చూచుచును భక్షించుచును నడుచుచు నిద్రించుచు, నిశ్వాసము విడుచుచు మాటలాడుచు విడుచుచును తీసికొనుచును కండ్లు మూసికొనుచును తెరచుచును ఆయా యింద్రియములు ఆయా విషయములయందు ప్రవర్తింపు చున్నవేగాని నేనొక కార్యమును చేయలేదని నిశ్చయించుకొను చుండును. గనుక జ్ఞానము కలవానికి కర్మ సన్యాసమందే అధికారము కలిగియున్నది. కాని కర్మయోగమందు అధికారములేదు. ఆత్మజ్ఞానము లేక జ్ఞానమును అపేక్షించినవాడు సర్వకర్మములను చేయుచు భృత్యునివలె యీశ్వ

రునకు సమర్పింపవలెను. కర్మములను చేయువాడు మోక్షమందు ఆసక్తి లేక కర్మఫలములను కోరక కర్మములనుచేసి యీశ్వరార్పణము చేయవలయును. అట్లు కర్మములను చేసినవాడు నీళ్ళు తామరాకును అంటనట్లు సకల పుణ్యపాపములచేత అంటబడడు. కర్మములను చేసినవానికి చిత్తపరిశుద్ధి మాత్రముకలుగుచున్నది. అర్జునా! కర్మయోగులు కర్మఫలమును గోరక అభిమానములేని దేహేంద్రియ మనోబుద్ధులచేత సకలకర్మములను చేసి యీశ్వరార్పణము చేయుదురు; అట్టివారికి చిత్తశుద్ధి కలుగుచున్నది. గనుక నీకు కర్మాధికారము కలిగియున్నది. కర్మములను చేసి యీశ్వరార్పణము చేయుము.

అర్జునా! యోగయుక్తుడై కర్మములను చేయుచు ఆ కర్మములను యీశ్వరార్పణము చేయుచు ఫలమును కోరనివాడు సత్వశుద్దిని పొంది తద్వారా జ్ఞానియై సర్వకర్మములను విడిచి, జ్ఞాననిష్ఠను పొంది ముక్తుడగుచున్నాడు. అర్జునా! కామముచేత ప్రేరేపింపబడినవాడు యోగముతో గూడుకొనక ఫలమందు ఆసక్తి కలిగి కర్మములను చేయుచు కర్మములచేత బంధింపబడును. గనుక నీవు యోగముతో గూడియుండుము. అర్జునా! పరమార్థజ్ఞానియగువాడు నిత్యనైమిత్తిక కామ్య ప్రతిషిద్ధములను సర్వకర్మములను వివేకబుద్ధిచేత విడిపించి మనోవాగ్దేహములచేత వ్యాపారములు చేయక సకల బాహ్య ప్రయోజనములను విడిచి యింద్రియములను జయించి సుఖముగా నుండును; తొమ్మిది ద్వారములుగల దేహము ఆత్మకు పట్టణము వంటిది. ఇంద్రియ మనోబుద్ధి విషయజ్ఞానములు పురజనులవంటివి. అట్టి దేహమను పట్టణమందు సర్వకర్మములను విడిచి యింద్రియాదుల చేత పనులను తాను చేయకను చేయించకను జ్ఞానియగువాడు సుఖించుచుండును.

అర్జునా! సర్వేశ్వరుడు ఆత్మలోకమునకు రథకుంభ ప్రాకారాది కార్యములను స్వయముగా చేయుటలేదు. ఆ రథాది కార్యములను ఆత్మ సృష్టింప జేయించునదియు కాదు. అవిద్యాలక్షణమైన ప్రకృతియను మాయాశక్తి సకలకార్యములను చేయుచు ప్రవర్తింపుచున్నది. అర్జునా! పరమార్థమువలన భక్తులుచేసిన పుణ్యాపాపములు సర్వేశ్వరుడగు ఆత్మ గ్రహించలేదు. అజ్ఞానముచేత జ్ఞానము కప్పబడియున్నది. అవివేకముచేత సంసారులు మోహింపబడి పూజాలక్షణమైన దానాది కార్యములను జేయుచున్నాననియు, చేయించుచున్నాననియు, భక్షించుచున్నాననియు, భక్షింపజేయుచున్నాననియు యీప్రకారము మోహమును పొందుచున్నారు. ఆత్మఒక్క కార్యమైనను చేసినవాడు కాడు. ఆత్మనిర్వికారుడు. అర్జునా! ఆత్మవిషయమైన వివేకజ్ఞానముచేత ఆ యజ్ఞానము యెవరికి నశింపబడునో అట్టివారికి సూర్యుడు సర్వవస్తువులను ప్రకాశింపజేసినట్లు జ్ఞానము ఆత్మవస్తువును ప్రకాశింపజేయును. (పరమార్థమైన బ్రహ్మతత్వము ఆత్మజ్ఞానముచేత ప్రకాశింపబడును) అర్జునా! ఆ బ్రహ్మమందు బుద్ధిగలవారును ఆ బ్రహ్మమే నేనని ధ్యానించువారును సర్వకర్మములను విడిచి బ్రహ్మనిష్ఠను పొందియుండువారును ఆ బ్రహ్మమునే పరమగతిగా నమ్మియుండువారును (కేవలము ఆత్మయందే రమించువారు) యీ మొదలగు వారందరును బ్రహ్మజ్ఞానముచేత సకల పుణ్యాపాపములను విడిచి మోక్షమును పొందుచున్నారు.

అర్జునా! జ్ఞానముచేత మోహరూపమైన అజ్ఞానమును నశింపజేసినవారలు పండితులగుదురు. అట్టి పండితులు జ్ఞానియందును సాత్వికుడై నట్టియు సంస్కారవంతుడైన బ్రాహ్మణులయందును రాజసగుణప్రధానమైనట్టి గోవులయందును కేవల తామసగుణప్రధానమైన యేనుగునందును నీచజంతువగు కుక్కయందును, కుక్కను భక్షించు

పాపాత్ముడైన మాలవానియందును పరబ్రహ్మమును సమముగా జూచుచుందురు. ఆ దేహములయందుండు ఆత్మ ఆయా దేహగుణదోషములచేత అంటబడక నిర్వికారముగా నున్నట్లు పండితులు సమానముగా జూచుచుందురు. అర్జునా! సకల దేహములయందును ఆత్మను సమముగా జూచుచు పండితులచేత యిప్పుడు వారిక్కడ జీవించి యుండగానే వారిచేత జన్మము జయించబడెను. అట్టిపండితులకు సర్వభూతములయందును బ్రహ్మము సమముగా నున్నదను నిశ్చలరూపమైన మనస్సుకలిగి యున్నది. బ్రహ్మము అద్వితీయమైన సకల దేహములయందునున్న దగుచు ఆయా దేహముల గుణదోషములచే అంటబడక నిర్దోషముగానున్నది. అట్టిబ్రహ్మమందు పండితులుండి బ్రహ్మస్వరూపులైనందున దేహములయందుండు గుణదోషములు ఆ పండితులను అంటజాలవు. అర్జునా! సర్వకర్మములను సన్యసించి బ్రహ్మమందుండు బ్రహ్మవేత్త యిష్టపదార్థమును పొందినపుడు సంతోషింపడు. దుఃఖము కలిగినపుడు దుఃఖింపడు. దేహమే తామని తలచియుండు మూఢులకు ఇష్టానిష్టములు కలిగినపుడు సుఖదుఃఖములు కలుగునేగాని ఆత్మవేత్తకు కలుగజాలవు. అట్టి ఆత్మవేత్త సర్వభూతములయందును నిర్దోషుడైన ఆత్మ సమముగా నున్నాడని నిస్సంశయమైన స్థిరబుద్ధికలిగియుండును. అట్టి ఆత్మవేత్త యెప్పటికైనను మోహమును జెందడు.

అర్జునా! బాహ్యములైన విషయములందు ప్రీతిలేనివాడై మనస్సునందు యేసుఖమును పొందుచున్నాడో అట్టివాడు బ్రహ్మనిష్ఠరూపమైన సమాధియోగముతో గూడినవాడగును. నాశములేని బ్రహ్మానందమును పొందుచున్నాడు. గనుక అక్షయమైన ఆత్మసుఖమును గోరువాడు విషయసుఖములయందు ప్రీతిని విడువవలయును. అర్జునా! ఇంద్రియవిషయసంబంధమువలన కలిగిన భోగానుభవములు అవిద్యవలన కల్పితము లగుటవలన ఇహపరలోక సౌఖ్యములన్నియు

దుఃఖకారణములే యగును. ఈసంసారమునందు కొంచమైనను సుఖము లేదని తెలియవలయును. విషయసుఖము లన్నియు ఆద్యంతములను గలిగి అనిత్యములై కనబడుచున్నవి. అట్టి విషయభోగములయందు పండితుడగువానికి ఆసక్తి కలుగదు. గనుక మిథ్యారూపములైన యెండమావులయందు గల జలములవంటి అవిద్యా కల్పితములైన విషయభోగములనుంచి యింద్రియములను త్రిప్పవలయును.

అర్జునా! తనకిష్టమైన విషయము తనయింద్రియమును పొందినను వినినను స్మరించినను అనుభవింపబడినను అట్టి సుఖహేతువు నందు యేఆశకలుగునో అది కామమనబడును. తనకు ప్రతికూలమైనట్టియు దుఃఖమును కలిగించునట్టి విషయములను చూచినను వినినను స్మరించినను అనుభవించినను యేద్వేషము కలుగునో అది క్రోధమనబడును. కామమువలన పుట్టిన వేగము కలిగినపుడు దేహమందు గల వెంట్రుకలు నిక్కబొడుచుకొని యుండును. నేత్రములకు సంతోషము కలిగియున్నట్లుండును. మనస్సు అధికముగా క్షోభింపుచుండును. క్రోధమువలన పుట్టిన వేగము కలిగినపుడు దేహము వడకుచు చెమట బోయుచు పెదవులు కరచికొనుచు నేత్రములు యెఱ్ఱనగుచుండును. ఈ కామక్రోధవేగములను రెంటిని యిపుడు జీవించియుండగానే మరణము కలుగక పూర్వమే పోగొట్టుకొనుటకు వుత్సహించినవాడు యీ లోకమందు యోగయుక్తుడై సుఖవంతుడగును. అర్జునా! బ్రహ్మనిష్ఠగలవాడు ఆత్మసుఖము గలవాడై ఆత్మక్రీడ కలవాడగుచు ఆత్మయందే ప్రకాశముగలవాడై యిక్కడ జీవించియుండియే బ్రహ్మస్వరూపుడై మోక్షమును పొందుచున్నాడు.

అర్జునా! సర్వకర్మ సన్యాసులై జ్ఞానులైన ఋషులు సకల పాపములను పోగొట్టుకొని సంశయములేనివారై యింద్రియములను జయించి సర్వభూతములయందును అహింసాధర్మము గలవారై మోక్షమును పొందుచున్నారు. అర్జునా! కామక్రోధములు లేనట్టియు

మనోనిగ్రహము కలిగినట్టి ఆత్మజ్ఞానులగు యతులకు జీవించియున్న పుడును మరణమైనపుడును సర్వదా మోక్షము సమీపమందు వర్తింపుచుండును. అర్జునా! శబ్దస్పర్శాది విషయములు శ్రోత్రాది యింద్రియములద్వారా బుద్ధియందుప్రవేశించును. అట్లు ప్రవేశించు విషయములను చింతించనియెడల ఆవిషయములు బాహ్యమునందుంచ బడినవి యగును. విషయములను బాహ్యమందుండునట్లు చేసి ప్రాణాపానవాయువులను సమములగునట్లు చేయవలయును. అట్లుచేసి ఇంద్రియమనోబుద్ధులను నిగ్రహించవలయును. అట్లు నిగ్రహించి మోక్షమే పరమగతియని తలచి పరమాత్మను ధ్యానించుము. నీశ్వ రుడు ఇచ్ఛాభయక్రోధగుణములు లేనియెడల అట్టివాడు సర్వదా ముక్తుడయ్యేయుండును. అట్టి సన్యాసి మోక్షముకొరకు మరియొక ప్రయత్నము చేయవలసినదిలేదు.

అర్జునా! అట్టి ధ్యానయుక్తుడైన సన్యాసి పరమేశ్వరుడగు నన్ను యెరిగి సర్వసంసారబంధవిముక్తుడగును. నేను కర్తృదేవతా రూపముచేత యజ్ఞతపస్సులను అనుభవించు సర్వలోక మహేశ్వరుడ నగుదును. నేను ప్రత్యుపకారమును అపేక్షింపక సర్వభూతములకు ఉపకారములను చేయుటచేత సుహృత్తునై యున్నాను. నేను సర్వ భూతములయొక్క బుద్ధియందు నివసించి సర్వప్రాణి కర్మములకు ఫలములు కలుగజేయుటకు ఆధారుడనై యున్నాను. ఇట్టి శ్రీమన్నా రాయణమూర్తి యగు నన్ను యెరిగినవాడు సర్వసంసార విముక్తు డగునని తెలిసికొనుము.

ఇది శ్రీకృష్ణార్జున సంవాదరూపమును బ్రహ్మవిద్యా
యోగశాస్త్రమును నగు భగవద్గీతోపనిషత్తు
సందు కర్మసన్యాసయోగమను
పంచమాధ్యాయము

---

# షష్ఠమాధ్యాయము

అర్జునా! కర్మఫలమును అపేక్షింపక చేయదగిన కర్మములను యెవడు చేయుచుండునో వాడు కర్మ పరిత్యాగము గలవాడును చిత్త సమాధి రూపమైన యోగముగలవాడు అగును. ఆత్మా నాత్మ వివేకజ్ఞానములేక అగ్నిహోత్రములు లేనివాడును తపోదానాది కర్మములుచేయనివాడును సన్యాసియనియు, యోగియనియు తలచవద్దు అర్జునా! యేసర్వ కర్మఫల పరిత్యాగమును, పరమార్థసన్యాసమని, శాస్త్రజ్ఞులగు పండితులు చెప్పుదురో అట్టిపరమార్థ సన్యాసమును కర్మయోగమునుగా తెలిసికొనుము. అదియెట్లనగా చెప్పెదవినుము. పరమార్థ సన్యాసియగు వాడు సర్వ కర్మ ఫలవిషయమైన సంకల్పమును బొత్తిగావిడిచి పిమ్మట సర్వ కర్మములను విడచుచున్నాడు. అటువలెనే కర్మయోగియు తాను కర్మములను చేయుచున్నను కర్మఫల విషయమైన సంకల్పమును బొత్తిగా విడిచియున్నాడు. కర్మఫల సంకల్పమును విడువని కర్మయెప్పటికిని చిత్తసమాధానముగల యోగికాజాలదు. గనుక పరమార్థ సన్యాసికివలె కర్మయోగికిని కర్మఫల విషయమైన సంకల్పము లేనందున కర్మయోగియు కర్మసన్యాసియనియే తెలియవలయును.

అర్జునా! కర్మఫలమును సన్యసించి నట్టియు, ధ్యానయోగమందు సమర్థుడుకానట్టివానియొక్క యోగము కర్మసాధనమై యుండును. గనుక అట్టివాడు కర్మఫలసంకల్పమును విడిచి కర్మములను చేయుచుండవలయును. ధ్యానయోగమందు సమర్థమైన చిత్తముగలవాడు కర్మములను విడచి ధ్యానయోగమును అభ్యసించుటయే వానికి యోగసాధనమగును. అర్జునా! సమాధిరూపమైన

చిత్తముగల యోగి శబ్దస్పర్శాది విషయములయందును నిత్యనైమిత్తిక కామ్యప్రతిషిద్ధములను కర్మములయందును ప్రయోజనము లేదను బుద్ధిచేత విరక్తుడెప్పుడగునో అప్పుడు ఇహపరలోక భోగ సాధనములైన సర్వకర్మములను సర్వ సంకల్పములను విడుచుచున్నాడు. అట్లు విరక్తిచేత సర్వకామసంకల్పములను విడిచినపుడు యోగమును పొందినవా డగునని తెలియవలయును. అర్జునా! సంసారసముద్రమందు మునిగియుండు తనను ఆసక్తి లేని మనస్సు చేతనే పూర్వగతికి తెచ్చి రక్షించుకొన వలయును. అనగా యోగ ప్రాప్తిని కలిగింపవలెను. అర్జునా! తనను అధోగతిని పొందించు కొనరాదు. తనకు వశ్యముగానిమనస్సే తనకు శత్రువగును. తనకు వశ్యమైన మనస్సే తనకు బంధువగును. అర్జునా! యేమనస్సుచేత దేహేంద్రియాది సంఘము జయింపబడునో ఆ మనస్సునకు దేహేంద్రియాది సంఘము బంధువగును. మనస్సు జయింపబడని యెడల అట్టి మనస్సు తనకు శత్రువువలె శత్రు భావముగాగల అపకారమందు ప్రవర్తింపు చుండును.

అర్జునా! దేహేంద్రియాదులను జయించినట్టి మిక్కిలి శాంతముగలవాని యొక్క మనస్సు శీతోష్ణసుఖదుఃఖములయందును పూజావమానములయందును సమాన స్వభావము గలిగియుండును. అట్టివాడు సాక్షాత్తుగా ఆత్మానుభవమందు వర్తింపుచుండును. అర్జునా! శాస్త్రజ్ఞాన అనుభవజ్ఞానముచేత తృప్తిబొంది మనస్సు గలవాడును నిశ్చలమైన యింద్రియ నిగ్రహముగలవాడును పెంకు రాయి బంగారములయందు సమబుద్ధిగలవాడును యోగి ఆత్మానుభవము గలవాడని చెప్పబడును. ధ్యానయోగ నిష్ఠగలవాడుప్రత్యుపకారమును స్నేహితునియందును శత్రువుని యందును మధ్యస్థుని యందును సాక్షియందును తనయందు ద్వేషముగలవాని యందును

బంధుజనుల యందును శాస్త్రజ్ఞులగు సాధువులయందు పాపకర్మ
ములను చేసినవారియందును వీరందరియందును సమబుద్ధికల్గి
కర్త యెవడనియు కర్మమెద్దియనియు యిట్లు తలచుచు చిత్తవికారము
లేక యుండును. యోగయుక్తులలో యిట్టివాడు శ్రేష్ఠుడని తెలియ
వలయును.

అర్జునా! అట్టిధ్యాననిష్ఠుడు పర్వతగుహాదిగహనస్థలమందున్న
వాడై ఒంటరిగా జేయుచుండును. అట్టివాడు మనోదేహములను
జయించి ఆశను విడిచి ధ్యానయోగముతోగూడి యుండవలయును.
అర్జునా! అట్లు ఉత్తమఫలమును పొందుటకొరకు ధ్యానయోగమును
అభ్యసింపువాడు పరిశుద్ధ ప్రదేశమందు సమమైన ఆసనమును
కల్పించుకొన వలయును. ఆ ఆసనము మిక్కిలి యెత్తుగానుండరాదు.
మిక్కిలి తగ్గుగా నుండరాదు. ఆసనమందు మొదట దర్భల నుంచ
వలయును. ఆ దర్భలమీద కృష్ణాజినము నుంచవలయును ఆ కృష్ణా
జినముమీద వస్త్రము నుంచవలయును ఆసనమనగా పీఠమని తెలియ
వలెను. అర్జునా! అట్టి ఆసనమందు కూర్చుండి సమాధిరూపమైన
ధ్యానయోగమును అభ్యసింపవలయును. ఎట్లనగా చెప్పెదనువినుము.
మనస్సును శబ్దాది సర్వవిషయముల నుంచి త్రిప్పి ఏకాగ్రమగునట్లు
చేసి చిత్తముయొక్క కార్యములను యింద్రియ కార్యములను
జయించవలయును. యింద్రియ చిత్తకార్యములను జయించి మనస్సు
నేకాగ్రమగునట్లు చేయుటయే యోగమనబడును. అట్లు యోగ
మభ్యసించిన యెడల మనస్సునకు శుద్ధి గలుగుచున్నది.

అర్జునా! యోగమును అభ్యసింపువాడు దేహమునుశిరస్సును
మెడను సమముగానుండునట్లు కూర్చుండి స్థిరుడై చలింపకుండ వల
యును. అట్లుకూర్చుండి దిక్కులను చూడనివాడగుచు, చూచుచున్న
వానివలెదృష్టిని నేత్రములయందే అణచియుండవలయును. అట్లుంచి

మిక్కిలి శాంత మనస్సుగలవాడై భయములేక గురుశుశ్రూష భిక్షాన్నాది బ్రహ్మచర్యవ్రతములను అనుష్ఠింపుచుండవలయును. అట్లు అనుష్ఠింపుచు మనోవృత్తులను అణచవలయును. మనోవృత్తులను జయించి పరమేశ్వరుడగు నాయందు చిత్తమునుంచి నేనే పరమగతి యని తలచి నన్ను ధ్యానింపుచుండవలయును. అర్జునా! యీపైన చెప్పిన ప్రకారము సమాధి యోగమును అభ్యసించినవాడు సర్వదా నియతమనస్సు గలవాడై నా అధీనమైన మోక్షపదమును పొందు చున్నాడు. అర్జునా! అమితముగా ఆహారమును భక్షించినవానికి యీ యోగము లభింపదు. గనుక యోగమును అభ్యసింపువాడు మితముగా ఆహారము భక్షింపుచుండవలయును. కడుపులోనుండు ఆకాశమును నాలుగు పాళ్ళుగా విభజించి అందు రెండు పాళ్ళు నిండు నట్లు ఆహారమును భక్షించి మూడవ పాలు నిండునట్లు జలముత్రాగి నాలుగవ భాగమును వాయు సంచారముకొరకు విడువవలెనని యోగశాస్త్రజ్ఞులు చెప్పుదురు.

అర్జునా! విశేషముగానిద్రించినవానికిని, బొత్తిగా నిద్రించక మేల్కొనియుండు వానికిని యోగము లభింపదు. అర్జునా! ఆహారము సంచారము యీ రెండును ప్రతినిత్యము హెచ్చు తక్కువలు లేక నియమపరిమాణములు గలిగియున్నవానికిని నియమముగా తగి నట్లు కర్మములు చేయువానికిని నియమితకాలములయందు నిద్రించుచు మేల్కొనుచుండు వానికిని సర్వసంసార దుఃఖములను నశింపజేయు సమాధియోగము లభించుచున్నది. అర్జునా! ఏకాలమందు మనస్సు బాహ్యవిషయమైన చింతలు విడిచి యేకాగ్ర రూపమై కేవలముగా ఆత్మనిష్ఠను పొంది యుండునో ఆకాలమందు సర్వకామ విషయము లందు ఆసక్తిలేని యోగీశ్వరుడు సమాధిరూపమైన యోగముతో కూడియుండెనని తెలిసికొనుము.

అర్జునా! సమాధియోగ నిష్ఠగల యోగీశ్వరుడు గాలిలేని ప్రదేశమందుండు దీపము చలింపకున్నట్లు ఆత్మసమాధియందు నిశ్చలమైన మనస్సుగలిగియుండును. ఈరీతిగా ఆ యోగియొక్క చిత్తము యోగాభ్యాసమువలన యేకాగ్రరూపమై వాయువులేని ప్రదేశమందుండు దీపమువలె నిశ్చలమైనదగుచు యేకాలమందు యోగానుష్ఠానముచేత సర్వవిషయములనుంచి నివారింపబడి చిత్తము ఉపరతిని పొందునో అప్పుడు యోగమును పొందెనని తెలిసికొనుము. పరిశుద్ధచిత్తముచేత యేకాలమందు పరంజ్యోతి స్వరూపమైన ఆత్మను ఆగి చూచుచు తనయందే తాను తృప్తిని పొందునో అట్టికాలమందు యోగమును పొందెనని తెలుసుకొనుము. ఆయోగి యేకాలమందు యింద్రియములచేత గ్రహింపరానట్టియు, బుద్ధిచేత గ్రహింపదగినట్టి అఖండ మహాసుఖమును అనుభవించునో అట్టికాలమందు యోగమును పొందెనని తెలియవలెను. అట్టి ఆత్మనిష్ఠనుపొందిన విద్వాంసుడు ఆయాత్మ స్వరూపమునుంచి చలింపడు. అర్జునా! అట్లు ఆత్మరూపమునుండి లాభమును పొందిన విద్వాంసుడు అందరికంటె వేరొక లాభపదార్థమున్నదని తలచడు ఆత్మస్వరూప నిష్ఠయందున్న విద్వాంసుడు శస్త్రాస్త్రములు మొదలగు వానిచేత ప్రహరించినవలె బాధింపబడినను ఆత్మస్వరూప నిష్ఠనుండి చలింపబడడు. ఇట్టి విశేషములుగల యోగము దుఃఖబంధములను పోగొట్టునని తెలిసికొనుము. అర్జునా! దుఃఖములతో కూడికలేక యుండుటయే యోగమనబడును. అట్టి యోగములు నిశ్చయ స్వభావము కలిగినట్టియు, దుఃఖము చిత్తముచేత అభ్యసింప వలయును.

అర్జునా! యోగమును అభ్యసించువాడు సంకల్పమువలన పుట్టుచున్న సకల కామములను బొత్తిగావిడిచి మనస్సునందు ఫలాపేక్షను వదలవలయును. వివేకముతో గూడిన మనస్సుచేత సకలే

ద్రియములను విషయములయందు ప్రా... ్వావము కలిగియుండును. అట్టి ధైర్యముతో గూడిన బుద్ధిచేత తిన్నగా మన... ి. గనుక ఆయోగమును ...లి చలనస్వభావము వలయును. మనశ్శాంతిని పొంది ఆమనస్సును ...క దుఃఖమును కలి యును. సర్వమాత్మయనియు, ఆత్మకంటె అన్యము ...బ...క బలము లేదనియు తలచుటయే అత్మయందు మనస్సు నుంచుటయని... ...ంసజాల వలయును. ఆత్మయందు మనస్సునుంచి యితరవిషయమును పూ...అని చింతింపకుండవలయును. ఇట్టిస్థితియే యోగమునకు పరమావధియని తెలియవలయును. ఇంతకుపైన యోగాభ్యాసము లేదు. అర్జునా! మనస్సును ఆత్మయందుంచుటకు ప్రయత్నించు యోగి యే యే శబ్దాది విషయములయందు స్వభావదోషమువలన మనస్సు వ్యాపించుచుం డునో ఆయా విషయములనుంచి మనస్సును వివేక వైరాగ్యముల వలన త్రిప్పి తన వశమును చేసికొనవలయును. ఈప్రకారము మన స్సును త్రిప్పుచుండగా యోగాభ్యాస బలమువలన యోగియొక్క మనస్సు ఆత్మయందే అణగియుండగలదు. అర్జునా! ఇట్లు మిక్కిలి శాంతమనస్సుగల యోగిని మిక్కిలి పరమసుఖము పొందుచున్నది. అట్టి యోగికి రజోగుణమువలన బుట్టిన మోహాదిదుఃఖము లుండవు. యోగి జీవించియుండియే బంధవిముక్తుడై బ్రహ్మస్వరూపుడగును. యోగికి పుణ్యపాపకర్మములు కలుగజాలవు. అర్జునా! పూర్వ మందు చెప్పబడిన ప్రకారము విఘ్నములులేని యోగి తన మన స్సును యోగాభ్యాసమందు చేర్చుచు సకల పాపములను విడిచి అనా యాసముగా పరబ్రహ్మముతో గూడిన వాడగుచు శాశ్వతమైన బ్రహ్మానందమును పొందుచున్నాడు. అర్జునా! యోగసమాధినిఅభ్య సించినవాడు తాను బ్రహ్మాది సర్వభూతములయందున్న వానినిగాను బ్రహ్మాది సర్వభూతములు తనయందు యేకీభవించి యున్నట్లుగాను ప్రత్యక్షముగా జూచుచు, అట్టి జ్ఞానముగలయోగి బ్రహ్మాది స...ంభ

పర్యంతముగల భూతములయందు బ్రహ్మరూపమైన ఆత్మయొక్కడే యున్నాడని ప్రత్యక్షముగా చూచుచు సమబుద్ధి కలిగియుండును.

అర్జునా! జ్ఞానికిని పరమేశ్వరుడగు నాకును కొంచమైనను భేదము లేదు. పరమేశ్వరుడగు నేనును బ్రహ్మాది సర్వభూతముల యందు ఆత్మయను పేరుచేత వర్తింపుచున్నాను. బ్రహ్మాది సర్వభూతములున్ను పరమేశ్వరుడగు నాయందు వర్తింపుచున్నవి. ఈశ్వరుడగు నేను సర్వదేహాది ప్రపంచములయందు ఆత్మరూపముగ నున్నట్లు గాను, సర్వదేహాదిప్రపంచము యీశ్వరుడనగు నాయందున్నట్లు గాను చూచినవానికి నేను ప్రత్యక్షము కాకమానను. వాడును నాకు ప్రత్యక్షముకాక యుండడు. పరమేశ్వరుడనగు నేనును జ్ఞానియు ఒక్క స్వరూపముచేతనే వర్తింపుచుందుమని తెలియవలయును. అర్జునా! అట్టి జ్ఞాని నేనేయగుటవలన జ్ఞాని తనప్రారబ్ధ కర్మబలము వలన నానావిధములైన పుణ్య పాపకర్మములను చేయుచున్నను అట్టి కర్మములువానిని బంధించి మోక్షమును అడ్డగింపజాలవు. జ్ఞాని నిత్య ముక్తుడై వైష్ణవమను నాస్వరూపమైన పరమ పదమందు వర్తింపు చుండును.

అర్జునా! యోగియగువాడు తనకు సుఖదుఃఖములు యెట్లు కలుగుచున్నవో అటువలెనే సర్వభూతములకు సుఖదుఃఖము లున్న వని తలచి యేజంతువునకును కష్టము కలిగింపకుండవలయును, అహింసా ధర్మముగల జ్ఞానయోగి సర్వయోగీశ్వరులలో శ్రేష్ఠుడని తెలియువలయును. అని భగవంతుడగు కృష్ణుడు యోగమును చెప్పగా ఆ వాక్యములను అర్జునుడు విని సమదర్శన లక్షణమైన యీ యోగమును అభ్యసించుట కష్టమని తలచి యిట్లనెను.

భగవంతుడవగు కృష్ణదేవా! సమదర్శనరూపమగు యేయోగ మును యిపుడు చెప్పితివో ఆయోగము మనస్సుచేత పొందదగినది.

యగును. మనస్సు అధికచలన స్వభావము కలిగియుండును. అట్టి మనస్సు నిశ్చలస్వభావమును పొందజాలదు. గనుక ఆయోగమును నేను పొందజాలను. కృష్ణా! మనస్సు మిక్కిలి చలనస్వభావము గలదై దేహేంద్రియములను పరవశము చేసి అధికదుఃఖమును కలిగించును. మరియొకటియగు దేనిచేతను మనస్సు శిక్షింపబడక బలము గలదై యున్నది. మనస్సు గట్టిదియగును. గాలిని నిగ్రహింపజాలనట్టు అట్టి మనస్సును నేను నిగ్రహింపజాలనని తలచుచున్నాను. అని యిట్లు అర్జునుడడుగగా అప్పుడు భగవంతుడైన విష్ణుదేవుడగు కృష్ణుడిట్లనెను.

అర్జునా! మనస్సు చలస్వభావము గలదగుటవలన నిగ్రహించుటకు శక్యముగాదని సంశయింపకుము. అభ్యాసముచేతను, వైరాగ్యముచేతను, మనస్సు నిగ్రహింపబడి వశ్యముగాగలదు. చిత్తమను ప్రదేశమందు ఒకానొక సమాన ప్రత్యయావృత్తి అభ్యాసమనబడును. ఇహలోక పరలోక భోగములయందు అనిత్యాదిదోషములను యోచించి భోగాపేక్షను విడుచుట వైరాగ్యమనబడును. అర్జునా! అభ్యాస వైరాగ్యములులేని మనస్సుగలవానిచేత యోగము పొందబడదని నేను నిశ్చయించి యున్నాను. అభ్యాస వైరాగ్యముల చేత సర్వదా వశ్యమైన మనస్సుకలవాడు ముందుచెప్పిన వుపాయము చేత యోగమును పొందగలడు. అని కృష్ణుడు చెప్పగా అర్జునుడిట్లనెను.

[illegible]! యోగాభ్యాసమును అంగీకరించినవాడు ఇహాపరలోక[illegible] లేక [illegible] పర [illegible] [illegible] [illegible]సించి యోగాభ్యాసమ[illegible] వె[illegible]మును. శ్రద్ధచేత యోగము[illegible] [illegible] మరణకాలమందు యోగ [illegible] పరి[illegible], జ్ఞానమును పొందక, [illegible] ఫల[illegible] [illegible]తిబొందినయెడల అట ్టివాడు యేగతిని పొందును[illegible]

చెప్పుము. కృష్ణా! అట్టివాడు కర్మమార్గ యోగమార్గములను రెంటి వల్లను భ్రష్టుడై చెదరిన మేఘమువలె నశించునా యేమి? కృష్ణా! అట్టివాడు కర్మమార్గ యోగమార్గములగు రెంటిలో ఒక ఆధార మైనను లేక బ్రహ్మప్రాప్తి మార్గమందు మూఢుడై చెడిపోవునేమో తెలియదు. కృష్ణా! యీ సంశయము నాకు కలిగి యున్నది. యీ సంశయమును పోగొట్టుటకు నీవే సమర్థుడవు. నీవుతప్ప వేరొక మునీంద్రుడైనను, దేవుడైనను కూడ యీ సంశయమును నివారిం చుటకు సమర్థుడు గాజాలడు. అని అర్జును డడుగగా భగవంతుడైన కృష్ణు డిట్లని చెప్పెను.

అర్జునా! అట్లు కర్మములను సన్యసించి యోగాభ్యాసియై యోగఫలమగు బ్రహ్మజ్ఞానమును పొందక యోగమును విడిచి మృతి బొందినవానికి ఇహపరలోకనాశనము లేదు. పూర్వజన్మముకంటె తక్కువజన్మముపొందుట నాశమన బడును. అర్జునా! శుభమును కలి గించు యోగమును అభ్యసించినవాడు యెవడైనను పాపగతినిపొంద డని తెలిసికొనుము. అర్జునా! యోగమార్గమందు ప్రవర్తించియోగ ఫలమును పొందక యోగమును విడిచి మృతిబొందిన సన్యాసి తన యోగాభ్యాససామర్థ్యమువలన అశ్వమేధాది క్రతువులవలన సోమ యాజులు పొందు పుణ్యలోకములను పొంది అక్కడ అనేక దివ్యసం వత్సరములు నివసించి దివ్యభోగములను అనుభవించును. పిమ్మట అతనియోగఫలము క్షయించినపిమ్మట ఆయోగభ్రష్టుడు ఐశ్వర్యవం తులగు పరిశుద్ధచిత్తముగలవారిగృహమందు మనుష్యుడై పుట్టుచున్నాడు. అట్లు గానియెడల మఱియొక

త్మునకే కలుగును. దరిద్రులగు యోగులకులమందు బుట్టినవాడు తన పూర్వజన్మపు దేహసంబంధమైన యోగాభ్యాస బుద్ధిగలవాడై మరల యోగాభ్యాసమునకు ప్రయత్నించును. యోగసిద్ధియగు బ్రహ్మప్రాప్తి రూపమైన జ్ఞానమును పొందుటకొరకు మరల అధిక ప్రయత్నము జేయును.

అర్జునా! యోగభ్రష్టుడు తాను పూర్వజన్మమందు అభ్యసించిన యోగము తనవశము లేనివాడైనను వాడు ఆయోగసంస్కారముకంటె బలముగల పుణ్యకర్మములను చేసినయెడల అపుడు యోగాభ్యాసమువలన గలిగిన సంసారరూపశక్తిచేత లాగబడి మరల యోగమును అధికముగా అభ్యసించును. పూర్వజన్మమందు అభ్యసింపబడిన యోగసంస్కారబలముకంటె పాపకర్మమును అధికముగా చేసినయెడల పాపకర్మబలముచేత యోగసంస్కారబలము అడగించబడి యోగము నభ్యసింపడు. పాపకర్మఫలము క్షయించినతోడనే యోగసంస్కారమునకు దీర్ఘకాలపర్యంతమునాశము లేదని తెలియవలయును. అర్జునా! యోగస్వరూపమును యెరుగుటకు యిచ్ఛయించినవాడును, కర్మసన్యాసియై యోగమందు ప్రవర్తించి మరణకాలమందు యోగమును విడిచి మృతిబొందినవాడును వేదోక్తకర్మానుష్ఠానఫలమును అనుష్ఠింపుచున్నాడు. కర్మ సన్యాసియే వేదోక్తమగు కర్మానుష్ఠానఫలమును అతిక్రమించినపుడు యోగము నెరిగి ఆయోగాభ్యాసనిష్ఠ చేసినవాడు వేదోక్తకర్మానుష్ఠానఫలము నతిక్రమించునని చెప్పవలసిన పని లేదు. యోగభ్రష్టుడైనవాడు పరలోకభోగాభిలాషగలిగియున్న యెడల అశ్వమేధాది సోమయాజులు పొందెడి లోకములను పొందును. అట్టిభోగా[illegible] లేక విరక్తుడై యున్నయెడల అట్టివాడు పరలోకములకు వెళ్ళకయే దరిద్రులగు యోగులకులమందు బుట్టి పూర్వోక్త ప్రకారము పరిపక్వకాలమందు మరల అధిక యోగమును అభ్యసించునని తెలియవలయును.

అర్జునా! ఆ ప్రకారము అధిక యోగప్రయత్నము చేయువాడగు యోగి సకలపాపములు నశించినవాడై యీప్రకారము అనేక జన్మలయందు కొంచెము కొంచెముగా యోగసంస్కారమును చేర్చుకొని, అట్టియోగసంస్కారముచేత బ్రహ్మజ్ఞానమును పొంది మోక్షప్రాప్తుడగును. పరలోకభోగాభిలాష లేనందున యోగసంస్కారము పరలోకభోగముద్వారా నశింపక చేరియుండును. అర్జునా! తపస్సు చేసినవారికంటె యీయోగి అధికుడగును. శాస్త్రార్థజ్ఞానము కలవారికంటె అగ్నిహోత్రాదికర్మములను చేసినవారికంటె యీయోగము నభ్యసించినయోగి అధికుడగును. గనుక నీవు ధ్యానరూపమైన యీ సమాధియోగము నభ్యసించి యోగివికమ్ము. అర్జునా! యోగులలో రుద్రాదిత్యాదిదేవతలను ఆశ్రయించినవారికంటె పరమేశ్వరుడగు నాయందుగల మనస్సుచేత శ్రద్ధావంతుడై నన్నెవడు ఆశ్రయించునో అట్టివాడు సకలయోగులలో శ్రేష్ఠుడని నాయభిప్రాయము.

ఇది శ్రీకృష్ణార్జున సంవాదరూపమును బ్రహ్మవిద్యా
యోగశాస్త్రమును నగు భగవద్గీతోపనిషత్తు
నందు ఆత్మసంయమ యోగమను
షష్ఠమాధ్యాయము

---

## స ప్త మా ధ్యా య ము

భగవంతుడైన కృష్ణుడు అర్జునునిజూచి యిట్లనెను. అర్జునా! ఇకమీాదట చెప్పబోవు విశేషములుగల పరమేశ్వరుడ నగు నాయందుంచినమనస్సుగలవాడవై యోగసమాధిని అభ్యసింపుచు నేనే ఆశ్రయముగలవాడవై యితర సాధనములను విడిచి సమస్త విభూతి

బలశక్త్యైశ్వర్యాదిగుణవంతుడనగు నన్ను నిస్సంశయముగా యేప్రకారము యెరుగగలవో ఆప్రకారమైన నన్నెరుగువిషయమును చెప్పెదను వినుము. అర్జునా! నాఅనుభవముతో కూడినయీజ్ఞానమును యిపుడు నీకొరకు చక్కగా చెప్పబోవుచున్నాను, అర్జునా! యేజ్ఞానమును నీ వెరిగినయెడల మరల యెరుగదగిన పురుషార్థముకలిగియుండదో అట్టి జ్ఞానమును చెప్పెదను వినుము. అనగా నాస్వరూపమును యెరిగిన వాడు సర్వజ్ఞు డగునని యభిప్రాయము. అర్జునా! మనుష్యులలో అనేకమందిలో ఒకానొకడు సిద్ధికొఱకు నన్నును నిగ్రహించుటకు ప్రయత్నింపు చున్నాడు. అట్లు మనోనిగ్రహశక్తియొక్క సిద్ధికొరకు ప్రయత్నించువారిలో మోక్షాపేక్షగలవాడొకా నొకడై యుండును. మోక్షాపేక్ష చేత మనోనిగ్రహమును చేసి సిద్ధిపొందినవారిలో నన్ను వాస్తవముగా యెరిగినవాడు ఒకడేయుండును. అర్జునా! భూమి జల అగ్ని వాయు ఆకాశములను సూక్ష్మభూతము లైదును మనస్సునకు కారణమైన అహంకార మనునది యొకటియు అహంకారమునకు కారణమైన మహత్తత్వమనునదియొకటియు అవిద్యతో గూడినఅవ్యక్త మను ప్రకృతి యొకటియు ఇవి యన్నియు చేరి యెనిమిదియగును. ఈప్రకారము నామాయాశక్తి యెనిమిది విధములుగా భేదమును పొందియున్నది.

అర్జునా! ఎనిమిదివిధములైన భేదములతో కూడియున్న యీ ప్రకృతి నీచమైనదగుచు సంసారబంధనాది దుఃఖములను కలిగించు స్వభావము కలిగియుండును. దీనికంటె అన్యమైన మరియొక విశుద్ధమైన ప్రకృతిగలదు. ఆ విశుద్ధమైన ప్రకృతి శ్రేష్ఠమైనది. ఆ విశుద్ధ ప్రకృతి పరమేశ్వరుడనగు నాయొక్క స్వరూపభూతముగా నున్నదనియు, క్షేత్రజ్ఞుడను జీవునియొక్క లక్షణము గలిగి యున్నదనియు ప్రాణమును ధరించుటకు నిమిత్తరూపముగా నున్నదనియు తెలిసికొను

ము. ఈవిశుద్ధప్రకృతియే ప్రపంచములోపల ప్రవేశించినదై జగత్తును ధరించుచున్నది. అర్జునా! ముందు చెప్పబడిన యెనిమిదివిధములుగల ప్రకృతిక్షేత్రలక్షణప్రకృతి యనబడును. ఈక్షేత్రక్షేత్రజ్ఞ లక్షణము లైనరెండుప్రకృతులవలనను సకల భూతములు పుట్టుచున్నవని తెలిసికొనుము. ఈరెండు ప్రకృతులునుపరమేశ్వరుడనగునాసంబంధములగుటవలన నేను యీరెండు ప్రకృతులద్వారా సకల జగత్తునకును సృష్టి సంహారములను చేయుచు జగత్కారణుడనై యున్నాను. గనుక అర్జునా! పరమేశ్వరుడైనగు నాకంటె మరియొక కారణవస్తువుకొంచెమైనను లేదు. నేనే సర్వజగత్తునకు కారణుడనై యున్నాను, అర్జునా! పరమేశ్వరుడనగు నాయందు సకలభూతములును యీసర్వజగత్తును వస్త్రమందు నూలువలె గ్రుచ్చబడియున్నది. దారమందు మణులు గ్రుచ్చబడినట్లు నాయందు సకలప్రపంచమును గ్రుచ్చబడి యున్నదని తెలిసికొనుము.

అర్జునా! నీటిలో యేసారరూపమైనరసముగలదో ఆ రస రూపమైన నాయందు నీళ్ళు గ్రుచ్చబడినట్టి విధముగా తోచుచున్నది. గనుక నీటిలో నుండు రసము నే నేనని తెలియవలయును. సూర్య చంద్రులయందుండు తేజస్సు నేనేయగుదును. అనగా సూర్యచంద్రుల యందు యేతేజస్సుగలదో ఆతేజోరూపమగు నాయందు సూర్య చంద్రులు గ్రుచ్చబడి యున్నట్లున్నారని తెలియవలయును. యీ ప్రకారమే అంతటను తెలియవలయును. ప్రణవరూపమగు ఓంకార మైన నాయందు వేదము లమరి యున్నవి గనుక వేదములలోని ప్రణవము నే నగుదును. శబ్దరూపమైన నాయందు ఆకాశము గ్రుచ్చబడినది. గనుక ఆకాశములోనుండు శబ్దము నేనే యగుదును. పురుషులలో పుంస్త్వమను పురుష స్వభావము నేనే యగుదును.

అర్జునా! వాసనారూపమగు నాయందు యీ భూమి అమరి యున్నది. గాన భూమియందుండు గంధభావము నేనే యగుదును. అగ్నియందుగల తేజస్సు నేను యగుదును. సర్వభూతములు దేని చేత జీవించుచున్నవో ఆ జీవనము నేనే యగుదును. తపస్సంపన్ను లగువారి యందుండు తపస్సు నేనే యగుదును. అర్జునా! సర్వభూత ములను పుట్టుటకు అనాదికారణమైన బీజము నేనే యగుదును. వివేకశక్తి మంతులగు వారియందుండు వివేకశక్తి నేనే యగుదును. తేజోవంతులగు వారి యందుగల తేజస్సు నేనే యగుదును. బల వంతులగు వారి యందుండు కామరాగములు లేని సామర్థ్యము నేనే యగుదును. అనగా దేహమును ధరించుటకు యోగ్యమైన బలము మాత్రమే నేనగుదునని తెలియవలెను. శాస్త్రధర్మమునకు విరుద్ధ ముగా నట్టియు దేహమును పోషించుకొనుటకు మాత్రము తగిన యే కామము ప్రాణులయందుండునో అట్టికామము నేనే యగుదును. అర్జునా! సాత్వికగుణము వలన పుట్టిన పదార్థములును, రాజసగు ణము వలన పుట్టిన పదార్థములును తామస గుణమువలన పుట్టిన పదార్థములును తమ తమ కర్మవశము వలన పుట్టిన ప్రాణులును యీ చెప్పిన వన్నియు నావలననే పుట్టినవని తెలిసికొనుము.

అర్జునా! యీ చెప్పబడిన జంతువులన్నియు నావలన బుట్టి నను ఆ జంతువుల కధీనముగా నేనుండలేదు. సంసారులగు ప్రాణు లన్నియు నా అధీనములై వర్తింపుచున్నవి. అర్జునా! సత్వరజస్త మములను గుణములయొక్క వికారములగు రాగద్వేష మోహాదుల చేత సకల జంతువులు అవివేకమును పొంది మోహింపబడుచున్నవి. అట్లు మోహింపబడి సర్వగుణ వికార ప్రపంచమునకు అతీతుడనైన నన్నో యెరుగక, సర్వజంతువులు మోహించి యున్నావు. నేను యెప్పటికిని నాశనములేక జన్మాది సకల వికారములను లేనివాడను.

నిత్యశుద్ధ బుద్ధముక్త స్వభావుడనై యున్నాను. అర్జునా! గుణ మయమైన నా మాయాశక్తిని అతిక్రమించుటకు యెవ్వరికిని శక్యముగాదు.

అర్జునా! సర్వధర్మములను సన్యసించి నామాయకు ఆధారుడగు నన్ను ఆత్మరూపముగా సర్వవిధములచేత సేవించువారలు నా మాయను అతిక్రమించి సంసారబంధమునుంచి ముక్తులగుదురు. అర్జునా! పాపాత్ములగు మూఢులు మాయచేత జ్ఞానశూన్యములై జంతువులను హింసింపుచు అసత్యములు చెప్పుచు యిటువంటి రాక్షస భావము నాశ్రయించియుందురు. పాపాత్ములు పరమేశ్వరుడగు నన్ను సేవింపక చెడిపోదురు. అర్జునా! పుణ్యాత్ములగు జనులు నాలుగు విధములు గలవారై నన్ను సేవింపుచు ప్రార్థింపుచున్నారు. వారెవరనగా చెప్పెదవినుము. దొంగలచేతను పెద్దపులి చేతను రోగాదుల చేతను ఆపదలను పొందిన వాడును, భగవంతుడైన నన్నెరుగుటకు యిచ్ఛయించువాడును, ధనాపేక్షచేత నన్ను సేవించువాడును విష్ణువగు నాయొక్క స్వరూపమును యెరిగిన జ్ఞానియు, యీ నలుగురును నన్ను సేవింపుచుందురు. ఆ నలుగురిలో జ్ఞానియగువాడు శ్రేష్ఠుడు. ఆత్మజ్ఞానికి పరమేశ్వరుడనగు నేను మిక్కిలి ప్రియుడను. తనకు తాను ప్రియుడగుట లోకప్రసిద్ధమేకదా! జ్ఞానియు నాయొక్క స్వరూపుడగుటవలన నాకు మిక్కిలి ప్రియుడు. జ్ఞానియగువాడు నాకంటె అన్యుడు గాడనియు, నేనే ననియు, యిది నా నిశ్చయ మనియు తెలిసికొనుము. ఆ జ్ఞాని నిన్నెరుగుటకు యిచ్ఛయించి యోగమును పొందదలచినవాడై వాసుదేవుడగు భగవంతుడు నేనే ననియు వాసుదేవునికంటె నే నన్యుడగాననియు యిట్లు సమాధి నిష్ఠ చేత పరబ్రహ్మమగు నన్ను పొందుటకు ప్రయత్నింపుచున్నాడు. అర్జునా! జ్ఞానియగువాడు అనేక జన్మములయందు జ్ఞానముకొరకు

యీశ్వరార్పణముగా కర్మములను చేసి చిత్తశుద్ధిని పొంది యోగా భ్యాస సంస్కారమువలన పరిపక్వకాలమందు ఆత్మజ్ఞానము గలవాడై సర్వముగ వాసుదేవుని నన్ను సేవింపుచున్నాడు. నన్ను సేవిం చెడి జ్ఞానితో సమానుడైనను అధికుడైనను మరియొకడు లేడని తెలిసికొనుము: గనుక మహాత్ముడగు జ్ఞాని మిక్కిలి దుర్లభుడగును.

అర్జునా! మూఢులగు జనులు పుత్రపశు స్వర్గాదివిషయము లైన కోరికలచేత వివేకజ్ఞానము లేనివారై ఆత్మయగు వాసుదేవుని కంటె అన్యులైన ఇంద్రాగ్న్యాది దేవతలను సేవింపుచున్నారు. అట్టివారు తమ పూర్వజన్మ సంస్కార రూపమైన ప్రకృతిచేత ఆయా అన్యదేవతలను పూజించుటకొరకు ఆయా నియమములను ఆశ్ర యించి పూజింపుచున్నారు. అర్జునా! యేకోరిక గలవాడు యేయే దేవతాదేహమును శ్రద్ధాభక్తును గలిగి పూజింపుటకు యిచ్ఛ యింపుచున్నాడో ఆ కోరిక గలవానికి ఆయాదేవతల యందుండు శ్రద్ధను నేను స్థిరము చేయుచున్నాను. అర్జునా! అట్టి స్థిరమైన శ్రద్ధగలవాడై కోరిక గలవాడు ఆయా దేవతాదేహమును పూజింపు చున్నాడు. అట్లు పూజించి తన కిష్టమైన ఫలములను పరమేశ్వరుడగు నావలననే పొందుచున్నాడు. అన్యదేవతలను పూజించిన అందరికిని నేనే ఫలముల నిచ్చుచుందును.

అర్జునా! అల్పబుద్ధి గలవారికి నాశముగల విషయభోగ ఫలము కలుగుచున్నది. దేవతలయందు భక్తిగలిగి పూజించినవారలు ఆయా దేవతలను పొందుచున్నారు. పరమేశ్వరుడగు నాయందు భక్తిగలిగి నన్ను సేవించిన వారలు నన్నుపొంది అనంత ఫలమగు మోక్షమును పొందుచున్నారు. జనులు అవివేకులై నన్ను సేవింపక అన్యదేవతలను సేవించి సంసారమందు ప్రవర్తింపుచుందురు. ఆహా! జనుల్ల అవివేక మేమని చెప్పవచ్చును. అర్జునా! నేను నాశములేని

వాడను. మిక్కిలి అధికుడను, మిక్కిలి శ్రేష్ఠుడను, ఇటువంటి నా స్వరూపము నెరుగని మూఢులు అవాఙ్మానస గోచరుడగు నన్ను యింద్రియగోచరునిగా తలంచు చున్నారు. అర్జునా! నేను నా భక్తులగు వారికి కొందరికే కనబడుదునుగాని తక్కిన ప్రాణులకు కనబడను. నేను జన్మము లేనివాడను. ప్రాణులందరును నా మాయా శక్తి వలన మోహింపబడినవారై నన్నెరుగక భ్రమించియున్నారు. అర్జునా! ఇదివరకు గతించిన సకల ప్రాణులను నే నెరిగి యున్నాను. ఇపుడు సృష్టియందుండు సకల ప్రాణులను నే నెరిగి యున్నాను. ఇకముందు పుట్టబోవు సకల ప్రాణులను నే నెరుగుదును. నాభక్తుడొకడు తప్ప మరియొక జంతువేదియు నన్ను నెరుగ నేరదు. అర్జునా! ఇచ్ఛాద్వేషములవలన బుట్టిన శీతోష్ణ సుఖదుఃఖాది రూపమైన జంటలచేత సర్వభూతములును పుట్టుచున్నవి అట్లుపుట్టిన భూతములన్నియు మోహముచేత జ్ఞానములేనివై ఆత్మరూపమగు నన్ను నెరుగక మోహించియున్నవి. అర్జునా! పుణ్యాత్ములగు వారు తమపుణ్యకర్మములచేత పాపములను పోగొట్టుకొని చిత్తశుద్ధి గలవారై శీతోష్ణ సుఖదుఃఖాది ద్వంద్వమోహమును విడిచి దృఢ వ్రతులై పరమాత్మయగు నన్ను సేవింపుచున్నారు. పరమాత్మ స్వరూపమును ప్రత్యక్షముగా నెరుగుటయే దృఢవ్రత మనబడును.

అర్జునా! నన్ను ఆ విధముగా సేవించువారలు నాయందు చిత్తసమాధిగలవారై ప్రయత్నించి ముదిమి చావులను విడుచుటకు యిచ్ఛయింతురు. అట్లు యిచ్ఛయించిన వారలు పరబ్రహ్మమును నెరుగుదురు. పరబ్రహ్మమును నెరిగినవారలు ప్రత్యగాత్మవిషయమైన సర్వవస్తువులను నెరిగినవారగుదురు. అట్టివారు సర్వజ్ఞులని చెప్పబడుదురు. అర్జునా! నేను అధిభూత అధిదైవములతోగూడిన వాడనగుదును. అధియజ్ఞముతో గూడినవాడ నగుదును ఇటువంటి

నన్ను యెవరెరుగుదురో అట్టివారు మరణకాలమందు సమాధిరూప మగు మనోనిగ్రహముగలవారై పరమేశ్వరుడగు నన్ను తెలిసి కొందురు.

ఇది శ్రీకృష్ణార్జున సంవాదరూపమును బ్రహ్మవిద్యా
యోగశాస్త్రమును నగు భగవద్గీతోపనిషత్తు
నందు విజ్ఞానయోగ మను
సప్తమాధ్యాయము

---

## అ ష్ట మా ధ్యా య ము

అని యీరీతిగా భగవంతుఁడైన కృష్ణుడు చెప్పగా అర్జును డిట్లనెను. భగవంతుడా! కృష్ణదేవా! బ్రహ్మమనునది యెటువంటిదో చెప్పుము. అధ్యాత్మమనునది యెటువంటిదో చెప్పుము. అధిభూతమనునది యెటువంటిదో చెప్పుము. అధిదైవమనునది యెటువంటిదో చెప్పుము. ఈ దేహమందు అధియజ్ఞమనగా యెటువంటిదో చెప్పుము. మరణకాలమందు మనోనిగ్రహముగల వారిచేత నీవెట్లు యెరుగబడుదువో అదియును చెప్పుము అని అర్జునుఁ డడుగగా భగవంతుడైన కృష్ణు డిట్లు చెప్పెను.

అర్జునా! నాశములేని పరమాత్మ పరబ్రహ్మమని చెప్పబడును. ఆ పరబ్రహ్మము ప్రతిదేహమందును ప్రత్యగాత్మ రూపముగా నుండుటయే అధ్యాత్మ మనబడును. అనగా దేహము మొదలుకొని ప్రత్యగాత్మ రూపముగా ప్రవర్తించు పరబ్రహ్మాంత పర్యంతము

గల వస్తువు అధ్యాత్మమని తెలియవలయును. అర్జునా! ప్రాణుల యొక్క స్వరూపమునకు పుట్టుకను కలుగ చేయునట్టియు, దేవతల నుద్దేశించి పురోడాశాది పదార్థమునిచ్చి యజాదులను చేయుట కర్మ మనబడును. ఈ యజ్ఞమువలన వర్షముకురిసి వర్షమువలన అన్నము కలిగి అన్నమువలన ప్రాణులు పుట్టునని తెలియవలెను. అర్జునా! నశించెడి దేహము అధిభూతమని చెప్పబడును. ఆదిత్యాంతర్గతుడైన హిరణ్యగర్భుడను పురుషుడు అధిదైవతమని చెప్పబడును. అర్జునా! యీ దేహమందు అధియజ్ఞము నేనేయగుదును. సర్వయజ్ఞాభిమాని యగు విష్ణుదేవుడు నేనే యైనందున యీ దేహమందు అధియజ్ఞము నేనే యగుదును. అర్జునా! మరణకాలమందు విష్ణువగు నన్ను స్మరించుచు దేహమును విడిచివెళ్ళిన జీవుడు నన్ను పొందుచున్నాడు. ఈ విషయమందు సంశయింపకుము. అర్జునా! జీవుడు మరణకాలమందు యేయే దేవతాస్వరూపమును చింతించుచు శరీరము విడుచునో ఆ దేవతాభావమును ఆజీవుడు పొందుచున్నాడు. సర్వదా యేదేవతను భావింపుచున్నాడో ఆదేవతాస్మరణము మరణకాలమందు కలుగుచున్నదని తెలుసుకొనుము. ఈప్రకారము మరణకాలమందుగల స్మృతి మరియొక దేహమును కలిగించుటకు కారణమగుచున్నది. గనుక అర్జునా! నీవు సర్వకాల సర్వావస్థలయందును శాస్త్రవిధి ప్రకారము నన్ను స్మరింపుచుండుము. నన్ను స్మరింపుచు నీ క్షత్రియ ధర్మమైన యుద్ధమును చేయుము. నీ మనోబుద్ధులను రెంటిని వాసుదేవుడనగు నాయందు అర్పించి శాస్త్రవిధిప్రకారము నన్ను స్మరింపుచుండుము. నీవు యేప్రకారముగా నన్ను స్మరించెదవో ఆప్రకారముగా నన్ను పొందగలవు. ఇందుకు సంశయ మేమియు లేదు.

అర్జునా! చిత్తసమాధిరూపమగుఅభ్యాసయోగముతో గూడినట్టి ఇతరవిషయమును పొందక నాయందేయున్నట్టి చిత్తముచేత శాస్త్ర

ఆచార్య వుపదేశ ప్రకారము సూర్యమండల మందున్న దివ్యపురుషుని చింతించుచు మిక్కిలి అతిశయుడైన ఆ దివ్యపురుషుని పొందుచున్నాడు. దివ్యపురుషుడు యెటువంటి వాడంటివేని చెప్పెదను వినుము. అ దివ్యపురుషుడు సర్వజ్ఞుడగును. అనాదిగనుండు వాడగును, సర్వజగత్తును శిక్షించెడివాడగును. అణువుకంటె మిక్కిలి సూక్ష్మరూపుడగును. ప్రాణులయొక్క సకలకర్మములను విచిత్రముగా వారి వారి కర్మఫలములను వారి వారికి పంచిపెట్టువాడగును. సాధారణ రూపమువలె చింతించుటకు సాధ్యముగాని వాడైనను ఒకానొక విధమైన రూపముచేత చింతించుటకు సాధ్యమైనవాడగును. సూర్యునివలె సర్వదా చైతన్య ప్రకాశవర్ణముగల వాడగును. అజ్ఞాన లక్షణమైన మహా మోహాంధకారమునకు అవతలవుండు వాడగును. ఇటువంటి పురుషుని శాస్త్రాచార్య వుపదేశముల ప్రకారము స్మరించుచు దేహమును విడిచిన మనుష్యు డట్టి దివ్యపురుషుని పొందునని తెలియవలయును.

అర్జునా ! మరణకాలమందు భక్తిగూడిన నిశ్చలమనస్సుగలవాడై సమాధి సంస్కారమువలన కలిగిన స్థిరచిత్తరూపమగు యోగబలమును గలిగినవాడు, మొదట, చిత్తమును హృదయ కమలమందు నిలుపవలయును. అట్లు నిలిపి రెండు కనుబొమల మధ్యమందు ప్రాణమును చక్కగా నిలుపవలయును. దివ్యపురుషుని స్మరింపుచు ప్రాణమును విడిచినవాడు దివ్యపురుషుని పొందుచున్నాడు. అర్జునా ! వేదార్థమును యెరిగినవారలు యేస్థానమును నాశములేని దానినిగా చెప్పుచున్నారో అట్టి స్థానమును నీకు సంక్షేపముగా చెప్పెదవినుము. ఆశలేక జితేంద్రియులైన సన్యాసులు, యేనాశములేని స్థానమును పొందుదురో, అట్టిస్థానమును చెప్పెద వినుము. ఏనాశములేని పరబ్రహ్మతత్వము తెలియుటకు అపేక్షించినవారలు బ్రహ్మచర్య

వ్రతమును ఆచరింపుచున్నారో, అట్టి నాశములేని పరబ్రహ్మ స్థాన మును ఉపాసనాయోగముచేత కొంతకాలమునకు పొందెడి ఉపాయ మును సంగ్రహముగా చెప్పెద వినుము.

అర్జునా! యీ స్థూలదేహమందుండు నవద్వారములవలన చేసెడి కార్యములను నిగ్రహించి మనస్సును నిగ్రహించి హృదయ కమలమందు చేర్చి నిశ్చలముగా నుండునట్లు చేయవలయును. అట్లు చేసి తన వశ్యమైన మనస్సుచేత హృదయమునకు పైభాగమందుండు నాడులను పైకెత్తి ప్రాణమును కనుబొమల మధ్యమం దుంచవల యును. అట్లుంచుటయే ధారణాయోగమనబడును. అట్లు ధారణా యోగమును ధరించినవాడు పరబ్రహ్మ వాచకశబ్దమగు ఓం అను అక్షరమును నోటిచేత పలుకుచుండవలయును. ఓంకారమునకు అర్థ రూపమగు పరమేశ్వరుడనైన నన్ను స్మరించుచు దేహమును విడిచి చచ్చిపోయినవాడు శ్రేష్ఠమైనగతిని పొందుచున్నాడు. అర్జునా! ఇతర విషయమందు బుద్ధిలేక జీవించియుండు పర్యంతము సర్వదా నన్ను స్మరించెడి యోగికి నేను సులభముగా లభింతును. అట్లు నన్ను స్మరిం చెడివాడు సర్వదా మనోనిగ్రహముగలిగియుండవలయును. అర్జునా! పరమేశ్వరుడగు నన్ను పొందినవాడు మరల జన్మమును పొందడు. జన్మము శాశ్వతముగానిది, సకల దుఃఖములకు పుట్టిల్లువంటిది. నన్ను పొందినవాడు అట్టిజన్మమును పొందడని తెలియవలెను. అర్జునా! మహాత్ములగు యతులు నన్ను పొందినవారై పునర్జన్మమును పొందక మోక్షమను పరమగతిని పొందిరి. పరమేశ్వరుడగు నన్ను పొందనివారు పునర్జన్మమును పొందుచుందురు. అర్జునా! బ్రహ్మలోక పర్యంతము గల లోకములన్నియు పునర్జన్మమును కలిగించునవి యగును. బ్రహ్మ లోకముకూడా పునర్జన్మమును కలిగించునది యగునని తెలియవల యును. అర్జునా! పరమేశ్వరుడనగు నన్ను పొందినయెడల పున

ర్జన్మము కలుగదు. సకల లోకములును, కాలముచేత పరిచ్ఛిన్నము లగుటవలన ఆ లోకములను పొందినవారు మరల మనుష్యలోకమందు మెప్పటివలె జన్మింతురనియు పరమేశ్వరుడగు విష్ణుదేవునకు కాలముచేత పరిచ్ఛిన్నము లేనందున పరమేశ్వరుని పొందినవారు మరల జన్మమునకు రాక ముక్తులగుదురనియు తెలియవలెను.

అర్జునా ! జ్యోతిష్కులగువారలు వేయి మహాయుగముల పర్యంతముగలకాలము బ్రహ్మదేవునకు ఒక పగలు అగుననియు, వేయి మహాయుగములపర్యంతముగలకాలము బ్రహ్మదేవునకు ఒక రాత్రి యగుననియు నిశ్చయించి యున్నారు. కాలముచేత సర్వలోకములు పరిచ్ఛిన్నము లగుటవలన అట్టిలోకములను పొందినవారలు మరల జన్మింపుచుందురనియు తెలియవలెను. కృతత్రేతాద్వాపరకలి అను నాలుగు యుగములకు చేరి ఒకమహాయుగ మనబడును. ఒక మహాయుగమునకు 432000 సంవత్సరములు. అర్జునా! బ్రహ్మదేవునియొక్క నిద్రావస్థ అవ్యక్తమని చెప్పబడును. బ్రహ్మదేవునకు పగటికాలమువచ్చినపుడు అదివరకు అవ్యక్తమందణగియున్న స్థావర జంగమలక్షణములైన ప్రాణులన్నియును అవ్యక్తమందే లయింపుచున్నవి, అర్జునా ! పూర్వమందు స్థావరజంగమ లక్షణరూపమైన యే ప్రపంచము పుట్టియుండెనో ఆప్రపంచమే బ్రహ్మదేవుని పగటికాలమందు మరల పుట్టుచున్నది. కొంచెమైనను భేదముగా పుట్టదని తెలిసికొనుము. అట్లు పుట్టినప్రపంచమే బ్రహ్మదేవుని రాత్రికాలమందు మరల అవ్యక్తమందు లయించుచున్నది. ప్రపంచ మంతయు స్వాతంత్రములేనిదై పూర్వకల్పమందువలెనే పుట్టుచు లయింపుచున్నదని తెలిసికొనుము. బ్రహ్మదేవుని పగటికాలము కల్పమని చెప్పబడును.

అర్జునా! ప్రపంచముతోచు సృష్టికాలము వ్యక్తమనియు ప్రపంచము లయించిన ప్రళయకాలముఅవ్యక్తమనియు చెప్పబడును.

అర్జునా ! అక్షరమను పరబ్రహ్మము ముందు చెప్పిన వ్యక్తావ్యక్తములను రెంటికంటె అన్యమై విలక్షణమైనదగుచు యింద్రియములకు కనబడకుండును. స్థావరజంగమరూపమగు ప్రపంచమంతయు వ్యక్తమన బడును. ఆ ప్రపంచము పుట్టుటకు కారణరూపమైన అవిద్యాలక్షణము గల ప్రకృతి అవ్యక్తమనబడుచు. ఈ చెప్పబడిన వ్యక్తావ్యక్తములగు ప్రపంచప్రకృతులగు రెంటికంటె ఆపరబ్రహ్మము అన్యమై ప్రకాశింపుచుండునని తెలియవలయును. ఆపరబ్రహ్మము అనాదిగ నుండునది యగును. బ్రహ్మదేవుడు మొదలుకొని వృక్షపర్యంతముగల చరాచరభూతములు నశించినను అపరబ్రహ్మము యెప్పటికిని నశించునది కాదు. అర్జునా ! ఆపరబ్రహ్మమనెడి పురుషుడు యింద్రియములకు కనబడనందున అవ్యక్తుడనియు నాశము లేనందున అక్షరుడనియు చెప్పబడుము. ఆపరబ్రహ్మమే పరమగతియని చెప్పబడును. అర్జునా ! పరబ్రహ్మమును పొందినవారలు, పునర్జన్మమును పొందక యెట్లుందురో, ఆపరబ్రహ్మ పదమే విష్ణువగు నాయొక్క పరమపదమని తెలిసికొనుము.

అర్జునా! పరబ్రహ్మమను ఆపురుషునికంటె పరమమైన వస్తువు కొంచెమైనను లేదు. ఆపరమ పురుషుడు మిక్కిలి శ్రేష్ఠుడగును. ఆ పురుషునిమధ్యమందు బ్రహ్మాండముగా యేర్పరచబడిన ప్రపంచమంతయు నిలిచియున్నది. ఆపరమపురుషునిచేత యీ చరాచర ప్రపంచమంతయు వ్యాపించబడి యున్నది. ఆ పరమపురుషుడు జ్ఞాన లక్షణమగు ఆత్మవిషయమైన భక్తిచేత పొందదగియున్నాడు. ధారణ యోగమును ధరించినవారలకు దేహమును విడువదగిన కాలమును చెప్పుచున్నాడు. అర్జునా ! యేకాలమందు దేహమును విడిచిన యోగులు మరల జన్మించరో, యేకాలమందు దేహమును విడిచిన యోగులు మరల జన్మించెదరో అట్టి కాలములను చెప్పెద వినుము.

అర్జునా ! అగ్న్యభిమాన దేవతయు, జ్యోతిరభిమాన దేవతయు, దినాభిమాన దేవతయు, శుక్ల పక్షాభిమాన దేవతయు, ఉత్తరాయణాభిమాన దేవతయు మార్గమైయుండగా ఆమార్గమందు దేహమును విడిచి వెళ్ళిన బ్రహ్మోపాసకులు క్రమముగా బ్రహ్మమునుపొందుచున్నారు. అనగా బ్రహ్మోపాసకులు ఉత్తరాయణమందు శుక్లపక్షములో పగటికాలమున యోగధారణముచేత జాగ్రత గలిగి మృతులైనయెడల క్రమముగా పరబ్రహ్మమును పొంది పునర్జన్మమును పొందరని తెలియవలెను. అర్జునా! ధూమాభిమాన దేవతయు రాత్ర్యభిమాన దేవతయు కృష్ణపక్షాభిమాన దేవతయు. దక్షిణాయనాభిమాన దేవతయు, మార్గమైయుండగా ఆమార్గమందు దేహమును విడిచి వెళ్ళినయోగి చంద్రలోకసంబంధమైనఇష్టాపూర్తాదిఫలమును పొంది మరల భూమియందు జన్మించును. దక్షిణాయనమునందు కృష్ణపక్షములో రాత్రికాలమున జాగ్రతలేక యోగమును విడిచి మృతిబొందినయోగి పరలోకమునకు బోయి మరల భూలోకమందు జన్మించునని తెలియవలయును.

అర్జునా ! యీప్రకారము జ్ఞానాజ్ఞానరూపములైన శుక్లకృష్ణములను రెండు గతులు గలవు. జ్ఞానకర్మములయందు అధికారులగు వారికి యీరెండును నిత్యగతులైయున్నవి. శుక్లగతిచేత దేహమును విడిచివెళ్ళినవాడు మరల జన్మించడు. కృష్ణగతిచేత దేహమును విడిచి వెళ్ళినవాడు పునర్జన్మమును పొందును. అర్జునా! యీరెండుమార్గములలో శుక్లమార్గము మోక్షమును కలిగించుననియు, కృష్ణమార్గము సంసారమును కలిగించుననియు, నిట్లు యెఱిగిన యోగి యెప్పటికిని మోహమును పొందడు. గనుక అర్జునా! నీవు సర్వకాలములయందును యోగముతో కూడినవాడవగుము. యోగమహాత్మ్యమును చెప్పెద వినుము. అర్జునా ! సప్తప్రశ్ననిర్ణయరూపముగా యీ చెప్పబడినప్రకారము చక్కగా అనుష్ఠించిన యోగి నాసంబంధమైన షర్గ

మపదమును పొందుచున్నాడు. అట్లు పొందినవాడు సకల వేదముల యందు చెప్పబడినట్టియు మంచిగుణముల చేత సకలయజ్ఞములను అను ష్ఠించినట్టియు గొప్పమహాతపస్సులు చేసినట్టియు యీసకల పుణ్యఫల ములను అతిక్రమించి పరబ్రహ్మమును పొందుచున్నాడని తెలియ వలయును.

ఇది శ్రీకృష్ణార్జునసంవాదరూపమును, బ్రహ్మవిద్యాయోగ
శాస్త్రమునునగు శ్రీభగవద్గీతోపనిషత్తునందు అక్షర
పరబ్రహ్మయోగ మను అష్టమాధ్యాయము

---

## న వ మా ధ్యా య ము

భగవంతుడైన శ్రీకృష్ణు డిట్లనెను. అర్జునా! నాయందు అసూయలేని నీకొరకు అతిరహస్యమైన బ్రహ్మజ్ఞానమును చెప్పుచు న్నాను. అనుభవముతో గూడినదియు నేను చెప్పునదియునైన బ్రహ్మ విద్యను నీవు యెరిగితివేని సంసారబంధమునుంచి విడువబడగలవు. అర్జునా! బ్రహ్మవిద్య సకలవిద్యలకంటె అధికముగా ప్రకాశించుచు సకలవిద్యలకు రాజువంటిదై యున్నది. బ్రహ్మవిద్య రహస్యములకు రాజువంటిదైయున్నది, అనగా అతిరహస్యమైనది. అర్జునా! బ్రహ్మ విద్య సకలశుద్ధికరములగు పదార్థములకును పరిశుద్ధినికలుగజేయునది యగును. అనేక జన్మసహస్రములయందుచేసి సంపాదింపబడియున్న పుణ్యాపుణ్యకర్మరాసులను క్షణమాత్రములో ఈబ్రహ్మవిద్యభస్మము

చేయుచున్నది. బ్రహ్మవిద్యకు పరిశుద్ధస్వభావమును చెప్పవలసిన పనిలేదని తెలియవలయును. అర్జునా! సుఖాదులను ప్రత్యక్షముగా పొందినట్లు బ్రహ్మవిద్య ప్రత్యక్షముగా పొందబడుచున్నది. బ్రహ్మ విద్య వైదికధర్మముతో గూడినదగుచు అనాయాసముగా లభించుచు అవ్యయమైన మోక్షఫలమును కలిగించుచున్నది. కనుక యీ ఆత్మ జ్ఞానమందు శ్రద్ధకలిగి అనుష్ఠించవలయును. అర్జునా! యీఆత్మజ్ఞాన మందు దానిఫలమగు మోక్షమందు నాస్తికులగుమూఢులు దేహమే తామనెడి రాక్షసభావమును పొందియున్నారు. పాపాత్ములు పర మాత్మయగు నన్ను పొందజాలక మృత్యువుతోగూడియున్న సంసార మార్గమందు ప్రవర్తింపుచున్నారు.

అర్జునా! ఇంద్రియములకు కనబడని నాపరమస్వరూపముచేత యీప్రపంచమంతయు వ్యాపింపబడియున్నది. ఇంద్రియములకు గోచ రముకాని స్వరూపముగల నాయందు బ్రహ్మాది సర్వభూతములును నివసింపుచున్నవి. బ్రహ్మాదిసకలభూతములకును నేనే ఆత్మ నగుదును. నేను ఆబ్రహ్మాదిభూతములయందుండలేదు. ఆబ్రహ్మాదిస్థావరాంతము గల భూతములును నాయందుండలేదు. ఈశ్వరసంబంధమైన నా యొక్క చాతుర్యమును చూడుము. అర్జునా! నాస్వరూపము ప్రాణు లను భరించుచు ప్రాణులను వృద్ధిబొందించుచున్నను ఆప్రాణులయం దుండలేదు. అర్జునా! ఆకాశమందంతటను సర్వదావ్యాపించియుండు మహావాయువు ఆకాశమును అంటకున్నట్లు సర్వభూతములును నా యందుండి నన్నంటకున్నవని తెలిసికొనుము. అర్జునా! ప్రళయకాల మందు సకలభూతములును త్రిగుణరూపియగు ప్రకృతియను నా మా యను పొందుచున్నవి. ప్రళయకాలమందు నామాయయందు అణ గినభూతములను సృష్టికాలమందు మరల పుట్టింపుచున్నాను. అర్జునా! యీభూతములన్నియు ప్రకృతియందున్నవగుచు స్వాతంత్ర్యమును విడిచి

యుండును. నేను నామాయను వశముచేసికొని సకల భూతములను మాటిమాటికి పుట్టించుచున్నాను. అర్జునా! నేను భూతములను సృష్టించినను, ఆసృష్టిరూపకమైన కర్మములు నన్ను బంధింపజాలవు. నేను ఆకర్మములను వుపేక్షించియున్నాను. ఆకర్మములను నేనే చేసితినను అభిమానము నాకు కలిగియుండలేదు. ఆకర్మఫలములయందాసక్తి లేదు. ఆకారణమున సృష్ట్యాదికర్మములు నన్ను బంధింపజాలవని యెరుగవలయును.

అర్జునా! సర్వదా నేను సాక్షిరూపముగా ప్రవర్తింపుచున్నాను. నాతో గూడియున్న నామాయాశక్తి జంగమస్థావరరూపమైన యీ సకల ప్రపంచమును సృష్టింపుచున్నది. నేను ఆ ప్రపంచమునకు సాక్షిగానుండుటచేత ఆ ప్రపంచమును సకల వ్యవహారములను చేయుచు ప్రవర్తింపుచున్నది. ఇట్లు నేను నిత్యశుద్ధబుద్ధ ముక్తస్వభావములను గలిగి సర్వజ్ఞుడనై సర్వజంతువులకును ఆత్మస్వరూపుడనై యున్నాను. అట్టి పరమేశ్వరుడను నేను యిపుడు మనుష్యదేహముచేత వ్యవహరించుచున్నాను. నాపరమార్థస్వరూపము ఆకాశమువంటిదై ఆకాశముకంటె మిక్కిలి సూక్ష్మమై యుండును. నేను సర్వభూతములను శిక్షించుచుండు మహేశ్వరుడనై యున్నాను ఇటువంటి నా స్వరూపము నెరుగజాలక మూఢులగువారు నన్ను అవమానించుచున్నారు. అర్జునా! అట్టి మూఢులు వ్యర్థములైన ఆశగలవారనియు, వ్యర్థములైన పుణ్యకర్మలుగల వారనియు నిష్ఫలమైన జ్ఞానము కలవారనియు తెలిసికొనుము. భగవంతుని నిందించినవారలు రాక్షస స్వభావము గలవారై క్రూరముగా మాటలాడుచు క్రూరకర్ములగుచున్నారు. అర్జునా! నాయందు భక్తిగలిగి మోక్షమార్గమందు ప్రవర్తించు మహాత్ములు మంచిచిత్తము గలవారై ఇంద్రియ మనోనిగ్రహ శ్రద్ధాది గుణములను కలిగి ఈశ్వరుడగు

నన్ను సేవించుచున్నారు. అట్టి మహాత్ములు నన్ను సకలభూతము లకును నాశములేని కారణవస్తువునుగా యెఱిఁగి ఇతర విషయముల యందు చిత్తము నుంచక నన్ను గొలుచుచున్నారు. ఆ మహాత్ములు సర్వదా పరమేశ్వరుఁడగు నన్ను కీర్తింపుచు, ఇంద్రియములను జయించి అహింసా శాంత దయాదిగుణములచేత నిశ్చలవ్రతము గలిగి నాకు నమస్కరింపుచు హృదయమందుండు నన్ను సర్వదా సేవింపుచుందురు. ఏ ప్రకారము సేవించెదరంటివేని చెప్పెదను వినుము.

అర్జునా! కొందరు మహాత్ములు, యితర దైవోపాసనను విడిచి జ్ఞానమునే భగవద్విషయమైన యజ్ఞముగాదలచి యీశ్వరు డైన నన్ను పూజించుచు జ్ఞానయజ్ఞముచేత నన్నుపాసింపుచున్నారు. మరికొందరు పరబ్రహ్మము ఒక్కటేనని తలచుచు ఆ పరబ్రహ్మ మును చూచుచు ఏక తత్వజ్ఞానముచేత సేవించుచున్నారు. కొందరు ఆ విష్ణుదేవుఁడగు భగవంతుఁడు సూర్యచంద్రాది నానావిధరూపముగా నున్నాడని భిన్నముగా వుపాసింపుచున్నారు. మరికొందరు విష్ణుదేవు డగు భగవంతుఁడు విశ్వరూపముగా నున్నాడని అనేకప్రకారములుగా వుపాసింపుచున్నారు. అర్జునా! శ్రౌత కర్మభేదమగు క్రతువు నేనే యగుదును. సర్వప్రాణులచేతను భక్షింపబడు సాధారణమైన అన్నము నేనే యగుదును. పితృదేవతలకును దేవతలకును యే మం త్రముచేత హవిస్సు యివ్వబడునో ఆ మంత్రము నేనే యగుదును. హవిస్సు నేనే యగుదును. ఏ అగ్నియందు హవిస్సు హోమము చేయబడునో ఆ యగ్నిహోత్రము నేనే యగుదును. హోమము చేయు కర్తను నేనే యగుదును.

అర్జునా! జగత్తునకు తల్లియు నేనే. తండ్రిని నేనే. ప్రాణులకు కర్మఫలము నిచ్చువాడను నేనే. జగత్తునకు తండ్రి తండ్రియైన

పితామహుడను నేనే. తెలియదగిన పరబ్రహ్మ వస్తువు నేనే. పరిశుద్ధవస్తువు నేనే. ఓంకారము నేనే. ఋగ్వేద యజుర్వేద సామ వేదములు నేనే. అర్జునా! కర్మఫలము నేనే. సర్వప్రాణులను పోషించు వాడను నేనే. సర్వప్రాణులకు నేనే ప్రభువును. ప్రాణులు చేయు పుణ్య పాప కర్మములకు నేనే సాక్షిని. ప్రాణులన్నియు దేనియందు నివసింపు చున్నవో అట్టి నివాసస్థానము నేనే యగుదును. దుఃఖితులై నన్ను సేవింపుచు ప్రాణులయొక్క దుఃఖములను పోగొట్టువాడను నేనే సుమా! ప్రత్యుపకారమును కోరక ప్రాణులకు వుపకారము చేయు వాడను నేనే. జగత్తుయొక్క పుట్టుక నేనే యగుదును. జగత్తుయొక్క ప్రళయము నేనే యగుదును. జగత్తుయొక్క స్థితి నేనే యగుదును. ప్రాణులకు మరియొక కాలమందు భోగింపదగిన నిక్షేపము నేనే యగుదును. పుట్టెడివస్తువులకు పుట్టువస్తువులకు నాశము లేని బీజము నేనే యగుదును.

అర్జునా! నేను సూర్యరూపముగనుండి భూమిని తపింప జేయుచు కొన్ని కిరణములచేత నాలుగు మాసములయందు వర్ష మును కురిపించుచున్నాను. మరికొన్ని కిరణములచేత భూమియం దుండు జలమును యెనిమిది మాసముల పర్యంతము తీసికొను చున్నాను. శ్రావణ భాద్రపద మాసములయందు దేవతలకు అమృత మును విడుచుచున్నాను. మనుష్యులకు మృత్యువును యిచ్చు చున్నాను. స్థూలసూక్ష్మరూపములైన కార్యకారణములు నేనే యగు దును. అర్జునా! ఇటువంటి పరమేశ్వరుడగు నన్ను యేకత్వ భిన్న త్వములను ముందు చెప్పిన జ్ఞానయజ్ఞముల చేత యేజనులు పూజిం తురో. అట్టిజనులు జ్ఞానులై తమ తమ జ్ఞానముల ప్రకారము నన్నే పొందుచున్నారు. అర్జునా! కొందరుజనులు, ఋగ్యజుస్సామ వేదము లను చదివియు, జ్ఞానము లేక అగ్నిష్టోమాది యజ్ఞములచేత వస్వాది

దేవరూపియగు నన్ను పూజించి సోమపానముచేత పాపములులేని వారై స్వర్గగతిని గురించి నన్ను ప్రార్థించుచున్నారు. తమపుణ్యా కర్మ ఫలమును పొందుటకై స్వర్గలోకమునకు వెళ్ళి దేవభోగములను అనుభవింపు చున్నారు. తమ పుణ్యాఫలము నశించెడి పర్యంతము స్వర్గలోక భోగములను అనుభవించి తమపుణ్యా ఫలము నశించిన తోడనే మరల యీ మనుష్య లోకమందు పుట్టుచున్నారు. ఈ ప్రకారము జ్ఞానము లేక కేవలవైదికకర్మమునుచేసి ఫలాపేక్ష గల వారు స్వర్గమునకు పోవుచు మరల మనుష్యలోకమునకు వచ్చుచు మరల యజ్ఞాది కర్మములను చేయుచు మరల స్వర్గమునకు వెళ్ళుచు మరల భూలోకమందు పుట్టుచుందురు. స్వాతంత్ర్యమును పొందక యీ ప్రకారము అజ్ఞానులు తిరుగుచుందురు.

అర్జునా! ఇక నిష్కాములైన జ్ఞానుల పద్ధతిని చెప్పెదను వినుము. కోరికలు లేని జ్ఞానులు అన్యవిషయమైన చిత్తము లేనివారై నారాయణ దేవుడగు నేను తమ స్వరూపముగా తలచుకొని సర్వ కాలముల యందును నన్ను ధ్యానింపుచుందురు. అట్లు సర్వదా నన్ను చూచు సన్యాసులకు నేను యోగక్షేమమును విచారించు చున్నాను. అదివరకు పొందని ఆత్మ వస్తువును పొందుట యోగ మనబడును. అట్లు పొందిన యోగమును రక్షించుట క్షేమ మన బడును. అర్జునా! అన్యదేవతలగు యింద్రాగ్ని సూర్యాదులకు భక్తులై శ్రద్ధచేత ఆయా దేవతలను పూజించువారును నన్ను పూజించిన వారే యగుదురు. నేనే ఆయా దేవతా రూపముగ నున్నందున ఆ దేవతలను పూజించినవారు నన్ను పూజించిన వారే యగుదురు. అని తెలిసికొన వలయును. అయినను అట్టిజనులు అజ్ఞాన పూర్వ కముగా నన్ను పూజించి రని తెలియుము. అర్జునా! సర్వ శ్రౌత స్మార్త యజ్ఞములకును నేనే దేవతారూపముచేత భోక్తనుగా ప్రభు

వుడనై యున్నాను. ఇతర దేవతలను పూజించువారు పరమేశ్వరుడగు నన్ను వాస్తవముగా నెరుగజాలక అజ్ఞాన పూర్వకముగా యజ్ఞముచేసి అట్టి యజ్ఞఫలము వలన నన్ను పొందక సంసారమందు ప్రవర్తింపు చున్నారు. అర్జునా! దేవతలయందు నియమభక్తులు గలవారు దేవతలను పొందుచున్నారు. పితృదేవతలయందు భక్తి గలిగి శ్రాద్ధాదిక్రియాపరులగువారు అగ్నిష్వాత్తాది పితృదేవతలను పొందుచున్నారు. భూతములను పూజించువారలు వినాయక మాతృగణ చతుర్భగిన్యాది భూతములను పొందుచున్నారు. విష్ణుదేవుడనైన నాయొక్క భక్తులగు వైష్ణవులు నన్నుపొంది సంసార విముక్తులగుచున్నారు. ఆయాసము సమానమై యున్నను అజ్ఞానముచేత నన్ను పూజింపక అన్యదేవతలను పూజించిన వారలు అల్పఫలమును పొందుదురు.

అర్జునా! ఆకునైనను. పుష్పమునైనను. పండునైనను, జలమునైనను, నాయందు భక్తిగలిగి యిచ్చినయెడల అట్టి స్వల్ప పదార్థము నైనను గ్రహించుచున్నాను. పరిశుద్ధబుద్ధి వలన భక్తి పూర్వకముగా నే పదార్థము నిచ్చినను నేను ప్రీతిపూర్వకముగా గ్రహింతును. అర్జునా! నీవు యేకర్మమును చేసెదవో ఆ ప్రయత్నముగా ప్రాప్తించిన యేయే పదార్థములను భక్షించెదవో శ్రౌతస్మార్త రూపమైన యేహోమమును చేసెదవో బ్రాహ్మణాది జనులకు యేయే దానమును చేసెదవో యేయే తపస్సు చేసెదవో అదియంతయు నాకు సమర్పణము చేయుము. అర్జునా! అట్లు సర్వము నాకు సమర్పించితి వేని సకల పుణ్యపాప కర్మబంధములచేత విడువబడుదువు. ఇది సన్యాస యోగము సన్యాస యోగబుద్ధిగల వాడవైన యెడల జీవించి యుండే బంధవిముక్తుడవై దేహమును విడిచినప్పుడు నన్ను పొంద గలవు. అర్జునా! నేను సర్వభూతములయందును సమానుడనై

యున్నాను. నాకు ఒకడు యిష్టుడనియు మరియొకడు అయిష్టుడనియు యిట్టి స్వభావము లేదు. అగ్నిసమీపమునకు వెళ్ళినవాని యొక్క చలిని అగ్ని స్వాభావికముచేత పోగొట్టినట్లు నాభక్తులను నేను అనుగ్రహింపుచున్నాను. ఏజనులు పరమేశ్వరుడగు నన్ను భక్తిచేత సేవింపుచున్నారో అట్టివారు స్వాభావికముగా నాయందు వర్తింపుచున్నారు. ఇతరులగువారు నాయందు వర్తింపరు. వారియందు నేనును వర్తింపను. ఇంతమాత్రముచేత నాకు రాగద్వేషము లున్నవని చెప్పరాదు. నాభక్తియొక్క మహాత్మ్యమును చెప్పెదవినుము. అర్జునా! అధికదురాచారుడైనను అన్యదేవతలను పూజింపక పరమేశ్వరుడగు నన్ను భక్తి పూర్వకముగా సర్వదా తలచుచు ధ్యానింపుచున్నయెడల అట్టివాడు మంచి ఆచారముగల వాడని తెలిసికొనుము అర్జునా! అట్టి దురాచారుడు ఆత్మ తత్వ విచార రూపమగు నాయందుగల భక్తిచేత తన బాహ్యదురాచారమును విడిచి అతిశీఘ్రముగా ధర్మబుద్ధికలవాడగుచు. సర్వదా శాంతిని పొందును. అర్జునా! విష్ణువగు నాయందు చిత్తమును సమర్పించిన నా భక్తుడు నశింపడని నీవు ప్రతిజ్ఞను చేయవచ్చును.

అర్జునా! పాపజన్మములగల స్త్రీలును వైశ్య శూద్రులును నన్నాశ్రయించి పరమగతిని పొందుచున్నారు. అట్లు పాపజన్మలే పరమగతిని పొందినపుడు పుణ్యాత్ములగు బ్రాహ్మణులును నాభక్తులైన రాజ ఋషులును నన్నాశ్రయించి పరమగతిని పొందుదురని చెప్పవలసిన పనిలేదు. గనుక యీ మనుష్య జన్మము అతిశీఘ్రముగా నశించుచు సుఖము లేకయున్నది. ఇట్టి మనుష్యజన్మమును నీవు యిపుడు పొందియున్నావు. నన్ను భజింపుము. అర్జునా! వాసుదేవుడనగు నాయందు మనస్సునుంచుము. నాయందు భక్తికలవాడవు క్షమాకారముగా షండిశితుఖు నేను ఆరాధ వగుము. ఈశ్వరుడైన

నన్ను గురించియే నమస్కరింపు చుండుము. ఈ ప్రకారము చిత్త సమాధానమును చేసికొని సర్వదా నన్ను చింతించుచు పరమేశ్వరు డగు నన్ను పొందగలవు.

ఇతి శ్రీకృష్ణార్జునసంవాద రూపమును బ్రహ్మవిద్యా
యోగశాస్త్రమును అగు శ్రీ భగవద్గీతో
పనిషత్తునందు రాజవిద్యా రాజగుహ్యా
మను నవమాధ్యాయము

## ద శ మా ధ్యా య ము



భగవంతుడైన కృష్ణు డిట్లనెను. అర్జునా! పరబ్రహ్మవస్తువును ప్రకాశింపజేయు నా వాక్యమును మరల చెప్పెదను వినుము. నా వాక్యములను వినినవాడవై అమృతము త్రాగినట్లు సంతోషింపగలవు. నీకు మేలుకలిగింపదలచి మంచి అమృతతుల్యములైన వాక్యములను చెప్పెదను వినుము. అర్జునా! నా ప్రభుశక్త్యతిశయమును ఇంద్రాది దేవతలైనను భృగువు మొదలగు మహర్షులైనను యెరుగరు. ఇంద్రాది దేవతలకును ఋషులకును నేను కారణుడనై యున్నాను. అర్జునా! నన్ను పుట్టుకలేనివానిగాను ఆదిలేనివానిగాను, సర్వలోకములకు యీశ్వరునిగాను యెవడెరుగునో అట్టివాడు మోహమును విడచి బుద్ధిపూర్వకముగా చేసిన సకలపాపములచేతను విడువబడుచున్నాడు. అర్జునా! సూ[illegible]కారములను యెరుగు సామర్థ్యముగల బుద్ధియు ఆత్మాది [illegible]

యెఱుగదగిన పదార్థములయందు వివేకపూర్వకముగా వర్తించుటయు, పరులచేత బాధింపబడినను, ఓర్పుగలిగి చిత్తవికారము లేక యుండుటయు, శాస్త్రాచార్య అనుభవముల ప్రకారము ఆత్మవస్తువును సత్యముగా పరులకు చెప్పుటయు, బాహ్యేంద్రియములను నిగ్రహించుటయు, మనస్సును నిగ్రహించుటయు. సంతోషించుటయు, దుఃఖముచేత తపించుటయు, పుట్టుటయు, చచ్చుటయు, భయపడుటయు, భయములేకుండుటయు, ప్రాణులను హింసింపకుండుటయు, సమచిత్తము గలిగియుండుటయు, తృప్తిబొందుటయు, తపస్సుచేయుటయు, తన శక్తికొలది దానముచేయుటయు, ధర్మనిమిత్తమువలన కలుగు కీర్తియు అపకీర్తియు యీ చెప్పిన విషయము లన్నియు పరమేశ్వరుడగు నావలన ప్రాణులకు తమ తమ కర్మానురూపముగా కలుగుచున్నవి.

అర్జునా! సృష్ట్యాదియందు భృగువు మొదలగు సప్తమహర్షులును సావర్ణి మొదలగు నలుగురు మనువులును, విష్ణువగు నాయొక్క మనస్సువలన పుట్టిరి. ఆ ఋషులయొక్కయు మనువులయొక్కయు సృష్టివలన పశ్వాది జంగమ స్థావరరూపమైన యీ ప్రపంచమంతయు పుట్టెను, అర్జునా! యీ చెప్పబడిన ప్రకారము నాయొక్క యోగైశ్వర్య సామర్థ్యాదికమును యెవడెరుగునో అట్లు వాస్తవముగా యెరిగినవాడు నిశ్చల సమాధియోగముతో కూడినవాడగును. ఇందుకు సంశయములేదు. అట్టి సమాధియోగముతో గూడినవారు నేనే వాసుదేవుడను పరబ్రహ్మమనియు నేనే సర్వజగత్తునకు కారణుడననియు, నావలననే లోకస్థితినాశాదిక్రియలన్నియు జరుగుచున్నవనియు, యీ జగత్తంతయు నావలననే ప్రవర్తింపుచున్నదనియు. యిట్లు యెరిగి నన్ను సేవింపుచున్నారు. ఈ ప్రకారముగా పండితులు నేను తాముగా తెలుసుకుని భావింపుచు

సేవింపుచున్నారు. అర్జునా! నా భక్తులగువారు పరమేశ్వరుడగు నాయందు చిత్తముగలిగి నాయందే సర్వేంద్రియములనుంచి అన్యోన్యముగా నా స్వరూపమును బోధించుకొనుచు జ్ఞానబలైశ్వర్యాది గుణవంతుడగు నన్ను చెప్పుకొనుచు ఆనందింపుచు ప్రీతిచేత రమింపుచుందురు. ఈ ప్రకారముగా సర్వదా నన్ను ప్రీతిపూర్వకముగా ధ్యానించువారికి నన్ను చూచుటకు తగినజ్ఞానమును నేను యిచ్చుచున్నాను. జ్ఞానయోగముచేత నా భక్తులు పరమేశ్వర స్వరూపుడగు నన్ను ఆత్మస్వరూపముగా యెరిగి పొందుచున్నారు.

సర్వదా నన్ను స్మరించువారలకు నేవిధముగా శ్రేయస్సు కలుగునో అని నేను తలచుచు వారియందు దయగలవాడనై యుందును. వారి మనస్సునందుండి దయగలవాడనై వివేకజ్ఞానమను దీపముచేత అజ్ఞానమువలన పుట్టిన చీకటిని నశింపజేయుచున్నాను. ఈ ప్రకారముగా భగవంతుని విభూతియోగమును అర్జునుడు విని భగవంతుడైన కృష్ణునితో యిట్లనెను. భగవంతుడా! కృష్ణా! దేవా! నీవు పరబ్రహ్మమనియు పరమపదస్వరూపుడవనియు, పరంజ్యోతి స్వరూపుడవనియు, పరిశుద్ధ రూపుడవనియు, మిక్కిలి శ్రేష్ఠుడవనియు, పరమపురుషుడవనియు, శాశ్వతుడవనియు, దివ్యపురుషుడవనియు, సర్వదేవతలకు ఆదిదేవుడవనియు, పుట్టుకలేనివాడవనియు, శాశ్వతుడవనియు, వసిష్ఠాది మహర్షులు చెప్పుదురు. దేవఋషియగు నారదుడును, అసితుడును, దేవలుడును వ్యాసుడును ఈప్రకారముగా నిన్ను గురించి చెప్పియున్నారు. నీవు ఈప్రకారముగా యిపుడు నాకు చెప్పియున్నావు గాన నీవిపుడు నీ విషయమై చెప్పిన దంతయు నిశ్చయమని తలచుచున్నాను. నీయొక్క జ్ఞాన బలైశ్వర్యాదిస్వభావమును దేవ రాక్షసులలో యెవరును యెరుగరు.

కృష్ణదేవా ! పరమేశ్వరుడవగు నిన్ను నీవే యెరుగుదువుగాని నిన్ను యితరులు యెరుగజాలరు. నీవు నీయొక్క యేయే విభూతి విస్తారములచేత యీ లోకములయందు వ్యాపించియున్నావో ఆయా నీ దివ్యవిభూతులను నిశ్శేషముగా చెప్పుము. కృష్ణదేవా ! నీవు యేయే పదార్థములయందు నాచేత ధ్యానింపదగుదువో ఆయా పదార్థములను చెప్పుము. నిన్ను నేను సర్వదా చింతించుచు యెట్లు యెరుగగలనో అదియును చెప్పుము. కృష్ణదేవా! పరమేశ్వరుడగు నీయొక్క యోగైశ్వర్య శక్తివిశేషమునున్ను విభూతినిన్ని నిన్ను ధ్యానింపదగిన పదార్థములయొక్క విస్తారమునున్ను చక్కగా చెప్పుము. ఈ విషయములను యిదివరకు చెప్పియున్నావు. అయినను మరల చెప్పుము. నీ ముఖమునుండి వెలువడిన వాక్యామృతములు వినుటకంటె నాకు వేరొక దానివలన తృప్తి కలుగ నేరదు. అని అర్జును డడుగగా విష్ణుదేవుడగు శ్రీకృష్ణదేవు డిట్లనెను.

అర్జునా ! ఇపుడు నీకు నాయొక్క దివ్యవిభూతులను చెప్పెద వినుము. నాయొక్క విభూతులకు పరిమితిలేదు. గనుక నాయొక్క ముఖ్యవిభూతి యెక్కడెక్కడ నున్నదో. ఆయా ముఖ్యవిభూతులను చెప్పెద వినుము. నావిభూతు లన్నిటిని చెప్పుటకు సాధ్యముకాదు. అర్జునా ! నా విభూతులలో మొదటివిభూతిని వినుము. నేను ప్రత్యగాత్మరూపముగా సర్వజంతువులయొక్క మనస్సునందున్నాను. ప్రత్యగాత్మరూపుడనగు నన్ను సర్వదా ధ్యానింపుచుండవలయును. అట్లు ధ్యానించుటకు శక్తిలేనియెడల ఇకను చెప్పబోయెడి విభూతులయందు నన్ను ధ్యానింపుచుండవలయును. నేను ప్రత్యగాత్మరూపముచేత సకలభూతములకు ఉత్పత్తిస్థితిసంహార కారణుడనై యున్నాను. సర్వభూతముల బుద్ధియందుండు ప్రత్యగాత్మయైన నన్ను ధ్యానింపవలయును. అర్జునా ! పన్నెండుమందియగు సూర్యులలో విష్ణువను

సూర్యుడు నేనగుదును. ప్రకాశవస్తువులలో కారణవంతుడైన సూర్యుడు నేనగుదును. మరుద్దేవతా భేదములలో మరీచియను దేవతను నేనేయగుదును. నక్షత్రములలో చంద్రుడు నేనేయగుదును.

అర్జునా! నాలుగు వేదములలో సామవేదము నేనేయగుదును. రుద్రాది దేవతలలో దేవేంద్రుడు నేనే. పదునొకండు యింద్రియములలో మనస్సు నేనే. కార్య కారణములను భూతములలో బుద్ధివృత్తియగు చేతనము నేనే అర్జునా! పదునొకండు రుద్రులలో శంకరుడను రుద్రుడు నేనే. యక్షరాక్షసులలో కుబేరుండను నేనే. ఎనిమిదిమంది వసువులలో అగ్నిదేవుడను వసువు నేనే. శిఖరములుగల పర్వతములలో మేరుపర్వతము నేనే. రాజపురోహితులలో దేవేంద్రుని పురోహితుడగు బృహస్పతి నేనే. సేనాపతులలో దేవసేనాపతియగు కుమారస్వామి నేనే. దేవతలచేత త్రవ్వబడిన యే సరస్సులు గలవో ఆ సరస్సులలో సముద్రము నేనే. అర్జునా! మహర్షులలో భృగువను ఋషి నేనే. వాక్కులలో ఓంకారము నేనే. యజ్ఞములలో జపయజ్ఞము నేనే. స్థావరములలో హిమాలయ పర్వతము నేనే. అర్జునా! సర్వవృక్షములలో రావిచెట్టు నేనేయగుదును. దేవఋషులలో నారదుడు నేనేయగుదును. గంధర్వులలో చిత్రరథుడను పేరుగల గంధర్వుడు నేనేయగుదును. సిద్ధులలో కపిలముని నేనే (పుట్టుకతోడనే ధర్మజ్ఞాన వైరాగ్యాతిశయమును పొందినవాడు సిద్ధుడు.) అర్జునా! గుఱ్ఱములలో ఉచ్చైశ్రవమను పేరుగల దేవేంద్రుని గుఱ్ఱము నేనే. (ఈ గుఱ్ఱము అమృతమునుండి పుట్టినది.) ఏనుగులలో సముద్రమునందు పుట్టిన ఐరావతమను పేరుగల దేవేంద్రుని యేనుగు నేనే. మనుష్యులలో ప్రజాపాలనముచేయు రాజు నేనే.

అర్జునా! ఆయుధములలో దేవేంద్రుడు ధరించిన వజ్రాయుధము నేనే. ఈవజ్రాయుధము దధీచియను మునియొక్క యెముక

వలన పుట్టినది. అర్జునా! గోవులలో వసిష్ఠుని కామధేనువు నేనే. ప్రజలను పుట్టించు సన్మథుడు నేను, సర్పభేదములలో వాసుకి యను సర్పరాజు నేను. అర్జునా! నాగములలో అనంతుడను పేరుగలవాడను నేనే, నీటిదేవతలలో వరుణదేవుడు నేనే. పితృదేవతలలో అర్యమ అనుపేరుగల పితృదేవత నేనే. శిక్షించువారిలో యమధర్మరాజు నేనే. అర్జునా! దితివంశస్థులగు రాక్షసులలో ప్రహ్లాదుడను రాక్షసుడు నేనే. లెక్కపెట్టువారిలో కాలము నేనే. మృగములలో సింహము నేనే. పక్షులలో వినతకుమారుడగు గరుత్మంతుడు నేనే. అర్జునా! పరిశుద్ధము కలిగించువస్తువులలో వాయువు నేనే. ఆయుధములు ధరించినవారిలో దశరథునికుమారుడగు శ్రీరాముడు నేనే. చేపలలో మకర మను జాతివిశేషముగల చేప నేనే యగుదును. నదులలో భాగీరథియను గంగానది నేనే. అర్జునా! సృష్టులలో ఉత్పత్తిస్థితిలయములను మూడును నేనే. విద్యలలో మోక్షమును కలిగించు బ్రహ్మవిద్య నేనే. వాదించువారిలో అర్థనిర్ణయకారణమగు తర్కము నేను.

అర్జునా! ఏబదియక్షరములలో అకారమను అక్షరము నేను. సమాసములలో ద్వంద్వసమాసము నేను. అక్షయమైన కాలము నేను. సర్వజగత్తునకును కర్మఫలమును నిర్మించువాడగు బ్రహ్మదేవుడు నేను. అర్జునా! సర్వమును సంహరించు మృత్యువు నేనగుదును. ఇకమీద రాబోవు శుభములను అనుభవించుటకు యోగ్యులగువారియొక్క అభివృద్ధిని ప్రాప్తిహేతువు నేనే యగుదును. శ్రేష్ఠులగు స్త్రీల యొక్క కీర్తియు, లక్ష్మియు, వాక్కు, బుద్ధి, తెలివి, ధైర్యము, ఓర్పు, నేనే. అర్జునా! సామములలో బృహత్సామము నేనే. ఛందోవిశిష్టములైన ఋక్కులలో గాయత్రియనుఋక్కు నేనే. మాసములలో మార్గశీర్షము నేను. ఋతువులలో వసంతఋతువు నేను. అర్జునా! వంచనచేయువారి యొక్క జూదము నేనే. తేజోవంతుల యొక్క తేజస్సు నేనే. జయమును పొందినవారియొక్క జయమును

నేనే. ఉద్యోగముచేయు వారియొక్క ఉద్యోగము నేనే. సాత్వికుల యొక్క సత్వగుణము నేనే. అర్జునా! వృష్ణివంశ స్థులలో వసుదేవుని కొడుకైన నీస్నేహితుడైన యీకృష్ణుడను నేనే యగుదును. పాండవులలో అర్జునుడైన నీవు కూడ నేనే యగుదువు. సర్వపదార్థ జ్ఞానముగల మనుష్యులలో వేదవ్యాసముని నేనే యగుదును. కవులలో భార్గవుడనుకవి నేనే యగుదును. అర్జునా! దండించువారలయొక్క దండకారణము నేనే. జయించుటకు కోరికగలవారియొక్క జయోపాయరూపమైన నీతి నేనే. జ్ఞానము కలవారియొక్క జ్ఞానము నేనే. అర్జునా! సర్వభూతములును పుట్టుటకు కారణమైన బీజము నేను. నాతో సంబంధములేని పదార్థములేదు. నాతో కూడనిది శూన్యమే గనుక సర్వము నాస్వరూపమని తెలుసుకొనుము. అర్జునా! నాదివ్య విభూతులకు అంతములేదు. ఇప్పుడు ఉద్దేశించి కొన్ని విభూతులను మాత్రము సంక్షేపముగా జెప్పితిని. సర్వాత్మస్వరూపుడగునాయొక్క దివ్యవిభూతులను చెప్పుటకైనను యెరుగుటకైనను యెవ్వరికిని సాధ్యముకాదు. అర్జునా! లోకమునందు ఐశ్వర్యముతో గూడిన వస్తు వెద్దియుండునో అదియు, కాంతితో గూడినవస్తువు, ఉత్సాహముతో గూడినవస్తువు. అట్టివస్తువు లన్నియు యీశ్వరుడగు నాయొక్క ఏక ప్రదేశమందు పుట్టినవని తెలిసికొనుము. అర్జునా! మరియొకపక్షము గా యీ చెప్పబోవు ముఖ్యమైన మాట వినుము. నీకు విశేషముగా చెప్పుటవలన ప్రయోజనములేదు. ఈచరాచర సకలజగత్తును నేను విశేషముగా వ్యాపించే ఒక్కఅవయవరూపముచేత సర్వభూతస్వరూ పముగా నున్నాను.

ఇది శ్రీకృష్ణార్జున సంవాదరూపమును బ్రహ్మవిద్యా
యోగశాస్త్రమును అగు శ్రీ భగవద్గీతోప
నిషత్తునందు విభూతియోగ మను
దశమాధ్యాయము

# ఏకాదశాధ్యాయము

భగవంతుడైన కృష్ణుడు యీరీతిగా చెప్పుచుండగా అర్జునుడు విని ఆభగవంతునియొక్క విశ్వరూపమును సాక్షాత్కారముచేసికొన దలచి భగవంతునితో యిట్లనెను. భగవంతుడా! కృష్ణదేవా! నీవు నాయందు అనుగ్రహము గలవాడవై మిక్కిలి అతిశయమైనట్టియు రహస్యమైనట్టియు ఆత్మానాత్మవివేకవిషయమైన వాక్యమును చెప్పితివి. ఆవాక్యముచేత నాఅవివేకబుద్ధి నశించినది. కృష్ణా! నీవు సకల భూతములకును ఉత్పత్తిప్రళయములను కల్పించెడివాడవని నీవలననే విశేషముగా వినియున్నాను. నీయొక్కమాహాత్మ్యమున్ను విశేషముగా వింటిని. నీస్వరూపమును నీవెట్లు చెప్పితివో అదియు నాప్రకారము గానే యుండును. అన్యవిధముగా నుండనేరదు. జ్ఞానైశ్వర్యబలశక్తి వీర్య తేజస్సులతో గూడిన యీశ్వరరూపమగు వైష్ణవస్వరూపమును చూచుటకు యిచ్ఛయించుచున్నాను. యోగీశ్వరుడవగు కృష్ణదేవా! నీవిశ్వరూపమును చూచుటకు నేను మిక్కిలి అపేక్షించుచున్నాను. నీ విశ్వరూపమును నేను జూచుటకు యోగ్యుడనని నీకు తోచినయెడల నీయీశ్వరరూపమును నాకు చూపుము. అని అర్జునుడడుగగా కృష్ణుడైన భగవంతుడు యిట్లనెను.

అర్జునా! నావిశ్వరూపమును చూడుము. అనేకములుగాను వేలపరిమితిగానున్న నారూపములను చూడుము. నారూపములన్నియు ననేకవిధములుగా నున్నవి. దివ్యరూపములైయున్నవి. నారూపములన్నియు నలుపు పసుపు యెరుపు మొదలగు వర్ణములు అవయవములయందు కలిగి అనేకవిధములుగా నున్నవి. మరియు అర్జునా! నాయందుండు పన్నెండుమంది సూర్యులను చూడుము. యెనిమిదిమంది వసువులను చూడుము. ఏకాదశరుద్రులను చూడుము. ఇద్దరు అశ్వినీ

దేవతలను చూడుము. ఏడుగుంపులుగా నున్న మరుద్దేవతలను చూడుము. మనుష్యలోకమునందు యిదివరకు చూడని అనేక దేవతలను ఆశ్చర్యములను నాయందు చూడుము. అర్జునా! ఇంతమాత్రమే కాదు. నా దేహమందు యిక్కడ ఒక యవయవమందున్న జంగమ స్థావరరూపమగు సకలచరాచరప్రపంచమంతయును చూడుము. నీకు యుద్ధమందు జయవిషయమైన సందేహము కలిగి యున్నది కదా! ఆవిషయమును చూడదలంచితివేని నా దేహమందు చూచి యుద్ధవిజయము నిశ్చయముచేసికొని సందేహమును విడువుము. అర్జునా! విశ్వరూపమును ధరించిన పరమేశ్వరుడగు నన్ను యీ మనుష్యుని నేత్రములచేత చూడజాలవుగనుక నీకు దివ్యనేత్రమును యిచ్చుచున్నాను. అట్టి దివ్యనేత్రముచేత యీశ్వరసంబంధమైన నా స్వరూపముతో కూడిన యోగయుక్తమైన ఐశ్వర్యమును చూడుము అని భగవంతుడైన కృష్ణుడు అర్జునునితో చెప్పినట్లు సంజయుడు ధృతరాష్ట్రునితో చెప్పెను.

ధృతరాష్ట్ర మహారాజా! ఈప్రకారము శ్రీమన్నారాయణమూర్తియగు కృష్ణుడు అర్జునునితో చెప్పి అర్జునునకు దివ్యనేత్రము నిచ్చి తన విశ్వరూపమును అర్జునునకు చూపించెను. ధృతరాష్ట్ర మహారాజా! ఆవిశ్వరూపము అనేక ముఖములను నేత్రములనుకలిగి యుండెను. అనేక ఆశ్చర్యములు కలిగించెను. అనేక దివ్యాభరణములను కలిగియుండెను. అనేకములగు కత్తులు మొదలైన ఆయుధములను ధరించియుండెను. ఇట్టి విశ్వరూపమును భగవంతుడైన కృష్ణుడు అర్జునునకు చూపించెను. ధృతరాష్ట్ర మహారాజా! ఆవిశ్వరూపము అనేక దివ్యపుష్పమాలలను దివ్యవస్త్రములను ధరించి యుండెను. దివ్యగంధముచేత పూయబడియుండెను. ఆవిశ్వరూపము సర్వాశ్చర్యమయముగాను, అంతము లేనిదిగాను, అంతటను ముఖములుగలదిగాను యుండెను.

ఇటువంటి విశ్వరూపమును అర్జునుడు చూచెను. ధృతరాష్ట్ర మహా రాజా! ఆకాశమందు వేయిసూర్యులు ఒక్కసారే ప్రకాశించుచున్న యెడల యెంతప్రకాశము కలిగియుండునో అంత ప్రకాశము ఆవిశ్వ రూపుడగు విష్ణుదేవునకు గలిగియుండెను. వేయి సూర్యులప్రకాశము కంటె ఆవిశ్వరూపదేవునకు అధికప్రకాశము కలిగియున్నదని చెప్ప వచ్చును. ధృతరాష్ట్రమహారాజా! విశ్వరూపమందు ఒకచోట దేవ మనుష్యాదిభేదములచేత నానావిధములుగా నున్న చరాచర సకల ప్రపంచమును అర్జునుడు చూచెను. అర్జునుడు ఆశ్చర్యముగిలవాడై గగ్గుర్పాటుగల వెండ్రుకలు గలిగి విశ్వరూపధరుడగు విష్ణుదేవునకు వంగి నమస్కరించి చేతులు జోడించుకొని ఆవిశ్వరూపదేవునితో యిట్లనెను.

శ్రీకృష్ణదేవా! నీవిశ్వరూపదేహమందు సకలదేవతలను చూచు చున్నాను. నీదేహమందు జంగమస్థావరరూపముచేత నానావిధములు గానున్న సకలభూతములగు గుంపులను చూచుచున్నాను. నీవిశ్వ రూపమందు సకలప్రాణులకు ప్రభువైనబ్రహ్మదేవుని చూచుచున్నాను. వసిష్ఠాదిఋషులను చూచుచున్నాను. విశ్వరూపుడగు కృష్ణదేవా! నీవిశ్వరూపము అనేకవిధములగు చేతులను, అనేకగర్భములను, అనే కములగు నోరులను, అనేక నేత్రములను కలిగియున్నది. అంతము లేని అనేకరూపములను కలిగియున్నది. నీవిశ్వరూపమునకు కొనకన బడలేదు. మధ్యప్రదేశము కనబడలేదు. మొదలు కనబడలేదు. ఇటు వంటి నీవిశ్వరూపమును చూచుచున్నాను. విశ్వరూపదేవుడగుకృష్ణా! నీవిశ్వరూపమందు కిరీటవంతుడవై గదను ధరించినవాడవగుచు చక్ర మను ఆయుధమును ధరించి తేజోరాశివలె అంతటను దేదీప్యమాన ముగా ప్రకాశించుచున్నావు. చూచుటకు సాధ్యపడక యున్నావు. మిక్కిలి ప్రకాశించుచుండు అగ్నిహోత్ర సూర్యులవంటి కాంతిగలిగి

ప్రకాశించుచున్నావు. ఇంతమాత్రపు పరిమితిగలవాడవని నిశ్చయిం చుటకు సాధ్యముగాకయున్నావు. ఇటువంటి నీవిశ్వరూపమునుచూచు చున్నాను. ఇట్టి నీవిశ్వరూపమును చూచుటచేత నాకుయిపుడుతోచు చున్నవిషయమును చెప్పెదను వినుము.

పరమేశ్వరా! కృష్ణా! మోక్షమును కోరువారిచేత పొంద దగిన నాశములేని పరబ్రహ్మము నీవే యగుదువు. ఈసకల ప్రపంచ మునకు ముఖ్యాధారుడవు నీవే యగుదువు. నీవే యెప్పటికిని నాశము లేనివాడవగుదువు. నిత్యధర్మమును రక్షించువాడ వగుదువు. నీవే ఆది పురుషుడవు. ఇట్లని నిన్ను నేను తలచుచున్నాను. విశ్వరూప దేవా! నీవు ఆది మధ్యాంతములను కాలము లేనివాడవు. అంతము లేని వీర్యముగలవాడవు. అంతములేని చేతులు గలిగి యున్నావు. సూర్యచంద్రులే నేత్రములై యున్నావు. మిక్కిలి ప్రకాశించు అగ్ని నోరుగా గలిగియున్నావు. నీ తేజస్సుచేత యీసకల ప్రపంచమును తపింపజేయుచున్నావు. ఇట్టి నీవిశ్వరూపమును చూచుచున్నాను. విశ్వరూప దేవా! భూమ్యాకాశములకు నడుమనుండు ఆకాశమంతయు విశ్వరూపమును ధరించిన నీవొక్కనిచేతనే వ్యాపింప బడియున్నది. నీ వొక్కనిచేతనే సకల దిక్కులును వ్యాపించబడి యున్నవి. ఈ విశ్వరూపమును మూడులోకములు చూచి ఆశ్చర్య భయమును పొందుచున్నవి. ఉగ్రమైన నీ విశ్వరూపము లోకములకు ఆశ్చర్య భయములను కలిగించుచున్నది. అని అర్జునుడు విశ్వరూపుడగు భగవంతునిచూచి చెప్పెను. భగవంతుడైన విశ్వరూపుడు భారత యుద్ధమందు పాండవులకు కలుగబోవు విజయమును అర్జునునకు రహస్యముగాజెప్పి తన విశ్వరూపమందు చూపెను. అర్జునుడు అట్లు చూచి మరల విశ్వరూపదేవునితో యిట్లనెను.

విశ్వరూపదేవా! భూమియొక్క భారమును పోగొట్టుటకై వసువులు మొదలగు దేవతలు భీష్మ ద్రోణ కర్ణాది మనుష్యరూపములుగ భూమియందు అవతరించి భారతయుద్ధము చేయదలచిన వారందరును యుద్ధమందుచచ్చి నీ దేహమందు ప్రవేశించుచు కనబడుచున్నారు. వారిలోకొందరు భయపడినవారై చేతులుజోడించుకొని నిన్ను స్తుతింపుచున్నారు. యుద్ధముచేయబూని సర్వసిద్ధముగా వచ్చినపు డుత్పాతాది దుర్నిమిత్తములు కలుగగా ఆ దుర్నిమిత్తములను చూచి కొందరు పరుగెత్తిపోవుటకు శక్తిలేనివారై నిన్ను స్తుతింపుచున్నారు, ఉత్పాతాది దుర్నిమిత్తములు పుట్టగా మహర్షులును, సిద్ధుల గుంపులును, జగత్తునకు మేలుకలుగవలెనని. సంపూర్ణస్తుతి వాక్యములచేత నిన్ను స్తుతింపుచున్నారు. విశ్వరూపుడగు విష్ణుదేవా! కృష్ణా! రుద్రులును, దేవతలును, వసువులును, విశ్వేదేవతలును, ఇద్దరు అశ్వనీదేవతలును, మరుద్దేవతలును, పితృదేవతలును, హాహాహూహూ మొదలగు గంధర్వులును కుబేరుడు మొదలగు యక్షులును విరోచనుడు మొదలగు రాక్షసులును కపిలాది సిద్ధులును ఈ చెప్పబడిన వారిగుంపులు విశ్వరూపుడవగు నిన్ను జూచుచు అందరును ఆశ్చర్యమును పొందుచున్నారు,

విశ్వరూపుడగు విష్ణుదేవా! నీ విశ్వరూపము యింతపరిమితి గలదియని నిశ్చయించుటకు శక్యముగాక మిక్కిలి గొప్పదియై యున్నది. నీ విశ్వరూపము అనేకములగు నోరులను ముఖములను, నేత్రములును, కలిగియున్నది. అనేకములగు తొడలును, చేతులను, పాదములను కలిగియున్నది. అనేకములగు గర్భములను కలిగియున్నది. నీ విశ్వరూపము అనేక కోరలచేత వికారమును పొందియున్నది. ఇటువంటి యుగ్రరూపమును చూచి సకలప్రాణులును నేనును భయముచేత వడకుచున్నాము. నీ విశ్వరూపమందు భయం

కరములైన నానా విధ వర్ణములు గలిగియున్నవి. నీ విశ్వరూపము ఆకాశమును అంటియున్నది. మిక్కిలి ప్రజ్వలింపుచున్నది. వ్యాపించి యుండు ముఖములను కలిగియున్నది. ప్రజ్వలింపుచుండు విశాల నేత్రములను కలిగియున్నది. ఇటువంటి నిన్ను జూచి నా మనస్సు మిక్కిలి అధిక భయమును పొందుచున్నది. నాకు ధైర్యము కలిగి యుండ లేదు. సంతోషమును కలిగి యున్నవాడను కాను నీ విశ్వరూపము యొక్క ముఖములు కోరలచేత వికారములు గలవై ప్రళయకాలమందు లోకములను దహించు అగ్నిహోత్రుని వలె నున్నవి. నేను తూర్పు పడమరలను రెండు దిక్కులను యెరుగ జాలక మూఢుడనైతిని. అందువలన నామనస్సునకు సంతోషము కలిగియుండ లేదు. నాయందు దయగలిగి యుండుము. నాకు యుద్ధమందు అపజయము కలుగునను సంశయము యిపుడు నివర్తిల్లి నది, ఎట్లనగా చెప్పెదను వినుము.

దుర్యోధనాదులందరును సకల రాజ సమూహములతో అతి వేగముగా నీ నోరులయందు ప్రవేశింపుచున్నారు. భీష్ముడును, ద్రోణుడును కర్ణుడును నా సైన్యమందుండు ధృష్టద్యుమ్నుడు మొదలగు యోధులతో గూడిన వారై నీ నోరులయందు ప్రవేశింపుచున్నారు. నీ నోరులు కోరలచేత వికారము గలవై భయంకరములై యున్నవి. నీ నోరులయందు భీష్మ ద్రోణ కర్ణాది రథికులందరును త్వరితగమనము గలవారై ప్రవేశింపుచున్నారు. అట్లు ప్రవేశించిన వారిలో కొందరు నీ పళ్ళయందు గ్రుచ్చుకొని భక్షింప బడు మాంసమువలె కనబడుచున్నారు. అట్లు నీ నోరులయందు ప్రవేశించు వారందరును శిరస్సులు చూర్ణములుగా చేయబడుచున్నారు.

విశ్వరూపుడవగు విష్ణుదేవా! కృష్ణా! నదులయందు ప్రవహించు నీటి ప్రవాహములు అతిశీఘ్రముగా సముద్రమందు ప్రవే

శించినట్లు యీ భీష్మ ద్రోణాది యుద్ధశూరులును అతిశీఘ్రముగా ప్రవేశింపుచున్నారు. మిడుతలు తమ తమ నాశనముకొరకు అధిక-వేగముతో మండుచున్న అగ్నియందు పడునట్లు ప్రాణులందరును అతివేగము గలవారై నీనోరులయందు తమ నాశము కొఱకు ప్రవేశింపుచున్నారు. నీవును ప్రకాశించు ముఖములచేతను ఆ ముఖము యొక్క తేజస్సులచేతను సకల జగత్తును వ్యాపించి లోపల ప్రవేశించినవాఁడవై సకల ప్రాణులను మ్రింగదలంచి భక్షింపుచున్నావు. నీయొక్క క్రూరములైన కాంతులు ప్రాణులకు దుఃఖమును కలిగింపు చున్నవి. నీవు వుగ్ర స్వభావుడవై కనబడుచున్నావు. విశ్వరూపుడగు దేవా! కృష్ణా! నీకునమస్కరింపు చున్నాను. ఉగ్రాకారుడవగు నీ వెవడవో నాకు చెప్పుము. నాయందు దయగలవాడవు గమ్ము. నిన్ను యెరుగుటకు నేనుఅపేక్షింపు చున్నాను. నీవు ఇక్కడ యేకార్యమును చేయుటకై ప్రవర్తింపు చున్నావో యెరుగజాలను అని యిట్లు అర్జునుడు చెప్పగా విశ్వరూపుడగు భగవంతుడు యిట్లనెను.

అర్జునా! లోకములకు నాశనము కలిగించు ప్రబలమైన కాలమగుదును. ఈ లోకమందు యీ కాలమున ప్రాణులను చంపుటకు యిక్కడికి ప్రవర్తింపు చున్నాను. నీవొకడవు తప్ప భీష్మ ద్రోణ కర్ణులు మొదలగు వారందరును చచ్చెదరు. నీశత్రు పక్షమందు యుద్ధముచేయదలచి వచ్చియుండు భీష్మ ద్రోణ కర్ణాదులందరును నశించెదరు. నీకు వారివలన అపజయము కలుగునను శంక విడువుము అర్జునా! భీష్మ ద్రోణాదులు అతిరథులనియు దేవతలైన వారిని గెలువజాలరనియులోకప్రసిద్ధి గలిగియున్నారు. భీష్మాదులు అర్జునునిచేత గెలువబడి రను కీర్తినిపొందుము. యుద్ధమునకు లెమ్ము. అట్టి విజయ రూపమగు కీర్తిని కేవల పుణ్యాత్ములు పొందు

దురు. దుర్యోధనుడు మొదలగు శత్రువులను జయించి నిష్కంటక మైన రాజ్యసంపదను అనుభవింపుము. నీశత్రు పక్షమందున్న వారం దరును నాచేత పూర్వమే ప్రాణములను గోల్పోయియున్నారు. అట్టి భీష్మ ద్రోణాదులను చంపుటకు నీవు నిమిత్త మాత్రుడవు గమ్ము.

అర్జునా ! ద్రోణుడును, భీష్ముడును, సైంధవుడును కర్ణుడును తక్కిన యుద్ధవీరు లందరును నీవు చంపకమునుపే నావలననే చచ్చి యున్నారు. నీవు నిమిత్తమాత్రుడవై నావలన చంపబడిన వారిని గెలువుము. ఆ భీష్మ ద్రోణాదుల వలన భయమును విడువుము. యుద్ధమును చేయుము. యుద్ధమందు నీ శత్రువులైన దుర్యోధనాదు లను గెలిచిన వాడవుగమ్ము. అని విశ్వరూపుడగు కృష్ణుడు అర్జును నితో చెప్పెనని సంజయుడు ధృతరాష్ట్రునితో చెప్పెను.

ధృతరాష్ట్రమహారాజా ! యీ ప్రకారము విశ్వరూప ధరు డగు కృష్ణుడు చెప్పగా ఆమాటలను అర్జునుడు విని వడకుచు చేతులు జోడించుకొని నమస్కరించి గద్గదకంఠ ధ్వనితో తిన్నగా కృష్ణునిజూచి యిట్లనెను. విశ్వరూపుడవగు దేవా ! కృష్ణా ! నీ మహాత్మ్యమును కీర్తించుట చేతను, వినుటచేతను, జగత్తు సంతో షించుట యుక్తము. నీ మహాత్మ్యమును జగత్తువిని నీయందు అను రాగము గలుగుట యుక్తము. నీ మహాత్మ్యమును రాక్షసులు విని భయముగలవారై దిక్కులను గూర్చి పరుగెత్తుటయు నిన్ను గురించి కపిలాది సిద్ధులు నమస్కరించుటయు యిదియంతయు యుక్తమే యగును.

విశ్వరూపుడవగు పరమేశ్వరా ! కృష్ణా ! శ్రేష్ఠుడవైన బ్రహ్మ దేవునకును నీవు ఆదికారణుడవై యున్నావు, నీకొరకు నమస్కరిం పనివారు లేరు. ఉన్నది లేదు అను యీ రెంటికిని పరమమైన అక్షర పరబ్రహ్మమే నీవగుదువుగాని సాధారణుడవుకావు, నీవు సర్వజగ

త్తును సృష్టించుటవలన ఆదిదేవుడవగుదువు. అనాది పురుషుడవగు దువు. మహాప్రళయాదికాలములయందు యీ సర్వజగత్తును నీ యందే వుంచుకొనువాడవగుదువు. వేదాంతములచేత యెరుగదగిన వస్తువు నీవే. పరమపదము నీవే. నీచేత సకల ప్రపంచము వ్యాపించ బడియున్నది. విశ్వరూపుడవగు దేవా! కృష్ణా! వాయుదేవుడు నీవే యగుదువు. యముడు నీవేయగుదువు, అగ్నిదేవుడు నీవేయగుదువు. వరుణదేవుడు నీవేయగుదువు. చంద్రుడునీవేయగుదువు.కశ్యపాదిప్రజా పతులు నీవేయగుదువు. బ్రహ్మదేవునకు తండ్రివి నీవేయగుదువు. నీకు నమస్కరింపుచున్నాను.పదేపదేనీకేనమస్కరింపుచున్నాను.నీయొక్క పూర్వదిక్కును, వెనుకదిక్కును. సర్వదిక్కులకును నమస్కరింపు చున్నాను. నీవు సర్వవ్యాపివై యున్నావు. అనంత పరాక్రమము గలిగియున్నావు. అమిత సామర్థ్యమును గలిగియున్నావు. సర్వము నీవేయగుదువు. నీకంటె అన్యమైనది కొంచెమైనను లేదు. ఇదివరకు నీవు పరమేశ్వరుడవని నేనెరుగక నాతో సమానవయస్సుగలవాడ వని తలచితిని. అట్లు తలచి నీ మహిమను యెరుగక అజ్ఞానముచేత కృష్ణుడవనియు యాదవుడవనియు స్నేహితుడవనియు, పిలుచుచు వవ్యహరింపుచుంటిని.

పొరపాటువలనను, స్నేహమువలనను, నిన్ను మనుష్యునిగా దలచి అనేకవిధములుగా వ్యవహరింపుచుంటిని. నడచునప్పుడును పీటలయందు కూర్చున్నప్పుడును. పాన్పుమీద పండుకొనినపుడును భోజనకాలములయందును యెగతాళికొరకు నిన్ను అవమానించితిని. నీవు దగ్గరలేనపుడు నిన్ను యెగతాళిచేసి అవమానించితిని. నీ కొరకు నేను చేసిన అవమానములన్నిటిని క్షమించి నన్ను రక్షింప వలయును. పరమేశ్వరుడవగు దేవా! కృష్ణా! ఈ చరాచర సకల జగత్తునకును నీవు తండ్రివి, పూజింపదగిన శ్రేష్ఠుడవు. గురుడవు

నీతో సమానుడుగాని, నీకంటె అధికుడుగాని లోకములయందు లేడు. నీవు మిక్కిలి అధికమైన ప్రభావముగలవాడవు. గనుక నేను వంగిన వాడనై పరమేశ్వరుడవగు నిన్నుగురించి నమస్కరించి ప్రార్థింపు చున్నాను. కొడుకుయొక్క సకల అపరాధములను తండ్రి క్షమించి నట్లు స్నేహితుని అపరాధమును హితుడు క్షమించునట్లు భార్య యొక్క అపరాధమును భర్త సహించినట్లు నా అపరాధము లన్ని టిని నీవు సహింపవలయును.

పరమేశ్వరుడవగు దేవా! కృష్ణా! ఇదివరకు నాచేతనైనను అన్యులచేతనైనను యెప్పుడైనను చూడబడని నీ విశ్వరూపమును చూచితిని. అట్లు చూచుటచేత సంతోషించితిని. నీ విశ్వరూపము ఉగ్రాకారము గలిగియున్నందున భయముచేత నామనస్సు బాధింప బడియున్నది. గనుక నీవు యీ విశ్వరూపమును విడిచి నా స్నేహ రూపమగు కృష్ణదేహమును ధరించియుండుము. నన్ను దయచేత రక్షింపుచుండుము. విశ్వరూపుడవగు దేవా! కృష్ణా! నీవు చక్ర గదా కిరీటములను ధరించి యెప్పటివలె కృష్ణరూపమును పొందుము. ఆ కృష్ణరూపమును చూచుటకు నేను అపేక్షించి యున్నాను. గనుక యీ విశ్వరూపమును విడిచి నాలుగు చేతులు గలిగియుండు వసుదేవ పుత్రుడగు కృష్ణుని దేహమును పొందియుండుము. అని అర్జునుడు ప్రార్థించగా భగవంతుడు విశ్వరూపమును విడిచి భయపడిన అర్జు నుని వూరడించుచు యిట్లనెను.

అర్జునా! నీయందు నేను దయగలవాడనై యీశ్వర సంబంధ మైన నా యోగశక్తివలన యీ విశ్వరూపమును నీకు చూపితిని. ఈ విశ్వరూపము తేజోమయమైనదగుచు పరిమితిలేనిదగును. నా విశ్వరూపమును యిపుడు నీవుతప్ప యిదివరకు యెవ్వరును చూడ లేదు. అర్జునా! నాలుగు వేదములయొక్క సమగ్రములైన అధ్యయన

యజ్ఞములచేతనైనను చాంద్రాయణాది ఘోరతపస్సులచేతనైనను నీకంటె యితరుడగువాడు యీ విశ్వరూపమును జూచుటకు సమర్థుడుకాడు. అర్జునా! నా విశ్వరూపమును చూచుటచేత నీకు కలిగిన భయము విడువుము. మూఢబుద్ధిని విడువుము. నా విశ్వరూపము ఘోరరూపమగుటవలన నీకు భయము కలిగినది, ఇక భయమును విడిచి సంతోషచిత్తముగలవాడవై, శంఖ చక్ర గదా కిరీట చతుర్భుజములుగల యెప్పటివలెనున్న యీ కృష్ణరూపమును చూడుము. ధృతరాష్ట్రమహారాజా! యీ ప్రకారము భగవంతుడైన విశ్వరూపుడు అర్జునునితో చెప్పి యెప్పటివలె వసుదేవుని గృహమందు బుట్టిన కృష్ణరూపమును పొందె, భయపడిన అర్జును నూరడించెను. అర్జునుడు శాంతరూపమైన కృష్ణునిజూచి యిట్లనెను.

మహాత్మా! కృష్ణదేవా! ఇపుడు శాంతరూపమైన నీమనుష్య దేహమును చూచి భయములేని సంతోష చిత్తముగలవాడనైతిని. పూర్వమువలె యథాస్వభావము గలవాడనైతిని. అని అర్జునుడు చెప్పగా భగవంతుడైన కృష్ణు డిట్లనెను. అర్జునా! నీకు నేను చూపిన విశ్వరూపమును చూచుటకు యెవ్వరికిని సాధ్యముగాదు. దేవతలును యీ విశ్వరూపమును చూచుటకు సర్వదా అపేక్షింపుచుందురు. అపేక్షించినను నీవలె నా విశ్వరూపమును ఆదేవతలైనను చూడజాలరు. వేదములచేతను తపస్సుచేతను, దానములచేతను, యజ్ఞములచేతను పరమేశ్వరుడగు నన్ను చూచుటకు శక్యముకాదు. అటువంటి నన్ను నీవు చూచి కృతార్థుడవైతివి. అర్జునా! ఆత్మవిషయమైన భక్తిచేత నన్ను యెరుగుటకును నన్ను చూచుటకును, నాయందు ప్రవేశించుటకును శక్యమగును. అర్జునా! మోక్షసాధనమైన సర్వ శాస్త్రార్థమును సంగ్రహించి చెప్పెదవినుము. పరమేశ్వరుడగు నాకొరకు కర్మములను చేయుచు, కర్మ ఫలాసక్తి నివిడిచినట్టియు

నేనే పరమగతిగా భావించినట్టియు, సర్వప్రకారములచేతను నాయందు భక్తిగలిగినట్టియు ధన పుత్ర మిత్ర బంధు భార్యాభోగములయందు ప్రీతి స్నేహములు లేనట్టియు, తనకు అపకారముచేసిన జంతువునందును వైరములేక సర్వభూతములయందును సమానబుద్ధి గలవాడు పరమేశ్వరుడగు నన్ను పొంది సంసార బంధవిముక్తుడగును. ఇది ముఖ్యమైన ఉపదేశమగును. ఇపుడు యీ ఉపదేశమును నీకు నేను చేసితిని.

ఇది శ్రీకృష్ణార్జున సంవాదరూపమును బ్రహ్మవిద్యా
యోగశాస్త్రమును నగు భగవద్గీతోపనిషత్తు
నందు విశ్వరూపసందర్శన మను
ఏకాదశాధ్యాయము

---

## ద్వా ద శా ధ్యా య ము

భగవంతుడైన కృష్ణుడు చెప్పగా అర్జును డిట్లనెను. భగవంతుడా! కృష్ణా! నీయందు భక్తిగలిగి నీవుముందుచెప్పిన ప్రకారము నీకు సమర్పణముగా కర్మములను చేయుచు చిత్తసమాధిచేత సర్వకాలములయందును పరమేశ్వరుడవగు నిన్ను కొందరు ఉపాసింపు చుందురు. కొందరు సర్వకర్మములను సన్యసించి యింద్రియ గోచరముగాని అక్షరమగు పరబ్రహ్మమును వుపాసించుచుందురు. ఈ రెండు విధములగు వారిలో అధికమగు యోగవిద్య గలిగినవారెవరో చెప్పుము. అని అర్జును డడుగగా భగవంతుడైన కృష్ణు డిట్లనెను. అర్జునా! సర్వకర్మములను సన్యసించి అక్షర పరబ్రహ్మమును

ధ్యానించుచు జ్ఞానులైనవారిని గురించి వెనుక చెప్పెదను. పరమే శ్వరుడగు నాయందు మనస్సుంచి నాయందు భక్తిగలిగి సర్వదా నిగ్రహింపబడినచిత్తముగలవారై అధికశ్రద్ధతోగూడుకొని ధ్యానింపు చుండెడివారు మిక్కిలి నాకు యిష్టులైయుక్తతములని చెప్పబడుదురు. అర్జునా! నాశములేని ఆపరబ్రహ్మము యిటువంటిదని నిశ్చయించు టకు సాధ్యముకాదు. ఆపరబ్రహ్మము శబ్దములకు అందనిదియు. ఇం ద్రియములకు కనబడనిదియు, ఆకాశమువలె సర్వము వ్యాపించినదియు మనస్సుచేత చింతించుటకు శక్యముగానిదియు, నాశములేనిదియు. నిర్వికారముగా నుండునదియు. చలింపనిదియు;నిత్యమైనదియుఅగును. అట్టి పరబ్రహ్మమును సర్వదా కర్మసన్యాసులగు యతులు ధ్యానింపు చున్నారు. ధ్యానింపదగిన వస్తువును మనస్సుచేత చూచుచున్నట్లు సమీపమున పొంది నూనెధారవలె మానసచిత్తవృత్తి ప్రవాహము చేత చిరకాలముండుటయే ధ్యాన మనబడును. పరబ్రహ్మమును ధ్యానింపుచు యింద్రియములను జయించి సర్వకాలములయందును సుఖదుఃఖప్రాప్తియందు సమబుద్ధిగలవారై సర్వభూతములకు మేలు కోరెడివారు పరమేశ్వరుడగు నన్నే స్వతంత్రముగా పొందుచున్నారు. పరమేశ్వరుడగు నాకొఱకు కర్మములు చేయుచు నన్ను ధ్యానించు వారికంటె అక్షరపరబ్రహ్మమను పరమాత్మను ధ్యానించువారలకు దేహాభిమానమును విడచువిషయమందుఅధికదుఃఖము కలుగుచున్నది. దేహాభిమానముగలవారిచేత రూపములేనివస్తువుధ్యానింపబడుటవలన అధిక కష్టము కలుగుచున్నది. అక్షర పరబ్రహ్మోపాసకులయొక్క ప్రవర్తనను వెనుక చెప్పెదను. ఇప్పుడు నాభక్తుల విషయమై యిక చెప్పెదను వినుము. అర్జునా! నాభక్తులు సకల కర్మములను పర మేశ్వరుడనగు నాయందు విడిచి నేనే పరమగతిగా భావించుచు అన్యసహాయముకొరకు సమాధియోగముచేత నన్ను ధ్యానింపు

చున్నాఁడు. అట్లు పరమేశ్వరుఁడగు నన్ను ధ్యానించెడివారలను మృత్యువుతోఁ గూడియున్న సంసారసముద్రమునుంచి నేను శీఘ్రముగా రక్షింపుచున్నాను. గనుక అర్జునా! నీవు నీమనస్సును విశ్వరూపుఁడగు నాయందు స్థాపించుము. నిశ్చయమును చేయుచుండు నీబుద్ధినిన్ని విశ్వరూపుఁడనగు నాయందుంచుము. నిశ్చయముగా నా రూపముతో నాయందు నివసించి యుండఁగలవు. అర్జునా! సర్వకర్మములను నాయందు పరమేశ్వరుఁడ ననుభావముతో సన్యసించి నీమనోబుద్ధులు రెంటిని నాయందు చేర్చియుంచినయెడల నీశరీరమునువిడిచిన పిమ్మట నిశ్చయముగా నీవు నాయందుండఁగలవని తెలుసుకొనుము. ఇందుకు సంశయములేదు. అర్జునా! నీవు చిత్తమును నాయందు స్థిరముగా నుంచుటకు శక్తుఁడవుగానియెడల అభ్యాసయోగముచేత నన్ను పొందుటకు యిచ్ఛయింపుము. సకల విషయములందు సంచరించు చిత్తమును ఒకచోటునందు మాటిమాటికి తెచ్చి నిలుపుట అభ్యాసమనఁబడును. అర్జునా! అట్టి అభ్యాసయోగమును అభ్యసింపుటకు శక్తుఁడవుకానియెడల, నాకొఱకు కర్మములను చేయుచు నన్నే ఆశ్రయించియుండుము. అనఁగా యీశ్వరార్పణబుద్ధిచేత కర్మములను చేయుచుండుము. నాకొఱ కట్లు కర్మములను చేసితివేని చిత్తశుద్ధిని పొంది యోగజ్ఞాన ప్రాప్తిద్వారా నన్ను పొందఁగలవు. ఇదియును చేయుటకు శక్తుఁడవుగానియెడల నాయందు చేయఁదగిన సకలకర్మలను సన్యసించి ఆకర్మములను చేయుచుండుము. ఇట్లు చేయుట నాయోగమనఁబడును. అట్లు నాయోగమును ఆశ్రయించినవాఁడవై పిమ్మట చిత్తమును వశముచేసికొని సర్వకర్మఫలములను పరిత్యాగము చేయుము. అర్జునా! అవివేకపూర్వమైన అభ్యాసముకంటె శాస్త్రజ్ఞానము మేలు. కేవలశాస్త్రజ్ఞానముకంటె నాజ్ఞానముతో కూడిన ధ్యానము శ్రేష్ఠము. శాస్త్రజ్ఞానముతోకూడిన ధ్యానముకంటె కర్మ

ఫలత్యాగము శ్రేష్ఠమైనది. కర్మఫలత్యాగమువలన శాంతిరూపమైన సంసారవిముక్తి కలుగుచున్నది. భగవంతు డిట్లు పరమార్థమైన కర్మసన్న్యాసయోగవిషయమగు కర్మఫలపరిత్యాగమునుకర్మయోగమందు చెప్పి ఆకర్మఫల పరిత్యాగమును స్తుతించెనని తెలియవలయును. అర్జునా! ఇక సర్వకర్మసన్న్యాసులై అక్షరపరబ్రహ్మమును ధ్యానించు వారిస్వభావములను చెప్పెదను వినుము. పరమార్థ సన్న్యాసయోగనిష్ఠుడగు యతి సర్వభూతములను ఆత్మభావముచేత చూచుచు, తనకు దుఃఖమును కలిగించు జంతువును చూచియైనను ద్వేషించుకొనడు. సన్న్యాసి సర్వభూతములయందును స్నేహభావము కలిగి ప్రవర్తింపుచుండును. దుఃఖించుజంతువులయందు కరుణ కలిగియుండును. నాదియను మమకారబుద్ధి లేకయుండును. నేనుచేయుచున్నా నను అహంకారప్రత్యయము లేకుండును. తనయందు ద్వేషరాగములు కలిగి ప్రవర్తించువానియందు దుఃఖసుఖభావములను పొందక సహానచిత్తము కలిగియుండును. పరులచేత తనశరీరము యీడువబడినను, కొట్టబడినను, ఓర్పుగలిగి వికారమును పొందకుండును. పరమార్థసన్న్యాసియగువాడు తన దేహస్థితికారణమైన లాభము కలిగినను, కలుగకపోయినను తృప్తి గలిగియుండును. సర్వదా చిత్తమును నిగ్రహించి తనవశవుందుంచుకొని ప్రవర్తింపుచుండును. దేహేంద్రియములనునిగ్రహించియుండును. ఆత్మస్వరూపమందు స్థిరనిశ్చయ స్వభావము గలిగి యుండును. మనోబుద్ధులను రెంటిని పరమాత్మయగు నాయందు స్థాపించియుండును. అట్టిజ్ఞానియగు నాభక్తుడు నాకు ప్రియుడు. జ్ఞాని నాకు ప్రియు డనియు, నేను జ్ఞానికి ప్రియుడ ననియు భగవంతుడైన కృష్ణుడిదివఱకే ఏనిమిదవయధ్యాయమున పలికియున్నాడు. అర్జునా! యేసన్న్యాసివలన ప్రాణులు దుఃఖమును పొందవో ప్రాణులవలన యే

సన్న్యాసి దుఃఖమును పొందఁడో అట్టిసన్న్యాసి సకలమనోవికారములను విడచినయెడల నాకు ప్రియుఁ డగును.

అర్జునా! దేహేంద్రియవిషయసంబంధాదులయందు ఆపేక్ష లేనివాడును దేహమనశ్శుద్ధులు గలవాడును దేహరక్షణముకొరకు అన్నపానాదికార్యములను చేయుటయందు సమర్థుడైనవాడును సాక్షిభావముగా ప్రవర్తించువాడును. భయములేనివాడును, సర్వకర్మములను సన్న్యసించువాడును అగు సన్న్యాసి నాకు ప్రియుడైన భక్తుడు. అర్జునా! తనకు యిష్టపదార్థము లభించినపుడు సంతోషవికారములేనివాడును. దుఃఖమును కలిగించు అనిష్టపదార్థము లభించినపుడు ద్వేషములేనివాడును ప్రియపదార్థముపోయినపుడు దుఃఖించనివాడును, లభించని పదార్థమును కోరనివాడును, శుభాశుభకర్మలను సన్న్యసించినవాడును యగుసన్న్యాసి నాయందు భక్తి కలిగియున్నయెడల నాకు ప్రియుడు. అర్జునా! శత్రుమిత్రులయందు సమబుద్ధిగలిగియుండువాడును, పూజావమానములయందు సమచిత్తము గలిగియుండువాడును, శీతోష్ణసుఖదుఃఖములయందు సమబుద్ధిగలవాడును, సర్వప్రపంచవిషయములయందుఆసక్తి లేనివాడును, నిందాస్తుతులయందు సమబుద్ధి గలవాడును, ఇంద్రియ మనోనిగ్రహముగలవాడును, శరీరస్థితిమాత్రప్రయోజనముచేతసంతోషించువాడును, నియమమైననివాసస్థలములేనివాడును, పరమార్థవిషయమందు స్థిరబుద్ధిగలవాడును నగు సన్న్యాసి పరమాత్మయగు నాయందు భక్తిగలిగియున్నయెడల అట్టిజ్ఞాని నాకుప్రియుడును యిష్టుడును అగునని తెలియుము. అర్జునా! సన్న్యాసులగు జ్ఞానులు యీకార్యములను అనుష్ఠింపుచు శ్రద్ధావంతులై అక్షరపరబ్రహ్మ మగు నేనే పరమగతిగాగలవారై నాకు భక్తులైయున్నయెడల అట్టి పరమార్థజ్ఞానభక్తులు నాకు ప్రియులు. మోక్షాపేక్ష గలవారు యీ

ముందు చెప్పబడిన గుణములను సంపాదించుకొని ఆప్రకారము వర్తించవలయును.

ఇది శ్రీకృష్ణార్జునసంవాద రూపమును బ్రహ్మవిద్యా
యోగశాస్త్రమును అగు శ్రీ భగవద్గీతో
పనిషత్తునందు భక్తియోగ మను
ద్వాదశాధ్యాయము

---

## త్రయోదశాధ్యాయము

భగవంతుడైన కృష్ణుడీరీతిగా చెప్పగా అర్జును డిట్లనెను. భగవంతుడా! కృష్ణా! ప్రకృతిని పురుషుని క్షేత్రమును, ఆక్షేత్రమును యెరుగు క్షేత్రజ్ఞుని జ్ఞానమును ఆజ్ఞానముచే నెరుగదగిన పరబ్రహ్మమును యిదియంతయు చక్కగా చెప్పుము. ఈవిషయములను తెలియుట కపేక్షించుచున్నాను అని అర్జును డడుగగా భగవంతుడైన కృష్ణు డిట్లనెను:

అర్జునా! యీశరీరము క్షేత్రమని చెప్పబడును. ఈక్షేత్రమును పాదము మొదలుకొని శిరస్సుపర్యంతము స్వాభావికముగా జ్ఞానముచేత యెరిగినవాడు క్షేత్రజ్ఞుడని చెప్పబడును. క్షేత్రక్షేత్రజ్ఞులను యెరిగినపెద్దలు యీరీతిగ చెప్పుదురు. అర్జునా! బ్రహ్మాదిస్తంభపర్యంతముగల సర్వక్షేత్రములయందును యేక్షేత్రజ్ఞుడుగలడో ఆక్షేత్రజ్ఞుని పరమేశ్వరుడగు నన్నుగా తెలిసికొనుము. ఈశ్వరుడే సకలశరీరములయందును క్షేత్రజ్ఞరూపముగా నున్నాడు. అర్జునా! క్షేత్రక్షేత్రజ్ఞులను యెరిగెడి యేజ్ఞానముగలదో మట్టి జ్ఞానమే మంచి నమని పరమేశ్వరుడ నగు నాయభిప్రాయమైయున్నది. క్షేత్రక్షే

త్రజ్ఞులను యెరిగినపిమ్మట జ్ఞానముచేత యెరుగదగిన పదార్థము మరి యొకటిలేదు. అర్జునా! ఆక్షేత్రము యేదియో. యెటువంటిదో. యే వికారముగలదో. యేకారణమువలన యేకార్యము పుట్టెనో అది యంతయు సంగ్రహముగా చెప్పెదను వినుము. అక్షేత్రజ్ఞుడు ఉపాధిగా కల్పించబడిన యేశక్తులు గలవాడో చెప్పెదను వినుము. క్షేత్ర క్షేత్రజ్ఞులయొక్క వాస్తవస్వరూపము వసిష్ఠాది మహర్షులచేత అనేక ప్రకారములుగా చెప్పబడియున్నది. వేదములచేత నానావిధములుగా చెప్పబడియున్నది. ఆక్షేత్రక్షేత్రజ్ఞులయొక్క వాస్తవస్వరూపమును నేను చెప్పెదను వినుము. యుక్తియుక్తములైన బ్రహ్మసూత్రముల చేతను చెప్పబడియున్నది.

భూమి జల అగ్ని వాయు ఆకాశములను అయిదు సూక్ష్మ భూతములును పంచ మహాభూతములని చెప్పబడును. ఆ పంచ మహా భూతములకు కారణము అహంకారము, అహంకారమునకు కారణమైన బుద్ధియను మహత్తత్త్వము. ఆబుద్ధియను మహత్తత్త్వమునకు కారణము ప్రకృతియను మాయాశక్తి. శ్రోత్రము, త్వక్కు, చక్షువు, జిహ్వా, ఘ్రాణము అను యీ అయిదును జ్ఞానేంద్రియములు. వాక్కు, పాణి, పాదము, పాయువు, ఉపస్థయు ఈఅయిదును కర్మేంద్రియములు. మనస్సు అనునదియొకటి, శబ్దము స్పర్శము,రూపము రసము, గంధము అనునీయైదును విషయములగును. మొత్తముగా నివియన్నియు చేరి యిరువదినాలుగుతత్త్వములగును.

అర్జునా! సుఖదుఃఖహేతువగు ఇచ్ఛఅనునది మనస్సుయొక్క గుణము. సుఖమనునది సాత్వికగుణమువలన పుట్టినది. దుఃఖమనునది రజోగుణమువలన పుట్టినది. దేహేంద్రియాది సమూహమందు కూడియుండు అంతఃకరణ ప్రవృత్తి చిదాభాసునితో చేరియుండును. అగ్నిచేత కాల్చబడిన యినుప ముద్దవలె నుండును. అదిచేతన మన

బడును. బింబస్వరూపుడగు ఆత్మయొక్క ప్రతిబింబము చిదాభాసుడన బడును. ధైర్యశక్తి బుద్ధిగుణమగును. అర్జునా! యీ ముందు చెప్ప బడిన యిరువది నాలుగు తత్వములును ఇచ్ఛా ద్వేష సుఖదుఃఖ చేతన ధైర్య శక్తి మొదలగు సంకల్పము లన్నియు క్షేత్రమే యగును. ఈ చెప్పబడిన వన్నియు క్షేత్రమని నిశ్చయించు కొనుము. ఇవియన్నియు యింద్రియములచేత నెరుగ బడినందున దృశ్యములగును. దృశ్య పదార్థము లన్నియు క్షేత్రమేయగునని తెలియవలెను. ఇకను జ్ఞానసా ధనములైన గుణములను చెప్పెదనువినుము, అర్జునా! తననుపొగడుకొన కుండుటయు, తాను చేసిన ధర్మమును ప్రకటింప కుండుటయు ప్రాణు లనుహింసింపకుండుటయు, తనకు పరులు అపరాధముచేసినను వోర్చు కొని యుండుటయు, వికృతగుణ స్వభావము లేకుండుటయు మోక్ష సాధనమును ఉపదేశించు ఆచార్యునకు శుశ్రూషలు చేయుటయు దేహమనస్సులను పరిశుద్ధి చేసికొనుటయు, మోక్షమార్గమందే స్థిరమైన ప్రయత్నము చేయుటయు, దేహేంద్రియములను చెడు మార్గములయందు పోనివ్వక మంచిమార్గమందు ప్రవర్తింపజేయు టయు, శబ్దస్పర్శాది విషయభోగములయందు వైరాగ్యము గలిగి యుండుటయు, అహంకారము లేకుండుటయు జన్మమృత్యువులయం దును ముదిమియందును, వ్యాధులయందును, దుఃఖదోషములున్న వని యోచించుటయు, విషయములయందు ప్రీతిని విడుచుటయు, పుత్ర భార్యా గృహాది పదార్థములయందు అభిమానము లేకుండు టయు ఇష్ట అనిష్టరూపములగు సుఖదుఃఖములు ప్రాప్తించినపుడు సంతోష కోపములు లేక సమచిత్తము గలిగియుండుటయు పరమే శ్వరుడగు నాయందు ఆత్మవిషయమైన యోగముచేత నిశ్చలభక్తి గలిగియుండుటయు, పరిశుద్ధములైన అరణ్య నదీ దేవాలయాది దేశ ములయందు నివసించుటయు మూఢులగు జనులదగ్గర నిల్వకుండు

టయు ఆత్మాది పదార్థములయొక్క స్వరూప విచారరూప జ్ఞానమును గలిగియుండుటయు, తత్వజ్ఞాన ఫలమగు మోక్షమును గురించి ఆలోచించుటయు నిట్లు చెప్పబడిన గుణములన్నియు జ్ఞానసాధనములైనందున జ్ఞానమని చెప్పబడును. ఈ చెప్పబడిన గుణములకు విరుద్ధములైన గుణములన్నియు అజ్ఞానగుణములగుటవలన అజ్ఞానమని చెప్పబడును.

అర్జునా! జ్ఞానముచేత యెరుగదగిన జ్ఞేయమను పరబ్రహ్మ వస్తువును చక్కగా చెప్పెదను వినుము. ఆ పరబ్రహ్మమును యెరిగిన యెడల మోక్షము కలుగుచున్నది. ఆ పరబ్రహ్మము అనాదిగనుండును. ఆ జ్ఞేయమైన పరబ్రహ్మము వ్యవహార వస్తువువలె వుండునదియనియు, లేనిదియనియు చెప్పబడదు. వ్యవహారమందు బుద్ధీంద్రియములకు కనబడు పదార్థమున్నదియని చెప్పబడును. బుద్ధీంద్రియములకు కనబడని పదార్థము లేనిదియని చెప్పబడును. ఆ పరబ్రహ్మము బుద్ధీంద్రియములకు విషయము గానందున వున్నది కాదనియు, లేనిది కాదనియు, చెప్పబడుచున్నది. అర్జునా! జ్ఞేయమైన ఆ పరబ్రహ్మము అంతటను కాళ్ళుచేతులు గలదగుచు, నేత్ర శిరోముఖములంతటను గలిగి అంతటను చెవులుగలదై సర్వమును వ్యాపించి లోకమందున్నది. ఆ పరబ్రహ్మము సకలేంద్రియ వ్యాపారములచేత ప్రకాశింపుచున్న దానివలె నుండినను సకలేంద్రియములు లేనిదైయున్నది. పరబ్రహ్మ మెక్కడ అంటనిదైనను సకలమును ధరించినదగును. గుణములేనిదైనను గుణములను అనుభవించునదియగును.

అర్జునా! ఆ బ్రహ్మము, ప్రాణులయొక్క లోపటను, వెలుపటను అంతట వ్యాపించియున్నది. ఆ బ్రహ్మము అంతట వ్యాపించియుండి నిశ్చలరూపముగనుండి చలించుదానివలె తోచబడుచున్నది. సూక్ష్మ రూపముగలది యగుటవలన తెలియబడలేదు. ఆ బ్రహ్మము

వివేకులకు దూరముగా నున్నట్లుండును. జ్ఞానులకు సమీపమం
ండును. అర్జునా! ఆ బ్రహ్మము అఖండాకారముగల దగుచు
కల ప్రాణులయందును ఖండముగా నున్న దానివలె తోచుచున్నది.
ఆ బ్రహ్మము లోకస్థితి కాలమందు సకల భూతములను భరించుచు
ప్రళయకాలమందు గ్రహించుచు సృష్టికాలమందు పుట్టింపుచున్నది.
ఆ బ్రహ్మము తెలియదగినది. అర్జునా! ఆ బ్రహ్మము తేజో పదార్థ
ములగు సూర్యాదులకును ఆత్మ చైతన్య రూపముచేత బరంజ్యోతి
స్వరూపమైయున్నది. అజ్ఞానమను చీకటికంటె అన్యమైనదగును.
ఆ పరబ్రహ్మము జ్ఞానరూపముగాను తెలియదగినదిగాను జ్ఞాన
గోచరముగాను, సకల ప్రాణులయొక్క హృదయమందుండునదిగాను,
యీ ప్రకారముగా చెప్పబడుచున్నది.

అర్జునా! యీ ప్రకారము క్షేత్రమును, జ్ఞానమును, జ్ఞేయ
మైన పరబ్రహ్మమును సంక్షేపముగా చెప్పితిని. నా భక్తుడగువాడు
యీ అభిప్రాయమును తెలిసికొని మోక్షమును పొందుచున్నాడు!
ఇకను ప్రకృతి పురుషుల విషయమై చెప్పెదను వినుము.

అర్జునా! ప్రకృతి పురుషులు రెండును అనాదిగా నుండునవి
యని తెలిసికొనుము. బుద్ధి మొదలుకొని దేహపర్యంతముగల వికా
రములును, సుఖదుఃఖ మోహరూపముగా యేర్పడిన గుణములును
ప్రకృతివలన పుట్టినవని తెలిసికొనుము. త్రిగుణాత్మకమైన మాయా
శక్తి ప్రకృతియనబడును. ప్రకృతియే దేహాది వికారములుగాను
గుణములుగాను పరిణమించుచున్నదని తెలియవలయును. అర్జునా!
దేహేంద్రియాదులకు సుఖదుఃఖాదులను పుట్టించుటయందు ప్రకృతి
కారణముగా నున్నదని చెప్పబడును. పురుషుడగు క్షేత్రజ్ఞుడు
సుఖదుఃఖములను అనుభవించుటయందు కారణమని చెప్పబడును.
ఆ పురుషుడను క్షేత్రజ్ఞుడు ప్రకృతియందుండి ప్రకృతివలన పుట్టిన

గుణములను అనుభవింపు చున్నాడు. ఈ ప్రకృతి పురుషునకు గు
సుఖదుఃఖాది గుణాభి మానమే పుణ్యాపాప యోనులయందు పుట్టు
టకు కారణమగు చున్నది. అర్జునా! యీ దేహమందు పురుషు
డను క్షేత్రజ్ఞుడు సకల కార్య కారణవ్యాపారములకు సాక్షిగానుండు
నట్టియు, అనుమోదించి యుండునట్టియు, భరించి యుండునట్టియు
అనుభవింపు చుండునట్టియు, నియామకుడై యుండునట్టి పరమాత్మ
యగును.

అర్జునా! యీ ప్రకారము క్షేత్రజ్ఞుడే పరమాత్మయని
క్షేత్రజ్ఞుని యెరిగినవాడును వికారములతో గూడిన ప్రకృతిని యెరిగిన
వాడును, నానావిధములుగా ప్రవర్తింపు చున్నను, సంసారబంధ
విముక్తుడై మరల జన్మించడు. అర్జునా! ధ్యానముచేత కొందరు
బుద్ధియందు ఆత్మను చూచుచుందురు. కొందరు తత్వవిచారణ
రూపమైన సాంఖ్యముచేత ఆత్మనుచూచుచున్నారు. కొందరు ఈశ్వర
సమర్పణ రూపమైన కర్మయోగము చేత చిత్తశుద్ధి గలవారై
తద్వారా జ్ఞానముచేత ఆత్మను చూచుచున్నారు. కొందరు యీ
వుపాయములలో నేదియు నెరుగనివారై ఆచార్యునివలన యీ
వుపాయములలో ఒక వుపాయమును యెరిగి శ్రద్ధావంతులై ఆత్మను
ధ్యానింపుచున్నారు. అట్టివారును మృత్యుయుక్త సంసారమును
అతిక్రమింపు చున్నారు.

అర్జునా! యెంతమాత్రపు స్వల్పవస్తువులైనను యెంతపర్యం
తము పుట్టుచున్నదో ఆవస్తువు ప్రకృతిపురుషుల కూడికవలన పుట్టిన
దని తెలిసికొనుము. అర్జునా! పరమేశ్వరుడు బ్రహ్మాదిస్థావరాంతము
వరకున్నటువంటి సర్వభూతములయందును సమానరూపుడై యున్నాడు.
ఆ భూతములు నశించినను, ఆత్మ స్వరూపుడైన ఆ పరమేశ్వరుడు
నశించడు. అట్టి పరమేశ్వరుని చూచినవాడు. పరమార్థమునుచూచిన

వాడగును. అర్జునా! సర్వభూతముల యందును సమరూపుడై యుండు పరమేశ్వరుని సమానముగా జూచినవాడు తనచేత తాను హింసింప బడువాడు కాడు. అందుచేత పరమగతియగు మోక్షమును పొందు చున్నాడు. అర్జునా! దేహేంద్రియములచేత చేయబడు కర్మము లన్నియు సర్వవిధములచేత ప్రకృతిచేతనే చేయబడు చున్నవని యిత రముచేత చేయబడలేదని, యిట్లు చూచిన వాడు ఆత్మయగు తనను అకర్తనుగా జూచుచున్నాడు. అర్జునా! నానావిధ భేదములుగానున్న భూతములను యేకాలమును ఆత్మయందున్నట్లు చూచునో అప్పుడు పరిపూర్ణమైన పరబ్రహ్మమే యగుచున్నాడు. అర్జునా! నాశములేని యీ పరమాత్మ కారణములేనివాడగుట వలనను, నిర్గుణుడగుట వలనను శరీరమందున్నప్పటికిని కర్మమును చేయుటలేదు. కర్మ ఫలముచేత అంటబడుటలేదు. ఆకాశము సర్వమును వ్యాపించి యున్నను సూక్ష్మ స్వభావమువలన బంధింప బడనట్లు పరమా త్మయు యీ దేహమందంతట వ్యాపించియున్నను అంట బడడు. అర్జునా! యీ సకలలోకమును సూర్యుడొక్కడే ప్రకాశింప జేసినట్లు ప్రకృతి మొదలుకొని స్థావరాంతము వరకుగల సకల క్షేత్ర మును పరమాత్మ యొక్కడే ప్రకాశింప జేయుచున్నాడు. అర్జునా! యీ ప్రకారము క్షేత్ర క్షేత్రజ్ఞుల యొక్క భేదమును జ్ఞాననేత్రముచేత యెరిగినవారును, భూతములకు కారణమగు అవిద్యా లక్షణ ప్రకృతి మిథ్యా స్వరూపమని. యెరిగినవారును పర బ్రహ్మమును పొందుచున్నారు. మరల పునర్జన్మమును పొందరని తెలియవలయును.

ఇది శ్రీకృష్ణార్జునసంవాదరూపమును, శ్రీబ్రహ్మవిద్యాయోగ
శాస్త్రమునునగు శ్రీభగవద్గీతోపనిషత్తునందు
క్షేత్రక్షేత్రజ్ఞ విభాగ యోగ మను
త్రయోదశాధ్యాయము

# చతుర్దశాధ్యాయము

భగవంతుడైన కృష్ణుడు అర్జునునిజూచి యిట్లనెను. అర్జునా! సకలజ్ఞానములలో శ్రేష్ఠమైన జ్ఞానమును, మరల చెప్పెదను వినుము. మునులందరు యేజ్ఞానమును తెలిసికొని యీ దేహబంధమునుండి విడువబడిన వారలై మోక్షమును పొందిరో అట్టిజ్ఞానమును మరల చెప్పెదను వినుము. ఈ జ్ఞానసాధనమును అనుష్ఠించినవారలు, నా స్వరూపము పొందినవారలగుచు, సృష్టికాలమందు మరల జన్మింపరు. బ్రహ్మదేవుని నాశావస్థయగు ప్రళయకాల మందును చలింపరు. అర్జునా! నా అధీనమైనట్టియు నా స్వరూప భూతమయినట్టియు, త్రిగుణాత్మకమైన నామాయాశక్తి సర్వభూతములు పుట్టుటకు కారణమగును. ఆ మాయాశక్తియందు నేను బీజమును మొట్టమొదట వుంచగా బ్రహ్మదేవుడు పుట్టెను. పరమేశ్వరుడనగు నేను క్షేత్ర క్షేత్రజ్ఞులకు సంబంధమును కలిగింపుచున్నానని తెలియవలయును.

అర్జునా! అట్లు మొట్టమొదట బ్రహ్మదేవుడు పుట్టుటచేత బ్రహ్మదేవుడు సర్వభూతములను సృష్టించుటకు కారణమాయెను. అర్జునా! సర్వయోనులయందును, యేయేభూతములు పుట్టుచున్నవో ఆసకలభూతములకును, నామాయాశక్తి కారణమై తల్లియగును. పరమేశ్వరుడనగు నేను గర్భాధానముచేసిన తండ్రి నగుదును. అర్జునా! సత్వమనియు, రజమనియు, తమమనియు యిట్లు మూడు గుణములు గలవు. ఈమూడు గుణములును, ప్రకృతివలన పుట్టినవగును. ఆసత్వ రజస్తమము లను మూడుగుణములును దేహమందుండు పరమాత్మను బంధించినట్లు తోచుచున్నవేగాని వాస్తవముగా బంధింపజాలవు. ఆమూటిలో సత్వగుణము, నిర్మలస్వరూపమగుటవలన స్ఫటికము వలె ప్రకాశముకలదై నేను సుఖి ననుసుఖాభిమానముచేతను, నేను

జ్ఞానిననుజ్ఞానాభిమానముచేతను ఆత్మను మోహింపజేసి బంధింపుచున్నది. అర్జునా! రజోగుణము యెఱుపువర్ణమువంటిది. ఆశా స్వరూపముగలిగియుండును. రజోగుణము లభించని విషయమందు అభిలాష కలిగించును. అట్లు అభిలాష కలిగించే కర్మాభిమానముచేత పురుషుని బంధింపుచున్నది. అర్జునా! తమోగుణము అజ్ఞానమువలన పుట్టినది. ఆతమోగుణము సకల ప్రాణులకును అవివేకమును కలిగించును. ఆతమోగుణము పొరపాటును గలిగించుటచేతను, సోమరితనమును కలిగించుటచేతను, నిద్ర కలిగించుటచేతను, పురుషుని బంధింపుచున్నది. అర్జునా! సత్వగుణము, పురుషునిసుఖమందు ప్రవర్తింప జేయుచున్నది. రజోగుణము కర్మమందు ప్రవర్తింప జేయుచున్నది. తమోగుణము, సత్వగుణమువలన కలిగినజ్ఞానమును కప్పి పురుషుని ప్రమాదమందు ప్రవర్తింపజేయును. చేయదగినపనిని చేయకుండుట ప్రమాదమనబడును. అర్జునా! సత్వగుణమును. రజస్తమోగుణములను రెంటిని యేకాలమందు తిరస్కరించి తాను వృద్ధి బొందునో, అప్పుడు పురుషునకు జ్ఞానసుఖాదులను కలిగించుచున్నది. రజోగుణము సత్వతమోగుణములను రెంటిని నిగ్రహించి యేకాలమందు వృద్ధిబొందునో అప్పుడు కృష్యాదికర్మమును చేయించుచున్నది. తమోగుణము సత్వగుణము, రజోగుణములను రెంటిని తిరస్కరించి యేకాలమందు వృద్ధిబొందునో, అప్పుడు జ్ఞానమును కప్పుట మొదలగు తనకార్యములను చేయుచున్నదని తెలుసుకొనుము. అర్జునా! సత్వగుణము వృద్ధిబొందినపుడు యీదేహమందుగల సర్వద్వారములయందును దేహమందును బుద్ధియొక్క వ్యాప్తిరూపమైన ప్రకాశము కలుగుచున్నది. అదియే జ్ఞానమని తెలియవలెను. అర్జునా! రజోగుణమువృద్ధిబొందినపుడు పరులద్రవ్యమందు అపేక్షకలుగును. కర్మములయందు సామాన్యప్రవర్తనము కలుగును. శాంతరూపమైన సుఖము లేకవుండును,

ఇచ్ఛాసుఖములయందు ప్రవర్తనము గలిగియుండును. సర్వసామాన్య విషయమైన ఆశకలిగియుండునని తెలియవలయును. అర్జునా! తమో గుణము వృద్ధిబొందినపుడు మిక్కిలి అవివేకము కలుగును. ప్రవర్త నము తెలియకయుండును. అనగా చేయదగిన కార్యమును చేయక సోమరితనము కలిగియుండునని తెలియవలెను. మూఢభావము గలిగి యుండును. అర్జునా! సత్వగుణము వృద్ధిబొందినపుడు చచ్చిన ప్రాణి కర్మాసక్తిగల మనుష్యులయందు పుట్టుచున్నాడు. తమోగుణము వృద్ధిబొందినప్పుడు చచ్చినవాడు పశ్వాది మూఢయోనులయందు పుట్టుచున్నాడు.

అర్జునా! సాత్వికకర్మమగు పుణ్యమునకు సాత్వికఫలమే కలు గునని పెద్దలు చెప్పుదురు. సాత్వికఫల మనగా సుఖమని తెలియ వలెను. రాజసకర్మమునకు దుఃఖము ఫలమగును. అధర్మమగు తామసకర్మములకు దుఃఖఫలమే కలుగునని తెలియవలెను. సత్వగు ణమువలన జ్ఞానము కలుగుచున్నది. రజోగుణమువలన పరద్రవ్యా పేక్ష కలుగుచున్నది. తమోగుణమువలన ప్రమాద అవివేకములు కలుగుచున్నవి. చేయదగినకార్యమును చేయకుండుట ప్రమాద మన బడును. అర్జునా! సత్వగుణవృత్తియందు ప్రవర్తించువారలు దేహ లోకాదులయందు పుట్టుదురు. రజోగుణముచేత ప్రవర్తించువారలు మనుష్యలోకమందు పుట్టుచున్నారు. తమోగుణవృత్తిచేత ప్రవర్తిం చువారలు పశ్వాదిజంతువులయందు పుట్టుచున్నారు. అర్జునా! యీ చెప్పబడిన కార్యకారణరూపములగు గుణములకంటె అన్యముగా కర్త లేడనియు, యిట్లు తెలిసికొని ఆమూడుగుణములకంటె అన్యమైన సాక్షిరూపముగా నుండువాడు. ఆత్మను యెరిగినవాడు నాస్వరూప మును పొందుచున్నాడు. ఎట్లనగా చెప్పెదను వినుము. మూండ్ను

చెప్పినప్రకారమెరిగినవాడు జీవించియుండగానే దేహము పుట్టుటకు కారణములగు యీ మూడు గుణములను అతిక్రమించును. ఇక్కడ జీవించియుండగనే జన్మమృత్యువులచేతను, ముదిమిచేతను, వ్యాధుల చేతను విడువబడినవాడై, నాస్వరూపుడై మోక్షమును పొందుచున్నాడు అని భగవంతుడైన కృష్ణుడు చెప్పగా అర్జునుడిట్లనెను. భగవంతుడా! కృష్ణా! యీచెప్పబడిన సత్వరజస్తమోగుణములను యే విధ్నములచేత అతిక్రమించునో చెప్పుము. అట్లు గుణములను అతిక్రమించిన విద్వాంసునకు యేలువంటి ప్రవర్తనము కలిగియుండునో చెప్పుము. విద్వాంసుడగువాడు యేప్రకారముగా యీగుణములను అతిక్రమించునో చెప్పుము. అని అర్జును డడుగగా భగవంతుడైన కృష్ణు డిట్లనెను.

అర్జునా! గుణాతీతుడగు విద్వాంసుడు సత్వరజస్తమోగుణ కార్యములగు జ్ఞానాదులు కలిగినపుడు ఆకార్యములను గురించి ద్వేషించుకొనడు. ఆగుణకార్యములగు జ్ఞానసుఖాదులు తనను విడిచి పోయినపుడు ఆగుణకార్యములను ఆపేక్షింపడు. అట్టిగుణాతీతుడగు విద్వాంసుడు సాక్షివలె గుణాతీతస్వభావమగు వుపాయ మార్గమందున్నవాడై వివేకనిష్ఠనుంచి చలింపకుండును. అట్టిగుణాతీతుడు గుణములేకార్యములుగాను - కార్యసాధనములైన ఇంద్రియాదులుగాను యేర్పడెననియు. అన్యోన్యముగా ఒకటియందు మరియొకటి వర్తింపుచుండుననియు. యీరీతిగా తలంచుచుండును. అట్టిగుణాతీతుడు చలింపక స్వరూపావస్థయందే యుండును. అర్జునా! సుఖదుఃఖములయందు సమబుద్ధిగలవాడు, ఆత్మనిష్ఠగలవాడు, మట్టి, రాయి. బంగారములను మూటిని సమానముగా జూచువాడును, ఇష్టానిష్టపదార్థములను సమముగా జూచువాడును, ధైర్యవంతుడును, నిందాస్తుతులయందు చిత్తవికారములేనివాడును, మానావమానములయందు నిర్వికారచిత్తము

గలవాడును, శత్రుమిత్రులపక్షములయందు సమానబుద్ధిగలవాడును, సర్వకర్మములను విడుచుటకు కోరువాడును, యీరీతిగా వర్తించు వాడు గుణాతీతుడని చెప్పబడును. అర్జునా! పరమేశ్వరుడనగు నన్ను ఆత్మానాత్మవివేకజ్ఞానమైన భక్తియోగముచేత సన్యాసియైనను, కర్మియైనను, సర్వదా సేవింపుచున్నయెడల అట్టి నాభక్తుడు, పూర్వోక్త గుణములను అతిక్రమించి మోక్షమును పొందుటకు సమర్థుడగుచున్నాడు. ఇట్టి నాభక్తుడు ముందుచెప్పిన గుణాతీతునికంటె శ్రేష్ఠుడని తెలియవలెను. ఎట్లనగా చెప్పెదను వినుము.

అర్జునా! పరమాత్మ నాశములేనివాడనియు, వికారము లేనివాడనియు, నిత్యుడనియు, జ్ఞానయోగధర్మముచేత పొందదగినవాడనియు, ఆనంద స్వరూపుడనియు, నియతస్వరూపుడనియు యెరుగవలెను. నా భక్తుడగువాడు వివేకవిజ్ఞానరూప భక్తిచేత ప్రత్యగాత్మను జ్ఞానముచేత పరమాత్మ స్వరూపముగా నిశ్చయింపుచున్నాడు. గనుక అట్టి నాభక్తుడు మోక్షముకొరకు సమర్థుడగుచున్నాడు.

ఇది శ్రీకృష్ణార్జున సంవాదరూపమును బ్రహ్మవిద్యా
యోగశాస్త్రమును అగు శ్రీ భగవద్గీతోపనిష
త్తునందు గుణత్రయవిభాగయోగమను
చతుర్దశాధ్యాయము

---

## పంచదశాధ్యాయము

భగవంతుడైన కృష్ణుడు చూచి అర్జునునితో యిట్లనెను. అర్జునా! మాయామయమైన సంసారము రావిచెట్టువంటిదని పెద్దలు చెప్పుదురు. ఆ సంసారవృక్షమునకు అవ్యక్తమగు మాయాశక్తికల

బ్రహ్మము మూలమగును. మహత్తత్వ అహంకార సూక్ష్మభూతా దులు కొమ్మలవంటివై సంసారవృక్షమునకు క్రిందుగానున్నవి. ఆ సంసారమను రావివృక్షము మాయయగుటవలన, ఆ సంసారవృక్షము నాశములేనిదని చెప్పబడును. ఆ సంసారవృక్షమునకు వేదములు ఆకులవంటివి. ఆకులు వృక్షమునుకప్పి రక్షించినట్లు వేదములు ధర్మా ధర్మములను తెలుపుచు, ఆ ఫలములను ప్రకాశింపజేయుచు సంసార వృక్షమును రక్షింపుచున్నవి. ఈ చెప్పబడిన సంసారవృక్షమును మూలముతోగూడ యెరిగినవాడు వేదవేత్త యనబడును. అర్జునా! జ్ఞాన కర్మఫల రూపములు ఆ సంసారవృక్షమునకు కొమ్మల వంటివి. ఆ కొమ్మలు పైతట్టు బ్రహ్మలోకమువరకును, క్రిందితట్టు మనుష్యులు మొదలు స్థావరములవరకును వ్యాపించియున్నవి. ఆ కొమ్మలు సత్వ రజస్తమో గుణములచేత స్థూలములుగా చేయబడి నట్లున్నవి. ఆ సంసారవృక్షమునకు శబ్ద స్పర్శాది విషయములవంటివి. ఆ వేరులు మనుష్యలోకమందుగల ధర్మాధర్మలక్షణమైన కర్మఫలములను ముందుగా కలిగినవై క్రిందను మీదను ప్రవేశించియున్నవి.

అర్జునా! యీ వృక్షమందున్న ప్రాణులచేత యీ సంసార వృక్షముయొక్క స్వరూపము తెలియబడదు. ఈ సంసారవృక్షము యొక్క ఆద్యంత మధ్యమ కాలములునుగూడ తెలియబడవు. ఈ సంసారవృక్షము గట్టివేళ్ళను కలిగియున్నది. గనుక వైరాగ్యమను ఆయుధముచేత ఆ సంసారమను వృక్షమును నరికి పిమ్మట పర మాత్మపదమును వెదుకవలయును. పరమాత్మపదమును పొందిన వారలు, మరల సంసారమందు ప్రవేశింపరు. ఆ పరమాత్మవలననే అనాదియైన సంసారవృక్షము ప్రవర్తింపుచున్నది. గనుక మూల కారణమగు ఆ పరమాత్మను శరణుబొందెదనని పరమాత్మస్వరూప మగు మోక్షస్థానమును వెదుకవలయును. అర్జునా! పరమాత్మను

వెదకిన జ్ఞానులు, అభిమాన అవివేకములు లేనివారై ఇచ్ఛాద్వేష ములను జయించి జ్ఞానయోగాసక్తులగుచు సకల కోరికలను విడిచి సుఖదుఃఖములను ద్వంద్వములు లేనివారై నాశములేని మోక్షపద మును పొందుచున్నారు. అర్జునా! ఆ పరమపదమును, సూర్యచంద్ర అగ్నిహోత్రులు, ప్రకాశింపజేయజాలరు. మరియు ఆ పరమ పద మును పొందినవారలు, మరల సంసారమును ప్రవేశింపరు. అట్టిపరమ పదము. విష్ణువగు నాయొక్క స్థానమని తెలిసికొనుము.

అర్జునా! కర్తననియు, భోక్తయనియు, యిట్లు సంసారమందు అనాదిగా ప్రవర్తింపుచు జీవుడు పరమేశ్వరుడనగు నాయొక్క అంశ మేనని తెలిసికొనుము. ఆజీవుడు జలమందు ప్రతిబింబించిన సూర్య ప్రతిబింబమువలె పరమేశ్వరుని అంశయగును. ఆజలసూర్య ప్రతిబిం బము, జలోపాధి నశించినవెంటనే సూర్యుని పొంది మరల రానట్లు జీవుడును, అజ్ఞానోపాధిని పోగొట్టుకొనినతోడనే తన నిజరూపమగు పరమేశ్వరుని పొంది మరల సంసారమునకు రాడని తెలియవలయును. అర్జునా! ఆజీవుడు చెవి మొదలగు స్థానములయందుండు శ్రోత్రము, త్వక్కు, చక్షువు, జిహ్వ, ఘ్రాణము అను యీ అయిదింద్రియముల తోడను, మనస్సుతోడను కూడియున్నాడు. ఆజీవుడు పూర్వశరీరము నుంచి మరియొక శరీరమును యెప్పుడు పొందునో. అప్పుడు మనస్సు మొదలగు ఆరింద్రియములను ఆకర్షించుకొని వెళ్ళుచున్నాడు. గాలి, పుష్పాదులయందుండు వాసనలను గ్రహించుకొని వెళ్ళినట్లు జీవుడు పూర్వశరీరమును విడిచి మరియొక శరీరమును పొందునపుడు మనస్సు మొదలగు ఆరింద్రియములను గ్రహించుకొని వెళ్ళుచున్నాడని తెలియవలెను.

అర్జునా! యీ జీవుడు దేహమందున్నవాడైనను, శ్రోత్ర త్వక్చక్షుర్జిహ్వా ఘ్రాణ మనస్సులను ఆరింటిని ఆశ్రయించి ఆ ఆరింటి

...తిని. ఈ చెప్పబడినప్రకారము
ద్వారా శబ్ద స్పర్శ రూప రసగంధములను
...తుడును కృతార్థుడును
వింపుచున్నాడు. అర్జునా! పూర్వదేహమును విడి...
...శి. గనుక నీవును
మందున్నట్టియు, శబ్దాదివిషయములను అనుభవింప
సుఖదుఃఖ మోహాది గుణములతో కూడియున్నట్టియు యీ
చక్కగా యెరుగుటకు యోగ్యుడై యున్నాడు. అట్లు జీవుడు స్పష్టముగా తెలియబడుచున్నను మూఢులగు జనులు యీ జీవుని యెరుగలేక భ్రమించియున్నారు. వివేకమే నేత్రముగా గలవారు యీజీవుని చూచుచున్నారు. అర్జునా! కొందరు యోగులు సమాధిచిత్తముగలవారై ప్రయత్నించి తమ బుద్ధియందుండు జీవుని చూచుచున్నారు. కొందరు యోగులు ప్రయత్నము చేసియు. వివేకజ్ఞానము లేనివారై యీ జీవుని చూడజాలరు. అర్జునా! సూర్యునియందుగల యేప్రకాశము సకల జగత్తును ప్రకాశింపజేయుచున్నదో, ఆ ప్రకాశము పరమేశ్వరుడనగు నా సంబంధమైనదని తెలిసికొనుము. చంద్రుని యందును, అగ్నిహోత్రుని యందును యేప్రకాశము గలదో, ఆ ప్రకాశమంతయు నాసంబంధమైనదని తెలిసికొనుము. సూర్యచంద్ర అగ్నిహోత్రుల యందుండు చైతన్యరూపమగు జ్యోతి యెద్దిగలదో ఆజ్యోతి విష్ణువగు నాయొక్క జ్యోతియని తెలియవలెను.

అర్జునా! నేను భూమియందు ప్రవేశించి బలముచేత భూతములను జగత్తును ధరింపుచున్నాను. నేను రసస్వరూపుడగు చంద్రుడనై భూమియందు పుట్టు సకల ఓషధులను సారవంతములుగా జేయుచు పోషింపుచున్నాను. అర్జునా! నేను గర్భమందుండు అగ్నిహోత్రుడనై ప్రాణులదేహములయందు ప్రవేశించినవాడనై ప్రాణాపాన వాయువులతో గూడియున్నాను. అట్లు కూడియుండి ప్రాణులు భక్షించెడు భోజ్యభక్ష్యచోష్యలేహ్యములను నాలుగువిధములుగా నుండు అన్నమును జీర్ణింపజేయుచున్నాను. అర్జునా! పరమేశ్వరుడ

వెదకిన జ్ఞానులు. అభిమానరహిత బుద్ధులయందు ప్రవేశించి ఆత్మ ములను జయించిరి. అట్లున్న ఆత్మయగు నావలన సకలప్రాణు సుఖదుఃఖములు జ్ఞానములు మొదలగున వన్నియు కలుగుచున్నవి. సమస్తవేదముల చేతను పరమాత్మనగు నేనే యెరుగదగినవాడ నగు దును. వేదాంతార్థసంప్రదాయమును చేసినవాడను నేనే యగుదును. వేదార్థమును యెరిగినవాడను నేనే యగుదును.

అర్జునా! లోకమందు క్షరుడను పురుషు డొకడును. అక్షరు డను పురుషు డొకడును యిద్దరుపురుషులుగలరు. క్షరుడనగా నశిం చునది. అక్షరుడనగా నశించనిది. సకల చరాచరభూతములును క్షరపురుషుడని చెప్పబడును. జీవుడు అక్షరపురుషుడని చెప్పబడును. అర్జునా! యిద్దరు పురుషులకంటె అన్యమైన వుత్తమపురుషుడు పర మాత్మయగును. ఆపరమాత్మయే ప్రత్యగాత్మయని తెలిసికొనుము. ఆప్రత్యగాత్మయే వేదాంతములయందు పరమాత్మయని చెప్పబడును. అపరమాత్మయే తనశక్తిచేత సకలలోకములయందు ప్రవేశించి స్వరూపసద్భావమాత్రముచేత ధరింపుచున్నది. ఆపరమాత్మ యెప్ప టికిని నాశములేనివాడు ఆపరమాత్మయే యీశ్వరుడు. అర్జునా! పూర్వోక్తప్రకారము క్షరపురుషరూపమైన సంసారవృక్షముకంటెను ఆసంసారవృక్షము కలుగుటకు కారణమైన అక్షరపురుషుని కంటెను పరమేశ్వరుడ నగు నేను ఉత్తమపురుషుడనై యున్నాను. అందు చేతను లోకమందును వేదమందును నేను పురుషోత్తముడని చెప్ప బడుచున్నాను. అర్జునా! పూర్వోక్తప్రకారము పురుషోత్తముడను పరమేశ్వరుడగు నన్ను యెరిగినవాడు మోహము లేనివాడై సర్వ జ్ఞుడై సర్వాత్మ స్వరూపముగా నన్ను భజింపుచున్నాడు. అర్జునా! ఈశాస్త్రము మిక్కిలి రహస్యమైనది. ఇట్టి రహస్యమైన శాస్త్ర

మును పరమేశ్వరుడగు నేను నీకు చెప్పితిని. ఈ చెప్పబడినప్రకారము యీశాస్త్రార్థమును యెరిగినవాడు బుద్ధిమంతుడును కృతార్థుడును అగును. నావలన నీవు పరమార్థస్వరూపమును వింటివి. గనుక నీవును కృతార్థుడ వైతివి.

ఇది శ్రీకృష్ణార్జున సంవాదరూపమును బ్రహ్మవిద్యా
యోగశాస్త్రమును నగు భగవద్గీతోపనిషత్తు
నందు పురుషోత్తమ ప్రాప్తియోగ
మను పంచదశాధ్యాయము

---

## షోడశాధ్యాయము

భగవంతుడు అర్జునునిజూచి యిట్లనెను. దైవ ఆసుర రాక్షస స్వభావములు గలవారికి స్వభావగుణములను చెప్పెద వినుము. అర్జునా! భయపడకుండుటయు వ్యవహారములయందు పరులను మోసముచేయక న్యాయముగా ప్రవర్తించుటయు శాస్త్రఆచార్యుల వలన ఆత్మాదిపదార్థములను యెరుగుటయు, యెరిగిన విషయము లను ఇంద్రియనిగ్రహచిత్త సమాధులచేత అనుభవమునకు తెచ్చు కొనుటకై ప్రయత్నించుటయు, ఇది ముఖ్యమైన దైవసంబంధమగు సాత్వికసంపత్తుయని తెలిసికొనుము. ఇకను పుణ్యకర్మములయందు గల సాత్వికసంపదను చెప్పెదవినుము. అర్జునా! తన శక్తికొలది అన్నాదిపదార్థములను దానముచేయుటయు, బాహ్యేంద్రియములగు శ్రోత్రత్వక్చక్షుర్జిహ్వాఘ్రాణములను నిగ్రహించుటయు. శ్రౌతాగ్ని హోత్రాదులను గ్రహించుటయు దేవయజ్ఞాదులను చేయుటయు

ఋగ్వేదాది వేదములను చదువుటయు తపస్సు చేయుటయు వంకర గుణస్వభావము లేకుండుటయు ప్రాణులను బాధింప కుండుటయు, సత్యము చెప్పుటయు తాను పరులచేత బాధింపబడినను కోపము లేకుండుటయు కర్మములను విరక్తిచేతనువివేకముచేతను విడుచుటయు మనస్సును నిగ్రహించి శాంతము గలిగియుండుటయు, పరులదోషము లను పరునకు చెప్పకుండుటయు దుఃఖించు ప్రాణములయందు దయ గలిగియుండుటయు, విషయసుఖములు సమీపమందున్నను వికారము లేకుండుటయు, క్రూరస్వభావము లేక మృదువుగా నుండుటయు, సిగ్గుగలిగియుండుటయు, ప్రయోజనము లేనపుడు వాక్పాణిపాద పాయు ఉపస్థలను చలింపజేయకుండుటయు బుద్ధియందు తేజస్సు కలిగియుండుటయు, పరులచేత తాను కొట్టబడినను ఓర్పుగలిగి యుండుటయు ధైర్యము గలిగియుండుటయు, దేహ మనస్సుల యందు పరిశుద్ధిగలిగియుండుటయు పరులను బాధింపవలెనను తలంపు లేకుండుటయు, తాను పూజింపబడవలెనను అభిమానము లేకుండు టయు, యీ చెప్పబడిన గుణములు దైవసంపదయని చెప్పబడును. దైవప్రకృతి గలవానికి యీ గుణములు గలిగియుండును. ఇకను అసుర సంపదను చెప్పెద వినుము.

అర్జునా! పరులు మెచ్చుకొనుటకై డంబముగా ధర్మకార్య మును చేయుటయు, విద్యాధన స్వజన నిమిత్తమైన గర్వము గలిగి యుండుటయు తాను పూజింపబడవలెనను తలంపు గలిగియుండు టయు, క్రోధము కలిగియుండుటయు, కఠినముగా మాటలాడుటయు, చేయదగిన కార్యములయందు నాస్తికబుద్ధి గలిగియుండుటయు, యీ గుణములు అసుర సంపద యనబడును. అసుర ప్రకృతిగలవారికి యీ గుణములు కలిగియుండునని తెలియవలెను. అర్జునా! దైవసం పద సంసార మోక్షమును కలిగించును. ఆసురసంపద సంసార బంధ

పురుషసంపన్నుడనై తిననియు, అందుచేత నాతో సమానుడు మరి యొకడు లేడనియు. యాగముచేతయితరులను అవమానించెదననియు నాట్యమాడువారు మొదలగువారికి ధనాము లిచ్చెదననియు అధికసం తోషమును పొందెదననియు, యీరీతిగా అవివేకముచేత మోహింప బడి చెప్పుచుందురు. అర్జునా! యీ ప్రకారము అసురస్వభావముగల వారు అనేకవిధములగుచిత్తవిభ్రాంతులు గలవారై అవివేకముచేత ఆవరింపబడి కామభోగములయందే ఆసక్తులగుచు పాపములను సం పాదించుకొని నరకమందు పడుచుందురు. అర్జునా! ఆసురస్వభావము గలవారు తమను తామే మెచ్చుకొనుచు గర్వితులై ధననిమిత్తమైన అభిమానమదములతో గూడినవారై యుందురు. అట్టి అసురులు నామ మాత్రములైన యజ్ఞములను డంబముకొరకు అశాస్త్రీయముగా చేయుచుందురు. అసురులు అహంకారబల గర్వకామక్రోధాది దుర్గు ణములు గలవారగుచు సర్వసాక్షియగు నాయొక్క ఆజ్ఞను అతిక్ర మించుటచేత నన్ను ద్వేషింపుచు మంచిమార్గమందు ప్రవర్తించు వారిని చూచి అసూయపడుచుందురు. అట్లు సాధువులను చూచి ద్వేషించు అసూయాసుర స్వభావము గల క్రూరజనులను నేను శీఘ్రముగా పెద్దపులి సింహము మొదలగు అసుర యోనులందు పుట్టించుచున్నాను. అర్జునా! అసురయోనిని పొందిన మూఢులు పశ్వాదియోనులయందు పుట్టుచు పరమేశ్వరుడనగు నన్నెరుగజాలక క్రమక్రమముగా నీచజన్మములను పొందుచుందురు.

అర్జునా! నరకప్రాప్తికి కారణమైన ద్వారమును చెప్పెదను వినుము. నరకప్రాప్తికి మూడువిధములైన ద్వారములుకలిగియున్నవి. ఆ మూడుద్వారములలో యేద్వారమును పొందినను తనకు నాశము కలుగును. కామక్రోధలోభములను యీ మూడుగుణములును నరక ద్వారములగుచున్నవి. ఈ మూడును అసురస్వభావము లగును. యీ

మాటిలో యేగుణము కలిగియున్నను నరకముకలుగుచున్నది. గనుక మేలును కోరువాడు యీ మూడుగుణములను నిశ్శేషముగా విడువవలయును. అర్జునా! కామక్రోధలోభములను మూడుగుణములను విడిచినవాడు తనకు మేలు కలిగించు ప్రయత్నము చేయుచున్నాడు. అట్లు ప్రయత్నముచేసి అనుష్ఠించి మోక్షమైనను పొందగలడు. అర్జునా! లోకమందెవడైనను విధిప్రతిషేధ శాస్త్రమును విడిచి తన యిష్టప్రకారము ప్రవర్తించినయెడల అట్టివాడుపురుషార్థయోగ్యతను పొందజాలడు. గనుక అర్జునా! యీ లోకమం దట్టివాడు సుఖమునైనను స్వర్గమైనను, మోక్షమైనను పొందజాలడు. నీకు చేయదగిన కార్యములకును చేయరానికార్యములకును శాస్త్రము ప్రమాణమై జ్ఞానసాధనముగా నుండును. శాస్త్రవిధియందు చెప్పబడినప్రకారము నీవు యీమనుష్యలోకమందు నీ కులధర్మమగు కర్మమును చేయుటకు తగియున్నావు.

ఇది శ్రీకృష్ణార్జున సంవాదరూపమును బ్రహ్మవిద్యాయోగ
శాస్త్రమును అగు శ్రీ భగవద్గీతోపనిషత్తునందు
దైవాసుర సంపద్విభాగయోగ మను
షోడశాధ్యాయము

---

## స ప్త ద శా ధ్యా య ము

భగవంతుడైన కృష్ణుడు యీరీతిగా చెప్పగా అర్జునుడిట్లనెను. భగవంతుడా! కృష్ణా! లోకమందు కొందరు వేదశాస్త్రములందుచెప్పబడిన పద్ధతిని విడిచి శ్రద్ధగలవారై దేవతలను పూజింపుచున్నారు. అట్లు శ్రద్ధచేత పూజించినవారలకు సాత్విక పూజాసిద్ధి కలుగునో

లేక రాజసపూజాసిద్ధి కలుగునో లేక తామసపూజాసిద్ధి కలుగునో చెప్పుము. అని అర్జునుడు అడుగగా భగవంతుడైన శ్రీకృష్ణు డిట్లనెను. అర్జునా! పూర్వజన్మసంస్కారము చొప్పున ప్రాణులకు సాత్వికశ్రద్ధ యనియు, రాజసశ్రద్ధ యనియు, తామసశ్రద్ధ యనియు, యిట్లు మూడువిధములుగా శ్రద్ధగలుగుచున్నది. ఆశ్రద్ధలయొక్క పద్ధతిని చెప్పెదను వినుము. అర్జునా! సకలప్రాణులకును తమతమ పూర్వ జన్మ సంస్కారముప్రకారము శ్రద్ధ కలుగుచున్నది. ఏపురుషునకు ఎటువంటి శ్రద్ధకలుగునో ఆపురుషుడు అటువంటి శ్రద్ధామయుడు. అర్జునా! సత్వగుణనిష్ఠగలవారు దేవతలయందు శ్రద్ధాభక్తులు కలిగి దేవతలను పూజింపుచుందురని తెలిసికొనుము. రాజసనిష్ఠ గలవారు యక్షరాక్షసులయందు శ్రద్ధాభక్తులు గలిగి వారిని పూజింపుదురని తెలిసికొనుము. తామసగుణప్రధానులగు జనులు పిశాచములను భూతగణములను పూజింపుచు పిశాచ భూతగణములయందు శ్రద్ధా భక్తులు గలిగియుందురని తెలిసికొనుము. అర్జునా! అసురస్వభావము గలవారు శాస్త్రసమ్మతము గానట్టియు, భయంకర మైనట్టియు. తపస్సు చేయుదురు. ఆతపస్సు ప్రాణులకును,అట్టితపస్సుచేయువారికిని కూడ బాధకలిగించును. అట్టి తపస్సును చేయు అసురజనులు అహం కారదంభగుణములు గలిగి కామరాగబలములతో కూడియుందురు. అసురజనులు తపస్సుచేత తమయింద్రియములను శుష్కింపజేయుచు బుద్ధికి సాక్షియగు నాయొక్క ఆజ్ఞను అతిక్రమించుచు నన్నును శుష్కింపజేయు చున్నారు. నా ఆజ్ఞను అతిక్రమించుటయే నన్ను శుష్కింపజేయుటయని తెలిసికొనుము. ఇట్టి అవివేకులగు జనులు రాక్షసస్వభావులని యెరుంగవలయును. అర్జునా! సకలప్రాణులకును సాత్విక రాజస తామసములను గుణభేదమువలన ఆహారములును యజ్ఞతపోదానములును యిష్టము లగుచున్నవి. అది యెట్లనగా చెప్పెద వినుము.

అర్జునా! రసముగలిగియుండు పదార్థములును చమురు గలిగి యుండు పదార్థములును చిరకాలము చెడకయుండు పదార్థములును, హృదయమునకు ప్రియములైన పదార్థములును, ఆయుశ్శక్తి బల ఆరోగ్యసుఖప్రీతులను వృద్ధిబొందించుచున్నవి. ఈపదార్థములు సత్వ గుణముగలవారలకు యిష్టములై యుండును. రాజసగుణముగలవానికి మిక్కిలి చేదుగల పదార్థములును మిక్కిలి పులుసుగల పదార్థములును మిక్కిలి ఉప్పుగుణముగల పదార్థములును మిక్కిలి వేడి మిక్కిలి కారము, ఆవాలు మొదలగు మిక్కిలి ఉష్ణవస్తువులును భోజనమునకు యిష్టములై యుండును. ఈపదార్థములను భోజనము చేయగా దుఃఖశోకరోగములను కలిగింపుచుండును. ఇక తామస గుణముగలవానికి యిష్టముగల భోజనపదార్థములును, చెప్పెదను వినుము. అర్జునా! అగ్నిచేత పక్వముగాని పదార్థములును, రసము పోయిన పదార్థములును, చెడువాసనగల పదార్థములును పక్వమైన పిమ్మట రాత్రి గడచినపదార్థములును, భోజనము చేయగా మిగిలిన పదార్థములును యజ్ఞమునకు యోగ్యముగాని పదార్థములును, తామసగుణము కలవానికి యిష్టములై యుండును. ఇక సాత్వికాది యజ్ఞస్వరూపములను చెప్పెదను వినుము.

అర్జునా! శాస్త్రమందు చెప్పబడిన యజ్ఞమును శాస్త్రవిధి ప్రకారము చేయదలచి ఫలాపేక్షను విడిచి మనస్సును సమాధానము చేసికొని శాస్త్రప్రకారము చేయు యజ్ఞము సాత్వికయజ్ఞమనబడును. డంబముకొరకు ఫలము కలిగెడికొరకు చేయబడు యజ్ఞము రాజసగుణ ప్రధానమని తెలిసికొనుము. శాస్త్రమునకు సమ్మతము కానట్టియు, అన్నదానము లేనట్టియు, మంత్రహీనమైన ట్టియు, దక్షిణ లేనట్టియు, శ్రద్ధలేనట్టియు యీవిధమైనయోగ్యమును చేసినయెడల అది తామసగుణప్రధానమని తెలిసికొనవలెను. విః కల్మషనా

దేవతలను, బ్రాహ్మణులను, గురువులను, పెద్దలను పూజించుటయు పరిశుద్ధి గలిగియుండుటయు, వంకరస్వభావము లేకుండుటయు స్త్రీలతో భోగింపకుండుటయు, హింసింపకుండుటయు, యీగుణములు శరీరము చేసిన తపస్సు యని తెలియవలెను. పరులకు దుఃఖము కలిగించని వాక్యములను చెప్పుటయు సత్యముగా మాటలాడుటయు ప్రియమును కలిగించుమాటలు చెప్పుటయు మేలుకలుగు మాటలు చెప్పుటయు వేదములు చదువుటయు ఇవి వాక్కు చేసిన తపస్సని తెలియవలెను. మనస్సునకు సమాధిరూపమైన శాంతభావము కలిగి యుండుటయు, మాటలాడక మౌనమును ధరించియుండుటయు, మనస్సును నిగ్రహించుటయు, మనస్సునందు కామాదులు లేక పరిశుద్ధి గలిగియుండుటయు, మనస్సు చేసిన తపస్సు యగును.

అర్జునా! ఫలమును గోరని యోగులచేత యీ మూడువిధము లైన తపస్సు చేయబడినయెడల అట్టితపస్సు సాత్వికతపస్సు యని చెప్ప బడును. అర్జునా! పరులు తనకు సన్మానించుటకొరకును పరులు తనను పూజించుటకొరకును దంభముచేత చేయబడిన తపస్సు రాజస తపస్సని చెప్పబడుచున్నది. అవివేకమైన నిశ్చయముగలిగి తన దేహ మును కష్టపెట్టుచు చేసినతపస్సు, పరులను చంపుటకొరకు చేసినతప స్సును తామసతపస్సని చెప్పబడును. ఇక సాత్వికాదిదానభేదములను చెప్పెదను వినుము. అర్జునా! పుణ్యదేశమందును, పుణ్యకాలమం దును, సత్పాత్రమందును, ప్రత్యుపకారము చేయని వానికొరకును యివ్వదగిన దానము యిచ్చినయెడల అట్టిదానము సాత్వికదానమని యందురు. అర్జునా! ఫలమునుగోరి చేసినదానము, మనోదుఃఖము చేత చేసినదానము, ప్రత్యుపకారము కలుగుకొరకు చేసినదానము రాజసదానమని చెప్పబడును. పుణ్యస్థలము కాని ప్రదేశమం దున్నను అనగా మ్లేచ్ఛులు మొదలగు అపరిశుద్ధజనులు కూడి

యుండు ప్రదేశమందును, అశుచిగానుండు ప్రదేశమందును, సంక్రాంత్యాది హేతువులేని కాలమందును, పాత్రులుగాని మూర్ఖజనులకొరకు చేయబడిన దానమును తామస దానమందురు. నర్జునా! పరమాత్మయొక్క నామోచ్చారణము ఓమ్ అనియు, తత్ అనియు సత్ అనియు మూడువిధములుగా వేదాంతములయందు బ్రహ్మవేత్తలచేత చెప్పబడుచున్నది. అట్టి నామోచ్చారణములచేత పూర్వము బ్రాహ్మణులును వేదములును, యజ్ఞములును నిర్మింపబడినవి. అందుచేతనే పండితులగువారు ఓం అని మొదట చెప్పి పిమ్మట యజ్ఞదానతపోక్రియాదులను ప్రారంభించి చేయుచున్నారు. మోక్షాపేక్ష గలవారు కర్మఫలము నపేక్షింపక నానావిధములైన యజ్ఞదాన తపోక్రియాదులను చేయునపుడు తత్ అను పరమాత్మనామమును, ఉచ్చరించి పిమ్మట సకల కర్మములను చేయుచున్నారు. అర్జునా! ఉన్నది అనుటయందును, శ్రేష్ఠము అనుట యందును సత్ అను పరమాత్మనామ ముచ్చరింపబడుచున్నది. ప్రసిద్ధమైన కర్మమునుచేయు నపుడును సత్ అను నామము చెప్పబడుచున్నది.

అర్జునా! యజ్ఞతపో దానములయం దెట్టి నిష్ఠగలదో అట్టి నిష్ఠసత్తని చెప్పబడుచున్నది. పరమేశ్వరార్పణమైన కర్మము సత్తని చెప్పబడుచున్నది. ఇట్లు పరమాత్మయొక్క పేర్లగు ఓం తత్సత్ అను యీ మూడుపేర్లను శ్రద్ధాభక్తులచే వుచ్చరించి సకల కర్మములను చేసినయెడల అట్టి కర్మములు సుగుణము కలవికానివి యైనను, సాత్విక కర్మములగుచున్నవి. గనుక శ్రద్ధచేత సర్వశుభములను పొందవచ్చును. గనుక అర్జునా! అశ్రద్ధచేత చేసిన హోమము వ్యర్థమగును. అశ్రద్ధచేత బ్రాహ్మణాదులకు చేసిన దానములు వ్యర్థములు. అశ్రద్ధచేత చేసిన తపస్సు వ్యర్థము. అశ్రద్ధచేత చేసి[illegible]స్తుతి

నమస్కారాది పూజంతయు వ్యర్థము. అశ్రద్ధచేత అధికాయాస ముగా విశేషకర్మములు చేసినను కర్మములన్నియు వ్యర్థము లే యగుచున్నవి. అట్టి అశ్రద్ధ కర్మమువలన యీ లోకమందును పర లోక మందునుగూడ ఫలము కలుగనేరదని తెలియపలెను.

ఇది శ్రీకృష్ణార్జునసంవాద రూపమును బ్రహ్మవిద్యా యోగ
శాస్త్రమును అగు శ్రీ భగవద్గీతోపనిషత్తునందు
శ్రద్ధాత్రయ విభాగయోగ మను
సప్తదశాధ్యాయము

---

## అష్టాదశాధ్యాయము

భగవంతుడగు కృష్ణుడు యీవిధముగా చెప్పగా అర్జును డిట్లనెను. మహాత్మా! కృష్ణా! సన్యాస శబ్దమునకును త్యాగశబ్దము నకును గలిగియుండు నిశ్చయార్థమును తెలిసికొన గోరుచున్నాను. గాన ఆ రెండు శబ్దములకు గల నిశ్చయార్థమును ప్రత్యేకముగా వివ రించి చెప్పుము. అని యడుగగా అర్జునకు భగవంతుడైన కృష్ణదేవు డిట్లని చెప్పసాగెను.

అర్జునా! పండితులగువారు కొందరు కామ్య కర్మములగు అశ్వమేధాది యజ్ఞములను చేయక విడుచుటయే సన్యాస శబ్దము నకు అర్థమని చెప్పుదురు. పండితులగువారు చేయదగిన నిత్యనైమి త్తికములను సర్వకర్మములయొక్క ఫలములను కోరకుండుటయే సర్వకర్మఫలపరిత్యాగమని త్యాగశబ్దమునకు అర్థము చెప్పుదురు. అనగా సర్వకర్మములను చేయుచు అందువలన కలిగిన ఫలము

తమను బంధించకుండునట్లు ఆఫలమును కోరక విడుచుటయే సర్వ కర్మఫలపరిత్యాగ మని తెలియవలెను. మరికొందరు పండితులు కర్మము సంసారబంధమును కలిగించుననియు, అందుచేత ముముక్షువు లగువారు సర్వకర్మములను చేయక విడిపించవలెనని చెప్పుదురు. కొందరు విద్వాంసులు యజ్ఞ దాన తపఃకర్మములను ముముక్షువు లగువారు చేయక విడువరాదని చెప్పుదురు. ఈ యభిప్రాయ మంతయు, అజ్ఞానుల విషయమైనదేగాని జ్ఞానులను గురించి చెప్పినది కాదని తెలియవలెను. అర్జునా! యీ చెప్పబడిన కర్మసన్యాసమందును, కర్మఫల పరిత్యాగమందును, నా నిశ్చయమును చెప్పెదను వినుము. కర్మసన్యాసమనునది, కర్మఫల పరిత్యాగమనునది యీ రెండును ఒక్కటే ఆరెండును కలిపి త్యాగమనబడును. ఆత్యాగము సాత్విక రాజసతామసములను మూడువిధములుగా శాస్త్రముల యందు చెప్పబడు చున్నది. నా యభిప్రాయమును చెప్పెదను వినుము.

అర్జునా! యజ్ఞకర్మములను దానములను తపస్సును యీ మూటిని విడువరాదు. యీ మూటిని చేయుచుండవలయును. ఈ మూడుకర్మములను ఫలము గోరక చేసినయెడల చిత్తశుద్ధిని కలిగించుచున్నవి. గనుక యీ మూడును పండితులకు పరిశుద్ధిని కలిగింపుచున్నవి. గనుక అర్జునా! యజ్ఞ దాన తపస్సులను చేయుచు ఆ కర్మములయందు ఆసక్తిని విడిచి ఆ కర్మముల ఫలములను వదలి పెట్టవలయును. కర్మములందును, కర్మఫలములందును ఆసక్తిని విడిచి యజ్ఞ దాన తపస్సులను చేయుచుండవలయును. ఇది పరమేశ్వరుడనగు నాయొక్క మతమని తెలిసికొనుము. అర్జునా! అజ్ఞాని యగువాడు నిత్యకర్మమును విడువకూడదు. నిత్యకర్మము పరిశుద్ధిని కలిగించును. అట్టి నిత్యకర్మమును అజ్ఞానమువలన విడిచినయెడల

అట్టి పరిత్యాగము తామస పరిత్యాగమని చెప్పబడును. శరీర దుఃఖ భయమువలన చేయదగిన కర్మమును చేయక విడిచినయెడల అట్టి కర్మత్యాగము రాజస త్యాగమనబడును గాని సర్వ కర్మత్యాగఫల మగు మోక్షము కలుగనేరదు. కర్మములయందు. కర్మ ఫలముల యందును ఆసక్తిని విడిచి నిత్యకర్మము చేయదగినదేయని నిత్యకర్మ మును చేసినయెడల అట్టిత్యాగము సాత్విక త్యాగమనబడును. ముముక్షువగువాడు నిత్యకర్మానుష్ఠానము చేయుచు పరిశుద్ధచిత్త ముగలవాడై క్రమముగా ఆత్మజ్ఞాననిష్ఠుడగును. అర్జునా! ముము క్షువు కామ్యకర్మము సంసారకారణమగునని తలచి అట్టి కర్మమును గురించి కోపించుకొనడు. నిత్యకర్మము, చిత్తశుద్ధిద్వారా మోక్ష కారణమగునని తలచి అట్టి నిత్యకర్మమందు అసక్తినుంచడు. ముము క్షువు అత్మానాత్మ వివేకజ్ఞాన హేతు వగు చిత్తశుద్ధిని గలిగియుం డును. ఆత్మజ్ఞాన లక్షణమైన ప్రజ్ఞావంతుడై సకల సంశయములను విడిచి విజ్ఞాననిష్ఠను పొందుచున్నాడు. అర్జునా! దేహమేనేనను అభి మానముగలవాడు నిశ్శేషముగా కర్మములను విడుచుటకు సమర్థుడు కాజాలడు. గనుక అట్టి అజ్ఞాని నిత్యకర్మములను చేయుచు కర్మ ఫలమునందు అపేక్షనుమాత్రము విడిచినయెడల అట్టివాడు త్యాగి యని చెప్పబడును.

అర్జునా! అనిష్టమనియు, ఇష్టమనియు, మిశ్రమ మనియు, యిట్లు కర్మఫలము మూడువిధములుగా నున్నది. అందు నరకము లను పొందుటయు పశ్వాదిజన్మములను పొందుటయు అనిష్టఫల మన బడును. దేవాది శరీరములను పొందుట యిష్టఫలమనబడును. మనుష్యదేహమును బొందుట మిశ్రఫలమనబడును. ధర్మాధర్మాది లక్షణమైన పుణ్య పాపకర్మములకు యీ చెప్పినప్రకారముగామూడు విధములైన ఫలములు కలుగుచుండును. కర్మఫలమందు అపేక్షగల

వారికి ఆ దేహమును విడిచిన పిమ్మట ఇష్టానిష్టఫలములు కలుగు చుండును. ఆత్మజ్ఞానులగువారికి కొంచెమైనను కర్మఫలము కలుగ జాలదు. ఈ చెప్పిన విషయమంతయు అజ్ఞానులకే చెప్పబడినదని తెలియవలయును. అర్జునా ! సిద్ధాంతమందును వేదాంత శాస్త్రమం దును సర్వకర్మములను చేయుటకు అయిదు కారణములు చెప్పబడి యున్నవి. అయిదుకారణములవలనను, సకలకర్మములు చేయబడు చున్నవి. అయిదుకారణములను నా వాక్కువలన వినుము.

1 దేహము 2 కర్తయను అహంకారము 3 శ్రోత్రాది ఇంద్రియము. 4 ప్రత్యేకముగానుండు ప్రాణ అపానాది వాయువుల యొక్క వ్యాపారము 5 నాలుగు కారణములయందు సూర్యాది అధి దేవత అయిదవ కారణమగును. ఈ అయిదును సకల కర్మము లను చేయుటకు కారణములైయున్నవి. అర్జునా ! మనుష్యుడు మనో వాగ్దేహములచేత యే కర్మమును చేయుటకు ప్రారంభింపుచున్నాడో అట్టికర్మము పుణ్యమైనను పాపమైనను ఆ కర్మమున ముందు చెప్పిన దేహాదులైదును కారణములైదును కారణములైయున్నవి. ఇట్లు చేయుటకు కారణములు వేరైయుండగా కేవలముగా తానేకర్త యని యెవడు చూచునో అట్టివాడు చెడుబుద్ధిగలవాడై చెడుబుద్ధిని గలిగి యుండుటవలన ఆత్మత్వమును యెరుగక నశించుచున్నాడు. అర్జునా ! కర్తృరూపమగు నేనను అహంభావము లేనివాడును ఈ కర్మఫలమును నేను పొందుదునను అభిమానము లేనివాడును యీ సకల జనులను చంపినను చంపినవాడుకాడు. అట్టి కర్మఫలముచేత బంధింపబడువాడును కాడు. అర్జునా ! కర్మములను చేయుటకు ప్రేరేపించునవి మూడుయగును. అవి చెప్పెద వినుము.

1 జ్ఞానము 2 జ్ఞేయము 3 పరిజ్ఞాత యీ మూడును కర్మము లను చేయుటకు ప్రేరేపించునవి. యగును. సర్వవిషయములను యెరి

గడి వ్యవహారపు తెలివి జ్ఞానమనబడును. అట్టివ్యవహారపు తెలివిచేత యెరుగదగిన లోకవస్తువులు జ్ఞేయమనబడును. అవిద్యచేత కల్పింపబడిన భోక్తయగు జీవుడు పరిజ్ఞాతయనబడును. మూడును సర్వకర్మములను చేయుటకు ప్రేరేపించుచుండును. ఈ మూడును చేరియున్నప్పుడు విడుచుట, గ్రహించుట, వుపేక్షించుట, అను ప్రయోజనముగల కర్మము ప్రారంభమగును. అటుపిమ్మట దేహాది పంచహేతువులవలన కర్మము చేయబడి మనోవాగ్దేహములచేత ఆకర్మము మూడువిధములు గలదగుచు మూడురాసులుగా నుండును. కర్మ సంగ్రహము మూడు విధములగును. అవిచెప్పెదను వినుము.

1 కరణము 2 కర్మము 3 కర్త యీ మూడును చేరి కర్మ సంగ్రహమగును. శ్రోత్రము మొదలగు బాహ్యేంద్రియములను బుద్ధ్యాదిఅంతఃకరణ భేదమును కరణమనబడును. క్రియచేత పొందబడునది కర్మమనబడును. కరణములచేత వ్యాపారములను చేయువాడు కర్తయనబడును. ఈ మూటియందును కర్మము గ్రహింపబడుచున్నది. అర్జునా! జ్ఞానము కర్మయు కర్మములను చేయువాడగు కర్తయు యీ మూడును సాత్వికాది గుణభేదమువలన మూడువిధములుగానున్నవని కపిల శాస్త్రమందు చెప్పబడియున్నది. ఆ కపిల శాస్త్రము గుణభోక్తృ విషయమందు ప్రమాణమగునుగాని వేదాంతము నందు చెప్పబడిన అద్వైతజ్ఞానమునకు విరోధమగును. ఆ కపిల శాస్త్రమందు చెప్పబడిన జ్ఞానాది భేదములను చెప్పెదవినుము.

అర్జునా! అవ్యక్తము మొదలుకొని స్థావరాంతమువరకు గల సర్వభూతములయందును ఆత్మవస్తువు ఒక్కటే ఆకాశమువలె పరిపూర్ణమైయున్నదని చూచుజ్ఞానము సాత్వికజ్ఞానమని తెలిసికొనుము. ప్రతిదేహమందును ఆత్మ ప్రత్యేకముగా నానావిధములై యున్నట్లు చూచుజ్ఞానము రాజసగుణమువలన పుట్టిన జ్ఞానమని తెలిసికొనుము.

అర్జునా! ఒక దేహమందు కూడినజ్ఞానము సర్వవిషయమైనదానివలె నుండునో అట్టి జ్ఞానము తమోగుణమువలన పుట్టిన దగుటవలన తామసజ్ఞానమని చెప్పబడును. ఈ తామసజ్ఞానము కారణములేనిది గాను అల్పఫలముగలదిగాను వాస్తవముగా లేనిదిగాను ఉన్నది. అర్జునా! ఫలమును కోరక రాగద్వేషములను విడిచి ఆసక్తి రహితముగా చేయబడిన నిత్యకర్మము సాత్వికకర్మమని చెప్పబడును. నేను చేయుచున్నానని అహంకారముతో గూడుకొని కర్మఫలమును కోరుచు అధికప్రయాసముతో చేసినకర్మము రాజసకర్మ మనబడును. అర్జునా! తామసగుణముకలవాడు ముందు కలుగబోవు కార్యమును యోచించక కర్మమును చేయును. అట్టి కర్మమువలన శక్తిధనములు నశించును. ప్రాణులకు బాధకలుగును. ఈ పనిని నేను చేయుటకు శక్తుడనగుదునని యోచించక అవివేకమువలన కర్మమును చేయుటకు ప్రారంభించును. ఈప్రకారము అవివేకమువలన చేయబడిన కర్మము తామసకర్మ మని చెప్పబడును. అర్జునా! కర్మఫలములయందు ఆసక్తి లేనివాడును, నేను కర్తనను అభిమానరూపమైన అహంకారము లేనివాడును, ధైర్యోత్సాహములతో గూడినవాడును, లాభాలాభములయందు వికారచిత్తము లేనివాడును, నగు కర్త సాత్వికుడని చెప్పబడును. కర్మములనుచేయువాడు కర్తయని తెలియవలయును. అర్జునా! కర్మములయందు అభిమానరూపమైన ఆసక్తి గలవాడును, కర్మఫలమును కోరినవాడును, పరులద్రవ్యమందు అభిలాషగలవాడును, పరులకు బాధ కలిగింపవలెనను స్వభావముగలవాడును, ఆచారము లేనివాడును, లాభనష్టములయందు సంతోషదుఃఖ స్వభావములు గలవాడును, ఇటువంటి కర్త రాజసకర్త యని చెప్పబడును. మనోనిగ్రహము లేనివాడును, మూఢబుద్ధి గలవాడును చురుకుతనములేక మొద్దువలె పడియుండువాడును, మాయాబుద్ధిగల

చు స్వభావముగలవ
వాడును, పరులను అవమానించుటవలన ఏ భావము గలవాడును, ను
గలవాడును, సర్వదా దుఃఖస్వభావుడుగ నుండి కర్త తామసక
పనులు చేయువాడును, ఇట్లని చెప్పినట్టి -యు, ధృతియొక్క -యు, సాత్త్వి
బడును. అర్జునా! బుద్ధియొక్క కర్మము చెప్పెదను.
భేదములను నిశ్శేషముగా చెప్పెదను. మార్గములను చేయదగిన కార్యము
కర్మమార్గసన్న్యాసమును పొందు స్వరూపమును, నిర్భయస్వరూపమును
చేయరాని కార్యమును, భయస్వరూపము మోక్ష స్వరూపమును,
సంసారబంధస్వరూపమును, సంసారమిక్కి బుద్ధి సాత్త్వికబుద్ధి యని యీవిష
యములను వాస్తవముగా యెరిగినను ము చేయదగినది చెప్ప
బడును. ధర్మమార్గము అధర్మమార్గ కర్మముగా యెరిగినబుద్ధి చేయరానిది
యీవిషయమును వాస్తవముగానియట్లు స్వరూపమగుటవలన రాజసబుద్ధి
యని చెప్పబడును. అజ్ఞానముచేత అధర్మమగు హింసాదికమును
ధర్మముగా యెరిగినబుద్ధియు, అనుకూలములను ప్రతికూలమైనవాని
నిగా యెరిగినబుద్ధియు, తామసబుద్ధి యని చెప్పబడును. అర్జునా! యే
ధైర్యశక్తి మనోవ్యాపారములను, ప్రాణఇంద్రియ వ్యాపారములను
చెడుమార్గములయందు పోనివ్వక యోగసమాధిచేతధరింపుచున్నదో
అట్టిధైర్యశక్తి సాత్త్వికధైర్య మనబడును. ఫలమును కోరుచు ఆసక్తి
చేత ధర్మార్థకామములను నిర్వహించుటకు మనస్సునందు ధరించిన
పురుషునియొక్క ధైర్యశక్తి రాజసమని చెప్పబడును. ఏధైర్యశక్తి
చేత పురుషుడు నిద్రాభయదుఃఖమదములను, దిగులును విడువకుం
డునో, అట్టిపురుషుని ధైర్యశక్తి తామసమని చెప్పబడును. అర్జునా!
ఇకను మూడువిధములైన సుఖములను చెప్పెదను వినుము. చిత్తపరి
శుద్ధి గలుగుటవలన ఆత్మానాత్మవివేకపూర్వకమగు అభ్యాసముచేసి
ఆత్మసుఖానుభవమందు క్రీడించుచు పురుషుడు సకలదుఃఖనాశనమును
పొందుచున్నాడు.

రక్షించుటయు, వర్తకము చేయువలన సర్వ సంసార హేతువులను కర్మములు. శూద్రునకు సేవారూక్షితొడనని తలచి అహంకారము కర్మము. అర్జునా! యీ పైన చెప్పినవియెడల నాశమును పొంద వైశ్య శూద్రులు తమ తమ కర్మములయందు పరుషు చెప్పిన మాటల గలవాడై సిద్ధిని పొందుచున్నాడు. తనకర్జునా! నీవు అహంకా చేసినవాడు యేప్రకారము సిద్ధినిపొందునో, యించిన యెడల అట్టి వినుము. ఈశ్వరునివలన సకల భూతములు, క్ష క్షీప్రకృతి నిన్ను యీశ్వరుని చేత ఈ సకలజగత్తు మిక్కిలిగా వ్యాపిం
అట్టి యీశ్వరునికి తన కులధర్మమును చేయుటవలన చేత నీవు చున్నది. తనకులమునకు స్వాభావమైన కర్మమును చేయుచు చేయు పాపమునుపొందడు. అర్జునా! త్రిగుణ స్వరూపమగుటవలన దోషేసె గలదని తలచి తన స్వాభావకర్మమును చేయక విడువకూడదు. పొ చేత అగ్ని కప్పబడినట్లు త్రిగుణరూపమగు పాపముచేత సకల కర్మ ములును కప్పబడియున్నవి. గనుక గుణసంబంధము లేనికర్మ మొక్కటి యైనను లేదు. అర్జునా! ఆసక్తి లేని బుద్ధిగలిగి మనస్సును నిగ్ర హించి సకలకోరికలను విడిచి తనకులధర్మమును చేయుచు కర్మ ఫల త్యాగము చేసినవాడు పరమార్థమైన నైష్కర్మ్యసిద్ధిని పొందు చున్నాడు. అర్జునా! జ్ఞాననిష్ఠయోగ్యతా రూపమగు నైష్కర్మ్య సిద్ధినిపొందినవాడు యేప్రకారముగా జ్ఞాననిష్ఠారూపముచేత పర బ్రహ్మమును పొందుచున్నాడో అట్టిజ్ఞాన నిష్ఠాక్రమమును నావాక్య మువలన సంక్షేపముగా చెప్పెదను వినుము.

అర్జునా! బ్రహ్మజ్ఞానముయొక్క యేపరమైన పరిసమాప్తి గలదో, అట్టి జ్ఞానపరిసమాప్తియే పరబ్రహ్మప్రాప్తియని తెలిసి కొనుము. బ్రహ్మజ్ఞానము యెట్లులభించునని యంటివేని చెప్పెదను వినుము, అర్జునా! బ్రహ్మజ్ఞానమందపేక్షకలవాడు మాయారహిత

మైన బుద్ధితోఁకూడినవాఁడై ధైర్యశక్తిచేత మనస్సును వశము చేసి కొనవలయును. పిమ్మట శబ్దస్పర్శాది విషయములను విడిచి రాగ ద్వేషములను పూర్తిగా విడువవలయును. పిమ్మట పరిశుద్ధప్రదే శములను సేవించుచు స్వల్పముగా ఆహారమును భుజించుచుండ వలయును.

ఆపిమ్మట మనోవాగ్దేహములను నిగ్రహించి సర్వదా ధ్యానా సక్తుఁడై వైరాగ్యమును ఆశ్రయించుచుండవలయును. పిమ్మట నేను విరక్తుఁడనను అహంకారమును, సామర్థ్యమును, గర్వమును, కామ క్రోధములను, బాహ్యవస్తుపరిగ్రహమును విడువవలయును. తరు వాత్ సాదియను మమకారములేనివాఁడై శాంతచిత్తుఁడై జ్ఞాననిష్ఠ ...ందుండవలయును, ఈ విధముగానుండు జ్ఞానవంతుఁడు మోక్షము నొందుటకు అర్హుఁడగుచున్నాఁడు. అర్జునా! అట్టి జ్ఞాననిష్ఠుఁడు నిర్మలమగు మనస్సుగలవాఁడై కష్టము కలిగినపుడు దుఃఖింపక, లభింపని పదా ర్థము నపేక్షింపక, ప్రవర్తించుచుండును. అట్టివాఁడు సకల ప్రాణుల యందును సమానభావముగల చిత్తముగలవాఁడై పరమేశ్వరుఁడగు నాయందు శ్రేష్ఠమైన జ్ఞానభక్తిని పొందుచున్నాఁడు అట్టి నాభక్తుఁడు నేను యెంతవాఁడనో యెటువంటివాఁడనో అట్టి పరమేశ్వరుఁడగు నన్ను జ్ఞానభక్తిచేత వాస్తవముగా తెలుసుకొనుచున్నాఁడు. పిమ్మటనాయందే ప్రవేశించి సంసారబంధ విముక్తుఁడగుచున్నాఁడు.

అర్జునా! పరమేశ్వరుఁడగు. నన్నాశ్రయించినవాఁడు సర్వదా సర్వకర్మములను చేయుచున్నను. నా యనుగ్రహమువలననాశరహిత మైన శాశ్వత పరమపదమును పొందుచున్నాఁడు. గనుక నీవు వివేక ముతోఁగూడిన బుద్ధిచేత సర్వకర్మములను నాయందు విడిచి నేనే పరమగతిగా గలవాఁడవై బుద్ధియోగమును ఆశ్రయించి సర్వదా నాయందు చిత్తముగలవాఁడవు గమ్ము. నాయందు చిత్తముగలవాఁడ

వైన యెడల నా అనుగ్రహమువలన సర్వ సంసార హేతువులను అతిక్రమించగలవు. నీవు నేను పండితుడనని తలచి అహంకారము వలన నేను చెప్పినమాటలను గ్రహించనియెడల నాశమును పొంద గలవు. గనుక నేను స్వతంత్రుడననియు, పరుడు చెప్పిన మాటల ప్రకారము చేయననియు యిట్లు తలచవద్దు అర్జునా! నీవు అహంకా రమును ఆశ్రయించి యుద్ధమును చేయనని నిశ్చయించినయెడల అట్టి నీ నిశ్చయము అబద్ధమగును. క్షత్రియస్వభావమైన నీప్రకృతి నిన్ను యుద్ధముచేయునట్లుగా నియమించియున్నది.

అర్జునా! నీక్షత్రియస్వభావమైన శౌర్యాదికర్మముచేత నీవు బంధింపబడియున్నావు. ఆ హేతువుచేత నీవు యేకర్మమును చేయు టకు సమ్మతింపవో ఆకర్మమును అవివేకమువలన పరవశుడవై చేసె దవు. అర్జునా! ఈశ్వరుడు సకల ప్రాణులయొక్క హృదయప్రదేశ మందుండి యంత్రములయందుండు బొమ్మలను భ్రమింపజేసినట్టు మాయచేత సకలప్రాణులను భ్రమింపజేయుచున్నాడు.

అర్జునా! సంసారదుఃఖమును పోగొట్టుటకొరకు ఆయీశ్వరునే శరణుపొందుము. సర్వభావములచేత ఆయీశ్వరుని ఆశ్రయించిన యెడల ఆయీశ్వరుని అనుగ్రహమువలన పరమశాంతినిపొంది విష్ణు వగు నాయొక్క పరమపదమును పొందగలవు. నాపరమపదము నిత్య మైనదగును. అర్జునా! యీశ్వరుడనగు నాచేత అతిరహస్యమైన యీ జ్ఞానము నీకొరకు చెప్పబడెను. ఈ చెప్పబడిన జ్ఞానమునందుగల అర్థమునంతయు చక్కగా యోచించి యెట్లుకోరెదవో అట్లుచేయుము. మరల నేను చెప్పుమాటను వినుము. ఇదివరకు చెప్పినను మరల అతి రహస్యమైన మిక్కిలి మంచిమాటను చెప్పెదను వినుము. నీవునాకు మిక్కిలి యిష్టుడవైనందున, నీకు విజ్ఞానప్రాప్తి సాధనరూప మగు మేలుకలిగెడి మాటను చెప్పెదను.

అర్జునా! పరమేశ్వరుడగు నాయందు చిత్తము గలవాడవగుము. నన్ను భజించెడివాడవగుము. నన్ను గురించి యజ్ఞము చేయువాడవగుము. నాకే నమస్కరింపుము. ఇట్లు చేయుచుంటివేని పరమేశ్వరుడనగు నన్ను పొందగలవు. ఈవిషయమై నేను సత్యమైన ప్రతిజ్ఞను చేయుచున్నాను. గనుక కలుగబోవు మోక్షఫలముకొరకు అవశ్యముగా నాభక్తుడవగుము. అర్జునా! సర్వకర్మములను సన్న్యసించి పరమేశ్వరుడగు వాసుదేవుడు నేనే ననియు నాకంటె అన్యము కొంచెమైనను లేదనియు యిట్లు నన్నొక్కని ఆశ్రయింపుము. అట్లు నన్ను నిశ్చయబుద్ధిచేత ఆశ్రయించితివేని నేను సకలపాపములనుండి నిన్ను మోక్షమును పొందించెదను. గనుక నీవు దుఃఖించవద్దు. అర్జునా! మోక్షశాస్త్రము నాచేత నీకు చెప్పబడెను. ఈశాస్త్రము తపస్సులేనివానికి చెప్పరాదు. తపస్సు గలిగియున్నను గురువునందును దేవునియందును భక్తి లేనివానికి యేఅవస్థయందైనను చెప్పకూడదు. భక్తితపస్సులు గలిగియున్నను వినుటకు యిచ్ఛయించనివానికి చెప్ప రాదు. వాసుదేవుడగు నన్ను సాధారణమనుష్యునిగాదలచి నాయందసూయాగుణము గలిగియున్నవానికిని చెప్పరాదు. అర్జునా! యీ గీతాశాస్త్రము అతిరహస్యమైనది. ఈగీతాశాస్త్రమును నాభక్తులగు వారికి యెవడు చెప్పునో అట్టివాడు నాయందు పరమభక్తి గలవాడై నన్నే పొందుచున్నాడు. ఈవిషయమందు సంశయము లేదు. అట్టి మనుష్యునికంటె నాకు ప్రియముకలిగించువాడు ఒకడైనను లేడని తెలిసికొనవలెను. అట్టివానికంటె మరియొక ప్రియుడు నాకు యిపుడైనను యింకనురాబోయెడికాలమందైనను యీలోకమందుకలుగడు. అర్జునా! మనసంవాదరూపమైన యీ గీతాశాస్త్రమును యెవడు చదువునో అట్టివాడు జ్ఞానయజ్ఞముచేత నన్ను పూజించినట్లగునని నా యభిప్రాయము. అట్లు యీ గీతాశాస్త్రమును పఠించిన దేవయజ్ఞమును చేసినఫలమును పొందుచున్నాడు.

అర్జునా! మూఢబుద్ధిగలవాడైనను, శ్రద్ధావంతుడైనాయందు అసూయలేక యీగీతాశాస్త్రమును వినినయెడల అట్టివాడును పాపములవలన విడువబడి అగ్నిహోత్రాది పుణ్యకర్మములు చేసినవారికి కలిగెడు పుణ్యలోకములను పొందుచున్నాడు. మూఢుడే యిట్లు పుణ్యలోకమును పొందునప్పుడు ప్రజ్ఞావంతుడు వినినయెడల అట్టివానిని గురించి చెప్పవలసిన పనిలేదు. అర్జునా! నేను చెప్పిన యీ గీతాశాస్త్రమును నీవు యేకాగ్రబుద్ధిచేత చక్కగా వింటివిగదా!! నావాక్యములను నీవు వినినందున నీకుగల అవివేకము నశించినది గదా! అని యిట్లు భగవంతుడగు కృష్ణుడు చెప్పగా అర్జునుడు యిట్లనెను, భగవంతుడా! కృష్ణా! నీ యనుగ్రహమువలన యజ్ఞానమువలన పుట్టిన నామోహము నశించినది. ఆత్మస్వరూపవిషయమైన వివేకము నాకు లభింపబడినది. ఇట్లు చెప్పుటచేత సర్వశాస్త్రార్థము యీగీతాశాస్త్రమందు చెప్పబడెనట్లు తెలియుచున్నది. కృష్ణా! నీయాజ్ఞయందు ప్రవర్తింపుచున్నవాడనైతిని. నాకు గల సంశయమంతయు నివర్తించినది. నీవాక్యప్రకారము చేసెదను. నీయనుగ్రహమువలన నేనును కృతార్థుడనైతిని అనగా పురుషార్థములకొరకు నేను చేయదగినది కొంచెమైనను లేదు. అని యర్జునుడు కృష్ణునితో చెప్పినట్లు సంజయుడు ధృతరాష్ట్రునితో చెప్పి కథాసందర్భమున ఇట్లనెను.

ధృతరాష్ట్ర మహారాజా! యీ ప్రకారము మహాత్ములైన కృష్ణార్జునులకు జరిగినసంవాదము నేను వింటిని. ఆసంవాదము మిక్కిలి ఆశ్చర్యము కలిగించుచు రోమహర్షణము గావించుచుండెను. వేదవ్యాసమునియొక్క కృపవలన నాకు దివ్యనేత్రలాభము గలుగుటచేత యీఅధికరహస్యమైనభగవద్గీతలను వినినవాడనైతిని. ఈశాస్త్రము యోగజ్ఞానవిషయమైనది. అట్టి శ్రేష్ఠమైన యీ గీతాశాస్త్రమును సాక్షాత్తుగా నేను భగవంతునివలన వినినవాడనైతిని. ధృతరాష్ట్ర

మహారాజా! కృష్ణార్జునులకుజరిగిన యీసంవాదమునువిని నేనుమాటి మాటికి సంతోషింపుచున్నాను. ఈసంవాదము నాకు ఆశ్చర్యమును కలిగించుచున్నది. విష్ణువుయొక్క విష్ణురూపమును నేను మాటిమాటికి స్మరింపుచు ఆశ్చర్యమును పొందుచున్నాను. ఆనందింపుచున్నాను. విశేషించి చెప్పుటవలన ప్రయోజనములేదు గనుక ముఖ్యమైనమాట చెప్పెదను వినుము. ధృతరాష్ట్ర మహారాజా! ఏపక్షమందు సర్వ యోగీశ్వరుడగు కృష్ణుడును గాండీవధరుడగు అర్జును డుండెనో అట్టి పాండవులపక్షమందు లక్ష్మివిజయైశ్వర్య న్యాయము లుండునని నాకు నిశ్చయమైన అభిప్రాయము కలదు,

ఇది శ్రీకృష్ణార్జున సంవాదరూపమును బ్రహ్మవిద్యా
యోగశాస్త్రమును అగు శ్రీ భగవద్గీతోపనిష
త్తునందు మోక్షసన్న్యాసయోగమను
అష్టాదశాధ్యాయము

## భీష్మునియొక్క మొదటియుద్ధము

అని సంజయుడు చెప్పగా ధృతరాష్ట్రుడు యిట్లనెను. సంజయుడా! ఆప్రకారము కౌరవపాండవుల సైన్యములు రెండును యుద్ధమునకు సర్వసిద్ధమైనపిమ్మట ఆరెండుపక్షములవారిలో మొట్టమొదట యుద్ధమునకు ముందునడిచినవా రెవరో చెప్పుము. ఆయుద్ధము యే ప్రకారముగా జరిగెనో చక్కగా తెలియచెప్పుము. అని ధృతరాష్ట్రుడు అడుగగా సంజయుడు ధృతరాష్ట్రునిజూచి యిట్లనెను.

(ధృతరాష్ట్ర) మహారాజా! నీపెద్దకొడుకగు దుర్యోధనుడు యుద్ధము నడిపించుటకు ప్రయత్నించెను. దుర్యోధనుడు దురహంకారముచేత ఆజ్ఞాపించగా బాహుబలగర్వవంతుడగు దుశ్శాసనుడు వెళ్ళి తమసైన్యములను పురికొల్పెను. అట్లు పురికొల్పగా కౌరవసైన్యములయందు శంఖములును భేరీవాద్యములును, మద్దెలమొదలగు వాద్యవిశేషములును, అధికముగా మ్రోగెను. ఆసమయమున భీష్ముడు మొట్టమొదట బయలుదేరి తన తెక్కెముచేత ప్రకాశింపుచు అతి భయంకరముగా పాండవసైన్యములమీదకు వచ్చెను. అట్లు వచ్చుచున్న భీష్మునిజూచి పాండవులు భీమునిముందర నుంచుకొని భీష్ముడు వచ్చుచోటున కెదురుగా నడచిరి. పాండవులు భీష్మున కెదురుగా నడచుచు పరస్పరము యుద్ధముచేయుటకు వుత్సహించి కౌరవుల సైన్యములయందుండు ఏనుగులు మొదలగువానిని గడ్డిపరకలవలె భావించుచు, నిర్వికారులై వెళ్ళిరి. ఓధృతరాష్ట్రమహారాజా! ఆసమయమున భీముడు అతిభయంకరముగా సింహనాదముచేసెను. ఆ భీముని సింహనాదధ్వని ఆకాశమునకు రంధ్రములను కలిగించునట్లుండు యితరవాద్యధ్వనులను మ్రింగివేసెను. ఆధ్వనివలన కౌరవ సైన్యభటులకును, యేనుగులకును, గుఱ్ఱములకును గుండెకాయలు పగిలిన ట్లుండెను. దుశ్శాసనుడును, దుష్ప్రహుడును, దుర్ముఖుడును, దుర్మర్షణుడును, వివింశతియు, వృషసేనుడును, చిత్రసేనుడును, వికర్ణుడును, పురమిత్రుడును వీరందరును దుర్యోధనునికి నేత్రానందమును కలిగించుచు భీమునిమీదకు వెళ్ళిరి. అప్పుడు నకులసహదేవ ధృష్టద్యుమ్న అభిమన్యుద్రౌపదీపుత్రులందరును భీమునికి సహాయులై వెళ్ళి ముందు నడచిరి. మరియు దుశ్శాసనాదులమీద వజ్రాయుధముతో సమానమైన బాణములను వేసిరి. ఆదుశ్శాసనాదులును మొడతెగని బాణవర్షముచేత నకులసహదేవాదులను కప్పిరి. ఆసమ్మ

యమున రెండుపక్షములవారి సైన్యములును ఆశ్చర్యభయములు గలిగి చిత్రపుబొమ్మలవలె నిలిచియుండెను. ఆసైన్యముల ననేక బాణసమూహములు కప్పెను. దుర్యోధనుడు మిక్కిలి గర్వముగల వాడై తన సైన్యములను పాండవసైన్యములమీదకు తరిమెను. అంతట ధర్మరాజు తమకు విజయము కలుగుటకొరకు తమ సైన్యములను కౌరవసైన్యములమీదకు పురికొల్పెను. అప్పుడు పాండవకౌరవ సైన్యములు రెండును పరస్పరము మిక్కిలి భయంకరముగా తాకినవి. ఆ రెండుసైన్యములయందుండు రథములును, యేనుగులును, గుఱ్ఱములును, భటులును, అతిభయంకరముగా ఒక్కపెట్టున ఆ యుద్ధభూమియందు ఒండొంటిని తాకెను. ఆతాకుడువలన యుద్ధభూమియందు రెండుసైన్యములలోనుండి అధికముగా దట్టమైన దుమ్ము లేచి ఆకాశమందంతటను వ్యాపించెను. ధృతరాష్ట్రమహారాజా ! ఆ యుద్ధభూమినుండి లేచినదుమ్ము ఆకాశమందు దట్టముగా వ్యాపించి రాహుమండలమువలె కనబడుచు సూర్యబింబమును కప్పెను. మరియు ఆ లేచినదుమ్ము యుద్ధభూమికి చాందినివలె నుండెను. అప్పుడు యెగసిన దుమ్ము యెఱ్ఱనిదగుటవలన ఆకాశమందుండు అప్సరస్త్రీలయొక్క ముంగురులందు ప్రవేశించి తుమ్మెదలమీద వ్రాలిన పుష్పములపొడివలెనుండెను. ఆలేచిన పచ్చనిదుమ్ము దిక్కులయందు వ్యాపించి అందుండు తూటులకు బంగారు రేకులు అంటించిన ట్లుండెను.

ధృతరాష్ట్రమహారాజా! ఏనుగులమెడలకు కట్టిన ఘంటధ్వనులును, గుఱ్ఱముల సకిలింతల ధ్వనులును, బాణములను సంధించుచు వేగముగా వదలుటవలన కలుగు ధ్వనులును మిక్కుటమైనందున ధ్వనులన్నియు యేకమై భూమ్యాకాశములు ప్రతిధ్వనులు మ్రోయుచున్నట్లుండెను. ఈధ్వను లధికముగానున్నందున సైన్యములయందు నానావిధములగు వాద్యధ్వనులు వినిపించలేదు. ఏనుగుగుంపుల

తొండములవలన కారుతుంపురనీటిచేతను, గుఱ్ఱపుదంతులరొమ్ముల ముక్కునోళ్ళనుండి కారిన చొంగనీటిచేతను, రక్తధారాప్రవాహముచేతనూ యుద్ధభూమి తడుపబడి అందుగల దుమ్మంతియు అణగెను. కౌరవ పాండవసైన్యములలో నుండు దొరలు తమతమ గురుతులతో ప్రకాశించు బిరుదుటెక్కెములు గలవారై శౌర్యము పురుషరూపములను ధరించి వచ్చినదోయనునట్లు తోచుచుండిరి.

ధృతరాష్ట్రమహారాజా! ఆసమయమున నీతండ్రియగు భీష్ముడు నీకొడుకులగు దుర్యోధనాదులకు సంతోషము కలుగుచుండగా కౌరవ సైన్యమును దాకి మధ్యాహ్నకాలమందుండు సూర్యునివలె తీక్ష్ణముగా ప్రకాశింపుచుండెను. అట్లు ప్రకాశింపుచుండు భీష్ముని అర్జునుడు చూచి తన ధనస్సుయొక్క అల్లెత్రాటిని సవరించుకొని శంఖమును పూరించి యుద్ధక్రీడయందు వుత్సాహము గలవాడై అడ్డములేని పరాక్రమముతో భీష్మునిమీదకు పోయెను. అప్పుడు అర్జునభీష్ములు భయంకరములైన మహాస్త్రములచేత అనేకరీతుల యుద్ధముచేసిరి. ఆసమయమున రౌద్రరసము ప్రబలియుండెను. సాత్యకి కృతవర్మను తరిమికొని అతనిమీదకు యుద్ధమునకు వెళ్ళెను. అంతట కృతవర్మ సాత్యకితో యుద్ధముచేసెను. అట్లు వారిద్దరును యుద్ధముచేయగా తీక్ష్ణబాణములవలన దెబ్బలుతగిలి వారిదేహములు రెండును పూచిన మోదుగువృక్షములవలె నుండెను. అభిమన్యుడు బృహద్బలుని తా అతనితో యుద్ధముచేసెను. బృహద్బలుడు అభిమన్యునియొక్క సారథినిచంపి గుఱ్ఱములప్రాణములను తీసెను. అభిమన్యుడు కోపమువలన యెఱ్ఱనినేత్రములు గలవాడై భయంకరముగా బృహద్బలుని సారథిని గుఱ్ఱములను చంపి టెక్కెమును నరికి ధనుస్సును త్రుంచివేసెను. పిమ్మట అభిమన్యుడు బృహద్బలుని దేహమందు బాణములను పూర్తిగా నిండించెను. అంతట భీమునిమీదకు మన భీష్ముడు

వెళ్ళి యుద్ధముచేసెను. వారిద్దరును అధికమైన కోపరోషములచేత యుద్ధముచేసి తమ అస్త్రవిద్యా నేర్పరితనమును ఆశ్చర్యముగా జూపిరి. వారి అస్త్రనైపుణ్యమును జూచి సైన్యములన్నియు ఆశ్చర్యమును పొంది తల్లడిల్లెను. దుశ్శాసనుడు నకులునిమీదికి వెళ్లి నకులుని మీద అధికతీక్ష్ణబాణములను వేసెను. నకులుడు నవ్వుముఖము గలవాడై బల్లెమువంటి ఒక బాణముచేత దుశ్శాసనుని ధనుస్సును నరికి వెంటనే యిరువదియైదు బాణములను దుశ్శాసనుని మీద వేసెను. అప్పుడు దుశ్శాసనుడు అతిశీఘ్రముగా మరియొక ధనుస్సును తీసికొని బాణసమూహముచేత నకులుడువేసిన యిరువదియైదు బాణములను నడుమనే నరికి నకులుని టెక్కెమును త్రుంచివేసెను.

ధృతరాష్ట్ర మహారాజా! దుర్ముఖుడు సహదేవునిమీదకు బోయి ప్రకాశమానములైన తీక్ష్ణబాణములను వేసెను. అప్పుడు సహదేవుడు దుర్ముఖుడు వేసిన బాణములను మళ్ళించి దుర్ముఖుని గుఱ్ఱములనుకొట్టి సారథినిచంపి సింహనాదము చేసెను. ధర్మరాజు రౌద్రాకారుడై శల్యునిమీదకు బోయెను. అప్పుడు శల్యుడు ఆ ధర్మరాజుయొక్క ధనస్సునరికెను. ధర్మరాజు నవ్వుచున్నట్లున్న కన్నులు గలవాడై అతిభయంకరముగా మరియొక ధనస్సును తీసికొని తీక్ష్ణబాణములను శల్యునిమీద వైచెను. అప్పుడు కౌరవసైన్యములు ధైర్యము లేకయుండెను. ధృష్టద్యుమ్నుడు ద్రోణాచార్యుని మీదకు పోయెను. ద్రోణాచార్యుడు అతిసులభముగా ధృష్టద్యుమ్నుని ధనుస్సును మూడు తునకలుగా నరికి ఒకయినుపబాణమును ధృష్టద్యుమ్నుని దేహమందు నాటెను. ధృష్టద్యుమ్నుడు శీఘ్రముగా మరియొక ధనుస్సును తీసికొని పదునాలుగు తీక్ష్ణబాణములను ద్రోణుని మీదవేసెను. మాగధ సహదేవుడు భూరిశ్రవుని మీదకు బోయి తేజోవంతములగు బాణములచేత అతని భుజమును నొప్పించెను.

భూరిశ్రవుడు కోపించుకొని ఒక భయంకర బాణముచేత ఆ మాగధ సహదేవుని రొమ్మును పగలగొట్టెను. మాగధసహదేవ భూరిశ్రవు లిద్దరును, వృత్రాసుర దేవేంద్రులవలె యుద్ధముచేసిరి. వారిద్దరిని సైన్యములు పొగడుచుండెను. ధృష్టకేతుడు బాహ్లికునిమీదకుబోయి అతని దేహమందు తొమ్మిది తీక్ష్ణబాణములను వేసెను. అంతట బాహ్లికుడు తన నేర్పుతనముచేత తొంబది బాణములను ధృష్టకేతుని దేహమందు నాటెను. అలంబసరాక్షసుడు భూమివడకుచుండగా వచ్చి ఘటోత్కచునితో యుద్ధముచేసెను. వారిద్దరియొక్క యుద్ధము మిక్కిలిగా సాగడదగియుండెను. గర్వముచేత శిఖండి అశ్వత్థామ మీదకుబోయెను. అశ్వత్థామ ఒక యినుపబాణమును శిఖండియొక్క రొమ్మునందు గుచ్చెను. ఆ బాణపుదెబ్బచేత శిఖండినొచ్చియు మిక్కిలి అధికమగు క్రూరబాణమును అశ్వత్థామ రొమ్మునందు నాటించెను. ధృతరాష్ట్ర మహారాజా! భగదత్తుడు విరాటునిమీదకు బోయెను. వారిద్దరును మిక్కిలి భయంకరముగా యుద్ధముచేసిరి. వారిద్దరి బాణసమూహములును ఆకాశమును కప్పి భయమును కలిగించెను. బృహత్క్షత్రుడును, కృపాచార్యుడును యుద్ధముచేసి ఒకరికొకరు టెక్కెములను గుర్రములను ధనుస్సులను నరికివేసిరి. వారిద్దరును అతిభయంకరములైన తీక్ష్ణపుకత్తులను ధరించి రథములు దిగి ఒకరిమీదకు ఒకరు వచ్చుచుండిరి. అస్థితిని చూచి సైంధవుడు కృపాచార్యునకు సహాయుడై అడ్డుపడెను. ద్రుపదుడు బృహత్క్షత్రునకు సహాయుడై అడ్డుపడెను. అడ్డుపడిన సైంధవ ద్రుపదులిద్దరును ఒకరికొకరు తీక్ష్ణబాణములచేత దేహపీడితులైరి. వారిద్దరి బలపరాక్రమ శౌర్య వేగములను జూచి అందరును మెచ్చుకొనిరి. అహంకార రోషవంతుడగు వికర్ణుడును యుధామన్యుడును తమ మాత్సర్య గుణములు ప్రకాశించునట్లుగా యుద్ధముచేసిరి. వారిద్దరియొక్క యుద్ధమునందు రౌద్రరసము తాండవించుచుండెను. వారిదరును

ఘోరముగా యుద్ధముచేయుచు ఒకరినొకరు తీక్ష్ణములగు బాణవర్ష ములచేత ముంచుచుండిరి.

ధృతరాష్ట్ర మహారాజా! చేకితానుడు సుశర్మను తాకి అతని మీద తీక్ష్ణములైన అనేక బాణములను వేసెను. సుశర్మ క్రూరము లగు శస్త్రాస్త్రములచేత చేకితానుని దేహమును నొప్పించి సింహ నాదమును చేసెను. శకుని ప్రతివింధ్యుని మీదకు వెళ్లెను. ప్రతివిం ధ్యుడు సింహపుపిల్ల యేనుగు మీదకు వెళ్ళినట్లు శకుని మీదకువెళ్ళి యుద్ధముచేసెను. శ్రుతసోముడును సుదక్షిణుడును కవిసి ఒకరిమీద ఒకరు క్రూరబాణములను వేయుచు సమానముగా యుద్ధమును చేయుచుండిరి. యమధర్మరాజుతో సమానబలవంతుడైన అధిక మహిమగల యిలావంతుడు మహాబలవంతుడగు శ్రుతాయువుతో యుద్ధముచేసెను. అట్లు వారిద్దరును యుద్ధముచేసి శీఘ్రముగానే బాణపుదెబ్బలచేత గుర్రములు చచ్చినందున యిద్దరును రథములేక యుండిరి. విందుడును అనువిందుడును వీరిద్దరు కుంతిభోజుని తోడను అతని కుమారుడగు పురజిత్తు తోడను యుద్ధముచేసిరి. పురజిత్తు బాణవర్షములచేత విందుని మునుగు నట్లు చేసెను. కుంతిభోజుడు వేయు బాణములను గదచేత తొలగగొట్టుచుండ అనువిందుడా కుంతి భోజుని మీదకు వచ్చెను.

ధృతరాష్ట్ర మహారాజా! కైకయు లయిదుమందిగాంధార దేశపు రాజులగు అయిదుగురితో క్రూరముగా యుద్ధముచేసిరి. దీర్ఘ బాహు డుత్తరునితో యుద్ధముచేసి తన పుత్సాహమును కనబర చెను. నలునికొడుకగు శతానీకుడు, ఉలూకునితో యుద్ధముచేసి తన శౌర్య బలశక్తిచేత మిక్కిలి ప్రకాశించెను.

ధృతరాష్ట్రమహారాజా! యారీతిగా ఆకౌరవ పాండవసైన్య ములలో నుండు రథిక శ్రేష్ఠులు ఒకరితోనొకరు అధికోత్సాహము

కలిగి ద్వంద్వయుద్ధముచేసిరి. అప్పు డాయుద్ధ
మందుండు సిద్ధులును చారణులును దేవతలును స్తోత్రె మొప్పుచుండిరి.
జరుగుచుండగా రెండుపక్షములలో నుండు చత్రములైన వెంటనే
తమ తమ జాతులతో పెనగెను. (రథములు, మెక్కి పరాక్రమిం
ములు, కాల్బలములు యీ నాలుగును చతురంగ బల యుద్ధమందు
రథములు, రథములమీదను, యేనుగులు, యేనుగులమీదను గా అశ్వ
ములు గుఱ్ఱములమీదను. కాల్బలము కాల్బలములమీదను. ఢము
పెనగుచుండెను. ఆ చతురంగ బలములు, తమ తమ జాతులకేతిని
పదులు పదులుగాను, నూరులు నూరులుగాను. వేలు వేలుగాను,
గుంపులు గుంపులుగాను కలిసి పెనగుచుండెను. ఆ రెండుపక్షములందు
గల చతురంగబలములు అక్కడక్కడ కలిసి పెనగుచుండగా కొంత
సేపటికి సందడి యుద్ధమాయెను. ఆ సమయమున అ రెండు పక్షముల
యందుండు సైనికులును పిచ్చివాండ్రవలె ఒకరిమీద ఒకరుపడి కొట్టు
కొనిరి. అప్పుడు బాణముల గుంపులు బాణముల గుంపులను తగిలి
తునుకలాయెను. కత్తులు కత్తులను తాకి తునుకలాయెను. ఏనుగుల
దంతములు యేనుగుల దంతములను తాకి తునుకలాయెను. రథముల
నొగలు రథముల నొగలను తాకి పగిలెను. ఈరీతిగా ఒకటి నొకటి
తాకి పగిలి తునుకలై పొడి రాసులాయెను. ఇట్లు అతిసంకులమైన
భయంకరయుద్ధము జరిగెను. ఆ సంకుల యుద్ధమందు యేను
గులయొక్కయు, గుఱ్ఱములయొక్కయు, రథములయొక్కయు,
సందడికిని రాపిడికిని కాల్బలములు సహింప లేకుండెను. కొందరు
పెద్దయేనుగులను భటులను రథముల గుంపులను పైకెత్తోలి బాధింపు
చుండిరి. రథికులు యేనుగుల గుంపులును నరుకుచుండిరి. ఇది
మనదనియు, ఇది శత్రువుల దనియు తలంపక చతురంగబలములు
చేరియున్నచోట ఆ చతురంగ బలములను యేనుగులమీద ఎక్కిన
వారు చిందరవందర చేయుచుండిరి.

మహారాజా! యీ ప్రకారము ఆ రెండుసైన్య
ఘోరముగా యుద్ధవ
ధకీక పెనగుచు మందరపర్వతముచేత క్షోభింప
ములచేత ముంచుచ
ై నుండెను. అప్పుడా రెండువిధములైన సైన్య
ధృతరాష్ట్ర
రి దేహమునందు బాణములు గ్రుచ్చికొని దూసి
మీాద తీక్ష్ణము
ుండెను. దేహములయందు గ్రుచ్చుకొని పడిన, యీ
లగు శస్త్రా
క్షురికాది ఆయుధములును, దూసికొనిపోయి పడిన బాణ
నాద
ములు పగడపురాసుల సమూహమువలె నుండెను. ఏనుగుల ముఖ ములయందు బాణములు కఠినముగా గ్రుచ్చుకొనినందున ఆ యేను గులు ప్రళయకాలమందు గల మహావాయువుచేత గిరగిర తిరుగుచు పర్వతములవలె నుండెను. కత్తులు, గదలు, బాణములు మొదలగు శస్త్రాస్త్రముల దెబ్బలచేత యేనుగుల కుంభస్థలములును, గుర్రముల ముఖములును మనుష్యుల శిరస్సులు మొదలగునవియు, పగిలి అధిక ముగా ధ్వనులు కలుగుచుండెను. నానావిధములైన ఆయుధముల దెబ్బలు తగిలి అ దెబ్బలచేత యేనుగులును, కాల్బలమును భటు లును క్రిందపడుచుండగా అధికధ్వని కలిగియుండెను. ఆ రెండు సైన్యములలో నుండు భటులు తీక్ష్ణ బాణములను ప్రయోగించుట చేత ఆ బాణములు దిక్కులను భేదింపు చున్నట్లు అన్ని దిక్కుల యందును సంచరింపు చుండెను.

ధృతరాష్ట్రమహారాజా! ఆసమయమందు ఆసైన్యములలో నుండు భటులలో కొందరికి ఒకచేయి విరిగినను రెండవచేతి చేత ఆయుధమును తీసికొని యుద్ధము చేయుచుండిరి. కాళ్ళువిరిగిన కొం దరు తమ శత్రువుల మీాదికి యెగసి దూకి యుద్ధము చేయుచుండిరి. కొందరికి శిరస్సులు వూడిపడుచుండగా అట్టివారు తాము ముందు కన్నుంచిన శత్రువులను పొడిచి చచ్చి పడుచుండిరి. కొందరు చచ్చి భూమిమీాద పడినను అట్టివారు పెదవులు కరచుకొనుచుకనుబొమ్మలు

ముడిపడునట్లుగా యెత్తుకొనుచు పీకిపోని తలచేత నొప్పుచుండిరి. మావటివాండ్రు తమ యేనుగులు అవయవహీనములైన వెంటనే సమీపమందుండు తమవారి వాహనములమీద యెక్కి పరాక్రమిం పుచు యుద్ధము చేయుచుండిరి. కొందరు తాము యుద్ధమందు నొచ్చియు తమ స్నేహితులకును చుట్టములకును సహాయముగా అడ్డ పడుచుండిరి. కొందరు శత్రుపక్షమందుండు తమ బంధువులను బంధు వులని తలచక నొప్పించుచుండిరి. శూరులగు భటులు శత్రుసైన్య ములయందు ప్రవేశించి యేనుగు గుర్రముగుంపులను నరుకుచుండగా ఆ గుంపులు వండినట్లు తరుగుచుండెను. గుర్రములు మీదనుండు భటులు రథములు మీదనుండు భటులను నరికి చంపగా ఆరథములు ద్రోహులవలె నుండెను. రథముల గాండ్లకు జేసిన యినుపకట్టుల రాపిడిచేత కాలిబంట్లు దట్టముగా చచ్చిపడియుండిరి. యేనుగులు గుర్రములను క్రిందపడవేసి కాళ్ళతో త్రొక్కుచు కొమ్ములచేత గ్రుచ్చి యెత్తుచుండగా ఆగుర్రములు తన్నుకొనుచు ప్రాణములు విడిచి దట్టముగా పడియుండెను. ఈప్రకారముగా కౌరవ పాండవ సైన్యములు రెండును యుద్ధము చేయుచుండెను. అప్పు డాయుద్ధభూమి మిక్కిలి భయంకరముగా నుండెను. ఇట్లు యుద్ధము చేయుచుండగా మధ్యాహ్నమాయెను.

## భీష్ముడు దుర్యోధన ప్రేరితుడై విజృంభించి పాండవ వీరులను నొప్పించుట

ఓ ధృతరాష్ట్రమహారాజా ! ఆ మధ్యాహ్న సమయమందు దుర్యోధనుడు భీష్ముని పురికొల్పి పాండవ సైన్యములమీదకు పంపిం చెను. అపుడు దుర్ముఖుడును కృపాచార్య, కృతవర్మ, శల్య, వివింశ తులను యీ అయిదుగురును నానావిధములైన బాణములచేత ప్రకా

శింపుచు పంచాగ్నులవలె భీష్మునకు సహాయులై వెళ్ళిరి. అట్లు వెళ్ళిన అయిదుగురును భీష్ముని వెంబడి నిలిచి పాండవ సైన్యములను తరుముచుండిరి. భీష్ముడు తన తాటిటెక్కెముచేత ప్రకాశింపుచు అగ్నిహోత్రునివలె నుండెను. భీష్ముడట్లు ప్రకాశింపుచు పాండవ సైన్యములను తరిమిబాధించి చేదిపాంచాలకేకయ మొదలగు రాజుల యొక్క సైన్యవ్యూహములలోనికి ప్రవేశించెను. ఆ సైన్యవ్యూహములు కలతజెందునట్లుగాను, కలగత్రొక్కుకొనునట్లుగాను, ఓరగిల పడునట్లుగాను, పెల్లగించునట్లుగాను, తల్లడపడునట్లుగాను అంను ప్రవేశించి భీష్ముడు యుద్ధము చేసెను. భీష్ముడావ్యూహములను పాయలుగాజేసి దానిలో ప్రవేశించి వాటిని చెదరజేసి గుంపులుగా భేదించెను. ఆ వ్యూహముల అంచులయందు తిరుగుచు చంపుచు, చెదరగొట్టుచు బాధింపుచుండెను. ఈరీతిగా భీష్ముడు శత్రుసైన్యములయందు యుద్ధక్రీడ చేయగా ఆ శత్రుసైన్యములయందు తలలు రాలుచుండెను. ధనుస్సులు విరిగి పడుచుండెను. చతురంగ బలముల శరీరములు భూమిమీద వ్రాలుచుండెను. టెక్కెములు విరిగి పడుచుండెను. రక్తప్రవాహములు విశేషముగా యేర్పడియుండెను. ఈరీతిగా పాండవబలములు నశింపుచుండెను. భీష్ముడు ప్రళయకాలమందు నాట్యముజేయు రుద్రునివలె విజృంభించి పాండవ సైన్యములను చంపుచుండెను. భీష్మునితో యెదిరించి యుద్ధము చేయుటకు పాండవ సైన్యములలో మొనగాడు ఒకడైనను కనబడలేదు. ఆ సమయమందు పాండవసైన్యములు దిగులుపడి ధైర్యము లేకుండెను. ఆసమయమున అభిమన్యుడు బంగారువర్ణములుగల గుఱ్ఱములను కట్టిన రథము నెక్కివచ్చి భీష్మునకు అడ్డమాయెను, అభిమన్యుని కర్ణికారవృక్షమువంటి టెక్కెము మిక్కిలి ప్రకాశింపుచుండెను. ఆ యభిమన్యుడు అయిదు అసలైన యినుపబాణములచేత శల్యుని

నొప్పించెను, ఒకబాణముచేత కృతవర్మయొక్క కొమ్మును చీల్చెను. మరియొక క్రూరబాణముచేత దుర్ముఖునియొక్క సూతుని తల ద్రుంచెను. వివింశతిని తనను గొప్పబాణముచేత వాని ధనస్సును విరుగగొట్టెను. పిమ్మట ఆతని దేహమునందు మూడు తీక్ష్ణబాణములను గ్రుచ్చెను. అంతట అభిమన్యుడు నాలుగు బాణములచేత కృపాచార్యుని గుఱ్ఱముల పొగరణచి భీష్మునిమీదకు పోయి ఆ భీష్మునిమీద తొమ్మిది బాణములను వేసి ఆశ్చర్యమును కలిగించెను. అభిమన్యుడు భీష్మాదుల నందరిని నొప్పించి సింహనాదము చేసెను. అభిమన్యుని పరాక్రమమును దేవత లందరును జూచి తల్లడించిరి. భీష్మాదులందరును అభిమన్యుని మెచ్చుకొని అభిమన్యు డర్జునునితో సమానుడు లేక అధికుడు కాగలడు గాని అర్జునునికంటె స్వల్పుడు మాత్రము కాడనిరి.

భీష్ముడు రెండుబాణములచేత అభిమన్యునియొక్క సారథిని జంపి మరిమూడు బాణములచేత టెక్కెపుస్తంభమును విరుగ గొట్టెను. పిమ్మట అభిమన్యునిమీద తేజోబాణములను వేయుచుం డెను. ఇట్లు భీష్ము డభిమన్యునిమీద బాణములు కురియుచుండగా శల్యుడు మొదలగు అయిదుగురు రథికులును వచ్చి ఒక్కపెట్టున అభిమన్యునిమీద అనేక బాణములను శీఘ్రముగా వేసిరి. అప్పు డభి మన్యుడు మిక్కిలి కోపించుకొని ఆభీష్మ శల్యాదుల బాణవర్షము లను నివారించుచు భీష్మాదులగు ఆరుగురు రథికులమీదను తీక్ష్ణబాణ ములను కురిపించుచు భీష్ముని తాటిటెక్కెమును విరుగగొట్టెను భీష్ముని తాటిటెక్కెము విరిగి క్రింద బడినతోడనే పాండవ సైన్యము లన్నియు ఒక్కపెట్టున సింహనాదము చేసెను. కౌరవసైన్యములలో నుండు భటులందరును ధైర్యములేక చిన్నబోయియుండిరి. ఆసమయ

మందు భీముడు సింహనాదముచేసి అభిమన్యుని తీసికొని శత్రుసైన్య ములమీదకు బోయెను.

అప్పుడు భీష్ముడు కోపించుకొని భీమునియొక్క శ్రేష్ఠమైన సింహపుటెక్కెమును విరుగగొట్టెను. భీముడు మూడు బాణములచేత భీష్ముని గట్టిగాకొట్టి మరియొక బాణముచేత కృపాచార్యుని దేహ మును పగులునట్లు కొట్టెను. అంతట భీముడు సింహనాదముచేయుచు యెనిమిది బాణములను కృతవర్మమీదవేసెను. శల్యునిమీద కొన్ని బాణములువేసి ఆ శల్యుని నిశ్చేష్టితునిగా జేసెను. భీముడు భీష్మ శల్యాదులను నొప్పించగా కౌరవసైన్యములలో నుండు శూరు లనే కులు తమ తమ రథవేగములచేత ప్రకాశింపుచు ఒక్కపెట్టున భీమునిమీదకువచ్చిరి. ఆసమయమందు భీముడు రౌద్రాకారుడై తన మీదకువచ్చిన ఆరథికులయొక్క సారథులను చంపి గుర్రములు ప్రాణ ములను పోగొట్టి ఆ రథికుల దేహములను అన్నిటిని రక్తమయమగు నట్లు కొట్టెను. భీముడుచేసిన యీ కార్యమును చూడగా ఆశ్చర్య ముగా నుండెను. పిమ్మట సాత్యకియు ధృష్టద్యుమ్నుడును కేకయ దేశపు రాజు లైదుగురును విరాటుడును, ఆ విరాటుని పుత్రులును, భీమునకు సహాయులై ముందర నిలిచి శత్రుసైన్యములమీదకు పోయిరి. అప్పుడు భీష్ముడు ఆ సాత్యకి మొదలగు వారందరిమీదను మూడేసి బాణములు నాటించెను. ఆసమయమందు ఉత్తరుడు ఏను గులగుంపుతో అధికోత్సాహము గలవాడై శల్యునిమీదకుపోయెను. ఉత్తరు డప్పుడొక యేనుగుమీద నెక్కియుండెను. ఉత్తరు డెక్కిన యేనుగు తనతోవచ్చిన యేనుగులగుంపును దాటి శల్యుని రథ మును తాకి శల్యుని గుర్రముల నత్యాశ్చర్యముగా క్రిందబడవేసి కాళ్ళతోత్రొక్కి చంపివేసెను.

అప్పుడు శల్యుడు భయంకరమైన కోపముగలవాడై ఒకశక్తి యనుఆయుధమును అతిశీఘ్రముగాతీసికొని ఆవుత్తరుని రొమ్మునందు

దూరిపోవునట్లు వేసెను. అప్పుడానుత్తరుడు లేని చేతులయందుండు అంకుశమును తోమరములను విడిచి క్రిందబడుచు మధ్యమందే చచ్చెను. శల్యుడు నిలువక రౌద్రాకారుడై కత్తిని తీసికొని తన గుఱ్ఱములను చంపిన యేనుగుదగ్గరకుబోయి యెగిరి ఆయేను తొండమును నరికి చంపివేసెను. ధృతరాష్ట్ర మహారాజా! యీప్రకారముగా శల్యుడు తనపరాక్రమమును జూపి తనసైన్యములచేత స్తుతింపబడుచు పర్వతముమీదకు యెగురుసింహమువలె శీఘ్రముగా కృతవర్మని రథముమీదకు యెగిరెను. ఉత్తరుడు చచ్చినవెంటనే వాని సహోదరుడగు శంఖుడనువాడు అధికకోపముగలవాడై తన రథబలసమూహముతో శల్యునిమీదకు యుద్ధమునకు వెళ్లెను.

అట్లు శంఖుడు అధికమైన కోపగర్వములచే శల్యునిమీదకు రాగా అప్పుడు భీష్మాదిరథికులందరును మిక్కిలి వేగముగా శల్యునకు సహాయమైరి. ఆభీష్ముడు ఆశంఖునిమీదను అతని రథ బలములమీదను అనేక బాణములను ప్రయోగించెను. ఆబాణపుదెబ్బలను సహింపలేక శంఖుడును అతనిరథబలములును మహావాయువుచేత చెదరిపోయిన మేఘమువలె చెడిపోవుచుండెను. అట్లు చెడిపోవుచున్నవని అర్జునుడు చూచి తన దివ్యరథమును తోలించుకొని శంఖునకు సహాయముగా అడ్డపడెను. అంతట ఒకఅగ్ని మరియొక అగ్నితో పోరినట్లు అర్జునుడును భీష్ముడును యుద్ధముచేయుటకు ప్రారంభించిరి. అప్పుడు వారిద్దరిని చూచువారందరును పొగడుచుండిరి. రెండుపక్షములవారి సైన్యములును యుద్ధమునకు మరల ప్రయత్నించెను. పిమ్మట మూడు జాములాయెను. ఆసమయమున శల్యుడు కృతవర్మని రథముమీదనుండి దిగి అధికకోపముచేత గొప్పగదను తీసికొని ఆగదచేత శంఖుని గుఱ్ఱములను చంపెను. అప్పుడు శంఖుడు రథములేనివాడై ముప్పది యంగుళములు పొడవుగల కత్తిని తీసికొని శీఘ్రముగా రథము దిగి

అధిక వేగముతో అర్జునునిరథము చాటునకు వెళ్లెను. అంతట తన బాణములు యన్ని దిక్కులయందును వ్యాపించు చుండగా భీష్ముడు ఉల్లాసముగలవాడై అర్జునునిరథమును అక్కడ విడిచి ద్రుపదుని సైన్యముమీదకు యతిభయంకరముగా వెళ్లెను. భీష్ముడట్లు వెళ్ళి యుండిన అడవిని కార్చిచ్చు దహించునట్లు వరుసపెట్టి రథములను యేనుగులను గుర్రములను కాల్బలములను చంపుచుండెను.

అట్లు ద్రుపదునిసైన్యములను చంపి భీష్ముడు కేకయదేశపు రాజులగు అయిదుగురి సైన్యములను బాణవర్షముచేత చంపుచు చిక్కుపరచెను. భీష్ముడు ఒక్కడే తన రథముచేత ప్రకాశించుచు గొర్రెలమందలలోనికి దూరు పెద్దపులివలె విరాటునిసైన్యములలోనికి పోయెను. ఆకాశమందుండు దేవతలందరును భీష్ముని పొగడుచుండిరి. ధృతరాష్ట్ర మహారాజా! యీరీతిగా పాండవసైన్యము లన్నియు భీష్మునిచేత కొట్టబడి చెదిరి యిక్కడక్కడ పడుచుండెను. అట్టి భీష్ముని సామర్థ్యమునకు పాండవు లాశ్చర్యముగలవారై పాండవులైదుగురును ఒకచోట జేరి ఆశ్చర్యముచేత నిశ్చేష్టితులైరి. భీష్ముడు తన ప్రతాపముచేత సకలప్రాణులను తపింప జేయుచుండగా నా తేజస్సును చాలించి అస్తమించి పోయెదనని సూర్యుడు అస్తమించుటకు సిద్ధమై యున్నట్లుండెను. అంతట చంద్రవంశమందు బుట్టిన భీష్ముడు యింత ప్రతాపము గలిగియుండగా అట్టి భీష్ముని సూర్యుడు చూచి సిగ్గుపడి దాగినట్లుండెను.

ధృతరాష్ట్ర మహారాజా! సూర్యుడస్తమించినతోడనే పాండవ సైనికులముఖములయందు కాంతి తగ్గినట్లు కమలములకు కాంతి తగ్గిపోయెను. పాండవసైనికుల మనస్సులయందు భయమను అంధకారము కలిగినట్లు క్రమముగా అంతకంతకు చీకటి వ్యాపించెను. అప్పుడా కౌరవ పాండవ సైన్యములు యుద్ధముచాలించి తమతమ నివాసస్థలము

లకు వెళ్ళిరి. అట్లు తమతమ నివాసములకు వెళ్ళినపిమ్మట దుర్యోధనుడును అతనితమ్ములును తమ తాతయగు భీష్ముని పరాక్రమమునకు అధికముగా సంతోషించుచుండిరి. అని యిట్లు భీష్ముని పరాక్రమమును సంజయుడు ధృతరాష్ట్రునితో చెప్పినట్లు వైశంపాయన మునీంద్రుడు జనమేజయమహారాజును జూచి చెప్పగా జనమేజయు డిట్లనెను. ఓ వైశంపాయన మహామునీంద్రా! అట్లు మొదటిదినమందు జరిగిన యుద్ధమందు భీష్మునిచేత పాండవులు భంగపడినట్లు చెప్పితివి. పిమ్మట పాండవు లేమిచేసిరో చెప్పుము.

ఇది మహాభారతమునందు భీష్మపర్వమున
ప్రథమాశ్వాసము

## ద్వితీయాశ్వాసము

ఓ దేవా! హరహరనాథా! వైశంపాయనమునీంద్రుడు జనమేజయుని జూచి యిట్లనెను. జనమేజయ మహారాజా! ఆప్రకారము సంజయునివలన ధృతరాష్ట్రుడు తనవారు మొదటిదినమందు గెలుపొందిరని విని యిట్లనెను. సంజయుడా! పిమ్మట జరిగిన వృత్తాంతమును చక్కగా చెప్పుము. అని ధృతరాష్ట్రుడు అడుగగా సంజయు డిట్లనెను. ధృతరాష్ట్ర మహారాజా! అట్లు మొదటిదినమందు యుద్ధమున పాండవులు భంగపడి ఆరాత్రి తమ నివాసస్థలమునకు వెళ్ళిన పిమ్మట ధర్మరాజు దుఃఖముతో కూడిన మనస్సుగలవా డాయెను. అంత ధర్మరాజు తనతమ్ములగు భీమార్జున నకులసహదేవులను, మరి కొందరిని చేర్చుకొని కృష్ణదేవునిదగ్గరకు వెళ్ళి యిట్లనెను.

మహాత్మా! కృష్ణా! కార్చిచ్చు అడవినంతయు ఒక్కపాయగా చేసికొని దహించినట్లు భీష్ముడు మన సైన్యమంతయును చంపెను. భీష్ముని శౌర్యపరాక్రమములు నీవును చూచితివిగదా! ఇకను భీష్ముని యుద్ధమందు చంపుటకు మనవారిలో మొనగాడు కానరాడు. కృష్ణా! భీష్మునియొక్క శక్తి నెరుగజాలక ఆ మహాత్ముని లోకములోని వానినిగా తలంచి వ్యర్థుడనైతిని. నీమరదులగు నాతమ్ములు నలుగురును బాణపుదెబ్బలచేత బాధింపబడిరి. అష్టదిక్పాలకులైనను భీష్మునితో యుద్ధము చేయజాలరు. అని నామనస్సునందు యిపుడు తోచుచున్నది. కృష్ణా! అర్జునుడు భీష్ముని జయించునని మనము నమ్మియుండగా యీ అర్జునుడు యుద్ధమందు వుపేక్షించియున్నాడు. భీము డొకడుమాత్రము తన భుజాబలమును దాచక సమయమందు యుద్ధము చేయుచున్నాడు. ఇక నేనేమి చేయుదును? ఈ అర్జునుని యీభీముని నేను బ్రతిమాలుకొనవలసిన పనిలేదు. నేను యుద్ధమును మానుకొనెదను. కృష్ణా! రాజులనందరిని భీష్మున కాహారముగా యివ్వజాలను. నేను మరల అడవులకు పోయి అచ్చట సంచరింపుచుందును. అడవుల యందు సంచరించుచు కూరాకు కోసికొని తిని బ్రతికెదను. కృష్ణా! మేము నీమాటప్రకారము సర్వదా ప్రవర్తింపుచుందుము, సర్వకాలసర్వావస్థలయందును మాకు అశుభములు పోగొట్టుటకును శుభములు కలిగించుటకును నీఅనుగ్రహమే కారణముగా నున్నది. గనుక మేము యిపుడు చేయదగిన పనిని మాకుచెప్పి మమ్మును పంపించుము అని యిట్లు ధర్మరాజు చెప్పుకొనగా కృష్ణుడు యిట్లనెను.

ధర్మరాజా! నీవింత చింతించవలసిన పనిలేదు. యుద్ధమందు నీకు సాధ్యముగానివారు కనబడలేదు. నీతమ్ములలో ప్రతివాడును యీసకలలోకములను జయించగలరు. మరియు యుద్ధపండితుడగు శిఖండి బలముచేత క్రొవ్వియుండుభీష్ముని చంపగలడు. నీకు సాధ్యము

గానివారినందరిని యేవిధముచేతనైనను నేను క్రమముగా చంపివేసె దను. ధర్మరాజా! ఈసాత్యకి సత్యపరాక్రమవంతుడు. ఈసాత్యకి యొక్క బాహుబలమును యుద్ధక్రీడయందుగల నేర్పరితనమును యిక మీాదట నీవు చూడగలవు. ఈసాత్యకియొక్క బాణములు అధికాశ్చ ర్యమును కలిగించునవి. ధర్మరాజా! యీాద్రుపదవిరాటరాజులు మిక్కిలిపరాక్రమంతు లగుదురు. వీరిద్దరును నిన్ను రాజ్యలక్ష్మిచేత ప్రకాశింపజేయదలచి తమప్రాణములను యుద్ధమునకు యివ్వదలచి యున్నారు. ఇట్లుండగా నీవు యుద్ధము మానుకొనవలసిన పనిలేదు. ధర్మరాజా! వేయిమాటలను చెప్పుటచేత ప్రయోజనములేదు. ముఖ్యమైనమాట చెప్పెదను వినుము. ధృష్టద్యుమ్నుడు ఒక్కడే శత్రువులయొక్క మదగర్వములను మాన్పగలడు. ఇది నిశ్చయము. అని కృష్ణుడు ధర్మరాజుతో చెప్పగా ధర్మరాజు ధృష్టద్యుమ్నుని జూచి యిట్లనెను. ధృష్టద్యుమ్నుడా! పాండవసైన్యముల నితడు పరి పాలించునని కృష్ణుడు నీకుసర్వసేనాధిపత్యమును యిచ్చిఅభిషేకము చేసెను. అందువలన సర్వసేనాధిపత్యమును నీవుపొందితివి. గనుక యీారాజులును, నాతమ్ములును నీతో కూడికొనివచ్చుచుండగా నీవు సర్వసైన్యములనుతీసికొని వెళ్లి శత్రువులను జయించవలయును. నీ వట్లుచేయనియెడల బాగులేదు. అని ధర్మరాజు ధృష్టద్యుమ్నుని స్తుతించెను. ఆస్తుతించుటకు ధృష్టద్యుమ్నుడు వుప్పొంగి ధర్మరాజును జూచి యిట్లనెను. ధర్మరాజా! సర్వలోకములును యెరుగునట్లుగా ఆబ్రహ్మదేవుడు ద్రోణునిచంపుటకు నన్ను పుట్టించియున్నాడు గనుక ఈవిషయమై నీవు పలుమార్లు చెప్పవలసినపనిలేదు. కౌరవసైన్యము లలో నుండుభీష్ముడుమొదలగు మహారథికులలో యెవరైనను నాకు యెదురైనపుడు నేనెట్లుయుద్ధముచేసెదనో చూచుచుండుము. అని ధృష్టద్యుమ్నుడు యుద్ధవుత్సాహపుమాటలను చెప్పగా ఆమాటలన్ని

అందరునువిని పాండవులును తక్కిన రాజులును కృష్ణుడును సంతోషిం చిరి. ధర్మరాజు ధృష్టద్యుమ్నునితో యిట్లనెను.

ధృష్టద్యుమ్నుడా! పూర్వము దేవేంద్రుడు రాక్షసులతో యుద్ధముచేయు కాలమందు బృహస్పతి దేవేంద్రునకు క్రౌంచమను వ్యూహక్రమమును చక్కగా చెప్పియున్నాడు. ఆ క్రౌంచవ్యూహము శత్రువులకు భయంకరముగా నుండును. గనుక నీ నేర్పరితనము చేత మనసైన్యమును రేపటిదినమందు క్రౌంచ వ్యూహముగా ఏర్ప రచుము. అని ధర్మరాజు చెప్పగా ధృష్టద్యుమ్నుడట్లే చేసెదనని చెప్పెను. ధర్మరాజు కృష్ణుని దగ్గరనుంచి లేచివచ్చి చింతనువిడచి అందరిని తమ తమ శిబిరములకు పంపించి తన నివాస శిబిరములకు పంపించితినని వాస శిబిరమునకు వెళ్ళెను. ఆ రాత్రియందు అంద రును సుఖముగా నిద్రించిరి. మరునాడు సూర్యోదయ మాయెను. పాండవసైనికుల హృదయములును కమలములును ఒక్కసారి విక సించెను. పాండవుల ప్రతాపముతోకూడ సూర్యోదయమై ప్రకా శించెను. ధర్మరాజు కాలోచిత కార్యములను తీర్చికొని యుద్ధము నకు బయలుదేరెను. పాండవసైన్యములు క్రౌంచవ్యూహమునుయేర్ప రచిరి. అర్జునుడు గాండీవ కపిధ్వజములచేత ప్రకాశించుచు ఆక్రౌంచ పక్షివంటి వ్యూహమునకు ముక్కువలె నిలిచియుండెను. కుంతిభోజు డును శైబ్యుడుచు ఆ క్రౌంచపక్షివంటి వ్యూహమునకు నేత్రస్థాన ములుగా నిలిచియుండిరి. ద్రుపదుడు ఆ వ్యూహమునకు శిఖవలెనిలిచి యుండెను. దశార్ణ దేశపు రాజులును శూరసేన దేశపు రాజులును కిరాత దేశపు రాజులును ఆ క్రౌంచకార వ్యూహమునకు కంఠము వలె నిలచియుండిరి. ఆ క్రౌంచ వ్యూహమునకు భీముడుకుడి రెక్కవలె నిలిచియుండెను. ధృష్టద్యుమ్నుడు యెడమ రెక్కవలె నిలిచియుం డెను. అభిమన్యు సాత్యకి ద్రౌపదీ పుత్రులును పాంద్ర చోళ పాండ్య

దేశముల రాజులును భీముడున్న దిక్కు తట్టుండిరి. నకుల సహదేవ ఘటోత్కచులును, శంబర వత్సదేశముల రాజులును ధృష్టద్యుమ్ను డున్న దిక్కుననుండిరి.

విరాటరాజు కేకయ కాశీదేశముల రాజులను చేర్చుకొని ఆ క్రౌంచమువంటి వ్యూహమునకు పిరుదులభాగమువలె నిలిచియుం డెను. ధర్మరాజు హూణదేశపు రాజులు మొదలగు వానిని చేర్చు కొని ఆ క్రౌంచవ్యూహమునకు వీపుభాగముగా నిలిచియుండెను. ఈరీతిగా పాండవుల సైన్యములు క్రౌంచవ్యూహమును యేర్పరచి కొని యుండెను. ఆసమయమున పాండవ సైన్యములలో నుండు యేనుగులవలె కమలములు వికసించి ప్రకాశించుచుండెను. బాల సూర్యునియొక్క లేతఎండ యెర్రని ఛాయగలిగి యుండెను. ధృత రాష్ట్రమహారాజా! ఇక్కడ పాండవుల వృత్తాంత మిట్లుండెను. అక్కడ కౌరవుల సమాచారమును చెప్పెద వినుము. ఆ కౌరవ సైన్యములు అధికమైన వేగము, గర్వము, సంతోషములను శబ్దము లతో బయలుదేరి వచ్చెను. ఆ సమయమున దుర్యోధనుడు భీష్మ ద్రోణ అశ్వత్థామ కృపాచార్య శల్య కృతవర్మలను జూచి వారితో యిట్లనెను.

భీష్మాదులారా! మీరందరును అధిక శౌర్య బలవంతులగు దురు. మీలో వొక వొకడే పాండవుల సకల బలములను గెలువ గలరు. మీరందరు వొకతట్టువున్నప్పుడు మిమ్ములను ఆ రుద్రుడైనను గెలువజాలడు. నేను చెప్పుమాటలను వినుము. పాండవులు క్రౌంచ వ్యూహమును యేర్పరచుకొని యున్నారు. ఆ క్రౌంచవ్యూహము భయమును కలిగించుచు చూచుటకు మనోహరముగా నున్నది. ఈ రీతిగనే మనమును మంచి దృఢవ్యూహములను యేర్పరచవలయును. అని దుర్యోధనుడు చెప్పి తమసైన్యములను వ్యూహములుగా యేర్ప

రచెను. అందుదుశ్శాసన వికర్ణవిందానువిందులును శూరసేన యవ త్రిగర్త కురుదేశముల రాజులును వారివారి సైన్యములును ఒక్క వ్యూహముగా యేర్పరచుకొని ఒకతట్టుగా నుండిరి. ద్రోణాచార్యుడును, కుంతలదశార్ణవిదర్భదేశపు రాజులును గాంధారసింధు సౌవీర దేశములరాజులును వారివారి సైన్యములును ఒక్క వ్యూహముగా యేర్పడి మరియొకతట్టుగా నుండిరి. భీష్ముడు మహాసైన్యమును దగ్గర వుంచుకొని మధ్యప్రదేశమం దుండెను. ఇట్లు మూడువ్యూహములుగ యేర్పడివుండెను. కృతవర్మశల్యులును అశ్మంత కాశ్మీరదేశములరాజులును దుర్యోధనుడును, అతనియొక్క కొందరుతమ్ములును వారివారి సైన్యములతో భీష్మునకు వెనుకప్రక్కనిలిచియుండిరి ధృతరాష్ట్ర మహారాజా! యీవిధముగా ఆకౌరవపాండవులసైన్యములు రెండును వ్యూహములుగా ఏర్పడి శంఖభేరీమృదంగాది ధ్వనులు మ్రోయుచుండగా ఒకటిమీాదకు మరియొకటివచ్చెను. అని సంజయుడు చెప్పగా ధృతరాష్ట్రుడిట్లనెను. సంజయుడా! యీరీతిగా రెండవనాడు యుద్ధము చేయుటకు ప్రయత్నించిన ఆకౌరవ పాండవులలో యెవ్వరెవ్వరు యే ప్రకారముగా యుద్ధముచేసిరో చెప్పుము అని ధృతరాష్ట్రుడడుగగా సంజయుడు యిట్లనెను.

ధృతరాష్ట్రమహారాజా! దుర్యోధనుడు గర్వముచేత అరచుచు, చేతిని వీచుచు, కౌరవసైన్యములను పురికొల్పగా అపుడు మనసైన్యములు పాండవసైన్యములమీాదికి బోయెను. మనసైన్యములట్లు మిక్కిలివేగముతో పాండవుల సైన్యములను తాకెను. అసమయమున భీష్ముడు క్రౌంచపక్షియొక్క రెక్కలు చించినట్టుగాను, కంఠమందు యినుపరేకులు గ్రుచ్చినట్లుగాను కంఠమును త్రుంచినట్లుగాను, యీప్రకారముగా పాండవసైన్యపు క్రౌంచ వ్యూహమును ఛిన్నపరచెను. భీష్ముడట్లు వ్యూహమును ఛీకాకుపరచి యేదిక్కున

జూచినను తానే కనబడుచు దిక్కులునిండునట్లుగా బాణపువర్షముల చేత ముంచెను. అర్జునుడంతట కోపించుకొని యెర్రని కండ్లుగలవాడై కృష్ణునితో యిట్లనెను.

## అర్జునుడు భీష్మునిమీదకు రథమును దోలించి విజృంభించుట

కృష్ణా ! భీష్ముడు మనసేనలను చెదరగొట్టుచు మనస్సునందైనను నన్ను లక్ష్యముచేయక గర్వించియున్నాడు. గనుక మనము రథమును భీష్ముడున్నస్థలమునకు శీఘ్రముగా తోలుము. ఈభీష్ముని పటాటోపమును అణగించి నిన్ను మెప్పించెదను. ఆకాశమందుండి చూచు దేవతలందరును పొగడునట్లుగా భీష్మునిమీద విజృంభించెదను గనుక నాపరాక్రమముచేత క్రీడించుటకు భీష్ముడున్న చోటికి మనరథమును శీఘ్రముగ తోలుమని అర్జునుడు చెప్పగా ఆమాటలను కృష్ణుడు విని అర్జునునితో యిట్లనెను. అర్జునా ! నేను నీయిష్టప్రకారము రథమును తోలెదను. నేను చెప్పుమాటను చక్కగా వినుము. చిక్కుపడక వుప్పొంగక నీఅఖండ శౌర్యభుజాబలములను చూపుచు నీఅస్త్రశక్తిని కనబరచుము. అట్లు చేసితివేని నిన్ను అందరును పొగడుదురు. భీష్ముడు మహాపరాక్రమశాలి. ఆభీష్మునితో నీవు ఆశ్చర్యముగా యుద్ధముచేసి ఆభీష్మునిదగ్గరనుండు శల్యద్రోణ దుర్యోధనులకు ఆశ్చర్యభయములను కలిగింపుము అని కృష్ణుడు అర్జునునితో చెప్పి తగినవేగముతో రథమును భీష్ముడున్న దిక్కునకు తోలుచుండెను. ఆసమయమందు శూరసేనునియొక్క సైన్యము మహాఅరణ్యమువలె అర్జునునకు అడ్డముగా వచ్చెను. అర్జునుడు గొప్ప శక్తివంతములైన బాణసమూహములను వాయువుచేత తన కడ్డమువచ్చిన సైన్యమును పడగొట్టుచు వెళ్లెను. అర్జునుడు భీష్మునిమీదకు పోవుచుండెను. అపుడు భీష్ముడు అర్జునున కడ్డమువచ్చి యెదిరించి డెబ్బదిఐదు యినుప బాణములను క్రూరముగా అర్జునునిమీద వేసెను. ద్రోణుడు మొద

లగువారు భీష్మునితో కూడిరి. ద్రోణుడు యిరువదిఐదు బాణములను అర్జుననిమీాద వేసెను. కృపాచార్యుడు అర్జుననిమీాద మూడు బాణములను వేసెను. వికర్ణుడు తొమ్మిదిబాణములను వేసెను అర్జునుడు అరువదినాలుగు బాణములను వేసెను. వీరందరుయిన్ని బాణములను ఉల్లాసముగా వేగముగా అర్జుననిమీాద వేయగా అర్జునుడు నిర్విశాకరుడై వర్షముకురిసిన పర్వతమువలె నిశ్చలముగా నుండెను. పిమ్మట అర్జునుడు యిరువదిఐదు బాణములచేత భీష్ముని నొప్పించెను. అరువది బాణములచేత ద్రోణుని కొట్టెను. తొమ్మిది వాడిబాణములచేత కృపాచార్యుని బంధించెను. మూడు బాణములచేత వికర్ణుని నొప్పించెను. మరిమూడు బాణములచేత శల్యుని నొప్పించెను. ఐదు బాణములచేత దుర్యోధనుని నొప్పించెను. పిమ్మట సాత్యకి, విరాట, ధృష్టద్యుమ్న, అభిమన్య, ద్రౌపదీపుత్రులు వచ్చి భీష్మునకు సహాయముగ నుండుద్రోణాదులతో యుద్ధముచేయుచుండిరి. భీష్ముడుఏబదివాడిబాణములను అర్జుననిమీాదవేసెను. ఆసమయమున కౌరవులందరునుసంతోషింపుచుండిరి. అర్జునుడు భీష్ముని యెదుటనుంచి తొలగి భీష్మని విడిచి తనరథమును శీఘ్రముగా పరుగెత్తించి కౌరవసైన్యములోనికి ప్రవేశించెను. అర్జునుడట్లు ప్రవేశించి ఆ సైన్యములలో నుండుఅనేకరథికులను సారథులను నరికివేసెను. అనేకరథములు నిశ్చేష్టితముగా నుండెను. కౌరవసైన్యములోని శూరులు భయపడిరి. మన సైన్యములు భయపడినవై పాయలుపాయలుగా చెదరెను. ఆసమయమున నీకొడుకగు దుర్యోధనుడు నీతండ్రియగు భీష్మునితో యిట్లనెను.

భీష్మా ! అర్జునుడు మనలనందరిని అతిక్రమించి తన భూజాబల గర్వమువలన మనసైన్యములో నుండుయుద్ధశూరులగు రాజులనందరిని సులభముగా నరికివేసెను. అర్జును డిట్లు అందరిని నరుకుచుండగా నీవుచూాచుచుంటివి. ఇది నీకు తగునా ! కర్ణుని యుద్ధమునకురాకుండు

నట్లు యిదివరకే చేసితివి. అప్పుడర్జునుడు నడుకుచుండగా సమ్మతించి చూచుచున్నావు. ఇది నీకు తగినపనియేనా? అని దుర్యోధను డనగా ఆమాటలకు భీష్ముడు అయ్యో! యీ దుర్యోధను డింతకు కూడని మాటలు పలికెనుగదా! అని తలచుచు మనస్సునందు దుర్యోధనుని దూషించుచు అర్జును డున్న వైపునకు యుద్ధమునకు వెళ్లెను. అంతట దుర్యోధనవికర్ణులు కుడిప్రక్కను అశ్వత్థామ యెడమప్రక్కను భీష్మునితో చేరి అర్జునునిమీద అనేక తీక్ష్ణ బాణవర్షములు కురిసెను. ధర్మరాజ, భీమ నకుల, సహదేవులు అర్జునునకు సహాయముగావచ్చి భీష్మదుర్యోధనాదులతో యుద్ధము చేయబూనిరి. ఇట్లు రెండు ప్రక్కల యందుండు రథికులు యుద్ధమునకు పూనుకొనగా ఆ రెండు సైన్యముల యందును శంఖములు పూరించిరి. ఆశంఖధ్వని మిక్కుటముగా నుండెను. అప్పు డా రెండు పక్షములవారును సంకులయుద్ధము చేసిరి. ఆసమయమున అర్జునుడు, భీష్ముడు ఒకరినొకరు తీక్ష్ణ బాణములను నరుకుచు, కవచములను చీల్చుచు ఒకరొకరు తెల్లగుఱ్ఱములమీదను, టెక్కెములమీదను బాణములు వేయుచు యీప్రకారము ఘోర ముగా యుద్ధము చేయుచుండెను. ఆసమయమందు భీష్ము డర్జునుని సారథియగు కృష్ణుకొమ్మును బాణసమూహముచేత భేదించి రక్త మయముగా చేసెను. కృష్ణునిరొమ్ములోనుండి రక్తముకారుచు చిగు రించుచున్న పారిజాతవృక్షమువలె కృష్ణుడు ప్రకాశించుచుండెను. అట్టికృష్ణుని అర్జునుడు చూచి కోపించుకొని భీష్ముని సారథిమీద బాణములు వేసి బాధించెను. భీష్ముడు బాణములు వెల్లువలచే అర్జు నునిరథము మునుగునట్లు చేసెను. వెల్లువనీటిని బడబాగ్ని పీల్చినట్లు అర్జునుడు తనబాణములచేత భీష్ముని బాణకెరటములను నశింపజేసెను. అర్జునుడు కార్చిచ్చుఅడవిని దహించుటకు ప్రారంభించినట్లు కౌరవ సైన్యమును బాణములచేత చంపుటకు ప్రారంభించెను. భీష్ముడు

మేఘమువలె అర్జునుడు సుకార్చిచ్చును చల్లార్చి కౌరవసైన్యమును చల్లార్చెను. ధృతరాష్ట్ర మహారాజా! యీ రీతిగా అర్జున భీష్ములు యెక్కువతక్కువలేక ఆశ్చర్యముగా యుద్ధముచేయుచుండిరి. అప్పు డాభీష్మార్జునులను ఆకాశమందుండు సిద్ధచారణగంధర్వాదులు చూచి తమలో తామిట్లు చెప్పుకొనసాగిరి. ఈభీష్మార్జునులు ఒకరితో నొకరు యుద్ధముచేయుటకు సమర్థు లగుదురుగాని వీరితో వేరొకరు యుద్ధము చేయుటకు సమర్థులు కారు. ఆయమధర్మరాజైనను దేవేంద్రుడైనను భీష్మార్జునులతో యుద్ధము చేయుటకు శక్తులు కారు. ఇట్టి యుద్ధములు మనమిదివరకు యెక్కడను చూడలేదు. పాండవ కౌరవులయొక్క భుజాబలవిలాసములు యింత అధికములుగా నుండినవి గదా! అని ఈరీతిగా సిద్ధచారణగంధర్వాదులు ఆకాశమం దుండి స్తుతించిరి. ఆసమయమున సూర్యు డాకాశమధ్యమున ప్రకాశింపుచు సంచరింపుచుండుటవలన మధ్యాహ్నమాయెను.

## ధృష్టద్యుమ్న ద్రోణాచార్యులయుద్ధము

ధృతరాష్ట్రమహారాజా! మధ్యాహ్న సమయమందు ధృష్టద్యుమ్నుడు ద్రోణాచార్యుని మీదకు యుద్ధమునకు బోయెను. ద్రోణుడొక బాణముచేత ధృష్టద్యుమ్నునియొక్క సారథిని బాధించి మరినాలుగుబాణములచేత గుఱ్ఱముల పొగరణచి విశాలమైన గొప్ప కత్తియొక్క అంచువంటి గొప్ప బాణముచేత ఆధృష్టద్యుమ్నుని వింటిని నడిమికి విరుగగొట్టెను. కౌరవసైన్యమంతయు సంతోషించెను. ధృష్టద్యుమ్నుడు క్రోధముగలవాడై ద్రోణునిమీదవర్షము కురిసినట్లు బాణసమూహములను కురిపించెను. అప్పుడు ద్రోణు డొక యినుపబాణమును సంధించి దృఢముగా లాగి ధృష్టద్యుమ్నునిమీద వేయగా ఆబాణమును ధృష్టద్యుమ్నుడు నడుమనే నరికివేసెను.

ద్రోణుడు శీఘ్రముగా అనేకములగు యినుప బాణములను వేసెను. అప్పు డతిశీఘ్రముగా ఆబాణముల నన్నిటిని ధృష్టద్యుమ్నుడు నరికి వేసెను. అట్లు ద్రోణునిబాణములు వ్యర్థములుకాగా అప్పుడు కౌరవ సైన్యములను జూచి భయపడెను.

ద్రోణుడు కోపించుకొని ధృష్టద్యుమ్నుని ధనుస్సును విరుగ గొట్టెను. ధృష్టద్యుమ్నుడు ద్రోణునిమీద శక్తియను ఆయుధమును వేసెను. ఆశక్తి ఆయుధమును ద్రోణుడు మూడు తునుక లగునట్లుగా నరికివేసెను. అంతట ధృష్టద్యుమ్నుడు పొక్కపెట్టున ఒకేసారిగఅనేక శక్త్యాయుధములను ప్రయోగించెను. వానినన్నిటిని ద్రోణుడు వెంటనే నరికివేసెను. పిమ్మట ధృష్టద్యుమ్న గదాయుద్ధము చేయగా పిడుగువలె తనమీద వచ్చుచుండు ఆగదను జూచి, ద్రోణుడు పిండి పిండిగా ఆగదను నరికివేసెను. అంతట ద్రోణుడు వాడిబాణములచేత ధృష్టద్యుమ్నుడు తొడిగికొనియుండి గట్టికవచమును చీల్చి తీక్ష్ణబాణ ములచేత ధృష్టద్యుమ్నుని రక్తమయముగా గొట్టెను. ధృష్టద్యు మ్నుడు మరియొక ధనుస్సును తీసికొని కోపముచేత అనేక యినుప బాణములను ద్రోణుని దేహమందు నాటించగా ఆ బాణములు ద్రోణునిదేహములో గ్రుచ్చుకొని వెనుకప్రక్కగా దూసుకొని పోయెను. ద్రోణునిదేహమందు రక్త మధికముగా కారుచుండెను, ద్రోణుడు క్రొత్తపుష్పములు నిండియున్న మోదుగువృక్షమువలె ప్రకాశింపుచుండెను. ద్రోణుడు ధృష్టద్యుమ్నునిధనుస్సు విరిచి నిమిష మాత్రమున వారిగుర్రములను జంపి సారథిప్రాణములను పోగొట్టెను. ధృష్టద్యుమ్నుడు విరథుడై కొంచెమైనను భంగపడని బంటుతనమును చూపుచు భయంకరముగా రథము దిగుచున్నప్పుడు, అతనిచేతియం దుండు గదాయుధము చూర్ణ మగునట్లుగా, ద్రోణుడు నరికివేసెను. అంతట ధృష్టద్యుమ్నుడు కత్తిని దీసికొని, ఒక పలకను చేతపట్టుకొని

భయమును కలిగింపుచు ద్రోణునిమీదకు వచ్చుచుండెను. అప్పుడు సైన్యములు తల్లడిల్లుచుండెను.

ఆసమయమున ద్రోణు డొక పర్వతముగాను ద్రోణుడు వేయు బాణములు ఆ పర్వతమందు పుట్టినవిగాను యుండెను. ద్రోణుని బాణములు అను నదీవేగమున కెదురుగా ధృష్టద్యుమ్నుడు నడున జాలకుండెను. అట్లుండియు తనమీదపడు బాణములను పలుకచేత చెదరగొట్టుచు శౌర్యముచేత ప్రకాశింపుచుండెను. ధృష్టద్యుమ్నుని భీముడుజూచి, శీఘ్రముగావచ్చి ద్రోణునికి అడ్డుపడెను. భీముడు ఏడు క్రూరబాణములచేత ద్రోణాచార్యుని బాధించి మరియొక రథము మీాద ధృష్టద్యుమ్నుని ఎక్కించెను. అదంతయు నీకొడుకగు దుర్యో ధనుడు చూచి కళింగదేశపురాజగు శ్రుతాయువునకు చేయివిసరి భీమునిదగ్గఱకు వెళ్ళి భీమునితో యుద్ధము చేయమని ఆజ్ఞాపించెను. ఆ శ్రుతాయువు మహాసైన్యమును సహాయముగా తీసికొని భీముని మీాదకువచ్చెను. ద్రోణాచార్యుడు యుద్ధోత్సాహముగల విరాట ద్రుపదులతో యుద్ధముచేయుటకు వెళ్లెను. ధర్మరాజు ధృష్టద్యుమ్నుని కలుపుకొని వెనుకను ఆనుకొనియుండెను. చేదిదేశపు బలములును కరూశదేశపుబలములును భీమునకు సహాయముగావచ్చి ముందర నిలచెను. ఆసమయమున నిషాదదేశపురాజగు కేతుమంతుడనువాడు తనసైన్యమును తీసికొని సర్పమువంటి ఔక్క్యముచేత ప్రకాశింపుచు శ్రుతాయువునకు సహాయముగ భీమునితో యుద్ధముచేయుటకు వచ్చెను. శ్రుతాయువు సైన్యముమీాదకు భీమునిముందర యుండు చేదికరూశదేశములసైన్యము యుద్ధమునకు వెడలెను. శ్రుతాయువుని సైన్యమువలన వేయబడిన బాణములచేత ఆయుద్ధమున భీమునిసైన్య మంతయు నశించెను. నిషాదదేశపురాజగు కేతుమంతుడు గర్వము చేత భీమునిమీాదకు వచ్చి అగ్నియందు బడిన మిడుతవలె భీముని బాణములచేత మృతిబొందెను.

పిమ్మట శ్రుతాయువుని కొడుకగు చక్రదేవుడు తీక్ష్ణమైన బాణములవర్షముచేత భీముని నుంచి గుఱ్ఱములను చంపెను. భీముడు క్రోధముచేత మండిపడుచు పెద్దదైన గదనెత్తి ఆ చక్రదేవునిపైని వేసెను. ఆగదయొక్క దెబ్బవలన వజ్రాయుధముచేత పర్వతము పడినట్లు చక్రదేవుడు సారథిసహితముగ చచ్చిపడెను. ఇట్లు భీముడు అద్భుతము కలిగించు పరాక్రమముచేత ప్రకాశింపుచు ఒక డాలును కత్తిని తీసికొని గుఱ్ఱములులేని తనరథమునుండి క్రిందికి దిగెను. భీముడు ధరించిన డాలు బంగారు చుక్కలగుంపులచేత సొగసుగలిగి గట్టిదై విశాలముగలదిగా యుండెను. భీముడు ధరించినకత్తి కల్పాంతమందు యమధర్మరాజుయొక్క నాలుకతో సమానమై భయంకరమై యుండెను. అట్లు డాలుకత్తులను దీసికొని రథముమీదనుండి భీముడు దిగి వెంటనే కుమారుని చావువలన దుఃఖించు శ్రుతాయువు భీముని మీదకు రథముతోలించి పిడుగుపిల్లవంటి ఇనుపబాణమును వేసెను. ఆబాణమును భీముడు నరికివేసెను. అంతట శ్రుతాయువు ఒక్కసారే పదునాలుగు తోమరాయుధములను భీమునిమీద వేసెను. వాని నన్నిటి భీముడు కత్తిచేత నరికివేసెను. అంతట శ్రుతాయువుని తమ్ముడగు భానుమంతుడనువాడు తన ఏనుగుసైన్యముతో వచ్చి శ్రుతాయువునకు సహాయుడై వానివెనుకవేసుకొని భీమునితో యుద్ధము చేయుటకు వచ్చెను. భానుమంతుడు తన సైన్యమునకు ముందు నిలిచి భీమునిమీద యినుపబాణములను వేయుచు తాను ఎక్కిన ఏనుగును భీమునిమీదకు పురికొల్పెను.

## భీమసేనునిచేత భానుమంతుడు చచ్చుట

ధృతరాష్ట్ర మహారాజా! అసమయమున భీముడు ఒక సింహనాదము చేయగా ఆధ్వనిచేత దిక్కులన్నియు ప్రతిధ్వని గలిగి

యుండెను. పిమ్మట భీముడు అధిక శౌర్యోత్సాహముచేత రౌద్రాకారుడై ఆయేనుగుమీదకు యెగిరెను. ఆ యేనుగు దంతములను త్రొక్కి యెక్కి తన కత్తిచేత ఆ భానుమంతుని నరికివేసెను. అట్లు నరికినపుడు ఆభానుమంతుని రక్తము ఆకాశమునకు వ్యాపించెను. భీముడు ఆభానుమంతుడెక్కిన యేనుగుయొక్క తలనరికి తొలగిపోయెను. భీముడట్లు తొలగిపోయి గంతులు వేయుచున్నట్లు నడచుచుండెను. భీమునికత్తి రక్తమయమై యెఱుపువన్నె గలిగి ప్రకాశించుచుండెను. భీమునితో యుద్ధము చేయుటకొరకు శ్రుతాయువు తన సైన్యమునకు చేయివిసరెను. వెంటనే ఆ శ్రుతాయువుయొక్క చతురంగబలములు వచ్చి భీముని చుట్టుముట్టుకొనెను. అప్పుడు భీముడు రథములేనందున పాదచారియై యుండెను. ఒంటరిగా నుండెను. ఇట్లున్న తన విధమును తలపక తన భుజాబలగర్వమువలన యుద్ధక్రీడకు ప్రవేశించెను.

ధృతరాష్ట్రమహారాజా! భీముడు తనకత్తిని తీసికొని ఆసైన్యములోనికి ప్రవేశించి ఆకత్తిచేత యేనుగుల కుంభస్థలములను పగలగొట్టగా ఆయేనుగుల మెదడు కత్తికంటుకొనగా ఆకత్తికి పదును తగ్గుచుండెను. పదును తగ్గినపుడు ఆ శ్రుతాయువుని సైన్యములోనుండు టెక్కెపుస్తంభములను ఆకత్తిచేత నరుకగా ఆ కత్తికి మరల పదును కలుగుచుండెను. భీముడు ఆకత్తిచేత రథికసారథులతోగూడిన రథములను నరికినపుడు ఆకత్తికి మొక్కలు పోవుచుండగా గుఱ్ఱముల శరీరములను కోసి ఆకత్తికి పదును కలిగింపుచుండును. ఉత్సాహముచేత గుఱ్ఱములమీదకు పోయినపుడు అలసటగలిగిన యెడల ఆకత్తిచేత గుఱ్ఱములను నరికి విసరుచుండును. కత్తిచేత విసరుచున్నపుడు ఆకత్తికి అంచు మొరవోయినయెడల సూరకత్తిచేత ఆకత్తికి యంచుకలిగించుకొని సులభముగా కాల్బలముమీదకు

రథ

...కి నరుకుచుండెను. ఈరీతిగా భీముడు అనేకవిధములైన చిత్ర...లచేత విహరించుచు శ్రుతాయువుని సైన్యవ్యూహమును భేదింపుచు ఆశ్చర్యముగా ఓడించి పరుగెత్తించుచుండెను. మూడుజాములైనప్పుడు భీముడు శ్రుతాయువునితో యుద్ధముచేయుటకు ప్రయత్నించెను. ఆ సమయమున భీమునియొక్క సారథి తగిన ఆయుధ సామగ్రితో కూడుకొనియున్న రథమునకు తగిన గుఱ్ఱములను పూన్చి తోలుకొనివచ్చెను. భీముడు తన సారథిని ప్రేమతో చూచి తన యెదుటనుండు రథముమీద నెక్కెను. పిమ్మట భీముడు ధనుస్సును తీసికొని అల్లిత్రాటిని ధ్వనింపజేయుచు సవరించుకొనుచుండెను. ఆసమయమున శ్రుతాయువు బంగారుపిడులుగల తొమ్మిది వాడిబాణములను భీముని దేహమునందు నాటునట్లుగా వేసెను. భీముడు కోపముగలవాడై భయంకరమగు యేనుగువలె రౌద్రాకారముగా ఆశ్రుతాయువునిదగ్గరకు పోయెను.

భీముడట్లు దగ్గరకుపోయి అయిదు యినుప బాణములచేత ఆశ్రుతాయువును సతికిలపడగొట్టి మూర్ఛబోవునట్లు చేసెను. భీముడు ఆ శ్రుతాయువుయొక్క రథచక్ర రక్షకులగు సత్యుని, సత్యదేవుని చంపి ఆకాశమువణకునట్లు సింహనాదము చేసెను. శ్రుతాయువు మూర్ఛనుపొందిన తోడనే వానిసారథి రథమును తొలగ దోలుకొని పోయెను. ఓడను నడుపువాడు లేని ఓడవలె శ్రుతాయువుని సైన్యము తిరుగు పడెను. భీముడు తన శంఖమును పూరించెను. ఆ శంఖధ్వనిని భీష్ముడు విని భీమునిమీదకు యుద్ధమునకు వెళ్ళెను. భీష్ముడు రాగానే ధృష్టద్యుమ్నుడును, శిఖండియు, సాత్యకియు, వీరు ముగ్గురును భీమునకు సహాయులై భీముని వెనుకవేసికొని భీష్మునకు అడ్డమువచ్చిరి. అట్లు అడ్డపడి వారుముగ్గురును భీష్మునిమీద అధికముగా బాణములను వేసిరి. అనేకరథములాధృష్టద్యుమ్నునికి

సహాయముగా వచ్చెను, భీష్ముడు శిఖండిదేహమందుతప్ప తక్కిన అందరిదేహములయందును తీక్ష్ణబాణములను నాటి భీముని నిశ్చేష్టితునిగా జేసెను. భీష్ముడు భీమునియొక్క రథమును పడగొట్టి గుఱ్ఱములను చంపివేసెను. భీముడు కోపముగలవాడై భీష్మునిమీద గొప్ప శక్త్యాయుధమును వేసెను. భీష్ముడాశక్త్యాయుధమును మూడు తునుకలుగా నరికివేసెను. భీముడు కోపము మిక్కిలిగా గలవాడై ప్రకాశమానమగు గదాయుధమును తీసికొని అతిభయంకర రూపముగా రథముదిగెను. సాత్యకి తన మదగర్వముచేత భీముని వెనుకవేసికొని భీష్ముని మీదకు బోయెను మంత్రసహితమైన బాణముచేత భీష్మునియొక్క సారథిని చంపెను. సారథిచచ్చిన తోడనే భీష్మునియొక్క వాయువేగమువంటి వేగముగల గుఱ్ఱములు అతని రథము నెత్తికొని పోయెను. కౌరవసైనికులు భీముని యెదుట నిలువజాలక పరుగెత్తిపోయిరి. ధృష్టద్యుమ్నుడు భీముని తన రథముమీద కూర్చుండబెట్టుకొనెను. సాత్యకి తన రథమును ధృష్టద్యుమ్నుని రథముదగ్గరకు తోలించుకొని వచ్చి భీమునిజూచి యిట్లనెను. భీమా! నీవు ఒంటరిగా శ్రుతాయువుతో యుద్ధముచేసి కౌరవసైన్యము లన్నియు చూచుచుండగా శ్రుతాయువునియొక్క పుత్ర సహోదర సైన్యములను చంపితివి. అట్లు చంపి అందరుచూచుచుండగా శ్రుతాయువు పారిపోవునట్లు చేసితివి. ఈపని యితరులకు సాధ్యమగునా! అని సాత్యకి భీముని పొగడెను. భీమాదులతో యుద్ధముచేయుటకు శల్య కృపాచార్య అశ్వత్థామలు ముగ్గురును వచ్చుచుండిరి. వారిని ధృష్టద్యుమ్నుడు చూచి భీమునితో యిట్లనెను.

భీమా! అదిగో శల్యకృపాచార్య అశ్వత్థామలు ముగ్గురును మన మీదకు వచ్చుచున్నారు. నీవు నావెనుకనుండి చూచుచుండుము. నేను ఆ ముగ్గురుమీదకు వెళ్ళి యుద్ధముచేసెదను. అని

ధృష్టద్యుమ్నుడు భీమునితో చెప్పి వినయముతో భీముని దించి పిసరథ
మును శల్యాదులుండు దిక్కునకు త్రోలించెను. అంతట ధృష్టద్యు
మ్నుడు పదిబాణములచేత అశ్వత్థామయొక్క గుఱ్ఱములను చంపెను.
అశ్వత్థామ శల్యునిరథముమీదకు పోయి ధృష్టద్యుమ్నునియొక్క
సారథి దేహమందు అనేక తీక్ష్ణబాణములను వేసెను. శల్య కృపా
చార్యులిద్దరును ధృష్టద్యుమ్నుని సారథి దేహమందు అనేక తీక్ష్ణ
బాణములను ప్రయోగించిరి. ఇట్లు ఆశల్య కృపాచార్య అశ్వత్థామ
లచేత ధృష్టద్యుమ్నుడు చుట్టబడియుండెను. ధృష్టద్యుమ్నుడొక్కడే
యుద్ధము చేయుచున్నాడని దూరమునుండి అభిమన్యుడు చూచి తన
రథమును త్రోలించుకొని అతనికి సహాయముగా వచ్చెను. అభి
మన్యుడు కృపాచార్య అశ్వత్థామలమీద తొమ్మిది బాణ
ములు వేసి శల్యునిమీద యిరువదియైదు బాణములను నాటించెను.
శల్య కృపాచార్యాశ్వత్థామలు ముగ్గురును ఒక్కొక్కడు పండ్రెండు
బాణములవంతున అభిమన్యునిమీద వేసిరి. పిమ్మట లక్ష్మణ కుమా
రుడు వచ్చి అభిమన్యునకు యెదుటనిలిచి మర్మములను భేదించు
యినుప బాణములచేత అభిమన్యుని నొప్పించి తన హస్తలాఘువ
మును చూపెను. ఆ లక్ష్మణ కుమారుడు పెద్ద బాణములచేత అభి
మన్యుని ధనుస్సుయొక్క నడిమిముడివరకు ధనుస్సును విరిచెను.
అట్లు లక్ష్మణకుమారుడు ధనుస్సును విరిచి సింహనాదము చేయగా
కౌరవసైన్యము లన్నియు సింహనాదముచేసెను. అభిమన్యుడు మరి
యొక గొప్పధనుస్సును తీసికొని లక్ష్మణ కుమారుని బాధించెను.
తన కుమారుడగు లక్ష్మణ కుమారుడు నొచ్చెనని దుర్యోధనుడు
తెలిసికొని కోపముచేత తన రథమును అభిమన్యుని మీదికి త్రోలిం
చెను. దుర్యోధనుడట్లు వచ్చినవెంటనే భీష్మ ద్రోణులు మొదలగు
మహారథికు లందరును ఒక్కపెట్టున అభిమన్యునిమీదికి వచ్చిరి.
నలుదిక్కులనుండి మహారథికు లందరును తనమీదికి వచ్చినను అభి

మన్న్యుడు భయపడక అందరికి అన్నిరూపులుగానుండి ధైర్యముచేత నవ్వుచు యుద్ధము చేయుచుండెను. అ సమయమున అర్జునుడుచూచి తల దివ్యరథమును ఆకాశ మార్గమున తోలుకొని వచ్చుచు కౌరవ సైన్యముమీదను దుర్యోధన భీష్మ ద్రోణులమీదను బాణవర్షము లను కురిపించుచు శీఘ్రముగా వచ్చెను. ఈ వృత్తాంతము నంతయు ధర్మరాజు చూచి తన సైన్యములన్నిటికిని చేయివిసరెను. పాండవ సైన్యములన్నియు ఒక్కపెట్టున కౌరవసైన్యములమీద పడెను. అప్పుడు కౌరవ సైన్యములకు ధైర్యము కలిగియుండలేదు. యుద్ధ భూమినుండి లేచినదుమ్ము సూర్యునికప్పి చీకట్లు గలిగించెను. యేను గుల యొక్కయు గుఱ్ఱముల యొక్కయు, రక్తప్రవాహముచేత ఆ దుమ్మంతయు అణగినది.

ధృతరాష్ట్ర మహారాజా ! అర్జునునియొక్క నానావిధములైన బాణముల దెబ్బలు తగుటచేత కౌరవ సైన్యములయందు గల ధనుస్సులును కత్తులును పరిఘాయుధములును గండ్రగొడ్డళ్లు మొద లగు ఆయుధములన్నియు తునుకలు తునుకలుగా విరిగిపోయెను. అర్జునుని బాణపు దెబ్బలచేత గుఱ్ఱముల శిరస్సులును, యేనుగుల కుంభస్థలములును, కాల్బలముల తల పుర్రెలును బ్రద్దలు బ్రద్దలుగా పగిలిపోయెను. అర్జునుని బాణములచేత రథచక్రములును టెక్కెము లును గొడుగులును చామరములు మొదలగున వన్నియు చూర్ణము లాయెను. అర్జునుని బాణములవలన యుద్ధభూమి మిక్కిలి భయంకర ముగా నుండెను. ఆ సమయమున యుద్ధభూమిలో తమ మీద నున్న మనుష్యులందరు చచ్చినందున గుఱ్ఱములును, యేనుగులును, రథములును తిరుగుచుండెను. గుఱ్ఱములు, యేనుగులును, రథములు నశించగా వాని మీదనుండు భటులు గర్వము లేనివారై దిరుగు చుండిరి.

ధృతరాష్ట్ర మహారాజా! యీ రీతిగా మనసైన్యమంతయు వ్యాకులమునుపొంది చెదిరి, మరలి భయపడి పరుగెత్తుచుండెను. ఆ సమయమున కృష్ణార్జునులు తమదివ్య శంఖములగు పాంచజన్య దేవదత్తములను పూరించిరి. ఆ సమయమున భీష్ముడు ద్రోణాచార్యునితో యిట్లనెను. ద్రోణాచార్యులారా! పూర్వము ఉత్తర గోగ్రహణ కాలమందు అర్జునుడు కృష్ణునియందు బుద్ధినుంచి వచ్చి కౌరవ సైన్యమంతయును అప్పుడే జయించెను. ఆ యర్జునుడే యిప్పుడు కృష్ణుని సారథిగానుంచుకొని యుద్ధమునకువచ్చి కౌరవ సైన్యముల నన్నిటిని యీ ప్రకారముగా చంపివేసెను. కోపముచేత మూడవకంటిని తెరచిన ప్రళయకాలరుద్రునివంటి స్వభావము యిప్పుడు యీ అర్జునుని ముఖమందు కనబడుచున్నది. గనుక యిప్పుడు మనము మనసైన్యములను మరలింపజాలము. మన సైన్యములన్నియు పరుగెత్తుచు పోవుచున్నవి. పరుగెత్తక నిలిచియున్న రథికులు యిపుడు డస్సియున్నారు. సూర్యుడస్తమింపబోవుచున్నాడు, ఇక యీ దినమునకు యుద్ధమును చాలింతము అని భీష్ముడు చెప్పగా ఆ మాటలకు ద్రోణాచార్యుడు సమ్మతించెను.

భీష్ముడు తమ సైన్యములను దించుటకు వుత్తరవు చేసెను. పాండవులు పాంచాలదేశపు సైన్యములతోడను, మత్స్యదేశము మొదలగు సైన్యములతోడను, చేరుకొని సింహనాదములు చేత తమ తమ శిబిరములకు మరలి వెళ్ళిరి. ఈరీతిగా రెండవనాటి సాయంకాలమందు కౌరవ పాండవుల పక్షములయందుండు సైన్యము లన్నియు తమతమ శిబిరములకు వెళ్ళిరి.

## మూడవనాటి యుద్ధము

ధృతరాష్ట్ర మహారాజా! మరునాటి వుదయకాలమందు భీష్ముడతిశీఘ్రముగా కౌరవ సైన్యములను చేర్చుకొని గరుడపక్షివంటి

వ్యూహమును యేర్పరచుకొని తానా వ్యూహమునకు ముందర నిలిచి ప్రకాశింపుచుండెను. ఆ గరుడవ్యూహమునకు, ద్రోణాచార్యుడును, కృతవర్మయు, వీరిద్దరును రెండు కన్నులుగా నిలిచియుండిరి. కృపాచార్యుడును, అశ్వత్థామయు, వీరిద్దరును గరుడవ్యూహమునకు శిరస్సుగా నిలిచియుండిరి. త్రిగర్తదేశపు రాజులును భూరిశ్రవుడును శల్యుడును భగదత్తుడును సౌవీరదేశపు రాజులును సైంధవుడు వీరందరును తమ తమ చతురంగబలములతో ఆ గరుడవ్యూహమునకు కంఠాకారముగా నిలిచియుండిరి. దుర్యోధనుడును అతని తమ్ములును వీపుగా నిలిచియుండిరి. విందానువిందులను అవంతీదేశపు రాజులును కాంభోజుడును శూరసేనుడును ఆ గరుడవ్యూహమునకు తోకవలె నిలిచియుండిరి. మగధదేశపు సైన్యములును కళింగాదిదేశముల బలములును గరుడవ్యూహమునకు కుడిరెక్కగా నిలిచియుండిరి. కర్ణాటపుదేశముల బలములును, కోసలము మొదలగు దేశముల బలములును, యెడమ రెక్కగా నిలిచియుండెను. తక్కిన కౌరవ సైన్యములన్నియు, ఆ గరుడవ్యూహమునకు తగినట్లుగా నిలిచి యుద్ధమునకు వచ్చియుండెను. పాండవసైన్యములును యుద్ధమునకు బయలుదేరెను. అసమయమున అర్జునుడు కౌరవ వ్యూహమును జూచి ధృష్టద్యుమ్నునితో యిట్లనెను.

ధృష్టద్యుమ్నా! మనసైన్యమునకు అర్ధచంద్ర రూపముగా వ్యూహమును యేర్పరపుము, దుర్యోధనుని సైన్యమును పొందుటకు అనుకూలముగా నుండవలయును. అని యిట్లు అర్జునుడు చెప్పగా ధృష్టద్యుమ్నుడు పాండవ సైన్యములకు అర్ధచంద్ర రూపముగా వ్యూహమును యేర్పరచెను. ఆ అర్ధచంద్రాకార వ్యూహమునకు పాండ్య మగధదేశముల రాజసైన్యములతో భీముడు గూడినవాడై

కుడికొమ్ముగా నిలిచెను. విరాట ద్రుపదులును నీలుడును కాశకరూశ దేశముల సైన్యములతో కూడియున్న ధృష్టకేతుడును అర్ధచంద్రాకార వ్యూహమునకు యెడమకొమ్ముగా నిలిచిరి. ఆ యర్ధచంద్రాకార వ్యూహమునకు మధ్యప్రదేశమందు ధర్మరాజు భయంకరమైన యేనుగు సైన్యముతో గూడుకొని ధృష్టద్యుమ్న శిఖండులను ముందు పెట్టుకొని అలంకరించి యుండెను. ఆ అర్ధచంద్రాకార వ్యూహమునకు కుడివైపు సాత్యకి మొదలుకొని నకులసహదేవ ద్రౌపదీపుత్రులును, అభిమన్యు ఘటోత్కచులును, కేకయరాజులును నిలిచిరి. యెడమవైపు అర్జునుడు నిలిచెను. తక్కిన దొరలందరును ఆ వ్యూహమునకు తగినట్లుగా నిలిచిరి.

ధృతరాష్ట్రమహారాజా ! యీ ప్రకారముగా రెండుపక్షముల వారును తగిన వ్యూహములను ఏర్పరచుకొని యుద్ధసన్నద్ధులై యుండిరి. ఆ కౌరవ పాండవ సైన్యములు రెండును నడిచి ఢంకా మొదలగు వాద్యవిశేషములు మ్రోగుచుండగా రౌద్రాకారముగా ఆ రెండు సైన్యములను యుద్ధమునకు ప్రారంభించెను. ఆసమయమందు కౌరవసైన్యముల కాల్బలములు అలయునట్లుగా అర్జునుడు తన రథమును తోలించి బాణములు వేసెను. ఆ బాణములచేత రథములును మహారథికులును గుఱ్ఱములును, సారథులును లెక్కలేనన్ని యేనుగులును, బంటులును, యివి యన్నియు పొడిపొడిగాను తునుకతునుకలుగాను నశింపుచుండెను. అర్జునుడు కౌరవసైన్యములను చంపుటకు ప్రారంభించెను.

ధృతరాష్ట్ర మహారాజా! ఆసమయమున నీకొడుకులగు దుర్యోధనాదు లందరును ఒక్కపెట్టున లేచి అర్జునునిమీదకు పోయిరి. ధర్మరాజు భీమ నకులసహదేవులు తమతమ రథములను తోలించుకొని అర్జునునకు సహాయముగా దుర్యోధనాదుల మీదకు

బోయిరి. అప్పుడా కౌరవపాండవుల సైన్యములు రెండును కలిసి యుద్ధముచేసెను. అప్పుడు యుద్ధభూమినుండి యెఱ్ఱని దుమ్ము దట్టముగా వ్యాపించెను. ఆదుమ్మువలన యేపక్షమువారైనను తెలియక తమ పేరులచేతను. తమ తండ్రిపేరులచేతను. తమ తాతపేర్ల చేతను తమ గొప్పబిరుదులు గల పేర్లచేత తమను తాము పరులకు తెలుపుచుండిరి. అట్లు తెలియబడినపిమ్మట భీష్ముని శక్తిచేత కౌరవసైన్యము చిక్కుపడక యుద్ధముచేసెను. భీముని బలముచేత పాండవసైన్యము చిక్కుపడక యుద్ధముచేసెను. ఇది ఆశ్చర్యమును కలిగించుచున్నది. అటుపిమ్మట కొంతసేపటికి రక్తప్రవాహముచేత ఆ దుమ్ము నశించెను. అట్లు నశించిన పిమ్మట రెండుపక్షములవారి సైన్యములును దేవరాక్షసులవలె యుద్ధము చేసెను. ఆసమయమున భీష్మ ద్రోణ పురమిత్ర శకుని వికర్ణులు పాండవ సైన్యముమీదకు వచ్చిరి. భీమ, ఘటోత్కచ, సాత్యకి చైద్య చేకితాన, ద్రౌపదీ పుత్రులు ఆ భీష్మాదులతో యుద్ధము చేసిరి. అప్పుడు జరిగిన యుద్ధము మిక్కిలి ఘోరముగా నుండెను. నీ పెద్దకొడుకగు దుర్యోధనుడు రథసమూహములతో వచ్చి భీముడున్నచోటికి వెళ్ళుచుండెను. భీష్మ ద్రోణు లాదుర్యోధనుని చూచి, అతనికి ముందునకువెళ్ళి ఘటోత్కచాది పుత్రసహితముగా నున్న భీముని తాకిరి. ఆ భీష్మ ద్రోణులను అర్జునుడు చూచి భీముని వెనుక వేసికొని మహాబాణ వర్షముచేత భీష్మ ద్రోణ దుర్యోధనాదుల గర్వమణచెను. సాత్యకి అభిమన్యు లిద్దరును కౌరవసైన్య మను మహాసముద్రమును యీది సాధించుటకు ఆసైన్యములోనికి ప్రవేశించిరి. శకుని బలము సాత్యకిని చుట్టుకొని అతని రథమును నరికివేసెను. సాత్యకి ధైర్యముచేత ఆ రథమును దిగి అభిమన్యుని రథముమీదకు పోయెను. సాత్యకి అభిమన్యు లిద్దరును శకుని మొదలగు అనేక రథికులను బాణసమూ

హాములచేత నొప్పించిరి. ధర్మరాజు క్రూరస్వభావముగలవాడై భీష్మునిమీదకు యుద్ధమునకు పోయెను. భీష్ముడు ధర్మరాజుతో యుద్ధము చేయకుండెను. అంత ద్రోణుడును కౌరవసైన్యములును ధర్మరాజుతో యుద్ధముచేసెను.

## దుర్యోధనుడు భీమునితో యుద్ధముచేసి మూర్ఛిల్లుట

ధృతరాష్ట్రమహారాజా! ఆసమయమున దుర్యోధనుడు వేగముగా భీమునిమీదకు పోయి ప్రకాశములగు బాణములను వేసెను. అప్పుడు భీముడు నవ్వుచు ఒక గట్టిబాణమును దుర్యోధనుని దేహములోనుంచి దూరిపోవునట్లు వేసెను. ఆ బాణపుదెబ్బచేత దుర్యోధనుడు రథముమీద చతికిలబడి మూర్ఛిల్లెను. అప్పుడు ఆ దుర్యోధనుని సారథి ఆ రథమును తోలుకొని తొలగిపోయెను. అప్పుడు కౌరవసైన్యము లన్నియు భయపడి పారిపోవుచుండెను. ధృష్టద్యుమ్న భీములును, వారితోనుండినవారును కౌరవసైన్యములకు వెనుకజేరి తరుమగొట్టుచుండిరి. భీష్మ ద్రోణు లిద్దరును భీముని బెదరించుచు నిలు నిలు మని చెప్పిరి. అట్లు చెప్పినను మనసైన్యములు మరలక భీముడు చేసిన సింహనాదమునకు భయపడి వెళ్ళుచుండెను. అభిమన్య సాత్యకు లిద్దరును శకుని సైన్యమును త్రోలిరి. శకునిసైన్యము భయపడి పరుగెత్తెను. శకునియు అతని బంధువులును ధైర్యములేక తిరుగుచుండిరి. అర్జును డొక్కప్రక్కనుండి రౌద్రాకారముగా కౌరవసైన్యమును త్రోలుచుండెను. దుర్యోధనుడు మూర్ఛను తెలిసికొని లేచి తన రథమును తొలగించినందుకు తన సారథిని దూషించి శీఘ్రముగా యుద్ధభూమి మధ్యమమునకు వచ్చెను. దుర్యోధనుడట్లువచ్చి అరువగా కౌరవసైన్యము లన్నియు మరలి యుద్ధమునకు వచ్చెను. భీష్మ ద్రోణులు తామున్నచోటనే కదలక యుద్ధము చేయుటకు ప్రయత్నించగా కౌరవసైన్యము పెరిగి చంద్రోదయ కాలమందు సముద్రమువలె ధ్వనింపుచుండెను.

ధృతరాష్ట్రమహారాజా! దుర్యోధనుడు పారిపోవు తన సైన్యములను మరలించి శీఘ్రముగా భీష్మ ద్రోణుల దగ్గరకు పోయి యిట్లనెను. భీష్మద్రోణులారా! మూడులోకములును ఒక్కటైయొక కాలమందు మీ మీదకు వచ్చినను మీరు ఒక్కొక్కరే ఆ మూడులోకములను సులభముగా జయింపగలరు. మీ ముక్కున కోపము గలిగినయెడల మన సైన్యమునకు యింత కీడుకలుగజాలదు. అయ్యో! మీరు పాండవులయందు కోపించుకొనని విషయమును యిదివరకే చెప్పకపోతిరి. అని యిట్లు దుర్యోధనుడు భీష్మద్రోణులతో జెప్పి భీష్ముని జూచి మరల యిట్లనెను, భీష్మా! ఇదివరకే నీవు పాండవులతో కోపించుకొననని చెప్పకపోతివి. అట్లు చెప్పిన యెడల నాకును కర్ణునకును తోచినట్లు యుద్ధముచేసి పడదగిన పాట్లను పడుదుము. నిన్ను నమ్మి యిపుడు యుద్ధమందు నీ నిమిత్తముగా భంగపడితిని. ఇకను మాటలాడవలసిన ప్రయోజనము లేదు, అని దుర్యోధనుడు చెప్పగా ఆమాటలను భీష్ముడు విని చిరునవ్వును నవ్వుచు సంతోషపు మాటలచేత దుర్యోధనుని వ్యాకులమునుపోగొట్టి యిట్లనెను.

దుర్యోధనుడా! దేవసైన్యముతోటి ఆ దేవేంద్రుడువచ్చినను పాండవులను గెలువజాలడు. నన్ను నీవిట్లు నిందించుట తగదు. పాండవులు దివ్యాస్త్రసంపన్నులై బలపరాక్రమవంతులై యున్నారు. పాండవులను ముసలివాండ్రును ఆయుస్సు లేనివారును చెడుబుద్ధి గలవారును, గెలువజాలరు. అయినను నా శక్తికొలది పాండవసైన్యములను చంపెదను. నీవును నీ బంధుజనులును దగ్గరయుండి చూచుచుండుడు. అని యిట్లు భీష్ముడు దుర్యోధనునితో చెప్పి తొందరచేత విజృంభించెను. నీ పుత్రులగు దుర్యోధనాదులును సంతోషించి తమతమ శంఖములను పూరించిరి. కౌరవసైన్యములయందు భేరీలును

మద్దెలలు మొదలగు వాద్యములు అధికముగా మ్రోగెను. ఆ ధ్వనులను పాండవులు విని తమ తమ శంఖములను భం భం భం అని పూరించిరి. అంతట పాండవసైన్యములయందు అనేక విధములైన వాద్యములు మ్రోగెను. పాండవులు తమ సైన్యమును దిట్టపరచికొని సంతోషముచేత యుద్ధమునకు నడిచిరి. అని యిట్లు సంజయుడు ధృతరాష్ట్రునితో చెప్పగా ధృతరాష్ట్రు డిట్లనెను.

సంజయుడా! దుర్యోధనునిమాటలకు భీష్ముడు తన భుజాబలము వలన విజృంభించి పాండవసైన్యములతో యే ప్రకారముగా యుద్ధము చేసెనో చెప్పుము. అని అడుగగా సంజయుడు యిట్లనెను. ధృతరాష్ట్రమహారాజా! అప్పుడు సూర్యుడు మధ్యాహ్నగతుడాయెను. సూర్యుడు మధ్యాహ్నమందు ప్రకాశింపుచుండగా ఆ సూర్యునితో సమానముగా భీష్ముడు తేజోమహిమచేత ప్రకాశింపుచుండెను. భీష్ముడు సూర్యకిరణములవంటి తన ప్రకాశబాణములచేత ప్రకాశింపుచు అర్జునునిమీదకు బోయెను. దుర్యోధనుడు మొదలగు కౌరవరథికశ్రేష్ఠులు భీష్ముని వెంటనే వెళ్ళి అర్జునునిమీదకు పోయిరి. పాండవసైన్యములలో నుండు భీముడు మొదలగు రథికులు ఒక్కపెట్టున దుర్యోధనాదులకు అడ్డుపడిరి. కౌరవపాండవులయొక్క రెండు సైన్యములును కలియబడి అతి భయంకరముగా యుద్ధము చేసెను. ఆ యుద్ధమును జూచి ఆకాశమందుండు దేవతలు మెచ్చుకొనిరి. అట్టి సమయమందు ఆ సైన్యముల యందుండు వారు హుంకారశబ్దములచేతను, బెదరింపుమాటలచేతను, అరకేలు వేయుటచేతను తిరస్కారవాక్యములచేతను, నిందావాక్యములచేతను, శౌర్యపుమాటలచేతను, వాద్యములను మ్రోయించుటచేతను, ధ్వనులు చేయుచుండిరి. ఈ శబ్దములన్నియు జేరి అధికముగా ధ్వనికలిగెను. ఆ సమయమందు బాణపుదెబ్బలచేత ఆ సైన్యములలో భటులశిరస్సులు విరిగి సగము

చుండెను. చేతులు తెగిపడుచుండెను శరీరములు తుంటలుగా విరిగి పడుచుండెను. బాణములు తునుకలుగా నరుకబడుచుండెను. గదాయుధములును, ధనుస్సులును, కిరీటములును, కంకణములను ఆభరణములును బంగారుభుజకీర్తులును, దట్టముగా భూమియందు పడియుండెను. ఆయుద్ధభూమియందు అనేకరక్తప్రవాహనదులు కలిగెను. ఆరక్తనదులయందు చచ్చిపడియుండు చతురంగ బలములయొక్క మాంసములే బురదగా నుండెను. ప్రవహించెడి రక్తప్రవాహములే నీరుగా నుండెను. సగము చచ్చినదేహములే చేపలు మొదలగు జంతువులుగా నుండెను. ఆ యుద్ధభూమియందు రథములు విరిగి తునకలై పడియుండెను. గుర్రములు యేనుగులు గుంపులు గుంపులుగాను కుప్పలు కుప్పలగాను పడి పర్వతములవలెనుండెను. ధృతరాష్ట్ర మహారాజా! యీవిధముగా యుద్ధభూమి యంతయు చతురంగబలములు తెగిపడుటచేత మిట్టపల్లములుగా నుండెను. అట్టి యుద్ధభూమియందు సంచరించుటకు సమర్థులుగాక రథికులందరును అక్కడక్కడ గుంపులుగుంపుగా నిలచియుండిరి. భీష్ముడు ప్రతిరథికుని వారి వారి పేర్లచేత ప్రత్యేకముగా పిలుచుచు గర్జించి అన్నిదిక్కులయందును బాణవర్షములు కురిపించుచుండెను. అప్పుడు భీష్ముడు మెరపుమెరసిన చందముగాను కొరవిత్రిప్పిన విధముగాను, ఇంద్రజాలపు మాయను చూపినట్లుగాను యెక్కడ చూచినను తానే కనబడుచుండెను. అప్పుడు భీష్ముడు యెక్కడ చూచినను తన రథమును ప్రకాశింపజేయుచు తన శక్తిశౌర్యములను చూపుచుండెను. భీష్ముని నిలుపుటకు యెవ్వరికిని సాధ్యము గాకపోయెను. అప్పుడుభీష్ముడు తన యెదుట బడిన శత్రుసైన్యములను ఒక్కబాణముచేతనే అనేకములను చంపుచుండెను. అనేకబాణములచేత ఒక్కటిని చంపుచుండెను. ఈప్రకారముగా భీష్ముడు యుద్ధక్రీడ జరుపుచు తనమీాదకు వచ్చు రథికులను

కీళ్ళు తొలగించిన యంత్రపుబొమ్మలవలె భూమియందు చంపి పడ వేయుచుండెను. భీష్మునకు గల దృఢస్వభావలక్ష్యశుద్ధి కరలాఘవము లకు దేవతలు తల్లడిల్లుచుండిరి. ఈ ప్రకారముగా భీష్ముడు అనేక విధములగు క్రూరబాణములచేత పాండవుల చతురంగబలములను తునకలు తునకలుగాను తుండ్లుతుండ్లుగాను నరికివేయుచుండెను.

ధృతరాష్ట్ర మహారాజా! యీరీతిగా భీష్ముడు కార్చిచ్చు దహించునట్లును, మాయను కలుగజేసినట్లును, మంత్రించి వేసినట్లును చెలరేగి పాండవుల సైన్యమును నశింపజేయు చుండెను. అప్పుడు భీష్ముడు ప్రళయకాలమందు తాండవనృత్యము సలుపు రుద్రునివలె యుద్ధరంగమందు పరాక్రమముచేత నృత్యము చేయు చుండెను. ఆ సమయమున పాంచాలయాదవాది సైన్యములలోనుండు యోధు లందరును భీష్ముని జూచి ఆశ్చర్యభయములు గలవారై చూచుచుండిరి. పాండవులు చేయునది లేక యేమియు చేయజాలక నిలిచి భీష్ముని జూచుచుండిరి. ఆ పాండవుల సైన్యములును నశించి భయపడి హీనదశకు వచ్చెను. ఆ సమయమందు కృష్ణుడు పగ్గముల చేత గుఱ్ఱములను లాగిపట్టి నిలిపి అర్జునునిజూచి యిట్లనెను.

అర్జునా! నీవు యిదివరకు భీష్మద్రోణ కృపాచార్యులతోగూడి యుండు దుర్యోధనుని సైన్యమును గెలిచెదనని యుద్ధకాలమును కోరుచుందువు. నీవు అపరిమితమైన పరాక్రమమును కలిగియున్నావు. భీష్ముడు ప్రళయకాలరుద్రునివలె పరాక్రమించి యున్నాడు. అట్టి భీష్మునిమీద యిపుడు నీపరాక్రమమును జూపి యుద్ధము చేయకుండుట తగదు.

## అర్జునుడు శ్రీకృష్ణప్రేరితుడై భీష్మునిపై గదయుట

అని శ్రీకృష్ణుడు చెప్పగా అర్జునుడు డిట్లనెను. కృష్ణా! నీవిట్లు యెందుకు చెప్పెదవు? మన రథమును యిప్పుడే ఆ భీష్మునిమీదకు

తోలుము. తీక్ష్ణబాణములచేత ఆ భీష్ముని మదమును అణగించెదను. అని అర్జునుడు చెప్పగా అట్లు చేయుమని కృష్ణుడు చెప్పి శీఘ్రముగా రథమును త్రోలెను. భీష్ముడు కృష్ణార్జునులను చూచి ఉప్పొంగి సింహానాదముచేసి కృష్ణార్జునుల దేహములయందును గుఱ్ఱముల దేహములయందును అతిశీఘ్రముగా గొప్ప తీక్ష్ణబాణముల గుంపులను నాటించెను. కృష్ణుడు తాను నొచ్చియు ధైర్యముచేత అలయక నొచ్చిన గుఱ్ఱములను తడివి శ్రమ తీర్చి శీఘ్రముగా తోలెను. అంతట అర్జునుడు ధనుస్సుయొక్క అల్లెత్రాటిని ధ్వనింపజేయుచు ఒక బాణముచేత భీష్ముని ధనుస్సును వరికెను. భీష్ముడు శీఘ్రముగా మరియొక ధనుస్సును తీసికొనగా ఆ ధనుస్సునుకూడా అర్జునుడు వరికివేసెను. భీష్ముడు తన మనస్సునందు అర్జునుని కరలాఘవమును మెచ్చుకొని మరియొక ధనుస్సుచేత బాణములను వేసెను.

ధృతరాష్ట్ర మహారాజా! యీరీతిగా భీష్ముడు వేయు అనేక బాణసమూహములచేత కృష్ణుడు తోలు రథవిచిత్రగతులు దప్పి గుఱ్ఱములు అలసెను. భీష్ముడంతట నిలువక గొప్పతీక్ష్ణబాణములచేత కృష్ణార్జునులను నొప్పించెను. అర్జునుడు నొచ్చియు, అనేక తీక్ష్ణబాణములను భీష్మునిమీదవేసెను అంతట మూడుజాములాయెను. ఆసమయమందు కృష్ణుడు నొచ్చియు, నొచ్చియున్న అర్జునుని పద్ధతిని యెరిగి భీష్మునకు కొంచెమైనను. కరలాఘవము చెడలేదని స్థిరముగా చూచి తన మనస్సులో యిట్లని తలంచెను. ఇపుడు పాండవసైన్యములన్నియు చెదరి పారిపోవుచున్నవి. వీరిలో ఒకడైనను భీష్మునితో యుద్ధముజేయు మొనగాడు కానరాడు. అర్జునుడు మిగుల నొచ్చియున్నాడు. ఈ ప్రకారముగా నున్నయెడల యీ దినమే భీష్ముడు దుర్యోధనునియొక్క సకలకోర్కెలను తీర్చగలడు. యీ పాండవ పక్షమందుండు యాదవసైన్యములున్ను పరుగెత్తుచుండగా చూచి

కౌరవసైన్యములన్నియు విజయాపేక్షచేత అంతటను వ్యాపించు చున్నవి. గనుక యీ సమయమందు నేనూరకుండరాదు. యీ భీష్ముని చంపి ధర్మరాజును గెలిపింపవలయును. అని కృష్ణుడు తన మనస్సులో తలచుచుండగానే ఆసమయమందు భీష్ముడు దృఢములైన తీక్ష్ణబాణములను కృష్ణార్జునులమీాద కురిపించెను. అర్జునుడు ధైర్యములేక యున్నాడని తెలిసికొని కృపాచార్య కృతవర్మ అశ్వత్థామ, భూరిశ్రవ. సైంధవ వికర్ణులు, ఆర్గురును ఒక్కపెట్టున రథసమూహములతోవచ్చి అర్జునునిమీాద పడిరి. ఆ సమయమందు సాత్యకి యేనుగుల సమూహముతోవచ్చి కౌరవ పాండవుల యందున్నందు రథికులను జూచి పాండవ రథికులతో యిట్లనెను,

పాండవ రథికులారా! యిదివరకు చెప్పినమాటలను మరువ వచ్చునా? మీారు భీష్మునకు భయపడి పారిపోరాదు. భయపడక భీష్ముని యెదుట నిలిచి భీష్ముని గీష్ముని తరిమివేయుడు. నన్ను ఎరుగుదురుగదా! నేనుండగా మీారు భయపడవలసిన పనిలేదు. అని సాత్యకి పాండవ రథికులకు ఉత్సాహమును కలిగించుచు కౌరవ బలములను నిలుడునిలుడని బెదరించుచు అర్జునుని రథమునుమించి భీష్మాదుల యెదుటకు వచ్చుచుండెను. ఆ సమయమున కృష్ణుడు సాత్యకితో యిట్లనెను. సాత్యకీ! మరలిపోవు పాండవసైన్యములను పురికొల్పుటవలన ప్రయోజనమేమి? ఇపు డిక్కడనున్నవారు పోరు. అట్లు పోయినను దుర్యోధనునకు నేను జయము కలుగనివ్వను. దుర్యోధనుడు యీ భూమిని యేలుచుండగా నేను చూడజాలను. నా పద్ధతిని చెప్పెదను వినుము. నాదివ్యమైన చక్రాయుధముచేత ఇపుడు భీష్మ ద్రోణాది కౌరవరథికుల నందరిని చంపి కౌరవసైన్యముల నన్నిటిని వశింపజేసి యీ భూమండల మంతయు పాండవుల కిచ్చెదను,

## శ్రీకృష్ణుడు చక్రమును ధరించి భీష్మునిమీద కురుకుట

ధృతరాష్ట్ర మహారాజా ! యీ రీతిగా కృష్ణుడు సాత్యకితో చెప్పి తన దివ్యచక్రాయుధమగు సుదర్శనమును తలచగా తక్షణమే ఆ చక్రాయుధము దగ్గరకువచ్చి నిలిచెను. కృష్ణుడు ఆ చక్రమును కుడిచేతియందు ధరించుకొని గుఱ్ఱముల పగ్గములను నొగలయందుంచి క్రిందకుదూకెను. అట్లు కృష్ణుడు క్రిందకుదూకి చక్రాయుధమును ధరించి భీష్ముని మీదకు వెళ్ళుచుండగా భూమి గడ గడ వడకెను. కృష్ణుని శరీరముమీదనుండు ఉత్తరీయము పచ్చనిదై చెరగు మాత్రము క్రిందకు జారెను. ఆ చక్రాయుధపు కాంతులు అధికముగా ప్రకాశింపు చుండెను. కృష్ణుని ముఖము క్రోధముచేత మిక్కిలి యెఱ్ఱగా కనిపించుచుండెను. అప్పుడు కృష్ణుడు సింహనాదము చేయుచు క్రూరస్వభావముచేతను భీష్మునిమీదకు పోవుచుండెను. అట్లు వెళ్ళుచున్న కృష్ణుడు మదపుటేనుగుపైకి వెడలు సింహము వలె ప్రకాశింపుచుండెను. అప్పుడు కృష్ణుని యొక్క ప్రతాప శౌర్య తేజో వేగములను చూడగా జగత్తులను సంహరించు ప్రళయకాల రుద్రునివలె కనబడుచుండెను.

ధృతరాష్ట్ర మహారాజా ! కృష్ణునిజూచి దుర్యోధనుని రథికు లందరును పెద్దపులినిజూచిన లేళ్ళగుంపులవలె బెదరి బెదరి భయపడి కదలక చిత్రపు బొమ్మలవలె నుండిరి. దుర్యోధనుడును యేమిచేయుటకు తోచక దుఃఖముతో గూడిన మనస్సుగలవాడై దీనుడై యుండెను. ఆ సమయమందు భీష్ముడు అధిక ప్రీతితో కృష్ణునిజూచి యిట్లనెను. పరమేశ్వరుడా! కృష్ణా! నీవు యీ ప్రకారముగా నన్ను చంపి కృతార్థునిగా జేయుదువా ? నీవు యిపుడు శీఘ్రముగా వచ్చినీకు తోచినట్లుగా జేయుము. ఇట్టి యుద్ధభూమియందు నీచేత నేను చచ్చుట మేలేయగును. అని భీష్ముడు కృష్ణునితో చెప్పగా

అర్జునుడు శీఘ్రముగా రథముమీదనుండి క్రిందకుదూకి వెళ్ళి కృష్ణుని వెనుకప్రక్కన పట్టుకొని వెనుకకు తీసికొని వెళ్లెను. అట్లు అర్జునుడు వెనుక తట్టుగా పదిఅడుగుల పర్యంతము కృష్ణునిపట్టుకొని పోయి అక్కడ నిలిపి కృష్ణుని ముందరితట్టుకువచ్చి యిట్లనెను. కృష్ణా! నీవు నీ కోపమును పోగొట్టుకొనుము. నీవు పాండవులకందరికిని తెప్ప వంటి వాడవు. నీవు యిపుడు కౌరవుల నందరిని సంహరించిన యెడల ధర్మరాజుయొక్క ప్రతిజ్ఞయు శౌర్య ధైర్య పరాక్రమములును చెడి పోవును. గనుక నీవు యీ కోపమును విడువుము. కృష్ణా! ఇంత కోపమును నీవు పూనరాదు. శాంతమును పొందుము. సాత్యకిని మా పక్షమందు యుద్ధముచేయుటకు పంపితివి. ఇంతమాత్రము చాలును. నీవు యుద్ధము చేయవలసినంత కార్యము కనబడదు. నీ సహాయము చేత నేనొక్కడనే కౌరవసైన్యమంతయు సులభముగా చంపగలను. అయ్యో! ఇట్లు నన్ను పనికిమాలిన వానినిగా జేయుట నీకు తగదు. నీవు చక్రాయుధమును తాకినయెడల నా పరిశ్రమము నింద పాలగును.

పరమేశ్వరా! కృష్ణా! నీవు నిశ్చయముగా కోపించినయెడల బ్రహ్మాండ మందుండు జంతువులన్నియు భస్మములైపోవును. నీవు చక్రమును చేతియందు ధరించినంత మాత్రముననే యీ కౌరవ సైన్యములన్నియు నశించుట ఆశ్చర్యముగాదు. గనుక నీ భుజాబల మును యిపుడు చూపుటచేత ప్రయోజనములేదు. కోపమును పోగొ ట్టుము. అని అర్జునుడు చెప్పగా ఆ మాటలను కృష్ణుడు విని అర్జునుని సమయస్ఫూర్తికి సంతోషించి రోషము పోగొట్టుకొనెను. కృష్ణుడు అర్జునునకు ప్రీతిగలుగునట్లుగా మరల రథముమీదకు వచ్చి నొగల మీద కూర్చుండి దిక్కులన్నియు పిక్కటిల్లునట్లు పాంచజన్య మను తన శంఖమును పూరించెను. అప్పు డర్జునుడు తన శంఖ మగు దేవ

ద త్తమును పూరించి తన గాండీవ మను దివ్యధనువుయొక్క అల్లె త్రాటిని మ్రోయించుచుండెను. ఆ సమయమున కౌరవ సైనికులు భేరీమృదంగాది వాద్యములు మ్రోయుచుండగా అర్జునుని పైకివచ్చిరి. అప్పుడు యర్జునుడు యమధర్మరాజువలెను, అగ్నిహోత్రునివలెను. దగ్గరకు వచ్చి ప్రకాశరూపబాణములచేత కౌరవసైన్యములను దహించుచుండెను. అప్పుడు దేవతలు సంతోషించి స్తుతించిరి.

ఆసమయమందు భీష్మభూరిశ్రవశల్యదుర్యోధనులు నలుగురును ఆకౌరవసైన్యమునకు ముందు మిగిలి అర్జునునిమీద ఒక శక్తియు గదయు యేడు బాణములును ఒక తోమరాయుధమును ప్రయోగించిరి. అర్జును డొక్కొక్క బాణముచేత శక్తిగదాతోమరములను నరికి యేడుబాణములచేత ఆ యేడు బాణములను నరికెను. అర్జును డట్లు నరికివేసి కౌరవసైన్యముమీద ఐంద్రాస్త్రమును ప్రయోగించెను. అంతట ఐంద్రాస్త్రము నానావిధములైన క్రూరబాణరూపములను పొంది కౌరవసైన్యమును బాధించుచుండెను. అర్జునుడు తీక్ష్ణములగు బాణసమూహములచేత భీష్ముని కొట్టి భూరిశ్రవుని ధనుస్సును నరికి తొమ్మిదితీక్ష్ణబాణములను శల్యునిదేహమందుగ్రుచ్చి ఒకగొప్ప బాణముచేత దుర్యోధనుని రొమ్మును చీల్చెను. ఆసమయమందు ద్రుపదుడు విరాటుడు మొదలగువారు బాణములను వేయుచుండిరి.

ధృతరాష్ట్రమహారాజా! ఆసమయమున నర్జునుని అల్లెత్రాటి వలన కలిగినధ్వనిచేత మనసైన్యములు భయపడి తూలుచు దీనదశకు వచ్చెను. ఆసమయమున నీకొడుకులగు దుర్యోధనాదులందరును అర్జునునిరథముచుట్టును చుట్టుముట్టిరి. అట్టిసంకులయుద్ధమందదివరకు అర్జునుడు ప్రయోగించిన ఐంద్రాస్త్రముచేత కౌరవసైన్యములలో గుఱ్ఱములు చచ్చిపడుచుండెను. రథములు కూలుచుండెను. యేనుగులు ఛాపకట్టువలె పడుచుండెను. కాల్బలములు విరిగిపడుచుండెను. చూపు

రములును, గొడుగులును, టెక్కెములును, ఆయుధములును తున కలు తునకలుగా విరిగిపడియుండెను. ధృతరాష్ట్ర మహారాజా! అర్జునుడు కౌరవసేనామధ్యమందు రక్తప్రవాహములు ప్రవహింపజేసెను. ఆనదికి మెదడులును, మాంసములును, క్రొవ్వులును బురదగా నుం డెను. నదికి నరములకుప్పలు నురుగుల సమూహమువలె నుండెను. వెంట్రుకలకుప్పలు నాచువలె నుండెను. ఆనదీప్రవాహమును జూచి రాక్షసభూతభేతాళపిశాచాదులు, సంతోషముగా తేలియాడుచుండిరి. అర్జునుడు దేవదత్తమను శంఖమును, కృష్ణుడు పాంచజన్యమను శంఖ మును పూరించి సింహనాదముచేసిరి. అంతట సూర్యుడస్తమించెను.

సంధ్యాకాలమందు భీష్మద్రోణబాహ్లికదుర్యోధనులు నలుగు రును తమబలములు నొచ్చినవనియు, అర్జునుని దివ్యబాణసమూహ ములు క్రూరములుగా నున్నవనియు, ఆబాణములయెదుట మనసైన్య ములు నిలువజాలవనియు యోచించి తమ సైన్యములను దించుటకు ఉత్తరువుచేసిరి. అంతటసైన్యములను దించుకొని తమతమ శిబిరము లకు వెళ్ళిరి. పాండవులును సంతోషముచేత వుప్పొంగుచు కృష్ణునితో గూడుకొని వందిజనులయొక్క కీర్తనలను వినుచు తమతమ నివాస శిబిరములకు వెళ్ళిరి. ఆమూడవనాటి రాత్రికాలమందు దుర్యోధనుని యొక్క దొమ్మరులు మొదలగువారు. అర్జునునియొక్క పరాక్రమ పద్ధతులను చెప్పుకొని భయపడుచు దుర్యోధనుని పక్షమందుండు నానాదేశములసైన్యములును నశించెనని దుఃఖంపుచుండిరి.

## నాలవనాటి యుద్ధము

ధృతరాష్ట్రమహారాజా! అంతట నాలుగవనాటి సూర్యోదయ కాలమందు భీష్ముడు శీఘ్రముగా యుద్ధమునకు బయలువెడలి వచ్చు చుండెను. అభీష్ముని వెనుక కౌరవసైన్యములన్నియు బారులుతీర్చి

సముద్రపు కెరటములవలె వచ్చుచుండెను. ద్రోణదుర్యోధన బాహ్లీకులు మొదలగువారు చతురంగ బలమునుతీసికొని నడిపించుకొనివచ్చు చుండిరి. అప్పుడు యేనుగులఘీంకారములను, గుఱ్ఱముల సకిలింతధ్వనులును, రథములయొక్క చక్రములకువేసిన యినుపకమ్ముల ధ్వనులును, అధికముగానుండెను. ఆకౌరవ సైన్యములు నల్లనిమేఘముల వలె మిక్కిలి ప్రకాశింపుచుండెను. ఆ సైన్యమందు వీర రసము మిక్కిలిఅతిశయించి యుండెను. పాండవసైన్యములును వీర రసము చేత ప్రకాశింపుచుండెను. ఆ పాండవసైన్యములకుముందుగా కృష్ణార్జునులు నిలిచియుండి సూర్యచంద్రులవలెప్రకాశింపుచుండిరి. అప్పుడు పాండవబలములును వాద్యములును కేకలును అధికముగా చెలరేగి విచిత్రగమనములతో ఆయుధములతో కంపించుచు శీఘ్రముగా యుద్ధమునకు ప్రారంభించెను ఇట్లు కౌరవ పాండవ సైన్యములు రెండును ప్రారంభించి యొండొంటిం దాకి యుద్ధముచేయగా, తోమరాయుధములగు, యీటెలను ఒకరిమీద ఒకరు విసరుచుండిరి. ఈటెల చేతను. మంగలికత్తులచేతను యితరములగు నానావిధాయుధముల చేతను, ఒకరినొకరు పొడుచుచుండిరి. కత్తులచేతను, గండ్రగొడ్డండ్ర చేతను, నరుకుచుండిరి. గదలచేతను, రోకండ్లచేతను, యినుపదుడ్డు కర్రలచేతను చితుకునట్లు కొట్టుచుండిరి. పెద్దయీటెలచేత కొట్టు చుండిరి. ఆ రెండుసైన్యములును ఒకరినొకరు పురికొల్పుకొనుచుచెదిరి పోవుచు గుంపుగుంపులుగ కూడుచు ఒక్కచోట నిలిచిపోవుచు ఒక్కచోట తిరుగుచు యీరీతిగా రెండు విధములుగా రెండు సైన్యములును నొచ్చుచుండెను. ధృతరాష్ట్ర మహారాజా! యీరీతిగా ఆ రెండుసైన్యములవారు అనేకస్థలములయందనేక విధములుగా అనేక సైన్యములు యుద్ధముచేయుచుండెను. ఆసమయమందు భీష్ముడు తన తాళధ్వజముచేత తళతళమెరయుచు అర్జునునిమీదకు వచ్చెను. ఆ

భీష్ముని వెంబడి దుర్యోధనుడు, ద్రోణ, వివింశతి, కృపాచార్య, సోమ దత్త, శల్యు లర్జునునిమీదకు వచ్చుచుండిరి. ఆభీష్మాదులకు ఏడుగురు రథికులకును అభిమన్యు డడ్డుపడెను. అందుల కభిమన్యుని గురించి ఆ దేవతలు స్తుతించిరి. భీష్మాదిమహారథికులందరు ననేక బాణసమూహ ముల నభిమన్యునిమీద ప్రయోగించిరి. ఆ బాణముల నన్నిటిని అభి మన్యుడు నరికివేసి మండుచున్న అగ్నిహోత్రమువలె ప్రకాశించు చుండెను.

పిమ్మట భీష్ముడు ముందుకు వచ్చి భయంకరములైన ననేక బాణసమూహములను అర్జునునిమీద కురిపించెను. అర్జునుడు లెక్క పెట్టుటకు సాధ్యముకాని బాణములగుంపులచేత భీష్ముడువేసిన బాణ ములనన్నటిని నరికివేసెను. ఇట్లు భీష్మార్జును లిద్దరును అతిభయంక రముగా యుద్ధముచేసిరి. ఆయుద్ధమునుజూచి రెండుసైన్యముల వారును కొంతసేవటికి నిశ్చేష్టితులై చూచుచుండిరి. అంతట అశ్వత్థామ, భూరిశ్రవ, శల్యపుత్రులును, చిత్రసేనుడును యీనలుగురును మదపు టేనుగులు సింహపుపిల్లమీదకు పోయినట్లభిమన్యునిమీదకు పోయిరి. వారందరిని అభిమన్యుడు చూచి చిరునవ్వు నవ్వుచు అశ్వత్థామ యొక్క రొమ్మునందు బాణములు గ్రుచ్చి శల్యపుత్రుని ఱెక్కమును నరికి చిత్రసేనుని ధనుస్సును విరిచి భూరిశ్రవుని బాధించెను. అంతట నలుగురును అంతకుముందుగా వచ్చిన దుర్యోధనాదులు ఆరుగురును ఒక్కపెట్టున అభిమన్యునిమీద బాణములను కురిపించిరి. వారందరి తోను అభిమన్యుడు మహాబలపరాక్రమవంతుడై యుద్ధము చేసెను.

ధృతరాష్ట్రమహారాజా! కరలాఘవమందును, అధికబల మం దును, శౌర్య మహిమమందును, అధిక ధైర్యమందును, ఆ మహా రథికు లందరును అభిమన్యునితో సమానులు కాజాలరు. ఇట్లు అనేక మహారథికులతో అభిమన్యు డొక్కడే ఘోరయుద్ధము చేయుచుండగా అర్జు

నుడువచ్చి ఆ రథికుల కందరకు అన్నిరూపులుగా తోచుచు వారి నందరిని బాధించి చిక్కుపెట్టెను. అంతట దుర్యోధనుని ఆజ్ఞమీద త్రిగర్తదేశపు రాజులును, కృతవర్మయు, కేకయదేశపు రాజులును వీరందరును ముప్పదియారు రథములవారు, అర్జునునిమీదకును అభిమన్యుని మీదకును యుద్ధమునకు ఆ సమయమునను వచ్చిరి. ఆ సమయమున నా సమీపమునందుగల ధృష్టద్యుమ్నుడు చూచి శీఘ్రముగావచ్చి తీక్ష్ణబాణములను ఆ ముప్పదియారురథికులమీద ప్రయోగించెను. అప్పుడు ధృష్టద్యుమ్నుడు మిక్కిలి శౌర్య సాహసముల చేత మిక్కిలి ప్రకాశింపుచుండెను. ధృష్టద్యుమ్నుడు అర్జునుని మించి ముప్పదియారు రథికులను తాకి మూడుబాణములచేత కృపాచార్యుని బాధించెను. పదిబాణములచేత శల్యుని నొప్పించెను. మరియొక బాణముచేత కృతవర్మని రథమును త్రుంచి వేరొక బాణముచేత అతని గుఱ్ఱములను చంపెను. ఆ సమయమున శల్యపుత్రుడు పదిబాణములచేత ధృష్టద్యుమ్నుని నొప్పించి మరి పదిబాణములచేత తన సారథిని నొప్పించెను. ధృష్టద్యుమ్నుడంత మహాకోపముచేత యెఱ్ఱని ముఖముగలవాడై మిక్కుటమైన కోపాగ్నిచేత మండిపడుచు శల్యపుత్రుని ధనుస్సును నరికి అతని దేహమందు సర్పములవంటి బాణములను నాటించెను. ఈరీతిగా ధృష్టద్యుమ్నుడు శల్యపుత్రుని నొప్పించి అతని సారథిని గుఱ్ఱములను చంపెను. అంతట శల్యపుత్రుడు రథము లేనివాడై తనమానమే వాహనముగాగలిగియుండెను. శల్యపుత్రుడును కత్తిని, డాలును తీసికొని రెక్కలుగల పెద్ద పాముల వలె ధృష్టద్యుమ్నునిమీదకు వచ్చుచుండెను. అప్పుడు పాండవులు భయపడిరి. పాండవ కౌరవ సైన్యములు రెండును ఆ శల్యపుత్రుని శౌర్యమును పొగడసాగిరి,

## శల్యుని కొడుకు ధృష్టద్యుమ్నునితో యుద్ధముచేసి చచ్చుట

ఆ శల్యపుత్రుడు తన నేర్పరితనముచేత ధృష్టద్యుమ్నుడు వేసిన బాణమును డాలుచేత చెదరగొట్టుచు కత్తిని చిత్రముగా త్రిప్పుచు ధృష్టద్యుమ్నునిమీదకు వచ్చెను. అట్లువచ్చిన శల్యపుత్రుడు తన కత్తిచేత ధృష్టద్యుమ్నుని కొట్టెను. ధృష్టద్యుమ్నుడు వెంటనే గదాయుధమును అడ్డముపెట్టి కత్తిదెబ్బను తప్పించుకొని ఆ గదచేత వజ్రాయుధపు దెబ్బవంటి దెబ్బకొట్టగా శల్యపుత్రుని డాలు తునక లాయెను. రెండవదెబ్బచేత శల్యపుత్రునిశిరస్సు బ్రద్దలుగా పగిలెను. శల్యపుత్రుడు తన ప్రాణములను, కత్తిని విడిచి ఒక్కసారే క్రింద పడెను. కౌరవబలము వ్యాకులమును పొందియుండెను. శల్యపుత్రుడు చచ్చి కొండవలె క్రిందపడెను. ఈ ప్రకారము తన కొడుకు చావగా శల్యుడు మిక్కిలి కోపముగలవాడై ధృష్టద్యుమ్నునిమీదకు వచ్చి అనేకమైన తీక్ష్ణబాణ గుంపులను ప్రయోగించెను. అని సంజయుడు చెప్పగా ధృతరాష్ట్రుడు విని యిట్లనెను.

సంజయుడా! మనుష్యబలమువలన ప్రయోజనము లేదు. సర్వము దైవాధీనమై యున్నది. బలవంతములగు నా సైన్యములను పాండవులు గెల్చుచున్నారు. చూచితివిగదా! యుద్ధమందు మన కౌరవ రథికులకు చావులు బాధలు కలుగుచున్నవి. విజయసంతోష ములు పాండవుల రథికులకు కలుగుచున్నవి. ఈ విధముగా నేను నీ వలన వినుచున్నాను. తుదకు రాజ్య విజయలక్ష్మి పాండవులకే లభించునుగదా! దుర్యోధనుని చెడుబుద్ధివలన యిపుడు నేను యీావిచార కరమైన మాటలను వినుచున్నాను. దుఃఖములను అనుభవించు వాడ నైతిని. పాండవులను గెల్చు ఉపాయ మేదియు కనబడుట లేదు. అని ధృతరాష్ట్రుడు చెప్పగా సంజయు డిట్లనెను. ధృతరాష్ట్ర

మహారాజా ! నీవు చెప్పిన దంతయు నిశ్చయమే యగును. నీ చెడు బుద్ధివలన నీ సైన్యములలో అనేక చతురంగ బలములు చచ్చెను. నీ సైన్యములయందుండు మహారథికు లందరును చచ్చెదరు. నేను చెప్పుమాటలను స్థిరచిత్తముతో వినుము.

అంతట శల్యుడు ధృష్టద్యుమ్నునిమీద బాణములు వేయగా అతడు అనేక తీక్ష్ణబాణములను శల్యునిమీద వేసెను. శల్యుడు ధృష్టద్యుమ్నుని ధనస్సును నరికెను. మరియు నానావిధ బాణముల చేత నొప్పించెను. అదిజూచి అభిమన్యుడు వచ్చి శల్యునితో యుద్ధము చేయుటకు ప్రారంభించెను. అంతట దుర్యోధనుడు పురి కొల్పగా దుర్విషహుడు దుష్ప్రహుడు, దుర్మర్షణుడు, మనభీముడును, చిత్రసేనుడును, పురమిత్రుడు, వివింశతి, వికర్ణుడు వీరందరును అభి మన్య ధృష్టద్యుమ్నులమీదికి వచ్చిరి. ఆ వచ్చినవారందరును ఒక్కొ-క్కడనేక బాణములను ధృష్టద్యుమ్నునిమీద వేసిరి. అప్పు డాధృష్ట ద్యుమ్నుడా బాణములను చలింపక వారందరిమీదను అనేక బాణ ములువేసి తనకరలాఘవము చూపుచు అందరితోడను యుద్ధము చేయుటకు సమర్థుడై యుద్ధము చేయుచుండెను. అంతట నకుల సహ దేవు లిద్దరును వచ్చి శల్యునకు ఆశ్చర్య ప్రేమలను కలిగించుచు శల్యునిమీద ననేకబాణవర్షములను కురిపించిరి. శల్యుడును నకుల సహదేవులమీద అనేకబాణములు గ్రుచ్చెను. ద్రుపద విరాటరాజు లిద్దరును తమసైన్యములతో వచ్చి నకులసహదేవులకు సహాయమై శల్యునిసైన్యములనుతరిమిరి. మనకౌరవసైన్యములయందుండు మహా రథికులు శల్యునకు సహాయముచేసిరి. అంతట మధ్యాహ్నసమయ మాయెను. ఆ సమయమున భీము డధికమైన కోపముచేత ప్రకాశిం చుచు దుర్యోధనునిరథ మున్నవైపునకు తనరథమును తోలించుకొని దుర్యోధనుని చంపవలెననియు అట్లు దుర్యోధనుని చంపినయెడల

ఆ దినమే యుద్ధము ముగియుననియు తలచుచు వచ్చుచుండెను. దుర్యోధనునితమ్ములందరును వ్యాకులమును పొందిరి. దుర్యోధనుడు మగధుని పిలిచి భీమునితో యుద్ధము చేయుటకు పంపించెను. మగధుడు తనయేనుగులసైన్యముతో భీమున కడ్డుపడెను. భీము డాయేనుగులసైన్యమునుచూచి సంతోషించి తనభుజమందు గదాయుధమును ధరించి రథముదిగి ఆసైన్యముమీాదకు వచ్చెను. పర్వతములమీాదకు వచ్చు దేవేంద్రునివలె అభీముడు ప్రకాశింపుచుండెను. భీముడు సింహనాదముచేసెను. ఆసింహనాదధ్వనివలన యేనుగులయొక్క గుండెకాయలు పగిలినట్లుండెను. భీముడు సింహనాదముచేసి దేవతలు తల్లడిల్లుచుండగా యుద్ధక్రీడకు ప్రవేశించెను. ద్రౌపదీ పుత్రులును అభిమన్యు నకులసహదేవ ధృష్టద్యుమ్నులును ఆయేనుగుల గుంపులమీాద బాణవర్షమును కురియుచు భీమునకు రెండుప్రక్కల యందుండిరి. ఆద్రౌపదీపుత్రులలో శతానీకుడు యేనుగులమీాదనుండువారి శిరస్సులను బాణములచేత త్రుంచుచుండెను. అట్టిసమయమందు మగధుడేనుగుమీాద నెక్కి ఆయేనుగు నభిమన్యునిమీాదకు త్రోలెను. ఆసమయమం దభిమన్యుడు ఒక ప్రకాశబాణమును ఆయేనుగుయొక్క కుంభస్థలమందు నాటెంచెను. ఆబాణము తగిలి ఆయేనుగు దీనదశకు వచ్చివ్రాలెను. అభిమన్యు డాశ్చర్యముగా మగధుని శిరస్సునుత్రుంచివేసెను. ఆయేనుగు మగధరాజులు క్రిందబడి చచ్చిరి. ఆసమయమందు ధృష్టద్యుమ్నుడు బంగారుపిడులు చెక్కిన బాణములచేత మగధునియేనుగును సైన్యమును చంపుచుండెను. ధృతరాష్ట్రమహారాజా! ఆసమయమందు భీముడు తన గదాయుధముచేత కొన్ని యేనుగులను పడగొట్టుచు కొన్ని యేనుగుల తొండములను విరగగొట్టుచు మరి కొన్ని యేనుగులకొమ్ములను పొడిపొడిగా జేయుచు కొన్ని యేనుగుల కుంభస్థలములను పగులగొట్టుచు కొన్ని యేనుగుల వీపులను పిండిపిండి

గాజేయుచుండెను. ఈప్రకారముగా భీముడు తన గదాయుధపు దెబ్బలచేత యేనుగులను చంపుచుండెను. అభిమన్య ధృష్టద్యుమ్నులు మొదలగువారు భీమునకు సహాయులై తీక్ష్ణబాణములచేత ఆయేనుగులను చంపుచుండిరి. ధృతరాష్ట్రమహారాజా! భీముని దెబ్బలచేత మగధుని యేనుగులు కొన్ని భూమిమీద పడుచుండెను. కొన్ని యేనుగులు నెత్తురు గ్రక్కుచుండెను. కొన్ని యేనుగులు క్రిందపడుచుండెను. కొన్ని యేనుగులు సొలయుచుండెను. కొన్ని యేనుగులు గిరగిర తిరుగుచుండెను. కొన్ని యేనుగులు క్రిందపడి పొర్లాడుచుండెను. భీముడు ఆయేనుగుల రక్తముచేత తానును గదయు దడిసి ప్రళయకాలమందు చండాయుధమును ధరించిన యమధర్మరాజువలె ప్రకాశింపుచుండెను. ఈప్రకారముగా భీముడు ఆ మగధుని యేనుగు సైన్యమును పీనుగుపెంటలుగా జేసెను. ఆయుధపుదెబ్బలను గదా దెబ్బలను తప్పించుకొనిపోవు యేనుగులను గొల్లవాడు ఆవులను తోలినట్లు భీముడు త్రోలెను. ఇట్లు ఆయేనుగులన్నియు పెద్దగాలిచేత చెదరిన మేఘములవలె చెదరిపోయెను. భీముడు దుర్యోధనుడున్న దిక్కునకు వెళ్ళుచుండగా దుర్యోధనుడు బెదరించి సర్వసైన్యములను భీమునిమీదకు పంపించెను.

అంతట కౌరవసైన్యము లన్నియు భీమునిమీదకు వచ్చుచుండగా భీముడు ఆసైన్యములను సముద్రమునకు చెలియలి కట్టవలె ఆపియుండెను. కౌరవసైన్యముల నన్నిటిని భీముడు నిలిపి సింహనాదముచేసి ఆసైన్యములను ఛేదించుటకొరకు ఆసైన్యముల లోపలికి ప్రవేశించెను. అప్పుడు అభిమన్యుడును, ధృష్టద్యుమ్నుడు మొదలగువారును భీమునకు సహాయులై రెండుప్రక్కల యందుండి వర్షము కురిసినట్లు బాణములను కురిపించుచు ఆకౌరవసైన్యములను చిక్కుపరచిరి. భీముడు అధికోత్సాహము గలవాడై అడవిని దహించు అగ్నిహోత్రమువలె కౌరవసైన్యమును పొడిపొడిగా జేయుచుండెను.

భీముడు తన రొమ్ముచేతను, కటిప్రదేశముచేతను, తొడలచేతను, కాళ్ళచేతను, కౌరవులయొక్క చతురంగబలములను భూమియందు చాపకట్టలవలె పడగొట్టెను. భీముడు తామరకొలనునందు మదపు టేనుగు విహరించినట్లు కౌరవ సైన్యములయందు యుద్ధక్రీడను జరి పెను. ఆకాశమందుండు దేవతలందరును భీముని పొగడిరి. ధృత రాష్ట్రమహారాజా! ఆసమయమందు కౌరవసైన్యములును, ఆసైన్య మందుండు మహారథికులును భీముని పరాక్రమమునకు భయపడి నిశ్చేష్టులై ఆశ్చర్యమును పొంది అతనిదగ్గిరకు రాక అక్కడక్కడ దూరముగానుండి చూచుచుండిరి. ఆసమయమున భీష్ముడు భీముని మీదకువచ్చెను. అప్పుడు వచ్చు భీష్ముని రథధ్వని అధికముగా నుం డెను. భీష్ముడు వేగముగా వచ్చుచు భీమునిమీద బాణములు వేయు చుండెను. అప్పుడు సాత్యకి భీష్మునకు అడ్డుపడెను. అట్లు సాత్యకి భీష్మున కడ్డుపడుట అలంబసుడను రాక్షసుడు చూచి ఆకాశము పగులునట్లు సింహనాదము చేసెను. మరియు పది తీక్ష్ణబాణములను సాత్యకిదేహమందు గ్రుచ్చెను. ఆబాణములకు సాత్యకి నొచ్చుకొని కోపించి నాలుగు బాణములచేత అలంబసుని నొప్పించి తొలగ జేసెను. సాత్యకి సింహనాదమును చేసెను. ఆసింహనాదమును భూరి శ్రవుడు విని యెఱ్ఱని కండ్లుగలవాడై అధికభయంకరముగా సాత్యకి మీదకు వచ్చెను. అపుడు సైన్యములన్నియు భూరిశ్రవుని పొగడెను. భూరిశ్రవుడు తొమ్మిదిబాణములను సాత్యకి దేహమందు నాటించెను. సాత్యకి తన బాణశక్తిచేత భూరిశ్రవుని నొప్పించి బాణవర్షముచేత ముంచెను. దుర్యోధనుడును అతని తమ్ములును భూరిశ్రవునకు సహా యముగా వచ్చిరి. పాండవులును సాత్యకి సహాయులై దుర్యోధన దుశ్శాసనాదుల మీద మిక్కుటమైన బాణవర్షమును కురిపించిరి. భీముడు అతి భయంకరముగా దుర్యోధనాదులమీద తీక్ష్ణబాణములను ప్రయోగించి చిక్కుపరచెను.

## దుర్యోధనుడు భీముని మూర్ఛనొందించుట

అంతట తన తమ్ములందరును పారిపోయినపిమ్మట దుర్యోధనుడు సింహనాదము చేయుచు భీముని యెదిరించి తొమ్మిది బాణములచేత దేహమును తూటులుగా జేసెను. భీముడు నిప్పులను నేత్రములనుండి రాల్చుచున్నట్లు కోపముగలిగి దుర్యోధనుని రథము మీదకు తన రథమును తోలించి అధిక భయంకరముగా పదిబాణములను దుర్యోధనుని దేహమందు నాటించెను. భీముడు దుర్యోధనుని సారథియగు నందకునిమీద మూడుబాణములను వేసెను. దుర్యోధనుడు భీమునిమీద అరువదిబాణములను వేసి భీముని సారథియగు విశోకుని మూడుబాణములచేత నొప్పించెను. దుర్యోధనుడు ఒక బాణముచేత భీముని ధనుస్సును విరిచెను. భీముడు అధికకోపము గలవాడై మరియొక ధనుస్సును తీసికొని దుర్యోధనుని ధనుస్సును విరిచెను. దుర్యోధనుడు మరియొక ధనుస్సును తీసికొని వజ్రాయుధము వంటి బాణమును భీముని రొమ్మునందు గ్రుచ్చెను. ఆబాణపు దెబ్బ చేత భీముడు మూర్ఛిల్లి రథముమీద వ్రాలెను. అపుడు తొలగి పోయిన కౌరవరథికు లందరును మరల దుర్యోధనునిదగ్గరకు వచ్చిరి. పారిపోయిన కౌరవసైన్యము లన్నియు ధైర్యముగలిగి మరల యుద్ధసన్నద్ధములై వచ్చెను. దుర్యోధనుని తమ్ములందరును వినయముచేత దుర్యోధనుని పొగడిరి. ఈ వృత్తాంతము నంతయు అభిమన్య ధృష్టద్యుమ్న ద్రౌపదీపుత్రులు చూచి మిక్కిలి కోపించుకొని ఒక్కమారుగా అందరును దుర్యోధనుని చుట్టుముట్టుకొనిరి. అభిమన్యుడు మొదలగువా రందరును గొప్ప బాణములను దుర్యోధనునిమీద వేసిరి. భీముడు మూర్ఛ తెలిసి ప్రళయకాలరుద్రునివలె మండిపడుచు అధికమైన పరాక్రమముచేత దుర్యోధనుని కుమారుడగు లక్ష్మణ

కుమారునిమీాదను శల్యునిమీాదను బాణసమూహములను నాటెను. ఆబాణములచేత వారిద్దరును నొచ్చిరి. అప్పుడు కౌరవసైనికు లంద రును సింహమునుచూచిన యేనుగువలె భీమునిదగ్గరకు రాకుండిరి. అప్పుడు మూడుజాము లాయెను. ఆసమయమున దుర్యోధనుని తమ్ము లగు 1 సేనాపతి 2 సుషేణుడు 3 జలసంధుడు 4 సులోచనుడు 5 మనభీముడు 6 భీమరథుడు 7 భీమబాహుడు 8 దుష్ప్రహుడు 9 దుర్మర్షణుడు 10 దుర్ముఖుడు 11 విచిత్రుడు 12 వికటుడు 13 ఉగ్ర లోలుపుడు 14 సముడు వీరు పదునలుగురును భీమునిమీాద అనేక బాణములను వేయుచు భీమునియెదుటకు వచ్చిరి.

భీముడు లేళ్ళమీాదకు దూకు పెద్దపులివలె ఆ పదునలుగురి మీాదకు బోయి ఒక బాణముచేత సేనాపతియను వానిశిరస్సు నరికి మూడుబాణములచేత జలసంధు డను వానిని చంపెను. ఒక గొప్ప బాణమును సుషేణుని రొమ్మునందు నాటెను. ఆ బాణపుదెబ్బచేత సుషేణుడు చచ్చెను. అయిదుబాణములచేత భీమబాహువను వానిని చంపెను. గొప్ప కత్తివంటి బాణముచేత వికటోగ్రుడనువాని శిర స్సును నరికెను. భీముడను వానిని భీమరథు డనువానిని యీా యిద్దరిని అనేకబాణములచేత చంపెను. భీముడు నవ్వుచు నాలుగుబాణముల చేత సులోచను డనువానిని కొట్టిపడవేసెను. తక్కినవా రందరును అధికభయముచేత చెదరిచెదరి పారిపోయిరి. భీష్ముడు విజృంభించి కౌరవవీరరథికులతో యిట్లనెను. వీరరథికులారా! భీముడు ధృత రాష్ట్రునియొక్క కుమారుల నందరిని చంపుచున్నాడు. ఇపుడు మనము వూరకుండరాదు. అని భీష్ముడు కౌరవరథికులతో చెప్పి పురికొల్పికొని భీమునిమీాదకు వచ్చుచుండెను. ఆసమయమందు భగ దత్తుడు భీష్ముని వెనుకవేసికొని తన మదపుటేనుగును భీమునిమీాదకు త్రోలెను. అట్లు త్రోలి అనేక బాణసమూహములను భీమునిమీాద

కురిపించెను. మేఘములు సూర్యుని కప్పినట్లు భగదత్తుడు వేసిన బాణసమూహములన్నియు భీముని కప్పెను. అభిమన్యుడు మొదలగు పాండవరథికులు వచ్చి అనేక బాణములను ఆభగదత్తుని మదపుటేనుగ మీద వేసిరి. ఆ యేనుగదేహములోనుండి రక్తమమితముగా కారు చుండెను. అనేకములగు సెలయేరులు ఒక్కమారుగా చుట్టుకొనిన పర్వతమువలె భగదత్తుని మదపుటేనుగు రక్తముచేత ప్రకాశింపుచు భయంకరముగా పాండవసైన్యములమీదకు వచ్చెను. ఆ యేనుగు పాండవబలములను చంపుచుండెను. ఆ యేనుగుయెదుట పాండవ రథికులు నిలువజాలక నిశ్చేష్టులైయుండిరి. ఆసమయమందు కౌరవ సైనికులందరు పాండవసైన్యముమీదికి వచ్చిరి. దుర్యోధను డుప్పొంగి తన రథమును శీఘ్రముగా భీమునిమీదకు తోలించి గొప్ప బాణ మును భీముని రొమ్మునందు వేసెను. ఆ బాణపుదెబ్బచేత భీముడు మూర్ఛగలవాడై ఒరగి తన టెక్కెపుస్తంభమును పట్టుకొని తెప్ప రిల్లెను. ఆసమయమందు మన సైన్యములన్నియు చేరి అధికముగా సింహనాదములు చేసెను. ఆసమయమున ఘటోత్కచుడు చూచి మాయను చేయుటకు తగిన సమయమది యని తలచెను.

## ఘటోత్కచుడు మాయబలముచే కౌరవసేనపై విజృంభించుట

ధృతరాష్ట్రమహారాజా! ఘటోత్కచుడు మాయచేయవలె నని తలచి ఒక యేనుగుమీద యెక్కి దేవేంద్రరూపమును దాల్చి వచ్చుచుండెను. ఆ యెక్కిన యేనుగు కైలాసపర్వతమువలె తెల్లగా నుండి నాలుగు దంతములు గలదగుచు భయంకరముగాను అధిక మైన వేగముగలదిగాను నడిచి వచ్చుచుండెను. ఘటోత్కచుడు వజ్రములచేత ప్రకాశించు చేతులను గలిగి వేయి నేత్రములుగల వాడై వచ్చుచుండెను. ఆ ఘటోత్కచుడు దేవేంద్రునివలె నుండెను.

ఆతఁడెక్కిన యేనుగు దేవేంద్రు డెక్కు ఐరావతమను యేనుగువలె నుండెను. దేవేంద్రుడు పాండవులకు సహాయముగా యుద్ధము చేయుటకు ఐరావతమునెక్కి వచ్చుచున్నాడని కౌరవసైన్యము లన్నియు తలచుచుండెను. అంజన వామనాది దిగ్గజములవంటి యేనుగులమీద ఆ ఘటోత్కచునియొక్క స్నేహితులగు రాక్షసులు యెక్కినవారై తక్కిన దిక్పాలకుల రూపములను ధరించి ఘటోత్కచుని ప్రక్కల యందు వచ్చుచుండిరి.

ఆ ఘటోత్కచుడు దుర్యోధనునిమీదకు వచ్చుచుండగా భగదత్తునియేనుగు అడ్డుపడెను. ఘటోత్కచుడు బాణములచేతను యేనుగు దంతములచేతను భగదత్తుని మదపుటేనుగును నొప్పించెను. కౌరవ సైన్యము భయపడి చెదిరి పారిపోయెను, మన సైన్యము లన్నియు ఒక్కసారే పారిపోవుటచేత దిక్కులు అదరెను. ఘటోత్కచు డధిక భయంకరమును కలిగించుచు భగదత్తుని మదపుటేనుగును త్రోలి విజృంభించి దుర్యోధనుడున్న దిక్కుకు వెళ్ళుచుండెను. భీష్ముడు ద్రోణాచార్యునితో యిట్లనెను. ద్రోణాచార్యా! ఘటోత్కచుడు తన మాయాగర్వముచేత విజృభించి కౌరవసైన్యమును చెదరగొట్టెను. ఘటోత్కచుడు భగదత్తుని గెలిచి దుర్యోధనునిమీదకు వెళ్ళు చున్నాడు. ఘటోత్కచునకు అడ్డుపడకుండుట మొగతనము కాదు. గనుక ఘటోత్కచరాక్షసుని యెదిరింపవలయును. భగదత్తుడు చలించువాడు కాడు. భగదత్తుని యేనుగు ఘటోత్కచుని ముందు నిలువలేకపోయెను. కావున ఘటోత్కచుడు తన యిష్టప్రకారము దుర్యోధనునిమీదకు పోవుచున్నాడు. అని భీష్ముడు ద్రోణునితో చెప్పి ఘటోత్కచుని యేనుగుమీద బాణములు వేయుడని భటులకు చేతిని విసరి ముందుగా తన రథమును త్రోలించెను.

అంతట భీష్ముని వెంబడి ద్రోణుడు మొదలగు మహారథికు లందరును వెళ్ళి దుర్యోధనునకు అడ్డుపడి ఘటోత్కచుని మీద నానావిధములైన బాణములను వేసిరి. అప్పుడు ఘటోత్కచునకు ధర్మరాజు మొదలగు పాండవులును ద్రుపదుడు విరాటుడు మొద లగు సేనాపతులును సహాయులై భీష్మ ద్రోణాదులమీద అనేక బాణములను కురిపించిరి. అధిక భయంకరమైన మహాయుద్ధము జరిగెను. భీష్ముడు అధిక పరాక్రమ క్రీడచేత పాండవబలములను తునుకలు తునుకలుగా నరికివేసెను. ఆసమయమందు ఘటోత్కచుడు మహాశౌర్య పరాక్రమవంతుడై సింహనాదము చేసెను. అప్పుడతని గొప్పవైన విద్యలు విజృంభించి కౌరవసైన్యములను అలయునట్లు చేసెను. భీష్ముడు ద్రోణునితో యిట్లనెను. ద్రోణాచార్యా! ఘటో త్కచునితో యుద్ధముచేయుటకు నాకు యిష్టములేదు. సూర్యుడస్త మింపబోవుచున్నాడు. గనుక నేటికి మనము యుద్ధముచాలించి రేపటి ధినమందు ఉదయముననే యుద్ధమునకు మరలివత్తము. అని భీష్ముడు చెప్పగా అందుకు ద్రోణాచార్యులు సమ్మతించి అట్లు చేయుదమని చెప్పెను. ద్రోణాచార్యుడు తమ పక్షపు కౌరవ రథికులకు మెరి గించి యుద్ధము నిలిపి సకల బలములను దించుటకు వుత్తరవు చేసెను.

• ధృతరాష్ట్రమహారాజా! కౌరవబలములు మరలగా పాండవ బలములు భేరీలు మొదలగు వాద్యములను మ్రోయించుచు, శంఖ ములు పూరించుచు అధికముగా సింహనాదములు చేయుచు అనేక విలాసములతో మరలెను. నీ పుత్రులగు దుర్యోధనాదులును కౌరవ సైన్యములలోనుండు మహారధికులును చిన్నపుచ్చుకుని తమ శిబిరము లకు వెళ్ళిరి. పాండవులు అధిక సంతోష ముఖములుగలవారై తమ శిబిరములకు వెళ్ళగా భీముడు తన పుత్రుడగు ఘటోత్కచుని

పొగడుచుండెను. అని యిట్లు నాలుగవనాటి యుద్ధమందు కౌరవులు యుద్ధమందు వోడిపోయిరని సంజయుడు ధృతరాష్ట్రునితో చెప్పగా ధృతరాష్ట్రుడు సంజయుని జూచి యిట్లనెను.

సంజయుడా! నీవు యీ యుద్ధమును చెప్పినపుడెల్లను పాండవులవైపు గెలుపు పరాక్రమములను చెప్పుచున్నావు. నా పుత్రులగు దుర్యోధనాదులకు పరాక్రమము తక్కువనియు ఓడిరనియు చెప్పుచున్నావు. ఆ పాండవులు భీష్మ ద్రోణ శల్యులు మొదలగు యుద్ధశూరుల నందరిని లక్ష్యపెట్టక వారిని గెలుచుటకు యెట్లు సమర్థులైరో అందుకు కారణమేమో చెప్పుము. అని యిట్లు ధృతరాష్ట్రుడడుగగా సంజయు డిట్లనెను. ధృతరాష్ట్ర మహారాజా! పాండవులు భీష్మ ద్రోణ శల్యాది యుద్ధశూరులను గెల్చుటకును లక్ష్యము చేయకుండుటకును కారణము చెప్పెదను వినుము. ఆ కారణము ఔషధగుణము కాదు. మంత్రశక్తి కాదు. మాయ కాదు. ఆ కారణమును ముందుగా చెప్పెద వినుము. ధృతరాష్ట్ర మహారాజా! పాండవులు ధర్మమార్గమందును సత్యమార్గమందును ప్రవర్తింపు చున్నారు. నీ పుత్రులగు దుర్యోధనాదులు అధర్మమార్గమందును అసత్యమందును ప్రవర్తింపుచున్నారు. ఆ ప్రకారమే నీవును అధర్మమందును ప్రవర్తించి పాండవుల రాజ్యభాగమును పంచిపెట్టకపోతివి. మీ పాపబుద్ధియే మీ కపజయమును కలిగించుచున్నది. ధర్మమార్గము అవశ్యముగా జయము పొందును. గనుక పాండవులు గెలుచుటయు మీరు ఓడుటయు, నిశ్చయముగా జరుగును. ఈ ప్రకారమే విదురుడు స్పష్టముగా చెప్పిన మాటలను వింటిమిగదా! ధృతరాష్ట్ర మహారాజా! నాలగవనాటి యుద్ధము ముగిసిన తరువాత ఆ రాత్రి కాలమందు యిపుడు నీ వడిగినట్లే దుర్యోధనుడు భీష్ముని యడిగెను. భీష్ముడు దుర్యోధనునితో చెప్పిన మాటలను చెప్పెదను వినుము.

దుర్యోధనా ! ఇదివరకు ఈ విషయమును గురించి అనేక మారులు చెప్పి యున్నాను. పాండవులకు కృష్ణుడు సహాయుడై యుండును. గనుక పాండవులకు సాధ్యముగాని కార్యమొకటియు నుండనేరదు. ఆ పరమేశ్వరుడగు శ్రీకృష్ణుని వాస్తవస్వరూపమును యెరిగినవారు కొందరై యుందురు. యెరుగనివా రనేకులై యున్నారు. ఆ కృష్ణుడగు పరమేశ్వరునియొక్క వాస్తవస్వరూపమును యెరిగిన వారలకు ఆపదలులేవు. పాండవులు కృష్ణునియొక్క వాస్తవస్వరూపమును యెరిగి కృష్ణుని ఆశ్రయించియున్నారు. నీవు కృష్ణుని లక్ష్యపెట్టక యున్నావు ఈ విషయమై పూర్వము జరిగిన వృత్తాంతమును వినుము.

మానస సరస్సుయొక్క ఉత్తర పర్వతపు కొనయందు పూర్వము బ్రహ్మదేవుడు సభచేసి యుండెను. ఆ బ్రహ్మదేవుని చుట్టును దేవతలును, మునులు, గంధర్వులును, అప్సరోగణములును ఉండి సేవింపుచుండిరి. ఆ సమయమందు నానావిధములైన రత్నముల చేత చెక్కబడిన దివ్యవిమాన మొకటి ఆకాశమందు కనబడెను. ఆ విమానమందు సర్వాత్ముడైన విష్ణుదేవు డుండెను. ఆ విమానమును బ్రహ్మదేవుడు చూచి లేచి నమస్కరించెను. మరియు సంతోషముచేత నమస్కరించుచు విష్ణుదేవుని గురించి స్తుతించెను. విష్ణుదేవా ! నీవు సకలలోకములను సృష్టింపుచు రక్షింపుచు సంహరింపుచు వినోదింపుచుందువు. మునీశ్వరులచేత పూజింపదగిన రత్నములవంటి గుణములను గలిగియున్నావు. అట్టి గుణములను గలిగి యున్నను పరమార్థముచేత నిర్గుణస్వరూపుడవగుదువు. నీ భక్తుల యొక్క సకలదుఃఖములను పోగొట్టువాడవగుదువు. సకలలోకములకును శుభమును కలిగించువాడవగుదువు. అని బ్రహ్మదేవుడు అనేక ప్రకారములుగా స్తుతించి యిట్లని విన్నవించెను.

మహాత్మా ! విష్ణుదేవా ! నీవలన నేను పుట్టినవాడనై యుపడెను. సకలలోకములను సృష్టించితిని. నావలన సృష్టింపబడిన లోకము లన్నిటిని నీవే రక్షింపుచుందువు. ఈ కాలమందు మనుష్యలోకము తల్లడిల్లుచున్నది. భయంకరులగు రాక్షసులు మనుష్యలోకమందుండి కష్టపెట్టుచున్నారు. గనుక నీవు లోకమందు కృపనుంచి యదువంశ మందు పుట్టవలయును. విష్ణుదేవా ! నీవును, నీ స్నేహితుడగు నర ఋషియు, మనుష్యలోకమందు బుట్టి శీఘ్రముగా రాక్షసులను చంపుము. అట్లుచంపి భూభారమును మాన్పుము. అని బ్రహ్మ దేవుడు నారాయణమూర్తిని ప్రార్థించి ఆదేవుని నీడవలెనుండు నరు డను మహాపురుషుని ఆ ప్రకారమే ప్రార్థించెను. నారాయణమూర్తి కృపచేత బ్రహ్మదేవునిజూచి యిట్లనెను. బ్రహ్మదేవా ! నీవు చెప్పి నట్లు భూలోకమందు యదువంశమునపుట్టి సకలరాక్షసులను చంపి భూభారమును మాన్పెదను. అని యిట్లు నారాయణమూర్తి ఆజ్ఞా పించి అంతర్ధానుడాయెను. అప్పు డాసభయం దుండువారందరును ఆశ్చర్యముగలవారై బ్రహ్మదేవునితో యిట్లనిరి. మహాత్మా ! బ్రహ్మదేవా! యిపుడు నీవు అధికభక్తితో వినయపూర్వకముగా ప్రార్థించిన వారలెవరో మాకు చెప్పుము. అని ఆ దేవతలును మునులును అప్సరోగణములును అడుగగా వారితో బ్రహ్మదేవుడు యిట్లనెను. దేవాదులారా ! ఇపుడు నాచేత ప్రార్థింపబడిన వారలు నరనారాయణులను పరమమునులు. వారిద్దరును నాచేత పూజింప దగినవారు. మనుష్యలోకమందుగల జనులను రక్షించుటకును రాక్ష సులను సంహరించుటకును, భూభారమును మాన్పుటకును వారిని ప్రార్థించితిని. వారును కృపగలవారై నా ప్రార్థనను అంగీకరించిరి.

దేవమునులారా ! ఈ నరనారాయణు లనెడి మహాపురుషులు భూలోకమందు క్రీడార్థముగా అవతరించినపుడు వీరిని కేవల మను

...గా తలచి పూజింపనివారు చెడిపోవుదురు. వారిని మహాత్ము లనియెరిగి భక్తిచేత పూజించిన వారలు శుభములను పొందుదురు. అని బ్రహ్మదేవుడు ఆ దేవాదులకు చెప్పి తాను బ్రహ్మలోకమునకు వెళ్లెను. ఆ సభయందుండు వారలు తమ తమ నివాస స్థలములకు వెళ్ళిరి. ఈ కథను నారద పరశురామ వేదవ్యాసాది మహామునుల వలన నేను వింటిని. దుర్యోధనా! యిదివరకే యీ మహామునులందరును ఆ నరనారాయణులతో విరోధమును పెట్టుకొనవద్దని నీతో చెప్పియుండిరి. నీవు మదముచేత గర్వించి ఆ మునుల మాటలను వినక ఆ నరనారాయణులతో విరోధమును పెట్టుకొంటివి. ఇకనైనను కృష్ణుని ఆశ్రయించి పాండవులతో స్నేహమును జేసికొని బ్రతుకుము. ఆ నరఋషియే అర్జునుడుగా పుట్టెను. ఆనారాయణఋషియే కృష్ణుడుగా పుట్టెను. ఆ నరనారాయణమునులిద్దరును విష్ణుదేవుని అవతార పురుషులగుదురు. గనుక నీవు కృష్ణుని ఆశ్రయించి పాండవులతో స్నేహమును గలిగి యున్నయెడల శుభమును పొందగలవు. అని భీష్ముడు దుర్యోధనునితో చెప్పి వూరకుండెను. ధృతరాష్ట్ర మహారాజా! భీష్ముడు చెప్పినమాటలను దుర్యోధనుడు పెడచెవుల పెట్టి వినకపోయెను. నీవును నీకొడుకగు దుర్యోధనుడును పెద్దలు చెప్పు హితవాక్యములను వినరుగదా! అని యిట్లు సంజయుడు ఆ ధృతరాష్ట్రునితో జెప్పి మరల యిట్లనెను.

## అయిదవనాటి యుద్ధక్రమము

ధృతరాష్ట్ర మహారాజా! ఆ నాలుగవనాటి రాత్రి వెళ్ళిన తోడనే మరునాటి వుదయ కాలమందు కౌరవ సైన్యములన్నియు శీఘ్రముగా బయలుదేరి భీష్ముని ముందు పెట్టుకొని యుద్ధమునకు వచ్చెను. ఆవచ్చిన కౌరవసైన్యములను చూడగా సముద్రములు

.గా తలచి పూజింపనివానిని నొప్పించి మూడగ్ని హోత్రము
దుర్యోధనుని ఎరిగి భక్తిచేత పూజించినట్లు భీముని సైన్యమును దహించివేసెను.
సేని బ్రహ్మదేవుడు ఆ కాలమున దివ్యబాణసమూహములశక్తి చేత భీష్ముని
వెళ్లెను. ఆ సభయంతయు. అప్పుడు అర్జునుడు మహాబలపరాక్రమవంతుడై
వెళ్ళిరి. ఈ కథనుల కందరికిని జ్యేష్ఠమాసమందుగల సూర్యునివలె
వలన నేను వింత తపింపుచు ప్రకాశించెను. కౌరవసైన్యము లన్నియు
రును ఆ నశించెను. అట్టిసమయమందు నీకొడుకగు దుర్యోధనుడు ద్రోణా
చెప్పియ్యనితో యిట్లనెను.

ఆ న ద్రోణాచార్యా! నీవును భీష్ముడును, పాండవులను పట్టుకొని
క పాలుపోసి రక్షించినట్లు రక్షించెదరేగాని చంపరు. నీవును భీష్ము
కుడును కోపించుకొనినయెడల మిమ్ములను దేవతలైనను గెలువజాలరు.
కృష్ణార్జునులంత సమర్థులై యుండగా యిపుడు అర్జునుడు మన సైన్యములను
తార పురాతనముగా నొప్పించినపుడు నీవు వోర్చుకొని చూచుచుండ
లతో స్నేహమును గలిగినుడు ద్రోణాచార్యునితో చెప్పగా ద్రోణుడు
అని భీష్ముడు దుర్యోధనునితూచి యిట్లనెను. దుర్యోధనుడా? ఇదివర
మహారాజా! భీష్ముడు చెప్పినలను గెలువలేదు. సముద్రములో తాటి
పెట్టి వినకపోయెను. నీవును ఆతాటికాయబుర్రకు తగునన్ని నీళ్ళు
చెప్పు హితవాక్యములను వినరావుగదా! అటువలెనే పాండవులను
ధృతరాష్ట్రునితో జెప్పి మరల రాదు. గనుక రుచింపని మాటలను

## అయిదవనాటి

ధృతరాష్ట్ర మహారాజా! పాండవసైన్యముపై గవియుట
తోడనే మరునాటి వుదయ కాలమున ఈప్రకారముగా ద్రోణుడు దుర్యో
శీఘ్రముగా బయలుదేరి భీష్ముని మును దాటి పాండవసైన్యముల
వచ్చెను. ఆవచ్చిన కౌరవసైన్యమునుచుండు ద్రోణుని పాండవసేని

కులు చూచి తొలగిపోసాగిరి. సాత్యకి ద్రోణాచార్యునకడ్డముపడెను. అడ్డుపడినసాత్యకి ద్రోణాచార్యునిమీద ప్రకాశమానములగు ననేక బాణములను వేసెను. ద్రోణాచార్యుడు నవ్వుచు పిడుగులవంటి బాణములను సాత్యకిమీద కురిపించి నొప్పించెను. సాత్యకినొచ్చియు తొలగక భయంకరముగా ద్రోణునితో యుద్ధముచేయుచుండెను. అంతట భీముడు వచ్చి తీక్ష్ణబాణములను ద్రోణునిమీద ప్రయోగించి ద్రోణుని నొప్పించెను. శల్యుడును, భీష్ముడును వచ్చి ద్రోణునకు సహాయులై భీమునిమీద బాణములను వేయుటకు ప్రారంభించిరి. ఆవెంటనే అభిమన్యుడును ద్రౌపదీపుత్రులును శీఘ్రముగా వచ్చి యధిక బాణవర్షమును భీష్మునిమీదను శల్యునిమీదను కురిపించిరి. అంతట శిఖండి శీఘ్రముగా వచ్చుచు ధనుస్సుయొక్క యల్లెత్రాటిని ధ్వనింపజేయుచు బాణసమూహములచేత ఆకాశమును కప్పుచు కౌరవసైన్యములను చిక్కుపరచుచు భీష్మునిమీదకు పోయెను.

భీష్ముడు యీశిఖండుడు స్త్రీయనియు, యీస్త్రీతో నేను యుద్ధముచేయననియు యిట్లుచెప్పుచు ఆశిఖండితో యుద్ధముచేయక తొలగిపోయెను. భీష్ముడుతొలగిపోవుట దుర్యోధనుడు చూచి శిఖండిమీదికి ద్రోణాచార్యుని పురికొల్పెను. ద్రోణాచార్యుడు నిరాటంకముగా శిఖండిమీదకుపోయి ప్రకాశమానములగు బాణసమూహములచేత శిఖండిని తొలగించెను. ఆప్రకారముగా కౌరవులసైన్యములు గర్వముచేత చెలరేగగా పాండవసైన్యములు కలియబడెను. ఆకౌరవపాండవసైన్యములకు రెంటికిని నధిక భయంకరముగా యుద్ధము జరిగెను. ధృతరాష్ట్రమహారాజా! ఆరెండు సైన్యములును కలిసినపుడు లేచినదుమ్ములు మేఘములవలె నుండెను. కత్తులు మొదలగు ఆయుధములయొక్క కాంతులు మెరుపులవలె నుండెను. అల్లెత్రాడులయొక్క ధ్వనులు ఉరుములవలెనుండెను. అప్పటిరక్తమువర్షమువలె నుండెను.

అపుడు యుద్ధభూమియందు గుఱ్ఱములపేగులు కుప్పలుకుప్పలుగా పడి యుండెను. ఏనుగులపీనుగులు దట్టముగా పడియుండెను. తెల్లనివస్త్రములు రక్తముచేత తడిసి యెఱ్ఱగా యంతటను పడియుండెను. భటులయొక్క దేహములు కుప్పలు కుప్పలుగా పడియుండెను. ధృతరాష్ట్రమహారాజా! అప్పుడు యుద్ధభూమి మిక్కిలి భయంకరముగా నుండెను. ఆ రెండుపక్షములవారును యతిశీఘ్రముగా తాకి కలిసినపుడు దిక్కులన్నియు గడగడ వడకెను. ఆకాశమందు దేవతలు పొగడు ధ్వనులు మిక్కిలిదట్టముగా నుండెను.

ధృతరాష్ట్రమహారాజా! పాండవసైన్యములకు భీముడును, కౌరవసైన్యములకు భీష్ముడును ఆధారముగా నుండిరి. అర్జునుని ఆధారము జేసికొని పాండవసైన్యములును తమ పరాక్రమమును చూపెను. ద్రోణాచార్యుని ఆధారము చేసికొని కౌరవసైన్యములు తమ పరాక్రమమును చూపెను. ఆసమయమందు దుర్యోధనుడు కళింగదేశపు యేనుగుసైన్యమును అతి భయంకరముగా భీముని మీదకు తోలించెను. అంతట దుర్యోధనదుశ్శాసనాదులగు నీకొడుకు లందరును ఒక్కపెట్టున తమతమ రథములను భీమునిమీదకు తోలించిరి. పర్వతమును మేఘములు చుట్టుకొనినట్లు ఆదుర్యోధన దుశ్శాసనాదులందరును భీముని చుట్టుకొనిరి. అర్జునుడు అల్లెత్రాటిని ధ్వనింప జేయుచు మహావాయువుచేత మేఘములు చెదరగొట్టబడినట్లు తీక్ష్ణ బాణములచేత దుర్యోధనాదులను చెదరకొట్టెను. అర్జునుని బాణములచేత దుర్యోధనాదుల రథసమూహములును కళింగదేశపు యేనుగుల సైన్యములును తొలగిపోయెను. కౌరవసైన్యములన్నియు భీష్ముని మరుగుచొచ్చెను. కౌరవసైన్యములు తొలగిపోగా దుర్యోధనుడు సైన్యములకు చేయి వీచుచు భీమార్జునులమీదకు తెంపు చేసి వెళ్లెను. ఆ వెంటనే శకుని సైంధవ దుశ్శాసనులు కాంభోజ

సైన్యములను యాదవసైన్యములను సింధుదేశపుసైన్యములను సౌవీర దేశపుసైన్యములను త్రిగర్త కళింగదేశముల సైన్యములను చేర్చు కుని భీమార్జునులను చుట్టుకొనిరి. ధర్మరాజు అదలింపగా ధృష్ట ద్యుమ్నుడు మొదలగు మహారథికులు కరూశదేశ పాంచాలదేశ సైన్యములను తీసికొని భీమార్జునులకు సహాయులైరి. ఆ సమయమున విందానువిందులను అవంతీదేశపు రాజులు కాశీరాజుతో యుద్ధము చేయుచుండిరి. సైంధవుడు భీమునితో యుద్ధము చేయుచుండెను. వికర్ణుడు సహదేవునితో యుద్ధము చేయుచుండెను. చిత్రసేనుడు శిఖండితో యుద్ధము చేయుచుండెను. విరాటరాజు దుర్యోధనునితో యుద్ధము చేయుచుండెను. నకులుడు త్రిగర్త దేశపు రాజుతో యుద్ధము జేయుచుండెను. చేకితానుడును సాత్యకియు అభిమన్యు డును ధృష్టకేతుడును, ఘటోత్కచుడును, సాల్వ కేకయరాజులతో యుద్ధము చేయుచుండిరి. ధృష్టద్యుమ్నుడు ద్రోణాచార్యునితో యుద్ధము చేయుచుండెను. ధర్మరాజు శల్యునితో యుద్ధము చేయు చుండెను. ఇట్లు సంకులయుద్ధమందు అస్త్రశస్త్రములు మొదలగు ఆయుధముల రాపిడిచేత పుట్టినమంటలు ఆకాశమందుచేరి, మధ్యా హ్నమందు తీక్ష్ణములైన సూర్యకిరణములవలె నుండెను. ఏనుగులు రథములకు తగిలి పడి పొరలుచుండెను. ఏనుగులయొక్క తొండము చేత లాగబడి రథములు క్రిందబడి పొరలుచుండెను. గుఱ్ఱములు గొరిసెలచేత త్రొక్కబడి కాల్బలము క్రిందబడుచుండెను. కాల్బ లము వలన నరుకబడి రక్తముచేత గుఱ్ఱములుతడుపబడి యుండెను. అప్పుడు ఆకాశమంచుండు దేవతలుచూచి ఆశ్చర్యపడిరి. ధృతరాష్ట్ర మహారాజా! ఆ సమయమున భీముడు మిక్కిలి భయంకరముగా ప్రకాశించుచు యుద్ధముచేయుచుండెను. భీష్ముడు సహింపక మిక్కిలి రోషముగలవాడై బాణములచేత భీముని దేహమును రక్తమయ

ములను వేసెను. చిత్రసేనుడు పది బాణములను వేసెను. భీష్ముడు భయంకరములైన తీక్ష్ణబాణముల నభిమన్యుని దేహమందు గ్రుచ్చెను. అభిమన్యుడు చిత్రసేనునిధనుస్సును విరిచి గుర్రములను చంపి కవచమును చీల్చి దేహమందు బాణములను గ్రుచ్చి చంపుటకు ప్రయత్నించెను. అతిశీఘ్రముగా కౌరవసైనికులలోని రాజులు వచ్చి యభిమన్యుని చుట్టుకొనిరి. ఆరాజులందరును యభిమన్యునిమీద బాణసమూహములను వేయుచుండిరి. అభిమన్యుడు గ్రీష్మకాలమందు కార్చిచ్చు యెండిన యడవిని యనాయాసముగా కాల్చినట్లు ఆరాజుల మీద బాణములను ప్రయోగించుచుండెను. ధృతరాష్ట్రమహారాజా! అప్పు డభిమన్యుడు గుర్రము నెక్కి తాండవకేళిని సల్పు రుద్రునివలె యుద్ధరంగమందు శత్రువులు మెచ్చినట్లుగా వీరనృత్యము చేసెను. ఇట్లు మహాబలపరాక్రమములచేత గర్వించి కౌరవబలములను సంహరించు అభిమన్యుని జూచి లక్ష్మణకుమారుడు కోపముగలవాడై అభిమన్యునిమీదకు వచ్చెను.

## అభిమన్య లక్ష్మణకుమారుల యుద్ధము

లక్ష్మణకుమారు డభిమన్యునిమీద నానావిధములైన బాణముల నధికముగా గురిపించెను. అభిమన్యుడు కోపముచేత యగ్నివలె మండిపడుచు ఆరు బాణములను లక్ష్మణకుమారుని రొమ్మునందు గ్రుచ్చెను. ఆదెబ్బలకు లక్ష్మణకుమారుడుతొలగక ప్రకాశమానములైన బాణములను అభిమన్యునిమీద వేసెను. అభిమన్యుడు కోపించుకొని మొదట లక్ష్మణకుమారుని గుర్రములను చంపి పిమ్మట సారథిని చంపెను. లక్ష్మణకుమారుడు విరథుడయ్యు ఒక శక్త్యాయుధమును అభిమన్యునిమీద వేసెను. ఆశక్త్యాయుధమును అభిమన్యుడు బాణములచేత నరికివేసెను. అభిమన్యుడు తీక్ష్ణబాణములను లక్ష్మణ

కుమారుని దేహమందు నాటెను. అభిమన్యుని బాహుబలమును కృపాచార్యుడు చూచి లక్ష్మణకుమారుని తనరథమందు యెక్కించుకొని దుర్యోధనుడు చూచుచుండగా తీసికొనిపోయెను.

అప్పుడు దుర్యోధనుడు కౌరవయోధులను పురికొల్పగానపుడు భీష్ముడు పాండవసైన్యములమీదకు వచ్చుచుండెను. ఆభీష్ముని వెంబడి యేనుగులగుంపులును గుర్రపుదండులును, కాల్బలసమూహములును, రథములగుంపులును వచ్చెను. మేఘసమూహములచేత ఆకాశము దట్టముగా నున్నట్లు కౌరవుల చతురంగబలములచేతను భూమి దట్టముగా నిండియుండెను. సాత్యకి గర్వించి ఆ కౌరవసైన్యముమీద విచిత్రముగా బాణవర్షములను కురిపించి కౌరవసైన్యములను చెదరగొట్టెను. భూరిశ్రవుడు నేయివోసిన అగ్నిహోత్రమువలె మండిపడుచు సాత్యకిమీదకు వచ్చెను. భూరిశ్రవుడు ప్రళయకాల అగ్నిహోత్రునివలె మండిపడుచు ననేకవిధములైన ప్రకాశబాణములను సాత్యకిమీద వేసెను. సాత్యకియొక్క కొడుకులు పదిమంది బాహుబలముచేత గర్వితులై భూరిశ్రవునిమీదకు వచ్చి ఆతనితో యిట్లనిరి. భూరిశ్రవసుడా! నీతో యుద్ధముచేసి వీరవినోదము జరుపవలె నను కోరికతో మేము వచ్చియున్నాము. మా పదిమందిలో ఒక్కనిని యుద్ధమునకు కోరుమని ఆసాత్యకి కొడుకులు చెప్పగా ఆమాటలకు భూరిశ్రవుడు నవ్వి వారితో యిట్లనెను. సాత్యకికుమారులారా! మీ పదిమందిలో ఒక్కడొక్కడు నాబాణశక్తిని సహింపజాలరు. మీకు నాతో యుద్ధముచేయుట కపేక్షయున్నయెడల మీరందరును ఒక్కపెట్టున నాతో యుద్ధముచేయుడు. అని భూరిశ్రవుడు చెప్పగా సాత్యకి కొడుకులు పదిమందియు భూరిశ్రవునిమీద తీక్ష్ణబాణములను వేసిరి. అంతట భూరిశ్రవుడు ఆబాణములన్నిటిని నరికివేసి బాణవర్షముచేత ఆ పదిమందిని మునుగునట్లు చేసెను. ఆసాత్యకి కొడుకులు పదిమంది

అధిక శౌర్యముచేత ననేక తీక్ష్ణబాణములను వేసి భూరిశ్రవుని నొప్పించిరి. భూరిశ్రవుడు కోపించుకొని ఆ పదిమందియొక్క ధనుస్సులను నరికి, వెంటనే ఆ పదిమంది శిరస్సులను నరికివేసి భూదేవికి బలియిచ్చెను. కౌరవసైన్యములంతట మిగుల సంతోషించెను. ఇట్లు పదిమందికుమారులు చావగా సాత్యకి మిగుల దుఃఖకోపములుగలవాడై తనరథమును భూరిశ్రవునిరథముమీదకు తోలించెను. కౌరవసైన్యములు భయపడెను. సాత్యకి భూరిశ్రవునియొక్క సారథినిచంపి గుర్రములప్రాణములను తీసికొనెను. భూరిశ్రవుడు సాత్యకియొక్క సారథిని చంపి గుర్రముల ప్రాణములను తీసికొనెను. అంతట శీఘ్రముగా ఆభూరిశ్రవసాత్యకులిద్దరును రథములుదిగి కత్తులను తీసికొనిరి. భీముడు శీఘ్రముగా వచ్చి సాత్యకిని వెనుకతీసి తనరథముమీద యెక్కించుకొనిపోయెను. దుర్యోధనుడు వచ్చి భూరిశ్రవసుని వెనుకకు తీసి తన రథముమీద యెక్కించుకొనిపోయెను. అంతట మూడుజాములాయెను. ఆ సమయమందర్జునుడు సూర్యాస్తమయము కాబోవుచున్నదనియు ఇక యీకౌరవసైన్యములు వెళ్ళుననియు తలచి ననేక బాణసమూహములచేత కౌరవరథికుల నందరిని చంపుచు విహారింపుచుండెడు. దుర్యోధనుడు చూచి శీఘ్రముగా అర్జునునితో యుద్ధముచేయుటకు యిరువదియైదువేల రథికులను పంపించెను. ఇయిరువదియైదువేల రథికులును అర్జునునిమీదకు వచ్చిరి.

అప్పుడర్జునుడు అగ్నిజ్వాలలవంటి అనేకబాణములను ప్రయోగించి యిరువదియైదువేల రథికులను చంపివేసెను. ఆ రథములును, ఆ రథములయందుండు రథికులును, అగ్నియందు మిడుతలు పడిచచ్చినట్లు అర్జునుని బాణాగ్నిచేత చచ్చిరి. అప్పుడు కౌరవబలములకు వుత్సాహము తగ్గిపోయెను. సూర్యుడు యెర్రని కిరణములు గలవాడై అస్తమింప బోవుచుండెను. ఆ సమయమందు భీష్ము

ద్రోణాది రథికులతో యిట్లనెను. ద్రోణాచులారా! మన సైన్యము లన్నియు శ్రమజెందియున్నవి. ఇపుడు సంధ్యాకాలమాయ్యెను. నేటికి యుద్ధము చాలించి వెళ్ళుదము. ఇకను నేటికి యుద్ధముచేయ రాదు. అని భీష్ముడు ద్రోణాది రథికులకు చెప్పి కౌరవబలములను దించుటకు నియమించెను. ఆకౌరవ పాండవ సైన్యములు దివిటీలు వేసికొని తమ తమ యుద్ధములను చాలించి తమ తమ నివాసస్థలము లకు వెళ్ళిరి. ధృతరాష్ట్ర మహారాజా! యీ విధముగా అయిదవ దినమందు యుద్ధముచేసి అ రెండుపక్షములవారును, ఆ రాత్రియందు సంగీతములచేతను, మనోహరములైన సాహిత్య గోష్ఠులచేతను ఆ రాత్రిని సుఖముగా గడిపిరి.

## ఆరవనాటి యుద్ధము

ధృతరాష్ట్ర మహారాజా! అయిదవనాటి రాత్రి కాలము వెళ్ళిన పిమ్మట ఆరవనాటి వుదయకాలమందు అర్జునుడు తమ సేనా పతి యగు ధృష్టద్యుమ్నుని రప్పించి యిట్లనెను. ధృష్టద్యుమ్నుడా! మన సైన్యమును మకరమునంటి వ్యూహముగా యేర్పరుచుము. అని అర్జునుడు చెప్పగా ధృష్టద్యుమ్నుడు వెళ్ళి అందరికిని సంతోషముగా మకర వ్యూహము నేర్పరచెను. ఆ మకరవ్యూహమునకు అర్జును డును ద్రుపదుడును శిరస్సుగా నిలిచియుండిరి. నకుల సహదేవులు ఆ మకరవ్యూహమునకు నేత్రములుగా నిలిచియుండిరి. ఆ మకర వ్యూహమునకు భీముడు ముఖముగా నిలిచియుండెను. అభిమన్యు డును, ద్రౌపదీ పుత్రులును ఘటోత్కచుడును ఆమకరవ్యూహము నకు చెక్కిళ్లుగా నిలిచియుండిరి. ధర్మరాజు సాత్యకితో గూడుకొని మకర వ్యూహమునకు కంఠాకారముగా నిలిచియుండెను. కేకయ దేశపు రాజులు మకరవ్యూహమునకు యెడమప్రక్కగా నిలిచి

యుండిరి. ధృష్టకేతుడును ఖరకర్ణుడును కుడిప్రక్కగా నిలిచి యుండిరి. శిఖండియు ఇలావంతుడును మకర వ్యూహమునకు తోకగా నుండిరి.

ధృతరాష్ట్ర మహారాజా! యీ ప్రకారముగా పాండవ రధికులందరును తమ తమ సైన్యములతో ముందుచెప్పిన ప్రకారము మకరము వంటి ఆకారముగల వ్యూహముగా నిలిచియుండిరి. ధృతరాష్ట్ర మహారాజా! పాండవుల మకర వ్యూహమును భీష్ముడు చూచి దానికి ప్రతివ్యూహమును కౌరవ సైన్యములకు యేర్పరచవలెనని తలచి క్రౌంచవ్యూహమును యేర్పరచెను. (క్రౌంచమనగా ఒకవిధమైన పక్షి) ఆ క్రౌంచపక్షివంటి వ్యూహమునకు భీష్ముడు ద్రోణాచార్యుని సహాయముచేసికొని ముక్కువలె నిలిచియుండెను. క్రౌంచ వ్యూహమునకు కృపాచార్యుడును అశ్వత్థామయు, నేత్రములుగా నిలిచి యుండిరి. కృతవర్మయు కాంభోజుడును బాహ్లికుడును యీ ముగ్గురును ఆ క్రౌంచవ్యూహమునకు శిరస్సుగానిలిచిరి. శూరసేనునితో దుర్యోధనుడు చేరి ఆ క్రౌంచవ్యూహమునకు కంఠముగా నిలిచియుండెను. సౌవీరదేశపు రాజుతోగూడిన భగదత్తుడు, క్రౌంచవ్యూహమునకు రొమ్ముగానిలిచియుండెను. విందానువిందులను యిద్దరురాజులును ఆ క్రౌంచవ్యూహమునకు వీపుగా నిలిచి యుండిరి. సుశర్మయనురాజు యెడమ రెక్కగా నిలిచియుండెను. యవనదేశపురాజు కుడిరెక్కగా నిలిచియుండెను. శ్రుతాయువుతో భూరిశ్రవుడుచేరికొని క్రౌంచవ్యూహమునకు వెనుక ప్రక్కగా నిలిచి యుండెను. ఈ విధముగా కౌరవరధికులు తమ తమ సైన్యములను చేర్చికొని. క్రౌంచ పక్షివంటి ఆకారము కలుగునట్లు క్రౌంచవ్యూహమును యేర్పరచుకొనిరి. ధృతరాష్ట్ర మహారాజా! యీ ప్రకారముగా ఆ రెండు పక్షములవారును మకర క్రౌంచవ్యూహములను

యేర్పరచుకొని యుద్ధసన్నద్ధులై యుండిరి. ఆ రెండుపక్షముల సైన్యములును నడిచి శంఖభేరి మొదలగు అనేకమైన వాద్యము లనేకవిధములుగా ప్రయోగుచుండగా యుద్ధమున కవిసెను. ఆ సమయమున ద్రోణాచార్యుడు కౌరవసైన్యమును దాటి ముందుకువచ్చి పాండవ సైన్యముమీాదికి కవియుచుండెను. అంత భీముడధికకోపముచేత మండిపడుచు ద్రోణుని సైన్యముమీాదకు తనరథము నతిశీఘ్రముగా తోలించెను. ద్రోణుడును ముందునడచుచున్న అతని భటులందరును భీముని భీమస్వరూపము జూచి భీతులై ద్రోణునివెనుకకు పోయిరి. ద్రోణుడు మహాకోపముతో తొమ్మిది బాణములను భీముని దేహమందు నాటెను. అంతట భీముడు మిక్కిలి తీక్ష్ణబాణములచేత ద్రోణుని యొక్క సారథిని చంపెను. ద్రోణుడు తానే గుఱ్ఱములను తోలుకొనుచు సాహసముచేత యుద్ధోత్సాహము గలవాడై పట్టుదల వదలక పాండవుల మకరవ్యూహమును ఛేదించుటకు ప్రయత్నించెను. ఆ సమయమున భీష్ముడు ద్రోణునకు సహాయుడై పాండవవ్యూహమును తరుమగా కేకయ దేశపు సైన్యములు భయపడి చెదరిపోయెను. సృంజయుని సైన్యములు కౌరవ సైన్యమునమీాదకు వచ్చెను. ఆసమయమున భీముడుకోపముచేత కౌరవసైన్యమునుచంపి చాపకట్టవలె పడవేసెను. దుర్యోధనుడును, ధర్మరాజును, తమతమ సైన్యములకు చేయివీచి యుద్ధమునకు తరిమిరి. ఆ కౌరవ, పాండవ సైన్యములను రెండును యుద్ధమునకు కవిసెను. అని సంజయుడు ధృతరాష్ట్రునితో చెప్పగా ధృతరాష్ట్రుడు యిట్లనెను. సంజయుడా! మన కౌరవసైన్యములో మంచి మంచి మొనగాండ్రున్నను పాండవ సైన్యములు గెలువకుండుట దైవనిర్మితముగా నున్నది. ఈచోద్యమును యిదివరకే నాకు చెప్పియున్నావు. విదురుడు ఎంత చెప్పినను నా కొడుకగు దుర్యోధనుడు వినలేదు. దుర్యోధనుడు మేలుకలుగు

మాటలను వినజాలడు, కీడుకార్యములను మానజాలడు. దుర్యోధనుడు చెడుబుద్ధి కలవాడు. పూర్వజన్మకర్మము బుద్ధిని వెనుకతీయక మానదుకదా! విధినిర్మితమైన కార్యమును తప్పించుటకు ఎవ్వరికిని సాధ్యముకాదుతదా! ఎట్లు జరుగవలెనో అట్లు తప్పక జరుగును. అని ధృతరాష్ట్రుడు చెప్పగా సంజయు డిట్లనెను. ధృతరాష్ట్ర మహారాజా! నీకొడుకగు దుర్యోధనుడు ధర్మమార్గమును యెరుగడని మరియు, మరియు అతనినిగురించి చెప్పరాదు. పాండవ కౌరవులు జూదమాడునపుడు మన ముపేక్షించి ఊరకుంటిమి. అట్టి జూదమే యిపుడు యుద్ధమాయెను. ఇక పశ్చాత్తాపమును విడిచి ధైర్యవంతుడవై యుద్ధప్రకారము వినుము. ధృతరాష్ట్రమహారాజా! ఆ సమయమున భీముడు కౌరవసేన యను మహాసముద్రమును పాయలుగా తరిమెను. నీ కొడుకులగు 1 దుశ్శాసనుడు, 2 దుర్విషహుడు, 3 దుర్ముఖుడు, 4 ద్రుష్పహుడు, 5 దుర్జయుడు, 6 జయత్సేనుడు, 7 వికర్ణుడు, 8 చిత్రసేనుడు 9 సుదర్శనుడు 10 చారుమిత్రుడు 11 పురమిత్రుడు 12 సుధర్ముడు 13 దుర్మర్షణుడు యీ పదమూడు మందియు ఒక్కచోటనుండిరి. భీముడు వారిని చూచి వారిమీదికి పోయెను. ఆ పదముగ్గురును వారిలోవారు ఒకరినొకరు పిలుచుకొనుచు తమలోతాము చెప్పుకొనిరి. ఇదిగో! భీముడు ఒంటరిగా వచ్చియున్నాడు. వీడు ఒంటరిగా కనబడినప్పుడే వీనిపొగరు అణచవలయును. గనుక మనమందరము ఒక్కపెట్టునవెళ్ళి యిపుడే భీముని చంపుదము. అని వారందరు చెప్పుకొని ప్రళయకాలమందు ఉగ్రగ్రహములు సూర్యునిచుట్టుకొనినట్లు అగ్నిహోత్రమువలె భీమునిచుట్టుముట్టుకొనిరి.

ధృతరాష్ట్రమహారాజా! ఆవిధముగా నీ కుమారులు పదముగ్గురును తమ తమ చతురంగబలములతో క్రౌంచి ని చుట్టుకొనగా

భీముడు సంతోషించి తన సారథితో యిట్లనెను. సారథీ! నీవు మాన రథమును యిచ్చటనే నిలిపియుండుము. అని భీముడు తన సారథితో చెప్పి తాను గధాయుధమును తీసికొని క్రిందకు దూకి ప్రళయకాల యమధర్మరాజువలె ఆ కౌరవసైన్యములలో ప్రవేశించెను. భీముడు గదచేత ఏనుగుల కుంభస్థలములు పగులగొట్టుచు, తొండములు విరుగగొట్టుచు, ప్రక్కలు తునుకలుగా చీల్చుచు ఏనుగులను కొట్టు చుండెను. ఆ యేనుగులు రక్తమయములై పర్వతములవలె కూలెను. భీముడు గదాయుధముచేత రథసమూహములను పొడిపొడిగా కొట్టి వేసెను. గుఱ్ఱపుగుంపులను నుగ్గునుగ్గుగా జేసెను. కాల్బల లమూహ ములను తునుకలు తునుకలుగా జేసెను. ఈవిధముగా భీముడు గదా యుధము చేబూని వీరవిహారము సలుపుచుండెను. ధృతరాష్ట్ర మహారాజా! భీముడు యీ విధముగా అనేకులతో యుద్ధము చేయుట మిక్కిలి యాశ్చర్యముగా నున్నది. ఇట్లు అనేక బలములు భీముని చుట్టుముట్టుకొనెనని ధృష్టద్యుమ్నుడు తెలుసుకొని ద్రోణునితో యుద్ధము చేసి చేసి అతిశీఘ్రముగా భీముడున్న దిక్కునకు రథము తోలించెను. ధృష్టద్యుమ్నుడు వచ్చి భీముని రథమునీాద సారథి నొకనినే చూచి అధిక దుఃఖముగలవాడై ఆ సారథియగు విశోకు నితో గద్గదస్వరముతో యిట్లనెను. విశోకుడా! భీముడు రథము మీాద లేడు. ఎక్కడున్నాడో తెలియకున్నది భీముడు వేరువిధమైన యెడల నాదేహమందు ప్రాణములు నిలువజాలవు. అయ్యో! ఏగతిని పొందుదునో తెలియదు. భీముని వృత్తాంతమును నాకు తెలియ జెప్పుము. అని ధృష్టద్యుమ్ను డడుగగా విశోకు డిట్లనెను. ధృష్ట ద్యుమ్నా! దుశ్శాసనాదులు పదముగ్గురు తమ తమ చతురంగ బలముతో భీముని చుట్టుముట్టుకొనిరి. భీముడు నన్నిక్కడ నిలిపి తాను గర్వమదములచేత గధాయుధమును తీసికొని జింకలగుంపులో

ప్రవేశించు సింహామువలె కౌరవసైన్యములోనికి ప్రవేశించెను. అని విశోకుడు చెప్పి భీముడువెళ్ళిన మార్గమును చూపెను.

## ధృష్టద్యుమ్నుడు భీమునకు తోడ్పడుట

ధృష్టద్యుమ్నుడు భీముడు వెళ్లిన మార్గమునుబట్టి వెళ్లుచు అక్కడక్కడ భూమిమీద పడి పొరలుచుండు ఏనుగుల గుంపులను చూచుచు భీముడు వెళ్ళిన మార్గము యిదియని స్పష్టముగా తెలిసికొనుచు శీఘ్రముగా రథము త్రోలించుకొని పోయెను. అంతట ధృష్టద్యుమ్నుడు భీమునిదగ్గరకు పోయి యిట్లనెను. భీమా! యిదిగో! నేను వచ్చినాను. ఇక నిర్భయముగా యుద్ధము చేయుము. నీమీాదకు వచ్చిన యీా దుశ్శాసనాదుల నందరిని నేను చంపెదను. అని ధృష్టద్యుమ్నుడు భీమునితో చెప్పుచు దుశ్శాసనాదులగు పదముగ్గురిమీాదకు బోయెను. ఆసమయమున దుర్యోధనుడు కౌరవ రథికులతో యిట్లనెను.

రథిక శ్రేష్ఠులారా! దుర్మార్గుడైన ధృష్టద్యుమ్నుని మీా రందరును చుట్టుకొనుడు. భీముని పొగడను మాన్పుడు. అని దుర్యోధనుడు చెప్పగా కౌరవ రథికవీరులును, దుశ్శాసనాదులగు పదముగ్గురును ఒక్కపెట్టున ధృష్టద్యుమ్నుని చుట్టుకొనిరి. ధృష్టద్యుమ్నుడు పూర్వము ద్రోణాచార్యు డిచ్చిన మోహబాణముచేత ఆ కౌరవ రథికులందరిని మూర్ఛపొందించెను. ఆసమయమందు భీముడు దప్పితీర్చుకొనదలచి ఒక్క తటాకమందు చల్లని నీటిని త్రాగెను. భీముడట్లు దప్పికతీర్చుకొని సంతోషించి ధృష్టద్యుమ్నునిదగ్గరకు వచ్చెను. ఆసమయమున ద్రోణాచార్యుడు అదివరకు యుద్ధముచేసినచోట ధృష్టద్యుమ్నుడు తొలగి వచ్చినందున ఆప్రదేశము తెరపిగా నున్నందున ద్రుపదుడు ద్రోణుని తరిమెను. ద్రోణాచార్యుడు ద్రుపదుని మీాద వర్షముకురిసినట్లు బాణములను కురిపించెను. ద్రుపదుడు తనకు

ద్రోణాచార్యునితోఁగల పూర్వవైరముచేత మిక్కిలి రోషముగల వాఁడై ద్రోణునిమీఁదకువచ్చెను. ద్రోణుఁడు ద్రుపదునకు కలిగిన రోషమునకు భయపడి పారిపోయెను. ద్రుపదుఁడు శంఖమును పూరించెను. ద్రోణాచార్యుఁడు ద్రుపదుని విడిచి ధృష్టద్యుమ్నుఁడు వెళ్ళిన మార్గమును తెలుసుకొనుచు వెళ్ళుచుండెను అంతట ధృష్టద్యుమ్నుని మోహనబాణముచేత మూర్ఛపొందిన రాజుల నందరిని చూచి ద్రోణుఁడచ్చటికి శీఘ్రముగా వెళ్ళి ప్రజ్ఞాబాణమును ప్రయోగించి మోహనబాణశక్తిని పోఁగొట్టెను. కౌరవ రథికులందరును మరల ప్రజ్ఞావంతులై శీఘ్రముఁగా యుద్ధమునకు వచ్చిరి.

ధృతరాష్ట్రమహారాజా! యీ ప్రకారము ద్రోణాచార్యుని వలన నీ పుత్రులగు దుశ్శాసనాదు లందరును భీమ ధృష్టద్యుమ్నుల మీఁదకు పోయిరి. ధర్మరాజు చూచి అయిదుగురు కేకయరాజులను ద్రౌపదీపుత్రులనయిదుగురిని ధృష్టకేతుని పిలిచి వారితో యిట్లనెను. కేకయాదులారా! మీ పదకొండుమందియు అభిమన్యుని ముందు పెట్టుకొని భీమ ధృష్టద్యుమ్నులకు సహాయపడవలయును. అని ధర్మరాజు చెప్పగా అభిమన్యుఁడు మొదలగు పన్నెండుమందియు అధికమగు సైన్యమును తీసికొని భీమ ధృష్టద్యుమ్నులకు సహాయముగా వెళ్ళిరి. ఆ పన్నెండుమందితో భీమ ధృష్టద్యుమ్నులు చేరి కౌరవ సైన్యములమీఁదికి పోయిరి. ఆ సమయమున ధృష్టద్యుమ్నుఁడు భీమునితో యిట్లనెను.

భీమా! గొప్పయుద్ధసమయమందు నీవు పాదచారివై క్రింద నుండరాదు. గనుక కేకయరాజుయొక్క రథముమీఁద యెక్కుము. అని ధృష్టద్యుమ్నుఁడు చెప్పగా భీముఁడు కేకయరాజుయొక్క రథము మీఁద యెక్కెను. ఆసమయమున మధ్యాహ్నకాలమందలి సూర్యుఁడు వలె ద్రోణుఁడు వచ్చి పాండవసైన్యములమీఁద జడివాన కురిసినట్లు

బాణవర్షమును కురిపించెను. ధృష్టద్యుమ్నుడు స్థిరుడై శౌర్యముచేత ద్రోణునిమీదకుపోయెను. ద్రోణుడు ధృష్టద్యుమ్నునియొక్క ధనస్సును విరిచి శీఘ్రముగా అతని దేహమందు అనేక బాణములను నాటెను. అంతట ధృష్టద్యుమ్నుడు మరియొక ధనస్సును తీసికొని అధికకోపముచేత డెబ్బది బాణములను ద్రోణునిమీద వేసెను. ద్రోణుడు కోపించుకొని రౌద్రాకారుడై నాలుగు బాణములచేత ధృష్టద్యుమ్నునియొక్క గుఱ్ఱములను చంపి మరియొక బాణముచేత సారథిని కూల్చెను. ఆకాశమందుండు దేవగణములు ద్రోణుని పొగడిరి. ధృష్టద్యుమ్నుడు విరథుడై శీఘ్రముగా అభిమన్యుని రథము మీదికి పోయెను. అపుడు ధృష్టద్యుమ్నుని సైన్యము ద్రోణుని ముందర నిలువజాలక మరలిపోవుచుండెను. ఆ సైన్యములు మరలిపోకుండునట్లుగా ధృష్టద్యుమ్న భీములు నివారించిరి. ఆ సమయమున దుర్యోధనుడు అనేక రథసమూహములతో వచ్చి భీముని చుట్టుకొనెను.

## ధృష్టద్యుమ్నుడు ద్రోణునితో యుద్ధముచేయుట

ధృతరాష్ట్రమహారాజా! ధృష్టద్యుమ్నుడు మరియొక సారథిని మంచిగుఱ్ఱములను రథమునకు పూన్చగా శీఘ్రముగా తన రథము మీదకు పోయి అధికపరాక్రమ శౌర్యములచేత ద్రోణునిమీదకు పోయి ఎప్పటివలె యుద్ధము చేయుచుండెను. ఆసమయమున భీముని సారథి యగు విశోకుడు భీమునిరథమును తోలుకొనివచ్చెను. భీముడంతట తన రథముమీదకువెళ్ళి క్రూరభావము గల ఉత్సాహబుద్ధితో తమమీదకు వచ్చియుండు దుర్యోధనునిమీద అనేక తీక్ష్ణ బాణములను కురిపించెను. దుర్యోధను డధికకోపముగలవాడై ఒక బాణమును భీమునిరొమ్మునందు నాటించెను. భీముడు అధికరోషముచేత మూడు గొప్పబాణములను దుర్యోధనుని అరచేతులయందును,

రొమ్మునందును నాటించెను. ఆ దెబ్బలకు దుర్యోధనుడు చలింపక నానావిధములైన బాణములను భీమునిమీద వేసెను. దుర్యోధనుని తమ్ములగు దుశ్శాసనాదులందరును దుర్యోధనునిముందు నడిచి భీముని పట్టుకొనుటకు ఉత్సహించి ఎప్పటివలె క్రూరముగా భీముని మీదకు పోయిరి. అంతట అభిమన్యుడును, ద్రౌపదీపుత్రులును, ధృష్టకేతుడును, కేకయరాజు లయిదుగురును దుశ్శాసనాదులమీదికి పోయిరి. అభిమన్యాదులును భీముడును భయంకరముగా దుశ్శాసనాదులను తరిమిరి.

దుశ్శాసనాదులందరును చెదిరి నలుదిక్కులకు పారిపోయిరి. భీముడు తనచేత ఆ దుశ్శాసనాదులందరును చావు తప్పించుకొని పోయిరని దుఃఖించెను. తన తమ్ములను తరిమిరని దుర్యోధనుడు కోపించుకొని రౌద్రాకారుడై కౌరవసైన్యములను వెంటదీసికొని అతిశీఘ్రముగా భీమాదులమీదికి వచ్చెను. అప్పుడు మూడుజాము లాయెను. ఆ సమయమున భీమునకును, దుర్యోధనునకును భయంకరమైన యుద్ధము జరిగెను. పిమ్మట వికర్ణుడును, చిత్రసేనుడును, అభిమన్యునిమీదికి బోయిరి. అంతట అభిమన్యుడు వికర్ణునియొక్క గుఱ్ఱములను చంపి వానిమీద యిరువదిబాణములను నాటించెను. వికర్ణుడు భయపడి రథముదిగి చిత్రసేనుని రథముమీదకు పోయెను. ద్రౌపదీపుత్రు లయిదుగురును భీముని రథమును మించి దుర్యోధనుని మీదకు పోయి ప్రకాశవంతమైన బాణములను వేసి దుర్యోధనుని దేహమును రక్తమయముగా చేసిరి. దుర్యోధనుడు అయిదుబాణముల చేత ద్రౌపదీపుత్రులను అయిదుగురిని నొప్పించి తరిమెను. ఆ సమయమున భీష్ముడు పాండవసైన్యములను చెదరగొట్టుటకై పాండవ సైన్యములలోనికి ప్రవేశించెను. భీష్ముడు పాండవులయొక్క చతురంగబలములను చెదరగొట్టెను. అర్జునుడువచ్చి భీష్మునకు అడ్డ

పడెను. ఆ సమయమున ఆసమీపమందుండు పాండవకౌరవసైన్యము లొండొంటిని దాకి భయంకరయుగా యుద్ధము జేసెను. ఆయుద్ధమందు రక్తప్రవాహములు నదులవలె పారుచుండెను. ఆరక్తనదులయందు మహారధికులు తమ రథములను ఓడలవలె నడిపించుకొని యుద్ధ క్రీడను జరిపిరి. అందరును సింహనాదములుచేసిరి. సూర్యుడు యెఱ్ఱని కిరణములుగలవాడై అస్తమించుటకు పోవుచుండెను. ఆ సమమమున భీముడు త్వరపడి దుర్యోధనుని యీ దినమే చంపెదనని ఉత్సాహము చేత దుర్యోధనున కెదురుగా రథమును తోలించెను. భీముడు క్రోధ సంతోషములు గలిగి దుర్యోధనుని జూచి యిట్లనెను.

ఓరీ! దుర్యోధనా! బహుకాలమునుండి నిన్ను చంపవలెనని అపేక్షించియున్నాను. అట్టి శుభమును యీ దినమందు దైవము చేకూర్చెను. ఇపుడు నిన్ను చంపి మాతల్లియగు కుంతీదేవియొక్క కష్టమును నివారించెదను. నిన్ను చంపినయెడల ద్రౌపదియొక్క అవమానము నశింపగలదు. కృష్ణుడు సంధిచేయుటకు వచ్చి నీకనేక విషయములుగా తెలియజెప్పెను. ఆమాటలను నీవు వినకపోతివి. నీవు ఉలూకుని పంపించి సభలో మమ్మునుగురించి చెప్పించిన కఠినవాక్య ములను యిపుడు నీచేత గ్రక్కించెదను. నీశూరత్వమును దక్కనీయక యిప్పుడు నిన్ను చంపెదను. పరుగెత్తక మగతనము కలిగి నిలువుము. నిన్ను చంపినయెడల యీపై చెప్పిన దోషములన్నియు నశింప గలవు. అని భీముడు దుర్యోధనునితో జెప్పి అతిభయంకరముగా దుర్యోధనున కెదురుగా వెళ్ళెను. భీముడు దుర్యోధనుని యొక్క గుఱ్ఱములను చంపి సారధిప్రాణములను తీసికొని ధనుస్సును విరిచి టెక్కెములను నరికెను. దుర్యోధనుడు మరియొక ధనుస్సును తీసు కొనుటకు ముందుగానే భీముడు పదిబాణములను దుర్యోధనుని దేహ మందు నాటించెను. ఆ పదిబాణములను పుట్టలోపలకి పాములు

ప్రవేశించినట్లు దుర్యోధనుని దేహములో ప్రవేశించి దూరిపోయెను. ఆ బాణములు వానిశరీరమునందు గల ఎముకలను గీరినందున దుర్యోధనుడు మూర్ఛనుపొంది ఒరిగెను. ఆ బాణముల దెబ్బలకు దుర్యోధనుని దేహమందు అధికముగా రక్తము కారెను. ఆసమయమందు సైంధవుడు అనేక రథిక శ్రేష్ఠులను తీసికొని భీమునిమీదకు వచ్చెను. ఆసమయమందు కృపాచార్యుడు దుర్యోధనుని తన రథముమీద నుంచుకొని తొలగిపోయెను. అభిమన్యుడును ద్రౌపదీపుత్రులును, కేకయరాజులును, భీముని అతిక్రమించి సైంధవున కడ్డుపడిరి.

ఓ ధృతరాష్ట్ర మహారాజా! ఆసమయమందు నీకొడుకులగు 1 చిత్రుడు 2 చిత్రదర్శనుడు 3 చిత్రాస్యుడు 4 చారుచిత్రుడు 5 సుచారుడు 6 జయసంధుడు యీ ఆరుగురును రౌద్రాకారములతో అభిమన్యుని చుట్టుకొనిరి. బలవంతుడగు అభిమన్యుడు ఒకొ్కకనిమీద ఐదేసిబాణములు వేసి ఆరుగురిని నొప్పించెను. చిత్రుడు మొదలగు ఆరుగురును జంకక బాణసమూహములచేత అభిమన్యుని మునుగునట్లు చేసిరి. ఇదివరలో తన సహోదరులకు సహాయము చేయదలచి వచ్చిన వికర్ణుడు అభిమన్యునిచేత విరథుడయ్యు మరల అభిమన్యుమీదకు వచ్చెను. అంతట అభిమన్యుడు కోపించుకొని వికర్ణుని ధనస్సు విరిచి సారథినిచంపి గుఱ్ఱముల ప్రాణములను దీసెను. అభిమన్యుడు వికర్ణుని టెక్కెమును విరుగగొట్టి అతని దేహమందు బాణములను గ్రుచ్చెను. ఆబాణముల దెబ్బలకు వికర్ణుడు నొచ్చెను. చిత్రుడు మొదలగు ఆరుగురును ఒక్కపెట్టున అభిమన్యుని చుట్టు ముట్టుకొనిరి. ఆ సమయమున ద్రౌపదీపుత్రు లయిదుగురును అభిమన్యునకు ముందు మిగిలి చిత్రుడు మొదలగు ఆరుగురిని తాకిరి. ద్రౌపదీపుత్రులగు అయిదుగురును చిత్రుడు మొదలగు ఆరుగురి యొక్క గుఱ్ఱములను చంపి టెక్కెములను నరికి బాణవర్షముచేత

ముంచి భయపెట్టిరి. నీకొడుకు లట్లు నొచ్చియు సిగ్గుచేత మరల ద్రౌపదీపుత్రులతో యుద్ధము చేసిరి. ఆసమయమున ద్రౌపదీపుత్రులలో నకులుని కొడుకగు శతానీకుడు అనేకప్రకారములుగా అనేకవిధములగు బాణములచేత నానావిధమైన యుద్ధక్రీడలను సలుపుచుండిరి. ఆసమయమున కేకయదేశపు రాజులును ద్రుపదుడును తమసైన్యములతో శతానీకులకు సహాయులై రథములును, గుఱ్ఱములును తోలించి ప్రకాశింపుచుండిరి. ఈప్రకారముగా పాండవసైన్యములు కౌరవసైనికులను చంపుచుండిరి. అప్పుడు సూర్యుడు అస్తమించుచుండెను. ఆసమయమున భీష్ముడు ప్రళయకాలమందలి యమధర్మరాజువలె భయంకరముగా తోచుచు నానావిధములైన సమర్థవంతములగు బాణసమూహములచేత వేడిమి చూపి పాండవసైన్యములను చెదరగొట్టి తమ కౌరవసైన్యములను మరలించుకొని ఆదినమందు యుద్ధము చాలించి తమ శిబిరమునకు వెళ్ళెను. పాండవులును దేహములయందు చెమటలు పోయుచుండగా తమ శిబిరములకు వెళ్ళిరి. అని సంజయుడు ఆరవనాటి యుద్ధక్రమమంతయు ధృతరాష్ట్రునితో చెప్పెను. అని వైశంపాయనుడు జనమేజయునితో చెప్పెను. జనమేజయుడు సంతోషించి వైశంపాయన మునీంద్రునిజూచి యిట్లనెను. వైశంపాయన మునీంద్రా! ఆరవనాటియుద్ధమందు భీమునిచేత దుర్యోధనుడు ఓడిపోయి అనేకములగు దెబ్బలుపడి మూర్ఛిల్లెనని చెప్పితివి. పిమ్మట మరల దుర్యోధనుడు యేప్రకారముగా యుద్ధమునకు వచ్చెనో చెప్పుము.

ఇది శ్రీ మహాభారతమునందలి భీష్మపర్వమునందు
ద్వితీయాశ్వాసము

# తృ తీ యా శ్వా స ము

హరిహరనాథా! వైశంపాయనమునీంద్రుడు జనమేజయున కిట్లనెను. జనమేజయ మహారాజా! యుద్ధమందు దుర్యోధను డోడిపోయెనని ధృతరాష్ట్రుడు విని మిక్కిలి దుఃఖముకలవాడై సంజయునితో యిట్లనెను. సంజయుడా! యుద్ధమెట్లు పిమ్మట జరిగెనో చెప్పుమని ధృతరాష్ట్రుడడుగగా సంజయు డిట్లనెను. ధృతరాష్ట్ర మహారాజా! అట్లు ఆరవనాడు యుద్ధముచేసి వెళ్ళినపిమ్మట ఆరాత్రియందు దుర్యోధనుడు భీష్మునిదగ్గరకు బోయి యిట్లనెను. తాతా! భీష్మా! మనము చక్కగా వ్యూహమును యేర్పరచుకొని యుద్ధమునకు వెళ్ళగా పాండవులబలము మనసైన్యములమీదకు వచ్చి మనలను కష్టపెట్టుచున్నది. అదిగాక నీయెదుట నేటియుద్ధమందు భీమునిచేత భంగపడితిని. నిన్ను యుద్ధమునకు తీసికొనిపోయి పాండవులను గెలిచెదనని నమ్మియుంటిని. అట్టినమ్మకమును తప్పించితివి. నీవు దేవతలనైనను గెలిచెదవని నమ్మియుంటిని. పాండవులు నిన్ను గెలుచుటకు సమర్థులైరిగదా! యని దుర్యోధనుడు చెప్పగా ఆమాటలను భీష్ముడు విని నవ్వి దుర్యోధనునితో యిట్లనెను. దుర్యోధనా! నీవు యీప్రకారము నన్నుగురించి యెందుకుమాటలాడెదవు? యుద్ధమందు నాదేహమును దాచినస్థలముకలదా! పాండవులు తప్ప యితరరథికులు యెవరైన నాయెదుట బడి బ్రతుకజాలరు. పాండవులను గెలుచుటకు సాధ్యముగాదని నేననేకమార్లు నీతో స్పష్టముగా చెప్పియున్నాను. మర్మమును విడిచి నీకు జయముగోరి యుద్ధము చేసెదను. దుఃఖించకుండుమని భీష్ముడు చెప్పగా దుర్యోధనుడు దుఃఖమును విడిచి వెళ్ళి సుఖముగా నిద్రించెను.

## ఏడవనాటి యుద్ధము

అంతట ఏడవనాటి వుదయమున దుర్యోధనుడు యుద్ధమునకు వచ్చెను. భీష్ముడు కౌరవసైన్యమును మండల వ్యూహముగా నేర్పరచెను. (యెనిమిదిదిక్కులనడుమ గుండ్రముగానుండు ప్రదేశము మండల మనబడును.) ఆ మండల వ్యూహమునకు మధ్యప్రదేశమందు దుర్యోధను డుండెను. దుర్యోధనుని తమ్ములగు దుశ్శాసనాదులును తక్కినదొరలును ప్రక్కలయందు నిలిచిరి. ఈ ప్రకారముగా కౌరవ సైన్యములు మండలవ్యూహముగా నిలిచి యుండెను. పాండవులు యుద్ధముకొఱకు బయలుదేరివచ్చిరి. ధర్మరాజు మన కౌరవవ్యూహమును చూచి వజ్రవ్యూహమును కల్పించునట్లుగా తమసేనాపతియగు ధృష్టద్యుమ్నునితో చెప్పెను. ధృష్టద్యుమ్నుడు పాండవసైన్యములకు వజ్రవ్యూహమును యేర్పరచెను. ఆ వజ్రవ్యూహమును కౌరవ వ్యూహమును మెచ్చుకొనక సకలవాద్యములు మ్రోయగా శత్రు సైన్యముమీదకు పోయెను. ఆ యుద్ధమందు ద్రోణాచార్యుడు విరాటునితో పోరుచుండెను. అశ్వత్థామ శిఖండితో యుద్ధము చేయుచుండెను దుర్యోధనుడు ధృష్టద్యుమ్నునితో యుద్ధము చేయుచుండెను. శల్యుడు నకులసహదేవులతో యుద్ధము చేయుచుండెను. విందానువిందులను ఆవంతీదేశపురాజులు యుధామన్యునితో యుద్ధము చేయుచుండిరి. అనేకరాజులు అర్జునునితో యుద్ధముచేయుచుండిరి. భీముడు కృతవర్మనితో యుద్ధము చేయుచుండెను. అభిమన్యుడు చిత్రసేనుని తోడను, దుశ్శాసనునితోడను, వికర్ణునితోడను యుద్ధముచేయుచుండెను. ఘటోత్కచుడు భగదత్తునితో యుద్ధము చేయుచుండెను. సాత్యకి అలంబసుడను రాక్షసునితో యుద్ధము చేయుచుండెను. చేకితానుడు కృపాచార్యునితో యుద్ధము చేయుచుండెను. ధర్మరాజు

శ్రుతాయువునితో యుద్ధముచేయుచుండెను. అనేకరాజులు భీష్మునితో యుద్ధముచేయుచుండిరి.

ధృతరాష్ట్ర మహారాజా! ఆసమయమందు కృష్ణునితో అర్జును డిట్లనెను. కృష్ణా! భీష్ము డేర్పరచిన కౌరవవ్యూహము మిక్కిలి బాగుగా నున్నది. కౌరవయోధులుమిక్కిలిగా ప్రకాశించుచున్నారు. ఈ కౌరవయోధులనందరిని నేనిపుడు చిక్కుపరచెదను. చూచుచుండు మని యర్జునుడు కృష్ణునితో చెప్పి ధనుస్సుయొక్క అల్లెత్రాటి మిడి సవరించి కౌరవయోధులమీద యధికముగా బాణవర్షమును కురిపించెను. ఆ కౌరవయోధులందరును ఒక్కపెట్టున కృష్ణార్జునుల మీద బాణవర్షమును కురిపించి మునుగునటు చేసిరి. కౌరవసైన్యములును సింహనాదము చేసెను.

అర్జునుడు కోపించుకొని ఐంద్రాస్త్రమును ప్రయోగించెను. ఐంద్రాస్త్రము కౌరవయోధు లర్జునునిమీద వేసిన బాణసమూహముల నన్నిటిని నరికివేసి కౌరవయోధుల దేహములయందు గ్రుచ్చి కొని మదపుటేనుగుల గుంపులను గుఱ్ఱపు దండులను చంపి భయంకరమై యుండెను. ఆ ఐంద్రాస్త్రము మందరపర్వతము సముద్రమును కలతబెట్టినట్లు కౌరవసైన్యములను చెదరగొట్టి నొప్పించెను. కౌరవసైన్యము లన్నియు భయముచేత పారిపోయి. భీష్ముని రథమును ఆధారము చేసికొని నిలిచియుండెను. త్రిగర్తదేశపు రాజులు మొదలగువారి సైన్యము లన్నియు పారిపోయి భీష్మునిదగ్గర నిలువగా త్రిగర్తాది కౌరవయోధులును పారిపోయి భీష్మునిదగ్గిర నిలిచియుండిరి. భీష్ము డర్జునుని మీదకు వచ్చెను. అట్టి సమయమందు గోడివచ్చిన త్రిగర్తాదిరాజులతో దుర్యోధను డిట్లనెను.

త్రిగర్తాదిరాజులారా! సైన్యముతో గూడి అర్జునుని మీదకు భీష్ముడొక్కడే వెళ్లుచున్నాడు. మీరందరును ఆ భీష్మునకు

సహాయులై వెళ్లకుండుట బాగుగాదు. మీరు పెద్దమన్న్యు లగుదురు. నేను చూచుచుండగా అర్జునునకు భయపడి పారిపోవచ్చునా? అని దుర్యోధనుడు ఆ త్రిగర్తాదిరాజులతో చెప్పగా ఆ రాజులందరును తమ తమ సైన్యములతో కూడుకొని భీష్మునకు రెండుప్రక్కల యందును నిలిచియుండిరి. ఆ సమయమందు ద్రోణాచార్యుడు విరాటరాజుతో యుద్ధము చేయుచు, రెండుబాణములచేత ఆ విరాటుని ధనుస్సును టెక్కెపు స్తంభమును విరుగగొట్టెను. విరాటుడు మరియొక ధనుస్సును తీసికొని మూడేసి బాణములచేత ఆ ద్రోణుని అతని సారధిని నొప్పించెను. అప్పుడు విరాటుడు నాలుగు బాణముల చేత ద్రోణునియొక్క గుఱ్ఱములను నొప్పించి రెండుబాణములచేత ధనుస్సును టెక్కెమును నరికివేసెను. అంతట ద్రోణాచార్యు డెనిమిది బాణములచేత విరాటుని గుఱ్ఱములను చంపి విరధుని చేసెను. అప్పుడు విరాటుడు తన పుత్రుడగు శంఖుని రథముమీదకు పోయెను. ఆ విరాట శంఖులిద్దరును తీక్ష్ణబాణవర్షమును కురిపించి ద్రోణుని మునుగునట్లు చేసిరి. ఆ సమయమందు ద్రోణాచార్యుడు కోపించుకొని గొప్ప బాణమును శంఖుని రొమ్మునందు గ్రుచ్చెను. ఆ బాణము శంఖుని రొమ్మునందు గ్రుచ్చికొని వీపుగుండా దూసికొని పోయెను. ద్రోణుని బాణము తాకగా శంఖుడు ధనుర్బాణములను విడిచి క్రిందబడి చచ్చెను. విరాటుడు ధైర్యములేక తల్లడిల్లుచు అందరును జూచుచుండగా తన సైన్యములతో గూడికొని పారిపోయెను.

ధృతరాష్ట్రమహారాజా! ఆ సమయమందు శిఖండి అశ్వత్థామయొక్క నొసటియందు మూడుబాణములను నాటెను. అందు కశ్వత్థామ కోపించుకొని ఒక్కపెట్టున ననేకబాణములు వేసి ఆ శిఖండియొక్క సారధిని గుఱ్ఱములను టెక్కెములను ధనుస్సును నరికివేసెను. శిఖండి కత్తిని డాలును తీసికొని క్రిందకు దూకి డేగవలె

ధృతరాష్ట్రమహారాజా ! యుధామన్యుడు అవంతీదేశపు రాజగు విందునితోడను అనువిందునితోడను యుద్ధము చేయుచుండెను. యుధామన్యుడు శక్తివంతములైన బాణసమూహముల చేత ఆ విందానువిందులను కప్పెను. యుధామన్యుడు అనువిందుని యొక్క గుఱ్ఱములను చంపి విరథునిగా జేసెను. అనువిందుడు విందుని రథముమీదకు పోయెను. యుధామన్యుడు ఒక బాణముచేత విందునియొక్క సారథిని చంపెను. విందుని గుఱ్ఱములు బెదరి రథము నీడ్చుకొనిపోయెను. విందుని సైన్యమంతయు తల్లడిల్లి పారి పోయెను.

ధృతరాష్ట్రమహారాజా ! ఆ సంకుల యుద్ధమందు భగదత్తుని మదపుటేనుగు పాండవబలముమీదకు వచ్చి పాండవబలములను చెదరగొట్టుచుండెను. ఏటివేగమును మహాపర్వతము ఆపినట్లు ఆభగదత్తుని యేనుగువలన కలిగిన బాధను ఘటోత్కచుడు పోగొట్టెను. భగదత్తునిఏనుగును ఘటోత్కచుడు నిలుపుట చూచి పాండవసైన్యములన్నియు యెప్పటివలె యుద్ధమునకువచ్చెను. అంతట ఆఘటోత్కచుడు భగదత్తునిమీద యనేకబాణములను ప్రయోగించెను. అప్పుడు భగదత్తుడు ఘటోత్కచుడు వేసినబాణముల నన్నిటిని మరలించి లిప్పవైన పదునాల్గు తోమరాయుధములను నరికివేసి డెబ్బది బాణములను భగదత్తునిమీద వేసి సింహనాదము చేసెను. ఘటోత్కచుడు భగదత్తునిమీద శక్త్యాయుధమును ప్రయోగించెను. భగదత్తుడా శక్త్యాయుధమును నడుమకు నరికివేసి వెంటనే ఘటోత్కచుని బాణములచేత నొప్పించెను. అప్పుడు నముచి యనురాక్షసుడు యుద్ధమునితో వోడి పారిపోయినట్లు ఘటోత్కచుడు భగదత్తునకు సింహముఓడిపోయెను. పిమ్మట భగదత్తుడు తన మదపుటేనుగును తోలి సాత్యకిచుని సైన్యమును చెదరగొట్టెను.

ధృతరాష్ట్రమహారాజా! ఆ సమయమందు నకులసహదేవులు శల్యునితో యుద్ధముచేయుచు శల్యునిమీద బాణవర్షమునుకురిపించు చుండిరి. శల్యుడు నవ్వుచు నకులునియొక్క గుర్రములను చంపి విరథునిచేసెను. అనకులసహదేవు లిద్దరును ఒక్కరథముమీద యెక్కి శల్యునిమీదకు పోయిరి. శల్యుడు రౌద్రాకారుడై నకులసహదేవులను నొప్పించెను. అంతట సహదేవుడు ధైర్యబలశక్తి గలవాడై గొప్పక్రూరబాణమును శల్యునిరొమ్మునందు క్రూరముగా నాటెను. ఆ బాణము శల్యునిరొమ్మును భేదించుకొని వెనుకప్రక్కను దూసి పడెను. ఆ దెబ్బచేత శల్యుడు చచ్చినవానివలె రథముమీద పడెను. ఆ సమయమందు దుర్యోధనుని సైన్యములన్నియు దుఃఖించుచు చెదరి పోయెను. శల్యుడు మూర్ఛను పొందగా యతనిసారథి రథమును తోలుకొని తొలగిపోయెను. నకులసహదేవులు సింహనాదముచేసి శంఖములను పూరించిరి. అంతట మధ్యాహ్న సమయమాయెను. ఆ సమయమున ధర్మరాజు శ్రుతాయువునితో యుద్ధము చేయుచు శ్రుతాయువునిమీద తొమ్మిదిబాణములను వేసెను. శ్రుతాయువా తొమ్మిదిబాణములను మరలించి యేడు తీక్ష్ణబాణములను ధర్మరాజు దేహమందు గ్రుచ్చెను. అప్పుడు ధర్మరాజు కోపించుకొని పందిచెవి వంటిబాణముచేత శ్రుతాయువురొమ్ము చీల్చి పెద్దనోరుగల బాణము చేత టెక్కెమును నరికెను. అంతట శ్రుతాయువు మరల యేడుతీక్ష్ణ బాణములచేత ధర్మరాజును నొప్పించెను. ధర్మరా జధికమైన భయంకరకోపము గలవాడై శ్రుతాయువుయొక్క గుర్రములను చంపి ధనుస్సునువిరిచి అతని దేహమును రక్తమయముగా జేసెను. అప్పుడా శ్రుతాయువు భయపడి పారిపోయెను. కౌరవసైన్యములకు దుఃఖభయములుగలిగి ధైర్యము లేకయుండెను. పాండవసైన్యములు ధైర్యసంతోషములను కలిగియుండెను.

## చేకితానకృపాచార్యుల ద్వంద్వయుద్ధము

ధృతరాష్ట్రమహారాజా! ఆ సమయమందు చేకితానుడు కృపాచార్యునిమీద తీక్ష్ణబాణములను వేసెను. కృపాచార్యుడు చేకితానుని యొక్క ధనుస్సును విరిచి గుర్రములను చంపెను. చేకితానుడు గదాయుధమును తీసికొని శీఘ్రముగా రథము దిగి కృపాచార్యునియొక్క గుర్రములను చంపెను. అంతట చేకితానుడు వెనుకప్రక్కకు ఎగిరి దూకిపోయెను. కృపాచార్యుడు పదియారు బాణములను చేకితానుని యెముకలయందు గ్రుచ్చెను. అపుడు చేకితానుడు గదాయుధమును కృపాచార్యునిమీద వేసెను. ఆ గదాయుధమును కృపాచార్యుడు తుండ్లుతుండ్లుగా నరికి వేసెను. చేకితానుడు శీఘ్రముగా రథముమీద నుండు కత్తిని తీసికొని మెరుపుమెరసినట్లు పరుగెత్తి కృపాచార్యుని మీదకు వచ్చెను. కృపాచార్యుడు మిక్కిలి తీక్ష్ణమైన కత్తిని తీసికొని క్రిందకు దూకి చేకితానునిమీదకు వచ్చి ఆ చేకితానుని నొప్పించెను. ఆ చేకితానుని చేత కృపాచార్యుడును నొచ్చెను.

ఆ కృపాచార్య చేకితానులిద్దరును నొచ్చినవారలై మూర్ఛిల్లి యిద్దరును క్రిందపడిరి. ఆ సమయమందు శకునికొడుకు వచ్చి కృపాచార్యుని తన రథముమీద నుంచుకొని వెళ్లెను. కరకర్షణుడు వచ్చి చేకితానుని తన రథముమీద నుంచుకొని వెళ్లెను. ధృతరాష్ట్రమహారాజా! ధృష్టకేతుడు భూరిశ్రవునిమీద తొమ్మిది బాణములను వేసెను. భూరిశ్రవుడు కోపించుకొని నానావిధములగు బాణములచేత ధృష్టకేతునియొక్క గుఱ్ఱములను చంపివేసి శీఘ్రముగా యినుప బాణములను ధృష్టకేతుని దేహమందు గ్రుచ్చెను. ధృష్టకేతుడు విరాటుని తమ్ముడగు శతానీకుని రథముమీదకు వెళ్లెను. దుశ్శాసనునితోడను వికర్ణునితోడను చిత్రసేనునితోడను అభిమన్యునకు

మహాయుద్ధము జరిగెను. ఆ యుద్ధమందు అభిమన్యుడు దుశ్శాసన వికర్ణ చిత్రసేనుల ముగ్గురుని విరథులను చేసెను. భీముడు ఆ దుశ్శాసనాదులను చంపెద నని పూర్వము చెప్పినమాటలను అభిమన్యుడు తలచుకొని ఆ ముగ్గురుని చంపక నొప్పించుచుండెను. ఆసమయమందు భీష్ముడు దుశ్శాసనాదులను ముగ్గురిని తీసికొని అనేక రథికులను చేర్చుకొని అభిమన్యునిమీదకు పోయెను. ఆ కౌరవరథికులగు రాజులందరును యౌవనవంతులై యుందురు. అభిమన్యుడు ఒక్కడై బాలుడై యుండును. ఆ విషయమును చూచి అర్జునుడు కృష్ణునితో యిట్లనెను. కృష్ణా! అనేక మహారథికులు భీష్మునితో గూడుకొని గర్వముచేత అభిమన్యునిమీదకు వెళ్లుచున్నారు. గనుక మనము రథము అభిమన్యునిదగ్గరకు త్రోలవలయును. అని అర్జునుడు చెప్పి వారలను చూపగా కృష్ణుడు అభిమన్యుడున్న దిక్కుతట్టు రథమును త్రోలుచుండెను. అ సమయమందు త్రిగర్తదేశపు రాజగు సుశర్మ యనువాడు తన సైన్యమునకు ముందువచ్చి అర్జునునకు అడ్డుపడెను. అపుడర్జునుడును సుశర్మతో యిట్లనెను.

సుశర్మా! మీ సైన్యములో నుండు మహారథికులలో నీవు మొనగాడవగుదువు. నీవిప్పుడు నాతో యుద్ధముచేయుటకు వచ్చితివి. నిశ్చయముగా నాతోయుద్ధము చేయవలయునుసుమా. అని అర్జునుడు సుశర్మతో చెప్పుచు బాణసమూహములచేత సుశర్మను అతని సారథిని గుర్రములను మునుగునట్లు చేసెను. అ సమయమున కౌరవ సైన్యము పొక్కపెట్టునన అర్జునునిమీదకు వచ్చిపడెను. పాండవ సైన్యములు అర్జునునకు ముందు మిగిలి కౌరవసైన్యములను తాకెను. అప్పుడు ఆ రెండుసైన్యములకును సంకులయుద్ధము లాయెను. ఆ సమయమం దర్జునుడు కౌరవపక్షముగా నుండు రాజులగుంపు మీదకు పోయి తుక్కెములను నరుకుచు సారథులరొుక్కయు, రథికుల

రొక్కయు, గుఱ్ఱములరొక్కయు ప్రాణములను తీయుచు, గొడు గులను చామరములను పొడిపొడిగా చేయుచు ధనుస్సులను నరికి వేయుచు కవచములను చీల్చుచు ప్రాణసంచార స్థానములయందు బాణములను గ్రుచ్చుచు సకల దేహములను బాధించుచు శిరస్సులు నరుకుచు విహరించుచుండెను. అంతట మూడుజాము లాయెను. ఆ సమయమందు సుశర్మ అర్జునునిమీదకు వచ్చి యెదిరించెను. ఆ సమయమందు సుశర్మయొక్క రథచక్రరక్షకులు ముప్పదిరెండు మంది అర్జునునిమీదకు వచ్చిరి. అర్జునుడు నవ్వి అరువదినాలుగు బాణములచేత ఆ ముప్పదిరెండు మందిని చంపివేసెను. సుశర్మ కోపించుకొని అర్జునునిమీదకు వచ్చెను. ఆసమయమున శిఖండి మొద లగు పాంచాలు రర్జునుని మించి సుశర్మమీదకు పోయిరి. అర్జునునకు యెదుట దుర్యోధన సైంధవులున్నను ఆ దుర్యోధన సైంధవులను అర్జునుడు ఓరకంట జూచుచు భీష్మునిమీదకు పోయెను.

ఆ సమయమందు శల్యుడు ధర్మరాజుమీదకు వచ్చుచుండెను. అట్లు వచ్చుచున్నను ధర్మరాజు ఆ శల్యుని ఆదరింపక భీమ నకుల సహదేవులతో గూడుకొని అర్జునునకు సహాయముగా భీష్ముడున్న దిక్కునకు వెళ్ళుచుండెను. పాండవు లైదుగురితో భీష్ముడు యుద్ధము చేయుచుండెను. ఆ సమయమందు దుర్యోధన సైంధవులు సాహసము జేసి భీష్మునకు సహాయులై పాండవులతో యుద్ధము చేయుచుండిరి. శలుడును. శల్యుడును, చిత్రసేనుడును, యీ ముగ్గురును కృపా చార్యునితో గూడుకొని పాండవులమీదకు బోయి తీక్ష్ణబాణము లను వేసిరి. దుర్యోధనుడు సంతోషించెను. పిమ్మట శిఖండి భీష్ముని యెదిరించెను. భీష్ముడు శిఖండిమీద బాణమును వేయుటకు సమ్మ తింపక శిఖండియొక్క ధనుస్సును తునుక తునుకలుగా విరుగ గొట్టెను. అప్పుడు శిఖండి వెనుకకు తగ్గెను. ధర్మరాజు ఆ శిఖండికి

అతని ప్రతిజ్ఞావచనములను చెప్పెను. ధర్మరాజు శిఖండిని పురి కొల్పగా ఆ శిఖండి మరల భీష్మునిమీదకు పోయెను. ఆ సమయ మందు శల్యుడు శిఖండికి అడ్డమువచ్చి ఆగ్నేయాస్త్రమును ప్రయో గించెను. ఆ శిఖండి ఆగ్నేయాస్త్రమునకు భయపడక వారుణాస్త్ర మును ప్రయోగించెను. ఆ వారుణాస్త్రముచేత అధికవర్షము కురిసి ఆగ్నేయాస్త్రము చల్లారెను. అప్పుడు భీష్ముడు ధర్మరాజుయొక్క టెక్కెమును విరిచి ధనుస్సును త్రుంచెను. అట్లుచేసి భీష్ముడు సింహ నాదము చేసెను. అంతట భీముడు గదాయుధమును తీసికొని రథము దిగి దుర్యోధనునిమీదకు పోయెను. ఆ సమయమున సైంధవుడు ముందు మిగిలి రౌద్రాకారుడై అతిశీఘ్రముగా ఏడువందలు తీక్ష్ణ మైన బాణములను భీమునిమీద వేసెను. భీముడు భయపడక తన గదాయుధముచేత సైంధవుడువేసిన బాణములను చెదరగొట్టుచు సైంధవునిమీదకు పోయి అతని గుఱ్ఱములను గదచేత చంపెను. అప్పుడు సైంధవుడు వుత్సాహము లేనివాడై మరియొక రథముమీద యెక్కెను. కౌరవ రథికులు వెనుకకుతగ్గిరి. సైన్యము చెదరిపోయెను. ఆసమయమందు దుర్యోధనుడు క్రూరముగా భీమునిమీదకు వచ్చెను. ఆసమయమున చిత్రసేనుడు భీమునిమీదకు వచ్చి గొప్ప శక్త్యాయుధ మును వేసెను. భీముడు కోపించుకొని గదాయుధమును చిత్రసేనుని మీద వేసెను. ఆ గదాయుధము ఆకాశమందు భయంకరమైన పిడుగువలె ప్రకాశించుచుండెను. ఆసమయమందు కౌరవయోధు లందరును గదాయుధము తమమీద పడునేమోయని భయపడుచు చెదరిపోవుచుండిరి. గాని దుర్యోధనునిమీద పడునని తలచకపోయిరి. ప్రాణభయము, యెటువంటివారినైనను మరుగుపరచును గదా! అట్టిసమయమున చిత్రసేను డొక కత్తిని డాలును తీసికొని రథము మీదనుంచి క్రిందకు దూకెను. భీముడువేసిన గదాయుధము చిత్ర

సేనుని రథమును సారథిని గుర్రములను పొడిపొడిగా చేసెను. ఈ ప్రకారము చిత్రసేనుడు రథములేనివాడైయుండగా చిత్రసేనుని తన రథముమీద యెక్కించుకొని పోయెను.

ధృతరాష్ట్రమహారాజా! ఆసమయమున భీష్ముడు ధర్మరాజు యొక్క గుర్రములను చంపి అతని సకల అవయవములను బాధించెను. అందుకు ధర్మరాజు కోపించుకొని భీష్మునిమీద శక్త్యాయుధమును ప్రయోగించెను. భీష్ముడు భయపడక శక్త్యాయుధమును నరికివేసెను. ధర్మరాజు నకుల సహదేవుల రథముమీదకు పోయెను. అప్పుడు భీష్ముడు నకుల సహదేవులమీద తీక్ష్ణబాణములు వేసి నొప్పించెను. తన తమ్ములగు నకుల సహదేవులను భీష్ముడు నొప్పించెనని ధర్మరాజు కోపముగలవాడై ఉత్సాహముతో తమ రథికజనులనందరిని భీష్మునిమీదకు పురికొల్పెను, ఆ పాండవసైన్యములలో నుండు అనేకరాజులు భీష్ముని చుట్టుకొనిరి. భీష్ముడు అనేక మృగములలో విహరించు సింహామువలె చెలరేగి నేర్పరియగువాడు తాటిపండ్లను త్రుంచినట్లు గొప్ప నోరులుగల బాణములచేత పాండవపక్షపు రాజుల శిరస్సులను నరికివేయుచుండెను. భీష్ముడు పాండవపక్షపు రాజుల శిరస్సులను త్రుంచుచు గుండ్రముగా నలుదిక్కులయందును సంచరింపుచుండెను, పాండవులు భయపడి ఆశ్చర్యముగా జూచుచుండిరి. ఆసమయమందు శిఖండి ధనుర్విద్యా ప్రకాశుడై భీష్మునిమీదకువచ్చెను. భీష్ముడు శిఖండియెదుట నిలుచుటకు యిష్టములేక సృంజయుని సైన్యమును తరిమి ఓడించెను. అప్పుడు సాత్యకియు ధృష్టద్యుమ్నుడును వీరిద్దరును కౌరవ సైన్యములమీదకు పోయి చెదరకొట్టిరి. ఆసమయమునందు అవంతీదేశపు రాజులగువిందానువిందు లిద్దరును ధృష్టద్యుమ్న సాత్యకులకు అడ్డమువచ్చి ధృష్టద్యుమ్నుని గుఱ్ఱములను చంపిరి ధృష్టద్యుమ్నుడు రథములేనివాడై

సాత్యకియొక్క రథముమీదకుపోయెను. ధర్మరాజు తన సైన్యముల నన్నిటిని పురికొల్పికొని సాత్యకి ధృష్టద్యుమ్నులను వెంటబెట్టుకొని కౌరవసైన్యములను తరిమెను, దుర్యోధనుడు తన సైన్యములకు చేయి విసరి తానును తన తమ్ములగు దుశ్శాసనాదులును భీష్ముడును పాండవసైన్యములకు అడ్డుపడిరి.

అర్జునుడు భీష్మాదులమీదకు వచ్చుచుండగా ద్రోణాచార్యుడు అర్జునునకు అడ్డుపడెను. ద్రోణుడు అర్జునునిమీద అనేక బాణసమూహములను వేసి భూమ్యాకాశములను నిండించెను. ఈరీతిగా ద్రోణుడు పరాక్రమింపగా ద్రోణుని ఆధారముచేసికొని కౌరవసైన్యములు పాండవసైన్యములమీదకు పోయెను. ఆసమయమందు ధర్మరాజు అరచుచు సేనలను పురికొల్పెను. పాండవసైన్యము లన్నియు చేరుకొని క్రూరముగా యుద్ధము చేయుచుండెను. ఆసమయమందు సూర్యుడు అస్తమించెను. ధృతరాష్ట్ర మహారాజా! ఆసమయమందు సూర్యకాంతిచే భూమియంతయు యెర్రని రంగు గలిగియుండెను. యుద్ధభూమియందు ప్రవహించు రక్తపునదులయందు పీనుగులు తేలి పోవుచుండెను, ఆ పీనుగులను తీసికొని భూతభేతాళములు వెళ్ళు చుండెను. ఆసందడి అధికముగా నుండెను. ఆ యుద్ధభూమియందు పడియుండు పీనుగులను నక్కలు అరచుచు యెత్తికొనిపోవుచుండెను. ఆప్రకారముగా యుద్ధభూమియంతయు అతిభయంకరముగానుండెను. ధృతరాష్ట్ర మహారాజా! సుశర్మాదు మొదలగు అనేకరాజులను, గెలిచిన అర్జునుడు సైంధవుడు మొదలగు రాజులను చిక్కుపరచి గర్వించిన భీముడును ఆధర్మరాజునకు కనబడిరి. ధర్మరాజు తమ సైన్యములను శిబిరములకు మరలింపుడని ఆజ్ఞాపించెను. ధర్మరాజు సకల పరిజనులతో కూడుకొని తమ శిబిరమునకు వెళ్ళెను. నీకుమారు ళ్ళగు దుర్యోధనాదులందరును భీష్మునిదగ్గరను పోయి తమ సైన్యముల

న్నిటిని తమ శిబిరమునకు మరలించిరి. దుర్యోధనాదులును భీష్ము ఁను తమ శిబిరమునకు వెళ్ళిరి.

## ఎనిమిదవనాటి యుద్ధము

ధృతరాష్ట్రమహారాజా! ఏడవనాటి రాత్రియందు రెండు పక్షములవారును నిద్రించిరి. ఎనిమిదవనాటి యుదయమున కౌరవు లును, పాండవులును, తమ తమ సైన్యములతో భయంకరముగా యుద్ధమునకు బయలుదేరివచ్చిరి. ఆ సమయమందు భీష్ముడు కౌరవ సైన్యములకు కూర్మవ్యూహమును తీర్చెను. (కూర్మమనగా తాబేలు) ఆ కూర్మవ్యూహమును ధర్మరాజు చూచి ధృష్టద్యుమ్నునితో యిట్లనెను. సేనాపతీ! ధృష్టద్యుమ్నా! కౌరవులయొక్క కూర్మ వ్యూహమును చూచితివిగదా! ఈ కూర్మవ్యూహమునకు ప్రతివ్యూహ మెద్దియో ఆ వ్యూహమును మనసైన్యమునకు యేర్పరచుము. అని ధర్మరాజు చెప్పగా ధృష్టద్యుమ్నుడు పాండవసైన్యములకు శృంగా టకవ్యూహమును యేర్పరచెను. (నాలుగు త్రోవలు కలిసినదారి శృంగాటకము.) ఈరీతిగా ఆ కౌరవ పాండవసైన్యములు రెండును కూర్మశృంగాటక వ్యూహములను యేర్పరచుకొని అధికోత్సాహ ముతో భేరీమొదలగు వాద్యములు మ్రోయుచుండగా యుద్ధమునకు కలిసిరి. ఆ సమయమున శక్తివంతములగు అనేకవిధములగు బాణసమూ హములను ఒకటొకటి తగిలిన రాపిడిచేత పొగలేనిమంటలు మెగయు చుండెను. రథములును యేనుగులును, గుర్రములును యీమూటి యొక్క గుంపులు వేగముగా నడచుచుండగా భూమియందుండి అధికముగా దుమ్ము లేచుచుండెను. ఆ సైన్యములయందు ప్రవ హించు రక్తప్రవాహములు ఆ దుమ్మును ఆకాశమందు చేరనివ్వక అణగించుచుండెను. ఈరీతిగా కౌరవపాండవ సైన్యములు రెండును

కలిసి యుద్ధముచేయుచుండెను, నీతండ్రియగు భీష్ముడా సమయమున సింహనాదము చేసి కౌరవసేనకు ముందు నడచి పాండవ సైన్యము మీదకు వచ్చుచుండెను. పాండవసైన్యము లన్నియు వెనుకకు తగ్గి పోయెను. అప్పుడు భీముడొక్కడే సింహనాదము చేయుచు భీష్ముని యెదిరించి అతనియొక్క సారథిని చంపెను. భీష్ముని గుర్రములు రథమును యీడ్చుకొని వెనుకకుబోయెను. పాండవసైన్యములు సంతోషించెను. నీకొడుకగు సునాభుడనువాడు అధిక శౌర్యసాహసముల చేత భీమునిమీదకు వచ్చెను. భీముడు ప్రళయకాలరుద్రునివలె కోపముగలవాడై కనుబొమలు రెండును ముడిపడుచుండగా నొక గొప్ప నోరుగల బాణముచేత ఆ సునాభునియొక్క శిరస్సును నరికివేసి పెద్దగా నవ్వెను.

## సునాభుడు మొదలగు కురుకుమారులు భీమునిచే జచ్చుట

ధృతరాష్ట్రమహారాజా! సునాభుడు చావగా అతని సహోదరులు కోపముగలవారై ఒక్కమారుగా భీమునిమీదకు వచ్చిరి, వారెవరనగా చెప్పెదను వినుము. 1 ఆదిత్యకేతుడు 2 అపరాజితుడు 3 బహ్వాశి 4 ఖండితకుడు 5 కుండధారుడు 6 విశాలాక్షుడు 7 సుహోదరుడు అను పేరుగల యేడుగురును ఒక్కమారుగా భీమునిమీదకు వచ్చి అనేకవిధములగు బాణములచేత భీముని నొప్పించిరి. భీముడు అధిక భయంకరరోషము గలవాడై తలయెత్తిచూచుటకు సాధ్యము గాకయుండెను. భీముడు సమర్థవంతమైన ఒక బాణముచేత ఆదిత్యకేతుని చంపెను. తీక్ష్ణమైన మంగలికత్తివంటి మరియొక బాణముచేత అపరాజితుని చంపెను. మరియొక తీక్ష్ణబాణముచేత బహ్వాశియను వానిని చంపెను. తీక్ష్ణమైన మంగలికత్తివంటి ముఖముగల మరియొక బాణముచేత ఖండితకుని చంపెను. అర్ధచంద్రునివంటి ప్రకాశబాణ

ముచేత కుండధారుని చంపెను. మరియొక తీక్ష్ణమైన అర్ధచంద్ర బాణముచేత విశాలాక్షునిచంపెను. మరియొక క్రూర బాణముచేత మహోదరుని చంపెను.

ధృతరాష్ట్రమహారాజా! ఈ ప్రకారముగా భీముడు ఒక్కొక్క బాణముచేత నీ యేడుగురు కొడుకులను చంపెను. తక్కిన నీ కొడుకులందరును ధైర్యములేక భయపడి అక్కడక్కడ నిలిచియుండిరి. తక్కిన నీ కుమారులందరును తమలోతామిట్లు జెప్పకొనసాగిరి. సోదరులారా! పూర్వము జూదమాడినపుడు ఆసభలో భీముడు చెప్పిన మాటలన్నియు యిప్పుడు క్రియారూపమున జరుపుచున్నాడు. వేయి మాటలు పలుకుటవలన ప్రయోజనములేదు. విదురుడు చెప్పిన ప్రకారము తప్పక జరుగుచున్నది. అని దుర్యోధనుని తమ్ములందరును చెప్పకొనుచు భయపడి భీముని చూచుచుండిరి. ధృతరాష్ట్ర మహారాజా! నీవు నీ కొడుకులగు దుర్యోధనాదులయొక్క చెడ్డతనమును పోగొట్టక వుపేక్షించితివి. ఆ చెడ్డతనముచేత యిపుడు నీ కొడుకులందరును భీమునిచేత చచ్చుచున్నారు. చావక యెట్లయినను ఉండిపోరుగదా! ఆవిషయమట్లుండనిమ్ము. అంతట జరిగిన యుద్ధవృత్తాంతమును చెప్పెదవినుము. ఆ సమయమందు దుర్యోధనుడు తన చుట్టునుండు మహారథికులను కలియజూచి వారందరిని భీమునిమీదకు పంపించెను. పిమ్మట దుర్యోధనుడు భీష్మునిదగ్గరకుపోయి దుఃఖించుచు గద్గదకంఠ స్వరముతో యిట్లనెను.

తాతా! భీష్మా! యీరీతిగా భీముడు మదగర్వముచేత వుప్పొంగుచు నాతమ్ములను చంపుచుండగా నీవు విడువక చూచుచుంటివే గాని విచారమునైనను పొందలేదుకదా! నీకు యేమాత్రమును కోపమైనను కలుగలేదు. అయ్యో! నీవు నాతమ్ములకు సహాయపడరాదని తలంచితివో లేకవున్నవారందరును ఒక్కసారే భీమునిచేత చావ

వలెనని యిట్లూరక నిలిచితివో తెలియకున్నది. అని దుర్యోధను డడుగగా ఆమాటలను భీష్ముడువిని తానును చచ్చినవారినిగురించి కొంతసేపు విచారించి దుర్యోధనునితో యిట్లనెను. దుర్యోధనా! పాండవులను మనము గెలువజాలమని యిదివరకే నేనును ద్రోణు డును విదురుడును అనేక పర్యాయములు నీతో చెప్పియున్నాము. పాండవులు మహాబలపరాక్రమవంతులై యున్నారు. అట్టి పాండవు లకు యెదురై యుద్ధముచేసి వారిని రుద్రుడైనను గెలువజాలడు. నీ తమ్ములలో యెవరైనను ఆ భీమునకు యెదురైనయెడల వారినందరిని భీముడు తప్పక చంపివేయును. భీముని యెదుటబడిన నీ తమ్ములను మనము రక్షింపజాలము. ఈ విషయమై నీవు దుఃఖింపరాదు. ఇక నీవు వీరస్వర్గమునే ధనముగా దలచుకొని యితరచింతలను విడచి యుద్ధము చేయుము. నా శక్తికొలది నేనును యుద్ధముచేసెదను. తెంపుసేసి యుద్ధముచేసినపుడు మనకు జయము కలిగినయెడల అట్టి విజయమును పోగొట్టనుగదా! అని భీష్ముడు దుర్యోధనునితో చెప్పె నని సంజయుడు ధృతరాష్ట్రునితో చెప్పగా ధృతరాష్ట్రుడు యిట్ల నెను. సంజయుడా! భీష్మద్రోణులు బ్రతికియున్నపుడే నా కుమారులు యిట్లు చచ్చుచుండిరిగదా! ఇట్లు జరుగునని యిదివరకే నేనును గాంధారియు దుర్యోధనునితో చెప్పియున్నాము. మా మాటలను దుర్యోధనుడు అసత్యముగా దలచి ఆ ఫలమును యిప్పుడు అనుభ వింపుచున్నాడు. ఇకను ఆమాటలను తలచుట గత జలసేతుబంధనము వలె వ్యర్థమగును. గాన ఆమాటల నిక చాలింపుము. భీముని చేత చచ్చిన నాకొడుకులను చూచినపిమ్మట భీష్మద్రోణులు యేమి చేసిరో చెప్పుము అని ధృతరాష్ట్రుడు అడుగగా సంజయు డిట్లనెను.

ధృతరాష్ట్రమహారాజా! భీష్ముడు భయంకరాకారము గల వాడై భీమునిమీదకు రథమును తోలించెను. అటు [illegible]

్మని ధర్మరాజు చూచి చేయివిసరగా ధృష్టద్యుమ్నుడును శిఖండియు
్యకియు యీ ముగ్గురును ముందు మిగిలి భీష్మున కడ్డుపడిరి.
కసమునపు భీమునిమీదకు దుర్యోధనుడు పంపిన మహారథిక
ాహాముతో చేకితానుడును. ద్రౌపదీపుత్రులును, అర్జునుడును
ద్ధము చేయుచుండిరి. అభిమన్యుడును ఘటోత్కచుడును వీరిద్దరును
సమారులగు దుర్యోధనాదులతో యుద్ధము చేయుచుండిరి. ఇట్లు
ాడు మొత్తములుగా జేరి యుద్ధము చేయుచుండిరి. పాండవరథి
ు క్రూరముగా పోరినను మనబలములు పారిపోవక పోరుచుండెను.
సమయమున ద్రోణాచార్యుడు ద్రుపదుని సైన్యముమీదపడి అనేక
ములైన బాణవర్షముచేత ఆద్రుపదుని సైన్యమును నొప్పించి
వరగొట్టెను. దేవతలు ద్రోణాచార్యుని మెచ్చుకొనిరి. ఆ సమయ
ున భీముడు కౌరవుల యేనుగులగుంపులమీద బడి యినుపబాణము
చేత ఆ యేనుగులను చంపుచు రూపుమాపుచుండెను. సూర్యకిరణ
ులచేత చీకట్లు నశించినట్లు భీముని బాణములచేత కౌరవుల యేను
ులగుంపులు చచ్చి భూమిమీద పడుచుండెను. ఆ సమయమందు
కులసహదేవులు కౌరవులయొక్క గుఱ్ఱపు దండులలో ప్రవేశించి
ౌద్రాకారులై గుఱ్ఱములను నరుకుచుండిరి. ఆ సమయమున రెండు
క్షముల రథములును నడచుటకు వీలులేకుండెను. అప్పు డర్జునుడు
ౌరవరథికులమీదపడి అతివేగముచేత బాణములను వేయుచుండగా
ౌరవరథికులు తాము ధరించినభుజకీర్తులు మొదలగు ఆభరణము
ుతోకూడా తునకలు తునకలుగా విరిగిపడుచుండిరి. అట్లుపడియుండు
ూమి పుష్పములు రాలినపు డుండువుద్యానవనమువలె నుండెను.
ఆ సమయమున నిలావంతుడు గుఱ్ఱపుదండులను తీసికొని కౌరవసైన్య
మును భేదించుటకు కౌరవసైన్యములోనికి ప్రవేశించెను. ఇలావంతుని
యుద్ధప్రయత్నము మిక్కిలి చక్కగా నుండెను. గొప్ప పక్షిసమ్హా

హాములలో ప్రవేశించు డేగలగుంపువలె యిలావంతుడు తనగుర్రపు దండుతో కౌరవ సైన్యములోనికి ప్రవేశించెను. అట్లు ప్రవేశించిన యిలావంతుని జూచి శకుని తమ్ములగు 1 శుకుడు 2 శర్మవంతుడు 3 వృషకుడు 4 సృంజయుడు 5 గజుడు 6 గవాక్షుడు ఈ ఆర్గురును గుర్రపుదండులతో యిలావంతునిమీదకు పోయి అతనిమీదను తమ వాహనములను తోలిరి. ఆ ఆర్గురును వెనుకతీయక రాతిని రాయి తాకినట్లు ఆ యిలావంతుని అతనిసైన్యములను తాకిరి. అట్లు ఆ రెండు పక్షముల వారును విచిత్రముగా యుద్ధముచేసిరి. ఆ సమయమందు శకుని తమ్ములారుగురు నిలావంతుని చుట్టుకొని మూరెడుమూరెడు ముద్దుకర్రలు మొదలగువానిచేత నిలావంతుని నొప్పించిరి. పదికోలల దెబ్బలచేత కోపించుకొనిన మదపుఏనుగువలె నిలావంతుడు కోపించుకొనెను. ఇలావంతునిచేతియందు ధనుస్సుయుండుటచేత గుర్రముమీదనుంచి దిగి ఆశకునితమ్ములగు ఆరుగురిమీదను యనేక ఇనుప బాణములను వేసెను. ఆబాణముల దెబ్బలచేతవారు ఆరుగురును నొచ్చిరి. అప్పుడు దేవతలు ఇలావంతుని మెచ్చుకొనిరి. అంతకుముందు నిలావంతుడు గుర్రముమీద యెక్కియుండగా శకునితమ్ముల దెబ్బలచేత ఆ గుర్రము నొచ్చి క్రిందబడినను ఆ యిలావంతుడు పడక క్రిందకు యెగిరి దూకి, కత్తిని తీసికొనెను. ఆయిలావంతుడు పాదచారియై క్రింద ఉండగా శకుని తమ్ములు ఆరుగురును ఇలావంతుని చుట్టుకొనిరి. మరియువానిమీదనేక బాణములను వేసిరి.

ఆయిలావంతుడు తనకత్తిచేత ఆబాణములనన్నిటినిఅత్యాశ్చర్యముగ నరికివేయుచుండెను. అంతట ఆశకునితమ్ములు ఆరుగురును తమలో తామిట్లనిరి. సహోదరులారా! యిలావంతుడు భూమిమీద నడచుచు యుద్ధముచేయుచున్నాడు. మనము గుర్రములమీద నున్నందున వీనిని మనము నొప్పింపజాలము గనుక మనమందరము క్రిందకు

దిగి ఒక్కపెట్టున వీనిని చుట్టుకొని చంపవలయును. యని దురాలోచనచేసి ఆరుగురును గుర్రములమీదనుండి క్రిందకు దిగి తీక్ష్ణమైన కత్తులను ఝుళిపించుచు, ఇలావంతునిమీదకు వచ్చిరి. అప్పుడర్జునుని కుమారుడగు ఇలావంతుడు గిరగిరతిరుగుచు తనకత్తిచేత ఆయారుగురిని పన్నెండు తునకలుగా నరికివేసెను. పిమ్మట సింహనాదము చేసెను. అంతట దుర్యోధనుడు చూచి తల్లడపడుచు అలంబసుడను రాక్షసునితో యిట్లనెను. అలంబసుడా! ఇలావంతు డొక్కడే మనసైన్యములను చంపుచున్నాడు. చూచితివిగదా! యని యిట్లు దుర్యోధనుడు చెప్పి ఇలావంతుని చూపెను. అలంబసుడను రాక్షసుడు యిలావంతుని జూచి యతనిమీదకు యుద్ధమునకు వెడలెను.

## అలంబసునిచేత ఇలావంతుడు మృతుడగుట

ధృతరాష్ట్ర మహారాజా! అలంబసుడు ఇలావంతునిమీదకు పోయి మాయచేత ఇలావంతునికి యెంతగుర్రపుదండు వుండెనో అంత గుర్రపుదండును కలిగించెను. ఆమాయాగుర్రములదండు ఆ ఇలావంతుని గుర్రపుదండును చంపి అదియునశించిపోయెను. ఆఇలావంతు డొక్కడే మిక్కిలిపరాక్రమముచేత అలంబసునిమీదకు పోయి మెరపు మెరసినట్లు ప్రకాశింపుచు తనకత్తిచేత అలంబసునియొక్క ధనుస్సును విరిచెను. అప్పు డలంబసుడు ఆకాశమునకు ఎగసి మాయాబాణముల చేత ఇలావంతుని నొప్పించెను. ఆ ఇలావంతు డాకాశమునకు యెగిరి గొప్పకత్తిచేత మాయాబాణములను నరికివేసెను. అలంబసుడు తన మాయచేత దేదీప్యమానముగా ప్రకాశించు యౌవనపురుషస్వరూపమును క్రొత్తగా ధరించి ఇలావంతునితో యుద్ధము చేయుచుండెను. ఇలావంతుడు భయపడక నిశ్చలుడై తనతల్లి వంశమందుగల అద్భుత మహాగుణాఢ్యుని తలచుకొని ఆమాయచేత ఆదిశేషునివంటి మహో

సర్పమాయెను. ఆ ఆదిశేషరూపము అనేక సర్పములగుంపులతో కూడియుండెను. ఆదిశేషుడు అలంబసునిమీదకు వచ్చెను. అప్పుడు అలంబసుడు గరుడరూపమును ధరించి శీఘ్రముగా యానాగసర్పములను మ్రింగివేసెను. ఆసమయమందు చిక్కుపడియున్న ఇలావంతుని కంఠమును అలంబసుడు కత్తిచేత నరికెను. ఇలావంతుడు క్రిందబడగా వానిముఖము పరిపూర్ణచంద్రునివలె ప్రకాశింపుచుండెను. అప్పుడు మధ్యాహ్న సమయమాయెనని సంజయుడు చెప్పగా ధృతరాష్ట్రుడిట్లనెను.

సంజయుడా! ఇలావంతుడు చచ్చినపిమ్మట పాండవులును వారిపక్షపు యోధవీరులును యేమిచేసిరో చెప్పుమని ధృతరాష్ట్రుడడుగగా సంజయుడిట్లనెను. ధృతరాష్ట్ర మహారాజా! తన తమ్ముడగు ఇలావంతుడు చచ్చుటకు ఘటోత్కచుడు కోపించుకొని మదపుటేనుగువలె కౌరవసైన్యములమీదకు వచ్చుచుండెను. ఆఘటోత్కచునియొక్క రాక్షసులందరును యేనుగులమీదనెక్కి యుద్ధమునకు ముందు మిగులుచుండిరి. ఆరాక్షసులు ప్రళయకాలమందుగల అగ్నివలెనుండిరి. ఆరాక్షసులు సింహనాదముచేయగా ఆశబ్దమునకు దిక్కులన్నియు ఎడకెను. ఘటోత్కచుడు తనచేతియందు శూలాయుధమునుధరించెను. ఆశూలాయుధపు కాంతులు శత్రువులకు భయమును గలిగింపుచుండెను. ఘటోత్కచుడు ఆశూలాయుధమును చేతియందు ధరించియుండగా శత్రుసైన్యమందలి యేనుగులను గుర్రములను భటులను గుదిగ్రుచ్చినట్లుగా యుద్ధమునకు వచ్చుచుండెను. ఆఘటోత్కచుని చూచి దుర్యోధనుడు వానిమీదకు యతిభయంకరముగ వెళ్లెను. అప్పుడు వంగదేశపురాజు అనేకములగు యేనుగులనుతీసికొని దుర్యోధనునకు సహాయముగా ఘటోత్కచునిమీదకు పోయెను. అప్పుడు ఘటోత్కచుడా యేనుగుల గుంపును చూచి సంతోషిం

కత్తిని తీసికొని ఆ యేనుగుల గుంపులోనికి ప్రవేశించెను. అంతట ఘటోత్కచుడు తనకత్తిచేత ఆ యేనుగుల గుంపును ఆశ్చర్యముగా నరికివేసెను. అప్పుడు దేవతలు ఘటోత్కచుని మెచ్చుకొనిరి. ఘటోత్కచునిచేత యేనుగులన్నియు చచ్చినందుకు దుర్యోధను డధికరోషవంతుడై యనుపబాణములచేత వానిని ముంచెను. ఘటోత్కచుని ముఖ్యసేనాపతులగు వేగవంతుడును, విద్యుజ్జిహ్వుడును, బహ్వాశియు యను ముగ్గురు రాక్షసులును దుర్యోధనునిచేత చచ్చిరి. యుద్ధప్రారంభమందే ఘటోత్కచుని దేహమందు దుర్యోధనుడు క్రూరబాణములను గ్రుచ్చెను. ఘటోత్కచుడు ధనుస్సును తీసికొని మిక్కిలి కోపముగలవాడై దుర్యోధనునిమీదకు పోయి యతనితో యిట్లనెను.

దుర్యోధనా! పాండవులు సత్యవంతులు, ధర్మాత్ములు, అట్టి పాండవులకు పూర్వము నీవు అపకారములను చేసి అవమానపరచితివి. ఇప్పు డందరును చూచుచుండగా ఆఫలమును నీకు నేను చూపెదను. అని యిట్లు ఘటోత్కచుడు దుర్యోధనుని దూషించి అతని దేహమందు కృష్ణసర్పమువంటి తీక్ష్ణమైన బాణములను నాటెను. ఆ బాణములకు దుర్యోధనుడు చలింపక యిరువదియైదు తీక్ష్ణబాణములను ఘటోత్కచుని దేహమందు నాటెను. ఘటోత్కచుడు కోపించుకొని యమధర్మరాజు నాలుకవంటి ఒక శక్తిని దుర్యోధనునిమీద వేయుటకు యెత్తెను. వంగదేశపురాజు దుర్యోధనునకు సహాయముగా అడ్డమువచ్చెను. అప్పుడు ఘటోత్కచుడు వంగదేశపురాజు యెక్కిన యేనుగును పడగొట్టెను. వంగదేశపురాజు క్రిందకు దూకెను. ఆ యేనుగు పడినవెంటనే అక్కడుండు కౌరవ సైన్యములన్నియు చెదరిపోయెను. దుర్యోధనుడు తనంతట తానే ధైర్యము తెచ్చుకొనుచు ఒక్కడే ఘటోత్కచుని యెదుట నిలిచి యుండెను. ఆసమయమున దుర్యోధనుడు ఒక గొప్ప ఆయుధమును ఘటోత్క

చునిమీాద వేసెను. ఆ ఆయుధము అధికముగా మండుచు వచ్చుచుం డెను. ఘటోత్కచుడు ఆ ఆయుధమును నడుమకు నరికి వేసెను. ఘటోత్కచుడు నాలుగు దిక్కులును పగులునట్లుగా సింహనాదము చేసెను. ఆ సింహనాదమును భీష్ముడు విని కౌరవయోధులగు ద్రోణా చార్యులను చూచి యిట్లనెను.

ద్రోణాదులారా! ఘటోత్కచుడు మిక్కిలి భయంకరముగా దుర్యోధనునితో యుద్ధము చేయుచున్నాడు. ఆ దుర్యోధనునియొక్క యేనుగులను చంపి దుర్యోధనునిమీాదకు మారివలె పోవుచున్నాడు. అష్టదిక్పాలకులైనను ఘటోత్కచుని గెలువజాలరు. మీారు శీఘ్రముగా దుర్యోధనునకు సహాయముగా వెళ్ళవలయును. అని కౌరవ సేనాపతి యగు భీష్ముడు చెప్పగా ద్రోణుడును, కృపాచార్యుడును. అశ్వత్థా మయు, చిత్రసేనుడును, బృహద్బలుడును, బాహ్లికుడును, అవంతీ దేశపురాజులగు విందానువిందులును భూరిశ్రవసుడును సైంధవుడును, సోమదత్తుడును, వివింశతియు, వికర్ణుడును. వీరందరును ఒక్కపెట్టున తమ సైన్యములను తీసికొని అనేక వేల రధికులతో రథములను తోలించుకొని వెళ్ళి దుర్యోధనునకు సహాయులైరి. వీరందరును ఘటోత్కచునిమీాదికి పోయిరి. ఘటోత్కచుడును రాక్షసబలము చేత పరాక్రమించి నిలచి ఆ రధికు లందరితో యుద్ధము చేసెను. ఆ రెండుపక్షములవారి సైన్యములును వొకటి కొకటి ముందుమిగిలి కలిసి యుద్ధము చేయుచుండెను. అప్పుడు ఘటోత్కచుడు ద్రోణుడు మొదలగు పండ్రెండు రధికులమీాదను అనేక విధములైన క్రూర బాణములను వేయుచుండెను. ఘటోత్కచునిచేత పన్నెండుమందిలో కొందరు సారధులు చచ్చిరి. కొందరి ధనుస్సులు విరిగెను. కొందరి రథములును గుఱ్ఱములును పడిపోయెను. కొందరి దేహములు నొచ్చెను.

# భీ ష్మ ప ర్వ ము

## ఘటోత్కచుడు ద్రోణాచార్య ప్రభృతులతో యు ద్ధ ము చే యు ట

ధృతరాష్ట్రమహారాజా! ఘటోత్కచుడు ఒక్కడే అతిరథ మహారథులగు ద్రోణాదులందరిని చిక్కుపరచెను. ద్రోణాదులగు పన్నెండుమంది రథికులును ఘటోత్కచునివలన నశించిన తమ సాధలములను మరల తయారుచేసికొని కోపముచేత వారందరును వొక్కపెట్టున ఘటోత్కచుని చుట్టుముట్టుకొని అతనిమీద గొప్ప బాణములను ప్రయోగించిరి. ఆబాణములన్నియు మంటలచేత ప్రకాశింపుచు ఘటోత్కచుని చుట్టుకొనెను. ఘటోత్కచుడు బాణములకు సహింపలేక ఆకాశమునకు యెగిరిపోయి పెద్దఉరుమువంటి కేక వేసెను. ఆ కేకను ధర్మరాజు విని భీమునితో యిట్లనెను. భీమా! ఇక్కడ భీష్మునకు కనబడిన పాంచాలదేశపు బలములను కాపాడవలయును. ద్రోణాదిరథికులకు కనబడిన ఘటోత్కచుని కాపాడవలయును. ఈ రెండుపనులను మనమిప్పుడవశ్యముగా చేయదగియున్నవి. ఇక్కడ పాంచాలబలములను రక్షించుటకును భీష్ముని యెదిరించుటకును అర్జునుడు కలడు. గనుక నీవు ఘటోత్కచుడున్నచోటికి వెళ్ళి ఆఘటోత్కచుని రక్షింపుము. శీఘ్రముగా వెళ్ళుమని ధర్మరాజు చెప్పగా భీముడు సింహనాదముచేయుచు శీఘ్రముగా వెళ్లుచుండెను. కౌరవసైన్యములప్పుడు సుడివలె గిరగిర తిరుగుచుండెను. దుర్యోధనుడు భీమున కడ్డుపడి అర్ధచంద్రునివలెనుండి బాణముచేత భీముని ధనుస్సును విరిచెను. దుర్యోధనుడు గర్వముచేత ఒకగొప్పబాణమును భీమునిరొమ్మునందు నాటెను. ఆ బాణము భీముని రొమ్మునందు దూరిపోయెను. ఆ దెబ్బకు భీముడు మూర్ఛిల్లెను. భీముడు మూర్ఛిల్లెనని ద్రౌపదీపుత్రులు తెలుసుకొని దుర్యోధనునిమీదకు పోయిరి.

ద్రౌపదీపుత్రులకు సహాయముగా అభిమన్యుడును ఘటోత్కచుడును వచ్చి కలిసిరి. వారందరును తమ తండ్రియగు భీముడు నొచ్చెనని మిక్కిలి కోపముగలవారై ఒక్కపెట్టున దుర్యోధనుని మీదకు పోయిరి. కృపాచార్యుడును బాహ్లీకుడు మొదలగు రథికులందరును ద్రౌపదీపుత్రులమీదకును అభిమన్యు ఘటోత్కచులమీదకు వచ్చిరి. ఆ రెండుపక్షములవారును యుద్ధము చేయుచుండిని. కొంతసేపటికి భీముడు మూర్ఛను తెలిసికొని మిక్కిలి క్రూరస్వభావముతో యుద్ధమునకు వచ్చుచుండెను. ద్రోణాచార్యుడు అధికమైన తీక్ష్ణబాణములచేత భీముని దేహమును రక్తమయముగా చేసెను. భీముడు కోపముగలవాడై ఒక యినుపబాణముచేత ద్రోణునికొట్టి మూర్ఛనుకలిగించెను. అశ్వత్థామయు దుర్యోధనుడును ద్రోణుడు మూర్ఛిల్లుటచూచి భీముని మీదకువచ్చిరి. భీముడు చిన్ననవ్వుగలవాడై గదాయుధము తీసికొని అతి భయంకరముగా రథమునుండి క్రిందకుదిగెను. ద్రోణుడు మూర్ఛను తెలిసికొని భీమునిమీదకు వచ్చుచుండెను. ద్రోణునకు సహాయముగా కృపాచార్యుడు మొదలగువారువచ్చిరి. అట్లువచ్చిన వారందరును భీమునిమీద తీక్ష్ణబాణములను ప్రయోగించిరి. ద్రౌపదీపుత్రులును ఘటోత్కచుడును అభిమన్యుడును ద్రోణాచార్య కృపాచార్యులు మొదలగు వారిమీద అనేక బాణసమూహములను ప్రయోగించి వారి గర్వమదములను అణచిరి. ఆ సమయమందు దశార్ణదేశపురాజు భీమునకు స్నేహితుడగు నీలుడను నాతడును వీరిద్దరును అశ్వత్థామను యెదిరించి నొప్పించిరి. ఘటోత్కచుడువచ్చి అశ్వత్థామను బాణములచేత అధికముగా మరల నొప్పించెను. ద్రోణాచార్యుడు అతిశీఘ్రముగా ప్రకాశమైన బాణములచేత ఘటోత్కచుని దేహమును నొప్పించెను. అప్పుడు ఘటోత్కచుడు కోపముగలవాడై మాయను కలిగించెను. ఈరీతిగా ఘటోత్కచుడు చేసిన

మాయచేత ద్రోణుడు మొదలగు పన్నెండుమంది రథికులును దుర్యో ధనుడును గొప్ప దెబ్బలచేత నొచ్చి తమ దేహములయందు రక్తము ప్రవహింపుచుండగా క్రిందవ్రాలిరి. ద్రోణాదులందరును చచ్చి భూమి మీద పడినట్లుగా కౌరవసైన్యములు తలచెను. అట్లు తలచి కౌరవ సైన్యములన్నియు చెదరి పాయలుపాయలుగా పరుగెత్తుచుండెను. భీష్ముడు పరుగెత్తు కౌరవసైన్యములను ఆపి ఆ సైన్యములతో పెద్ద కంఠధ్వని చేయుచు యిట్లనెను. కౌరవసైనికులారా! మీకు యిప్పుడు కనబడిన దంతయు రాక్షసులమాయ. మీకుతోచిన దంతయు అస త్యము, అబద్ధము, కల్ల, మాయసుమీ. అని భీష్ముడెంతగా చెప్పి నను అ కౌరవసైన్యములు భయపడి నమ్మకుండెను. కౌరవసైన్యము లన్నియు పారిపోగా దుర్యోధనుడు దీనుడై భీష్మునిదగ్గరకు వచ్చి యిట్లనెను.

భీష్మా! నీవును ద్రోణాచార్యుడును నాకు సహాయులై యుండగా నేను శత్రువులచేత కష్టపడితిని. ఇక నేను పాండవులతో యుద్ధము చేసి మరణమునైనను, విజయమునైనను పొందగలను. అని దుర్యో ధనుడు భీష్మునితో చెప్పగా భీష్ముడు నవ్వి దుర్యోధనునితో యిట్లనెను. దుర్యోధనా! పాండవులతో యుద్ధము చేయువారు పాండవులయంతటి సమర్థులై యుండవలెనుగాని నీవు పాండవులతో యుద్ధము చేయ జాలవు. ఇప్పుడు కౌరవసైన్యము లన్నియు ఘటోత్కచుని మాయకు భయపడి పారిపోయినవి కాని వేరొకటికాదు. ఇటువంటి కష్టసమ యములందు కాపాడుటకు మావంటివారు కావలయునుగదా! నీవు ధైర్యమును వహింపుము. అని భీష్ముడు దుర్యోధనునితో చెప్పి సమీప మందుండు భగదత్తునితో యిట్లనెను. భగదత్తుడా! రాక్షసులు చేయు మాయలు నిన్ను పొందజాలవు. ఆరాక్షసులను నీవు గెలువ గలవు. ఇప్పుడే యీ దుర్యోధనుడు నిన్నుజూచి మెచ్చునట్లుగా నీ

సైన్యమును తీసికొనివెళ్ళి ఘటోత్కచుని గెలువుము. అని భీష్ముడు భగదత్తునితో చెప్పగా ఆ భగదత్తుడు మంచి మొనగాడగుటవలన భీష్మునిమాటకు పుష్పొంగి సింహము అరచినట్లు అరచెను. ఆ భగదత్తుడు సుప్రతీకమను పేరుగల తనయేనుగమీద యెక్కి తనసైన్యమును తీసికొని పాండవసైన్యముమీదకు పోయెను. అపుడు పోయిన కౌరవసైన్యము లన్నియు భీష్ముడుచెప్పిన మాటలు నిశ్చయమని తలచి మరలి యుద్ధమునకువచ్చెను ఆకౌరవపాండవుల రెండుపక్షములు సైన్యములును చేరి సంకులయుద్ధము చేయుటకు ప్రారంభించెను. ఆ సమయమునకు మూడుజాములాయెను. అప్పుడు ఘటోత్కచుడు పెద్ద కొండవంటి యేనుగుమీద యెక్కి తన రాక్షససైన్యముతో ఆభగదత్తునిమీదకు వెళ్లెను. ఆసమయమందు భీముడు శీఘ్రగమనముతో రథమునందుండి ప్రకాశింపుచు తానును ద్రౌపదీపుత్రులును అభిమన్యుడు మొదలగువారును ఘటోత్కచునకు సహాయముగా నడిచిరి. భీమాదులందరును భగదత్తుని చుట్టుకొని అతని యేనుగుమీద అనేక తీక్ష్ణబాణములను వేసిరి. ఆదెబ్బలచేత భగదత్తుని యేనుగుదేహమందు రక్తధారలు కారుచుండెను. ఆ రక్తధారలచేత భగదత్తుని యేనుగు సెలయేరులచేత పర్వతము ప్రకాశించినట్లు అధికముగా ప్రకాశింపుచుండెను. ఘటోత్కచుడు ప్రళయకాలరుద్రునివంటి ఆకారముగలవాడై శూలాయుధమును వేసెను. భగదత్తుడు శీఘ్రముగా ఒకబాణముచేత ఆశూలాయుధమును పొడిపొడి యగునట్లుగా నరికివేసెను. భగదత్తుడు తన సుప్రతీకమను యేనుగును తోలి భీమునిగుఱ్ఱములను చంపి అభిమన్యుడు మొదలగువారియొక్క రథములను గుఱ్ఱములను భటులను పడగొట్టెను. మరియు భగదత్తుడు అభిమన్యుడు మొదలగు పాండయోధులమీద బాణవర్షమును కురిపించెను.

భగదత్తుని మదపుటేనుగు మహాసముద్రములో తిరిగినమందర పర్వతము వలె పాండవసైన్యములలో తిరిగి అనేక యేనుగులను చంపి వేసెను. ఆసమయమున దశార్ణదేశపురాజు కోపించుకొని తన క్రూరమగు మదపుటేనుగును భగదత్తునిమీదకు త్రోలెను. భగదత్తుడు ప్రకాశమానము లగు తోమరాయుధములను ఆ యేనుగుమీద వేయగా ఆ దెబ్బలకు దశార్ణదేశపు రాజుయొక్క యేనుగు చలించి వెనుకకు మరలెను. ఈరీతిగా భగదత్తుడు యుద్ధము చేయుచుండెను. దుర్యోధనుడు గర్వించి ద్రోణకృపాచార్యులు మొదలగు తమ యోధులను తీసికొని పాండవసైన్యములను తరిమెను. ఆసమయమందు కౌరవసైన్యములో అధికమైన ధ్వనికలిగెను. ధర్మరాజు ద్రుపదుని ముందుపెట్టుకుని తమ సైన్యములకు వుత్సాహధైర్యములను కలిగించెను. ఆసమయమున అర్జునుడు తన ధనుస్సుయొక్క అల్లెత్రాటిని ధ్వనింపజేయుచు శంఖమును వూదుచు ఆకాశము పగులునట్లుగా ధ్వని కలిగింపుచు అనేక బాణములచేత కౌరవసైన్యముల గర్వమును పోగొట్టెను.

## అర్జును డిలావంతుడు చచ్చుటను భీమునిచే విని దుఃఖించుట

ధృతరాష్ట్ర మహారాజా! ఆసమయమున భీముడు అర్జునుని దగ్గరకు పోయి తిన్నగా యిట్లనెను. అర్జునా! నీకుమారుడగు యిలావంతుడు యుద్ధమందు చచ్చిపడియున్నాడు. అని భీముడు చెప్పగా అర్జునుని తీసికొనిపోయి యిలావంతుని కళేబరమును చూపెను. అర్జునుడు యిలావంతుని కళేబరమును చూచెను ఇలావంతుని దేహము అలంబసునిచేత నరుకబడియుండెను. ఆయిలావంతుని కళేబరమును అర్జునుడు చూచి యిట్లు దుఃఖించెను. పుత్రుడా! నీసౌంద

ర్యము, నీలావు, నీచాతుర్యము, నీబలము, నీసాహసము, నిష్ఠు నీచక్క దనము, యేరాజపుత్రునకును లేదుగదరా! నీవంటివానిని టవ యిశః నేను యేలోకమందును చూడజాలను, లేచిరావేమిరా! అఃఆ అర్జు నుడు దుఃఖపుమాటలను చెప్పి అంతట నిలువక గొప్పదైనపుత్ర దుఃఖము చేత కన్నులయందు నీళ్ళుకార్చుచు దుర్యోధనుని అవివేకముమవలన యీయుద్ధము సంభవించినదనియు, ధర్మరాజు సందిగోరినప్పటికిని దుర్యో ధనుడు న్యాయముతప్పి యుద్ధమునకు ప్రయత్నించెననియు, రెండవ తోమును యుద్ధముచేయవలసి వచ్చెననియు, అర్జునుడు తలచుచు, మనసుచేత దుర్యోధనుని తిట్టుచు, ధర్మరాజును స్తుతించుచు రోయుచుండెను. అర్జునుడు పుత్రదుఃఖాగ్ని చేత మనస్సునందు పరితపించు చుండెను. కృష్ణుడు అర్జునుని జూచి చిన్నినవ్వునవ్వెను. అర్జునుడు కృష్ణునినవ్వు చూచి దుఃఖము విడిచి కృష్ణునితో యిట్లనెను.

కృష్ణా! దుఃఖింపరాదని. యిదివరకే నీవలన వింటిని. ఇపుడు దుఃఖమును విడిచితిని. ఇకను కౌరవసైన్యములను చంపుటకు రథ మును త్రోలుము. అని అర్జునుడు చెప్పగా కృష్ణుడు శీఘ్రముగా కౌరవసైన్యములమీదకు రథమును త్రోలెను. ఆసమయమం దర్జు నుడు శక్తివంతములైన అనేక బాణసమూహములను కౌరవసైన్యము మీాద ప్రయోగించెను. భగదత్తుడును కృపాచార్యుడును సుశర్మడును భీష్మునితో గూడుకొని అర్జునుని యెదిరించిరి. సాత్యకి అర్జునునకు సహాయముగా వచ్చునపుడు కృతవర్మడును, బాహ్లీకుడును సాత్యకిని యెదిరించిరి. భీమునకు ద్రోణాచార్యు డడ్డుపడెను. ఆ ద్రోణుని ఆధా రము చేసికొని నీ పుత్రులు ఆ భీముని కొట్టుటకు ప్రారంభించిరి. భీముడు తన నేర్పరితనముచేత ద్రోణాచార్యుని బాణములను మర లించుచు, నీ పుత్రులమీాద బాణవర్షమును కురిపించుచు నీ పుత్రులు వేయు బాణములకు భయపడక యుద్ధక్రీడను నడుపుచుండెను. ధృత

రాష్ట్రమహారాజా ! నీ పుత్రులువేయు బాణములచేత భీముఁడునొచ్చి నేయిపోసిన అగ్నిహోత్రమువలె కోపముచేత మండిపడుచుండెను. భీముడు కోపముతో తన ధనుర్విద్యా నేర్పరితనముచేత నీ కుమారులను 1 కుండభేదిని 2 అనాధృష్టుని 3 కనకధ్వజుని 4 సుబాహుని 5 దీర్ఘలోచనుని యీ అయిదుగురిని చంపివేసెను. తక్కిన వారందరును భయపడి పారిపోయిరి. గొర్రెలమందను తరిమెడు తోడేలువలె భీముడు కౌరవులను తరుముచు, బాహుబలముచేత ప్రకాశింపుచుండెను ఆసమయమున సూర్యుడుఅస్తమగుచుండెను. దుర్యోధనుడు అనేక రథికులను పురికొల్పికొని ధైర్యముచేత పాండవసైన్యము మీదకు పంపించెను. పాండవసైన్యములును అధికోత్సాహముచేత కలియబడెను. అప్పుడు జరిగిన యుద్ధముచేత భూమియంతయు రక్తమయముగానుండెను. ఆ యుద్ధభూమి ఆభరణముల తునుకలుచేతను, శరీరముల తుండ్లచేతను, బాణముల తునకలచేతను మిక్కిలిగా ప్రకాశింపుచుండెను. ఆ యుద్ధభూమి దట్టముగా కుంకుమచేత పూయబడి నానావిధాభరణములను ధరించిన స్త్రీవలె ప్రకాశింపుచుండెను. పిమ్మట సూర్యాస్తమయ మయినంతన చీకట్లు గలిగెను. అంతట పాండవసైన్యములును కౌరవసైన్యములును యుద్ధము చాలించి తమ తమ శిబిరములకు వెళ్ళిరి. యెనిమిదవనాడు రాత్రియందు దుర్యోధను డధికముగా దుఃఖించుచు. తన శిబిరమందు కల్పించబడిన నగరునందు ప్రవేశించి దుశ్శాసనునితో యిట్లనెను.

దుశ్శాసనా ! శకునిని కర్ణుని యిప్పుడు వెళ్ళి శీఘ్రముగా పిలిచికొని రమ్మని దుర్యోధనుడు చెప్పగా దుశ్శాసనుడు వెళ్ళి శకుని కర్ణులను పిలుచుకొని వచ్చెను. దుర్యోధనుడు రహస్యప్రదేశమందు శకుని కర్ణ దుశ్శాసనులతో యిట్లనెను. శకుని కర్ణులారా ! భీష్మ ద్రోణ కృపాచార్య అశ్వత్థామలు యీ నలుగురును మధ్యస్థు

లుగా వుందు రేగాని పాండవబలములను చంపుటకు యిష్టపడరు. మన కౌరవసైన్యములు నానాటికి బలహీనములై చచ్చుచున్నవి. యేమిచేయవలయునో తెలియలేదు. ఇందుకు ఆలోచనను చెప్పుడు: అని దుర్యోధను డడుగగా ఆమాటలను కర్ణుడు విని యుద్ధము చేయుటయందుగల అపేక్షచేత దుర్యోధనునితో యిట్లనెను. దుర్యోధన మహారాజా! ఇక భీష్ముని యుద్ధమునకు రప్పింపకుండుము. నేను నా భుజాబలమువలన యుద్ధముచేసి పాండవులయొక్కయు వారిసైన్యముల యొక్కయు పొగరడగించెదను. అని యిట్లు కర్ణుడు ఆలోచనను చెప్పగా దుర్యోధను డామాటను విని దుశ్శాసనునితో యిట్లనెను. దుశ్శాసనా! ఇప్పుడు మనము భీష్మునిదగ్గరకు వెళ్ళి యిక భీష్ముని యుద్ధము చేయవద్దని చెప్పివత్తము అని దుశ్శాసనునితో చెప్పి శకుని కర్ణులను వారి నివాసములకు పంపించెను. దుర్యోధన మహారాజు నానావిధములైన సుగంధములతో గూడిన జలములయందు స్నానము చేసి మంచి శ్రేష్ఠమైన సువాసనగల చందనమును పూసికొనెను. చీని చీనాంబరములను కట్టుకొని మనోహరములైన పుష్పమాలల చేతను, ఆభరణములచేతను నవరత్నములచేతను అలంకరించబడెను. దుర్యోధనుడు భీష్ముడున్న శిబిరగృహమునకు వచ్చుచుండెను. దుర్యోధనుడు వెంబడి అతని తమ్ములును మరికొందరు తగినవారును వచ్చుచుండిరి. మంచి సువాసనగల క్రొత్తచమురుచేత అనేక వేల దివిటీలు వేయబడెను. అంత ప్రకాశముగా వెళ్ళుచున్నపుడు చేతుల యందు బెత్తములు పట్టుకొని కొందరు పరిచారకులు మార్గమందు తొలగుడని సందడిచేయుచు వెళ్ళిరి. వందిజనులు కీర్తనలు చేయుచుండిరి. (వందిజనులనగా భట్టుజనులు) భట్రాజులు మనోహరములుగా పాడుచుండిరి. పాఠకులు మాధుర్యధ్వనులచేత మనస్సు సంతోషపెట్టుచుండిరి. ఆసమయమున దుర్యోధనుడు నవరత్నమయ

ఎన రథముమీాద కూర్చుండి తిన్నగా భీష్ముడున్న శిబిరగృహము
స వెళ్లుచుండెను. ఆ గృహద్వారముదగ్గిర దుర్యోధనుడు దిగి
శ్శాసనుని ముందేతిని తన అరచేతితో పట్టుకొని తిన్నగా పక్షిచి
కురీతిని భీష్ముడున్న గృహములోనికి ప్రవేశించెను. దుర్యోధనుడు
ష్ముని పాదములకు నమస్కారములు చేసి భీష్ముని పీఠమునకు సమీాప
ఎనగల ఒక బంగారు పీఠమందు కూర్చుండి భీష్మునితో యిట్లు
నెను.

మహాత్మా ! భీష్మా ! యింతకుమునుపు నిన్ను నేను నమ్మి
యుండి పాండవులను, వారి బలములను లక్ష్యపెట్టక యుంటిని. నీవు
యుద్ధముచేయు పద్ధతు లనేకములు చూచితిని. నీవు పాండవుల దగ్గ
కు పోయి ఆ పాండవులకు మేలుగలిగించుచుందువుగాని ఆ పాండ
లను నొప్పించవు. ఆ పాండవులను చంపక వారినిపట్టుకొని పాలు
సి పెంచునట్లు రక్షించెదవు. నీవిషయమై వేరొకమాటను మాటాడ
లను. ముఖ్యమైన మాటను చెప్పెదను వినుము. ఇకను నీవు
యుద్ధమును చాలింపుము. తాతా! భీష్మా! దేవరాక్షసు లందరును
కక్కసారివచ్చి మీాదపడినను, నిన్ను జయింపలేరు. ఇప్పటికి యెని
ఎది దినములనుంచి యుద్ధము చేయుచుంటివి. ఈ యెనిమిది దినముల
ంచి అర్జునుని చంపలేదు. నొప్పింపలేదు. ఆ విషయము అట్లుండ
మ్ము. నే నొకవిషయమును ప్రార్థించెదను. అది చక్కచేయుము.
ంతవఱకు జరిగినవిషయమును నామీాదవిడిచి యిక యుద్ధము చేయు
కు కర్ణుని పంపవే యని దుర్యోధనుడు భీష్మునితో చెప్పెను.
ఆమాట బాణమై భీష్ముని మనస్సునందు గ్రుచ్చుకొనిన ట్లుండెను.
ష్ముడు మిక్కిలి కోపముగలవాడై తలవంచుకొని యేమాటయు
చెప్పక మౌనముదాల్చి యుండెను. కొంతసేపటికి భీష్ముడు నిట్టూర్పు
డుచుచు ముఖమును యెత్తి దుర్యోధనుని చూచి యిట్లనెను.

దుర్యోధనా ! నీపక్షమందు నేను నిలిచియుండి ప్రాణములను దాచక నాశక్తికొలది యుద్ధము చేయుచుంటిని. అట్లు చేయుచున్న వానిని యీ రీతిగా మాటలాడవచ్చునా? అయ్యో ! నావలన కలిగిన భక్తియంతయు భస్మమైపోవు నట్లుగా మాటలాడితివి. అని యిట్లు భీష్ముడు దుర్యోధనునితో చెప్పి కోపించుకొని మరల యిట్లనెను.

దుర్యోధనా ! పూర్వము అర్జునుడు దేవసైన్యములతో కూడుకొని వచ్చి దేవేంద్రుని గెలిచి ఖాండవవనమును దహింప జేసెను. అర్జునుడు శివునితో ఘోరముగా యుద్ధముచేసి శివుని మెప్పించి ఆ శివునిచేతను సకలదేవతలచేతను అనేక దివ్యాస్త్రము లను పొందియున్నాడు. ద్వైతవనమందు నిన్ను గంధర్వులు పట్టు కొని వెళ్ళినప్పుడు నీ తమ్ములగు దుశ్శాసనాదులును కర్ణుడును ఆ గంధర్వులచేత నోడిపోయిరి. అర్జును డొక్కడే వచ్చి గంధర్వుల నందరిని జయించి నిన్ను విడిపించెను. అర్జునుడు ఉత్తరగోగ్రహణ కాలమందు నిన్నును నన్నును ద్రోణుని అశ్వత్థామను కృపాచార్య కర్ణులను అందరిని గెలిచి ఒక్క అర్జునుడే విరాటునియొక్క గోవు లను తోలుకొని పోయెను. ఆ అర్జును డనేకస్థలములయం దనేక మార్లు యెవరెవరిని యేమిచేసెనో అది యంతయు మనము విని యున్నాము. అట్టి మొనగాడగు అర్జునితో యిన్నాళ్ళు నేను పోరాడియు తుదకు నీచేత కఠినపు మాటను పడవలసి వచ్చెను.

దుర్యోధనా ! తగని పనియని తలచక నీవు పాండవులతో విరోధమును పెట్టుకుంటివి. ఆ పాండవులను దేవతలైనను జయింప జాలరు. ఇకను నీవు యుద్ధమందు చచ్చిన మొగతనమును చూపుము. వ్యర్థములైన మాటలవలన ప్రయోజనములేదు. అని యిట్లు భీష్ముడు కోపించుకొని దుర్యోధనునితో చెప్పెను. దుర్యోధనా ! అర్జునుని

నేను గెలువజాలననియు, నేను శిఖండిని చంపననియు, వీరిద్దరు తప్ప తక్కినవారు నాకెదుటబడిన యెడల చీల్చి చెండాడుదుననియు, యిదివరకే నీతో చెప్పియున్నాను. నేను నా సైన్యమును తీసికొని పోయి పాండవుల పక్షముగానుండు ద్రుపదుని సైన్యములతో విరాటుని సైన్యములతో యాదవ సైన్యములతో యుద్ధము చేసెదను. మీరందరును పాండవులను గెలుచుటకు వెళ్ళుడు. అర్ధరాత్రి కాలమందు వచ్చి నా మనస్సు బాధపడునట్లు మాటలాడితివి. ఇట్లు మాటలాడుటచేత జయము కలుగునా ? రేపటిదినము నీవు యుద్ధమునకు బయలుదేరి రమ్ము. నా భుజబల పరాక్రమములను చూడుము. వేయిమాటలను చెప్పుటచేత ప్రయోజనములేదు. అని భీష్ముడు చెప్పగా ఆమాటలకు దుర్యోధనుడు సంతోషించి తన నివాసమునకు వెళ్ళి సుఖముగా నిద్రించెను.

## తొమ్మిదవనాటి యుద్ధము

అంతట తొమ్మిదవనాటి వుదయకాలమందు దుర్యోధనుడు నిద్రలేచి దేహ ముప్పొంగుచుండగా యుద్ధప్రయత్నము చేసెను. ధృతరాష్ట్రమహారాజా! యీ ప్రకారముగా యుద్ధసన్నద్ధుడై సైన్యములను తీసికొని బయలుదేరి భీష్మునిజూచి తమ పక్షమందుండు రాజసమూహములతో యిట్లనెను. రాజులారా ! యీ భీష్ముడు పాంచాలురసైన్యములు మొదలగు పాండవులసైన్యములను చంపుదుననియు యుద్ధమందు పాండవులను గెలుతుననియు గడచిన రాత్రియందు నాతో చెప్పియున్నాడు. గనుక యీ దినమందు మన బలపరాక్రమములను చూపి పాండవసైన్యములను తరుమవలెను. అని దుర్యోధనుడు రాజులతో చెప్పగా ఆతులువమాటలను భీష్ముడు వినికోపము, సిగ్గు, దుఃఖము, యీ మూడుగుణములుగలవాడై యధికముగా దుఃఖమనస్సుగల

వాడాయెను. భీష్ముడు తనకు తానే శాంతగుణమును పొందియుండెను. భీష్ముడు శాంతుడాయెనని దుర్యోధనుడు తెలిసికొని భీష్ముని చూచుచు దుశ్శాసనునితో యిట్లనెను. దుశ్శాసనా! మనమందరము మన తాతయగు భీష్మునిదగ్గర నే యుందము. ఈ భీష్మునిముందర యిరువది రెండు వేల రథికులనుంచవలయునని దుర్యోధనుడు నియమించగా ఆప్రకారము దుశ్శాసనుడు యిరువది రెండు వేల రథికులను తెచ్చి భీష్మునిముందర నిలిపెను. దుర్యోధనుడు, ద్రోణాచార్య, కృపాచార్య, అశ్వత్థామలను చూచి భీష్ముని జూపి వారితో నిట్లనెను. ద్రోణాదులారా! భీష్ముడు సత్యమైన వ్రతనిష్ఠగలవాడు. భీష్ముడు శిఖండి విషయమై మన కిదివరకే చెప్పియున్నాడు. గనుక ఆనీచుడగు శిఖండికి భీష్ముడు కనబడకుండునట్లుగా భీష్ముని మనము రక్షించుకొనవలయును. అని దుర్యోధనుడు చెప్పగా ద్రోణాదులు అట్లుచేయుదమని దుర్యోధనునితో చెప్పిరి. భీష్ముడు కౌరవసైన్యములకు సర్వతోభద్రమను వ్యూహమును యేర్పరచెను. (నలుప్రక్కల నడవలు, వాకిళ్లు గల నలుచదరమగు యిల్లు సర్వతోభద్ర మనబడును.) ఆసర్వతోభద్ర వ్యూహమందు కృపాచార్యుడును, కృతవర్మయు, శల్యుడును, శకునియు, సుదక్షిణుడును, సైంధవుడును, దుర్యోధనునితమ్ములును, భీష్ముడును ముందుతట్టు నిలిచియుండిరి. ద్రోణాచార్యుడును, భూరిశ్రవుడును, భగదత్తుడును, వ్యూహమునకు కుడిప్రక్క నిలిచిరి. సోమదత్తుడుడు, అశ్వత్థామయు, అవంతీదేశపురాజులగు విందానువిందులును యెడమప్రక్క నిలిచియుండిరి. హలాయుధుడను రాక్షసుడును అలంబసుడును శ్రుతాయువును యీముగ్గురును వ్యూహమునకు వెనుక ప్రక్క నిలిచిరి. దుర్యోధనుడు సుశర్మ మొదలగు త్రిగర్త దేశపు రాజసమూహముతో గూడుకొని ఆవ్యూహమునకు నడుమ నుండెను. ఈ ప్రకారముగా కౌరవ సైన్యములకు భీష్ముడు సర్వతోభద్రమను

వ్యూహమును యేర్పరచెను. అంతకుమునుపే పాండవులు తమ సైన్యములను తీసికొని బయలుదేరి యుద్ధమునకు వచ్చిరి. ఆసమయమం దర్జునుడు మనకౌరవవ్యూహమును చూచి తమసేనాపతితో "ధృష్టద్యుమ్నా! కౌరవ వ్యూహమందుండు భీష్ముని చూచితివిగదా! భీష్ముని కెదురుగా శిఖండిని నిలుపుము. ఈశిఖండిని చుట్టుకొనియుండి మన మాతనిని రక్షింతము. ఈరీతిగా మనసైన్యములను ఒక వ్యూహముగా యేర్పరపు" మని అర్జునుడు చెప్పగా ధృష్టద్యుమ్నుడట్లే చేసెదనని చెప్పివెళ్ళి పాండవసైన్యముల నన్నిటిని ఒకవ్యూహముగా నిలిపెను. పాండవుల వ్యూహమునకు సాత్యకియు విరాటుడును కుడిప్రక్కన నిలిచి యుండిరి. అభిమన్యుడును ద్రుపదుడు మొదలగు పాంచాలదేశపురాజులును కేకయదేశపురాజులును, వ్యూహమునకు యెడమప్రక్క నిలిచిరి. ధర్మరాజు, నకుల, సహదేవ, ద్రౌపదీపుత్రులను ముందుంచుకొని ఆవ్యూహమునకు నడుమనుండెను. చేకితానుడును, కుంతిభోజుడును వ్యూహమునకు వెనుక ప్రక్కనుండిరి. వ్యూహమునకు ముందు శిఖండినుంచి శిఖండియొక్క రెండుప్రక్కలయందును సమీపముగా భీమసేనుడును, ఘటోత్కచుడును ఒకప్రక్కనుండిరి. అర్జునుడును ధృష్టద్యుమ్నుడును శిఖండికి సమీపముగా మరియొక్క ప్రక్కనుండిరి. తక్కిన పాండవ రథికవీరులును వ్యూహమందు కలియజేర్చి గట్టివ్యూహముగా ధృష్టద్యుమ్నుడేర్పరచెను. ఇట్లు పాండవులును దృఢవ్యూహమును యేర్పరచుకొని యుద్ధసన్నద్ధులై యుండిరి. ఆ రెండుపక్షముల సైన్యములయందును భేరీమొదలగు అనేక వాద్యధ్వనులు మిక్కిలి యధికముగా మ్రోగుచుండెను. ఆకౌరవపాండవసైన్యములు రెండును ఒకటొకటి తాకి యుద్ధమునకవిసెను. ధృతరాష్ట్ర మహారాజా! ఆసమయమం దభిమన్యుడు గోరోచనమువంటి వర్ణముగలగుర్రములచేత ప్రకాశించురథమునందు

కూర్చుండి గర్జించి వుప్పొంగి మన కౌరవసైన్యముమీదకు వచ్చెను. అగ్నిహోత్రము దూదిని దహించువిధముగా అభిమన్యుడు కౌరవసైన్యమును చంపుటకు ప్రయత్నించెను. అభిమన్యు డప్పుడు మెఱుపు మెఱసినట్లు మెఱయుచు కౌరవసైన్యములతో గుండ్రముగా కొఱవి త్రిప్పినట్లు తిరుగుచు ద్రోణాచార్య, సైంధవులు మొదలగు యోధవీరులందరికిని ఆశ్చర్యమును కలిగించుచుండెను. అప్పు డధిక ధ్వనిచేత తరుమబడు మహాసముద్రమువలె కౌరవసేనయంతయు కలకపారుచుండెను. ఇట్లు యెదురులేక యభిమన్యుడు కౌరవసైన్యములసు తరుముచుండెను. ఆయభిమన్యుని దుర్యోధనుడు చూచి అలంబసునితో యిట్లనెను.

మిత్రుడా! అలంబసుడా! అభిమన్యుడు రెండవ అర్జునునివలె మన సైన్యములను చెదరగొట్టుచు తరుముచున్నాడు అభిమన్యునకు నీవేమందు. అతనిని యెదిరించుటకు శీకంటెమందు మరియొకటి కనబడలేదు. మేమందరము పాండవులకు అడ్డుపడి యుద్ధము చేయుచుండెదము. నీవు వెళ్ళి అభిమన్యుని చంపుము. అని దుర్యోధనుడు చెప్పగా అలంబసుడు తన రాక్షససైన్యమును ముందు అభిమన్యుని మీదకు పంపించెను. పెద్దగాలిచేత పండుటాకులు రాలినట్లు పాండవులసైన్యములు భయముచేత బెదరెను. ధృతరాష్ట్ర మహారాజా! ఆసమయమున రాక్షససైన్యములకు ద్రౌపదీపుత్రులు అడ్డుపడి రాక్షసులను చంపి కుప్పలుకుప్పలుగా పడవేసిరి. అలంబసుడు కోపించుకొని బాణములచేత ద్రౌపదీపుత్రులను కప్పబడునట్లు చేసెను. ద్రౌపదీపుత్రులు అయిదుగురును అఖండ పరాక్రమవంతులై అలంబసుని మూర్ఛిల్లునట్లు గొట్టి సింహనాదమును చేసిరి. అలంబసుడు త్రాలి తన రథముయొక్క నొగను ఆధారముగా పట్టుకొని లేచి ప్రళయకాల యమధర్మరాజువలె మండిపడుచు, కండ్లయందు

నిప్పులు రాల్చుచు ద్రౌపదీపుత్రులయొక్క అయిదుగురి టెక్కెము లను నరికివేసి అయిదు ధనస్సులను విరిచెను.

## అలంబసుడు దుర్యోధనప్రేరితుడై యభిమన్యునిపై గవియుట

అంతట అలంబస రాక్షసుడు ద్రౌపదీపుత్రులలో ఒక్కొకని మీద అయిదేసి క్రూర బాణములను వేసి నొప్పించి సంతోషించు చుండెను. ద్రౌపదీపుత్రులు నొచ్చి బాధగలిగియుండిరి. తన తమ్ము లగు ద్రౌపదీపుత్రులు నొచ్చుటను అభిమన్యుడు చూచి అలంబసుని మీదకు వచ్చెను. అట్లు వచ్చుటకు రెండు సైన్యముల వారును, అలంబసుడు అధిక మాయావంతుడనియు అభిమన్యుడు దివ్యాస్త్రము లను తెలిసినవాడనియు వీరి యుద్ధ మెట్లగునో యనియు తలచుచుం డిరి. ఆసమయమున అలంబస అభిమన్యు లిద్దరును వృత్రాసుర దేవేంద్రులవలె భయంకరముగా యుద్ధము చేసిరి. ఒకరొకరి బాణ ముల దెబ్బలచేత వారిద్దరి దేహములును రక్తమయములై గైరికాది ధాతువులచేత ప్రకాశించెడి పర్వతములవలె నుండెను.

అప్పుడు అలంబసుడు తన మాయచేత పెనుచీకటిని కలిగిం చెను. అభిమన్యుడు సూర్య బాణమును ప్రయోగించి చీకటిని పోగొట్టి వెలుతురు కలిగించెను! అప్పుడు దేవతలు మెచ్చుకొనిరి. అటుపిమ్మట అలంబసు డనేక విధములైన మాయలను కలిగించెను. అభిమన్యుడు దివ్యాస్త్రములచేత ఆ మాయాకార్యముల నన్నిటిని పోగొట్టెను, అభిమన్యుడు తీక్ష్ణ బాణములచేత అలంబసుని నొప్పించెను. అలంబస రాక్షసుడు రథము దిగి వడిగా పారిపోయెను, అలంబసుడు పారి పోయిన పిమ్మట అభిమన్యు డధికోత్సాహముగలవాడై కౌరవసైన్య ములమీదకు వచ్చుచుండెను. కౌరవసైన్యము అభిమన్యుని జూచి భయపడి చిక్కుపడి నాలుగు దిక్కులకు పరుగెత్తిపోయెను, ఆసమ

యమందు భీష్ము డనేక రధికులను వెంటతీసికొని అభిమన్యునిమీదకు వచ్చెను. వారికి అభిమన్యుడు భయపడక అందరికి అన్నిరూపులుగా యుద్ధము చేయుచుండెను. అర్జునుడు శీఘ్రముగా భీష్మునిమీదకు వచ్చెను. అంతట కౌరవసైన్యములు పొంగివచ్చి అర్జునుని చుట్టు కొనెను. పాండవసైన్యములు పొంగివచ్చి భీష్ముని చుట్టుకొనెను. ఆ రెండుపక్షముల సైన్యములకును సంకులయుద్ధము జరిగెను, ఆ సమయమందు కృపాచార్యు డభిమన్యునిమీదకు వచ్చుచుండగా సాత్యకి కృపాచార్యుని యెదిరించి పిడుగులవంటి యినుప బాణములను వేసెను. ఆబాణముల నన్నిటిని అశ్వత్థామ నరికివేసి సాత్యకియొక్క ధనుస్సును విరిచెను, సాత్యకి కోపించుకొని మరియొక ధనస్సుచేత క్రూరబాణమును అశ్వత్థామ దేహమందు గ్రుచ్చెను.

అదెబ్బచేత అశ్వత్థామ మూర్ఛిల్లి వ్రాలి తన టెక్కెపు స్తంభమును పట్టుకొనెను. ఆ వెంటనే అశ్వత్థామ మూర్ఛను తెలిసి కొని ఒక ప్రకాశమైన బాణమును సాత్యకియొక్క రొమ్మునందు గ్రుచ్చి అతని టెక్కెమును విరుగగొట్టి ఆకాశము వడకునట్లుగా సింహానాదము చేసెను. అందుకు సాత్యకి కోపించుకొని మిక్కిలి క్రూరములగు అనేక యినుపబాణములను అశ్వత్థామమీద ప్రయోగించెను. ఆబాణము లన్నియు అశ్వత్థామను చుట్టుకొనగా అశ్వత్థామ రాహుగ్రస్తుడైన సూర్యునివలె చిక్కుపడి యుండెను. తన పుత్రుడగు అశ్వత్థామను కాపాడుటకై ద్రోణాచార్యు డతి భయంకరముగా సాత్యకిమీదకు వచ్చుచుండెను. అర్జునుడు ద్రోణాచార్యునకు అడ్డుపడి యెదిరించెను. అని సంజయుడు చెప్పగా ధృతరాష్ట్రు డిట్లనెను, సంజయుడా! ద్రోణాచార్యుడు తన మనస్సును అర్జునునికి యిచ్చినవాడు. అర్జునుడు ద్రోణాచార్యుని జూచి మిక్కిలి భక్తిగా నుండును. అట్టి గురుశిష్యులగు ద్రోణార్జును లిద్దరును

యేరీతిగా యుద్ధముచేసిరో నేను వినవలయును. వారి యుద్ధము స్పష్టముగా నాకు చెప్పుము. అని ధృతరాష్ట్రు డడుగగా సంజయు డిట్లనెను. ధృతరాష్ట్రమహారాజా! క్షత్రియధర్మమును అవలంబించి యుద్ధమునకు వచ్చినపుడు. వీరు గురువులనియు. వీరు తమ్ములనియు, వీరు తండ్రులనియు, వీరు మనుమలనియు వీరు శిష్యులనియు. వీరు మామలనియు, వీరు కుమారులనియు, తలచక ఒకరితో నొకరు యుద్ధము చేయవలయును. క్షత్రియధర్మమును ఆశ్రయించినపుడు, స్నేహ బంధుత్వములను తలచరాదు.

## అర్జునుడు ద్రోణాచార్యులతో యుద్ధముచేయుట

ధృతరాష్ట్ర మహారాజా! అర్జునుడు ద్రోణాచార్యులమీద అయిదు యినుపబాణములు వేసి క్రూరమైన బాణవర్షములు కురిపించెను. అందుకుద్రోణాచార్యుడు భయపడక అర్జునుని దేహమందుబాణములుదట్టముగా నాటెను. అంతట దుర్యోధనుడు పురికొల్పగా సుశర్మ మొదలగు త్రిగర్త దేశపు రాజులు ద్రోణునకు ముందుమిగిలి అర్జునుని మీదకు వచ్చిరి. అర్జునుడు వాయుబాణము ప్రయోగించి అందువలన కలిగిన గొప్పదైన గాలిచేత త్రిగర్తులను పడగొట్టుచుండెను. ద్రోణాచార్యుడు పర్వతబాణమును ప్రయోగించి అర్జునుని వాయుబాణశక్తిని పోగొట్టెను. అందుల కర్జునుడు కోపించుకొని అచ్చ యినుపబాణములను వర్షముకురిసినట్లు ప్రయోగించి సుశర్మునియొక్క పుత్రులను మునుగునట్లు చేసెను. దుర్యోధనుడు కృపాచార్య శల్య బాహ్లికులను వెంటపెట్టుకొని అర్జునునిమీదకు వచ్చెను. అర్జునుడు ఆవచ్చిన వారి నందరిని గన్నేరు ఆకులవంటి బాణములచేత చిక్కుపరచెను. ద్రోణుడు మొదలగు వారందరికిని, అర్జునునితో యుద్ధము కష్టము కలిగించుచుండెను. ఆసమయమున భీష్ముడు, ధర్మరాజు వున్న స్థలము

నకు పరుగెత్తి అక్కడుండు పాండవసైనికులయొక్క శిరస్సులను ఏరుచుండెను. అప్పుడు శకునియు, భూరిశ్రవసుడును వీరిద్దరు, నకుల సహదేవులతో యుద్ధము చేయుచుండిరి.

శ్రుతాయువును, భగదత్తుడును, యేనుగుసైన్యములను తీసికొని భీమునిమీదకు పోయి, పర్వతముమీదనుండు సింహమువలె భీముడు గదాయుధమును తీసికొని రథముదిగి ఆయేనుగు సైన్యము మీదకు దూకెను. అప్పుడు పెద్దగాలిచేత మేఘములు చెదరిపోయి నట్లు భీముని గదాయుధపుదెబ్బలకు ఏనుగుగుంపులన్నియు చెదరి పోయెను. శ్రుతాయువు భగదత్తులిద్దరును చెదరిపోక నిలిచి నానా విధబాణములచేత భీముని కవచమును చీల్చి అతనిదేహమును చించి నట్లు కొట్టిరి. ఆసమయమందు ధర్మరాజు భీష్మునితో యుద్ధము చేయ జాలక పెద్దకంఠధ్వనితో భీమా! అనియు అర్జునా అనియు వేరువేరు పేర్లచేత తమవారందరిని పిలుచుచు చేయి విసరుచుండెను. ఆమాట లను భీముడువిని శ్రుతాయుభగదత్తులను విడిచి కోపముచేత పెదవులు కరచుకొనుచు ధర్మరాజుదగ్గరకు పోవుచుండెను. అప్పుడు భీముని చేతులందును కాళ్ళయందును, రొమ్మునందును, ఘోరన రక్తము కారుచుండెను. ఆరక్తముచేత భీముడు క్రొత్తగా చిగిరించిన మామిడి వృక్షమువలె ప్రకాశింపుచు ధర్మరాజుదగ్గిరకు వెళ్లెను. ఇట్లు భీముడు వెళ్ళకమునుపే ధృష్టద్యుమ్నుడును శిఖండియు, విరాటుడును, ద్రుపదుడును యీనలుగురును, ధర్మరాజునకు ముందె మిగిలి భీష్ముని మీదకుపోయి యెదిరించిరి. అంతట ధృష్టద్యుమ్నాదులు నలుగురును నానావిధములైన బాణములచేత భీష్మునిగొట్టి నిశ్చేష్టితునిగాజేసిరి. అందుకు భీష్ముడు కోపించుకొని శిఖండిమీద బాణము వేయక తక్కిన ముగ్గురిమీదను మూడేసి తీక్ష్ణబాణములను గ్రుచ్చెను. ధృష్టద్యుమ్న విరాట ద్రుపదులు ముగ్గురును మూడు అగ్నిహోత్రములవలె మండి

పడుచు భీష్మునిమీాద నిప్పువంటులబోలు బాణములను వేయుచుండిరి. అప్పుడు భీముడు వచ్చి భీష్ముని యెదిరించెను. ఆసమయమున కేకయ దేశపురాజులును సాత్యకియు, ద్రౌపదీపుత్రులును వీరందరుచేరి భీమునకు సహాయముగా భీష్మునిపైకి వచ్చిరి. కౌరవసైన్యములతో నుండు మొనగాండ్రందరును భీష్మునకు ముందుమిగిలి ఆభీమాది పాండవరథికులతో యుద్ధముచేయుచుండిరి. ఆరెండుపక్షముల వారి సైన్యములును వచ్చి కలియబడి భయంకరముగా పెనగులాడుచుండిరి. కొంత సేపటికి మధ్యాహ్నసమయమాయెను.

ఆ మధ్యాహ్నసమయమున రెండుపక్షములవారును, రథముల చేతను, యేనుగులచేతను, గుఱ్ఱములచేతను రక్తనదులను పాఱుచు, యేటు ్రవేటు పోటులచేత ఒక్కపెట్టున పోరుచుండిరి. ధృతరాష్ట్ర మహారాజా! ఆ కౌరవసైన్యములలో నుండు జనులందరు తమలో తాము యిట్లని చెప్పుకొనిరి. జనులారా! ధృతరాష్ట్రుడును అతని కొడుకులగు దుర్యోధన దుశ్శాసనాదులును మిక్కిలి లోభగుణము కలవారై యీరీతిగా ప్రజాక్షయము చేసిరి కౌరవులు ధర్మరాజును గెలువజాలరు. ధృతరాష్ట్రుడును అతనికొడుకులగు దుర్యోధనాదు లును బుద్ధిలేనివారు. ఇక మాటలాడినందువలన ప్రయోజనములేదు. అని కౌరవసైన్యమందలి జనులు మిక్కిలి బిగ్గరగా చెప్పుకొనుచు దుఃఖించుచుండిరి. ఆమాటలను దుర్యోధనుడు విని భీష్మాది యుద్ధ వీరులతో యిట్లనెను.

భీష్మాదులారా! కుత్సితపురుషులు చెప్పుకొనుమాటలు మీారు వినవద్దు అని చెప్పగా భీష్మాదివీరులు యుద్ధశూరత్వమును చూపుచు ఆమాటలను, యీామాటలను కూడ వినక తమ యుద్ధపరాక్రమ క్రీడను సలుపుచుండిరి. ఆసంకులయుద్ధమందు భీముడు రథముదిగి గద చేత కౌరవసైన్యమును చంపుచు గదకు పండుగ గలుగజేయుచుం

డెను. ఆసమయమున భీముని సారథి రథమును తోలుకొనివచ్చెను. భీముడు ఆరథముమీాద యెక్కి మిక్కిలి తీక్ష్ణమైన బాణములచేత బాహ్లికునియొక్క గుఱ్ఱములను చంపెను. అతనిని విరథునిచేసెను. అపుడు దేవతలు భీముని మెచ్చుకొనిరి. ఆ సమయమందు చిత్రసేనుడు అభిమన్యునితో యుద్ధముచేయుచు విచిత్రములైన బాణములచేత అభిమన్యుని నొప్పించి సింహనాదముచేసెను. అభిమన్యుడు చిత్రసేనునియొక్క సారథిని నొప్పించి అతనిగుఱ్ఱములను చంపి పొగరణచెను. అంతట చిత్రసేనుడు దుర్ముఖునియొక్క రథముమీాదకు పోయెను. ఆసమయమందు ద్రుపదుడు ద్రోణునిమీాదకు పోయెను. మరియు అతనిదేహమందు నానావిధములైన బాణములను నాటెను. అందుకు ద్రోణుడు కోపించుకొని ద్రుపదుని కవచము చీల్చి దేహమందు ప్రకాశబాణములను గ్రుచ్చెను. ద్రుపదుడు బలహీనుడై సిగ్గులేక తొలగిపోయెను. ఆసమయమున సుశర్మ అర్జునునిమీాదకు పోయి బాణములువేసి నొప్పించి కృష్ణునిమీాద బాణములను గ్రుచ్చెను. అర్జునుడందులకు కోపించుకొని తీక్ష్ణమైన బాణసమూహములను సుశర్మునిమీాద కురిపించెను. ఆసమయమున సుశర్ముని సైన్యమంతయు జేరి ఒక్కపెట్టున అర్జునునిమీాద పెద్దసుత్తెలను వేయుచు చేరుకోలలచేతను, అంకుశములచేతను, అతిశీఘ్రముగా వాహనములను త్రోలుచుండిరి. సుశర్మబలములన్నియు ధనుస్సులను, డాలులను అర్జునునిమీాద వేయుచుండిరి. నీతంత్రజ్ఞుడైన భీష్ముడు అర్జుననిమీాదకు వచ్చుచుండగా సాత్యకి భీష్మునకు అడ్డుపడెను భీష్ముడు సాత్యకిమీాద శక్త్యాయుధమును ప్రయోగించెను. సాత్యకి దేహమును వంచి శక్త్యాయుధమును పట్టుకొని పారవేసెను. భీష్ముడు సాత్యకిమీాదక్రూరబాణములను వేసెను. సాత్యకి భీష్మునిమీాద తొమ్మిదిబాణములువేసెను. పిమ్మట పాండవులయొక్క చతురంగబలములును అతి భయంకరముగావచ్చి భీష్ముని పట్టుకొనెను.

## దుర్యోధనుడు శకుని దుశ్శాసనుల భీష్మునకు సహాయముగా బంపుట

ధృతరాష్ట్ర మహారాజా! ఆ సమయమందు దుర్యోధనుడది చూచి దుశ్శాసనునితో యిట్లనెను. దుశ్శాసనా! పాండవుల గొప్ప సైన్యము భీష్మునిమీదకు పోయి చుట్టుకొనెను. గనుక నీవును శకునియు వెళ్ళి భీష్మునకు సహాయపడవలయును. అని దుర్యోధనుడు చెప్పగా దుశ్శాసనుడు, శకుని, వీరిద్దరును గర్వముచేత భీష్మునకు సహాయముగా పాండవసైన్యములమీదకు పోయిరి. అట్లువచ్చిన దుశ్శాసనశకునులను ధర్మరాజుచూచి తానును నకుల సహదేవులును దుశ్శాసనశకునులమీదకు వెళ్ళిరి. అప్పుడు దుర్యోధనుడు పదివేల గుర్రపుదండును పురికొల్పి ధర్మరాజాదులమీదకు పంపించెను. ఆపది వేలగుర్రములమీదను మొనగాండ్రగు రవుతులెక్కి ఒక్కపెట్టున ధర్మరాజాదులమీదకు పోయిరి ఆ సమయమందు గొప్ప చేపలగుంపులు సంచరించుటచేత కలకబారిన తటాకమువలె పాండుసైన్యము క్షోభించెను. అందుకు ధర్మరాజ నకులసహదేవులు కోపించుకొని అనేక బాణసమూహములను కౌరవులయొక్క గుర్రపుదండులమీద ప్రయోగించిరి.

ఆ బాణముల దెబ్బలు తగులుటచేత కౌరవుల గుర్రపుదండులలో కొన్ని గుర్రములకు ముందరికాళ్ళు విరిగి ముందరికి పడుచుండెను. కొన్ని గుర్రములకు ముఖములు బ్రద్దలుగా పలిగి చచ్చిపడుచుండెను. కొన్ని గుర్రములకు గుండెకాయలుపగిలి చచ్చుచుండెను. కొన్ని గుర్రములకు కళ్లెములు తగిలించు వాగులు తెగుటచేత గుర్రములు కలకబారుచుండెను. బాణముల దెబ్బలు తగిలి రవుతులు క్రింద పడుచుండగా మరికొన్ని గుర్రములు విచ్చలవిడిగా తిరుగుచుండెను. అనేకవిధములుగా గుర్రములు నశించగా మిగిలినగుర్రములు ఉత్సా

హము లేక సైన్యములు భేరీశంఖాదులను అధికముగా ప్రయోగించుచు సింహనాదములు చేయుచుండెను. అందుకు దుర్యోధనుడు దుఃఖించుచు దీనుడై శల్యునితో యిట్లనెను. శల్యుడా ! పాండవసైన్యములు మహాసముద్రమువలె వచ్చుచున్నట్లున్నవి. ధర్మరాజు యొక్క యుద్ధనైపుణ్యమును నీవొకడవే ఆపగలవు. గాని మరియొకని వలన గానేరదు. అని దుర్యోధనుడు చెప్పగా శల్యుడు ధర్మరాజ నకుల సహదేవులమీదకు పోయి తన గొప్పబాహుబలముచేత అనేక బాణములను వేసి ముగ్గురిని చిక్కుపరచెను.

అప్పు డర్జునభీములు వచ్చిచూచి శల్యుని అనేకమైన తీక్ష్ణ బాణములచేత నొప్పించిరి. భీష్మ ద్రోణులిద్దరును వచ్చి భీమార్జునుల మీద బాణములను వేసిరి. కౌరవపాండవ సైన్యములు రెండును వచ్చి కలియబడెను. అప్పుడు మూడుజాములాయెను. ఆ సమయమందు ఆ రెండుపక్షములవారి చతురంగబలములును గొప్పయుద్ధము చేసి ఒకటొకటి నశించెను. ధృతరాష్ట్ర మహారాజా ! ఆ సమయమందు భీష్ముడు గ్రీష్మ కాల సూర్యునివలె అధికముగా ప్రకాశించుచు గొప్పబాణములను ప్రయోగించి నొప్పించెను. భీష్ముడు పండ్రెండు బాణములచేత ధర్మరాజునుకొట్టి బాధించెను. మరిపండ్రెండు బాణములచేత భీమునికొట్టి నొప్పించెను మూడు మూడు బాణముల చేత నకుల సహదేవులను కొట్టెను. ఏడుబాణములచేత సాత్యకిని మరి యేడుబాణములచేత ధృష్టద్యుమ్నుని బాధించెను. భీష్ముడు పాండవరథికులనుకొట్టి నొప్పించి మదముచేత సింహనాదముచేసెను. ఆ సమయమందు పాండవపక్షమందుండు మత్స్యదేశపు సైన్యములును పాండ్యదేశపు సైన్యములును, సోమకుని సైన్యములును, మగధదేశపు సైన్యములును, కాశీదేశపు సైన్యములును, కరూశదేశపు సైన్యములును యివియన్నియు ఒక్కపెట్టున అతిశీఘ్రముగా

భీష్మునిమీదను వచ్చెను. ఆసమయమునందు ద్రోణాచార్యుడు పాండవు లను వారి రథికులగు సాత్యకి ధృష్టద్యుమ్నుడు మొదలగు వారిని రాకుండునట్లు ఆగి వారందరికిని అన్నిచూపులుగానుండి వారందరితో మహాయుద్ధముచేసెను. ఆ సమయమందు భీష్ముడు మహాబల పరా క్రమ శౌర్య ధైర్య తేజో విశేషములుగల పాండవుల సైన్యముల మీదకు తనరథమును అతిశీఘ్రముగా త్రోలించి మిక్కిలి తీక్ష్ణబాణ ములచేత పడగొట్టుచు చెదరగొట్టుచు చంపుచు చలింప జేయుచుం డెను. అప్పుడు భీష్ముడు తనరథమును అతిశీఘ్రముగాను శీఘ్రప్రకాశ ములు గలుగునట్లుగాను పాండవసైన్యములలో నడిపించుచు పిడుగు పిల్లవంటి బాణసమూహములను వేసి పాండవులయొక్క చతురంగ బలములను నశింపజేయుచుండెను.

అప్పుడు భీష్ముని బాణములచేత పాండవుల సైన్యములలో నుండు యేనుగులు గుంపులు గుంపులుగాచచ్చి పడుచుండెను. గుర్రపుదండులు కుప్పలు కుప్పలుగా ప్రాణములువిడిచి పడుచుండెను. కాహళము, దుందుభి, మొదలగు వాద్యవిశేషములను, సుందర ములైన టెక్కెములును ఘంటల సమూహములును ధనుస్సులగుంపు లును అస్త్రశస్త్రాదుల సమూహములును, మొదలగునవి అన్నియు పగిలి విరిగి కుప్పలు కుప్పలుగా పడుచుండెను. ఇట్లుపడిన కుప్పలచేత పాండవులసైన్యములు మునిగినట్లుండెను, ధృతరాష్ట్ర మహారాజా! భీష్ముడు మొనగాడై యీ ప్రకారము యుద్ధముచేసి తనను యెదిరించు మొనగాండ్రు లేనందున మదగర్వములచేత వుప్పొంగి పాండ వులు ఆశ్చర్యభయములను పొందునట్లుగా పాండవ సైన్యముల మీదకు పోయెను. భీష్ముడు మరల పాండవసైన్యములమీదకు దూకి యెదురులేని దివ్యాస్త్రములను ప్రయోగించి యేదిక్కుయందు చూచినను తానే కనపడుచు పాండవసైన్యములను రూపుమాపు

చుండెను. భీష్ముని దివ్యాస్త్రముల శక్తిచేత పాండవసైన్యములలో నుండు రధికులును యేనుగుల మీాదనుండు రవుతులును గుఱ్ఱముల మీాదనుండు వారును చచ్చిపడుచుండగా ఆస్థలములు మదపుటేనుగు క్రీడించి విహరించుటచేత ప్రాడుపడియుండు వుద్యాన వనమువలె నుండెను.

కాల్బలములు నరుకబడు చుండగా కొందరికి కాళ్ళు విరుగు చుండెను. మరికొందరికి చేతులు విరుగుచుండెను. కొందరికి కాళ్లు చేతులు రెండును విరుగుచుండెను. కొందరికి తలకాయలు విరిగిపడు చుండెను. మరికొందరికి డొక్కలు పగులుచుండెను. ఈ ప్రకారము అగ్నిచేత పరిపక్వముగా వండినపుడు తరిగినట్లు కాల్బలములు తరిగి పోవుచుండెను. పాండవ సైన్యములలో అనేక స్థలములయందు అనేక రధములును ఆ రధములయొక్క అవయవములును విరిగి పడుచుండగాను యేనుగుల గుంపుల యొక్కయు, గుఱ్ఱపుదండుల యొక్కయు యెముకలు విరిగిపడుచుండగాను మిక్కిలి చప్పుళ్ళు కలిగియుండెను. ఆచప్పుళ్లుగల స్థలములు వెదురుల అరణ్యమును కార్చిచ్చు కాల్చుచున్నపుడు కలుగు ధ్వనులుగలిగి యుండెను. గొడుగులు పొడి పొడిగా విరిగి పడుచుండగా స్థలములు పెద్దగాలిచేత చిక్కుపడునట్టి పుష్పించిన కుంతరెల్లు వనములవలె నుండెను. ఆ యుద్ధభూమియందు అనేక రత్నమయములైన కిరీటములు మొదలగు భూషణములు బాణముల దెబ్బలచేత పొడి పొడియై పడి యుండెను.

నానావిధములైన వర్ణములుగల చామరముల సమూహములు నరకబడి యుండెను. ఆ స్థలములను చూడగా తామరకమలములచేత నిండియుండు సరస్సులవలె కనబడుచుండెను. ధృతరాష్ట్ర మహారాజా! యీా ప్రకారము భీష్మునిచేత పాండవసైన్య

ములు హీనదశకు వచ్చి తమకుతామే చిక్కుపడుచు బలహీనములై కలకబారిన వగుచు పారిపోవుచు చచ్చుచుండెను. పాండవ సైన్యముల యందు అధికముగా రొదలు గలిగెను. ఆ స్థితియంతయు కృష్ణుడు తెలిసికొని అర్జునునితో యిట్లనెను. అర్జునా! మహాపరాక్రమ శౌర్యవంతుడగు భీష్ముడు మన సైన్యముల నన్నిటిని చంపుచు చెదరగొట్టుచు, తనశక్తిని చూపుచున్నాడు. చూచితివిగదా? ఇటువంటి సమయమందు నీ భుజాబలమును చూపకుండ వచ్చునా! అని యిట్లు కృష్ణుడు చెప్పగా అప్పుడు అర్జునుడు దుఃఖముచేత కొలాయమానచిత్తము గలవాడై వుత్సాహములేక యుండగా కృష్ణుడు మరల అర్జునునితో యిట్లనెను.

అర్జునా! పూర్వము నీవు విరాటరాజుయొక్క పట్టణమందున్నపుడు వుప్పొంగుచు కౌరవుల నందరిని జయింతునని సంజయునితో విశేషముగా చెప్పితివి. ఆమాటల నన్నిటిని యిపుడు మరచినయెడల నిన్ను జూచి జనులందరును యెగతాళి చేయుదురు. అని యిట్లు కృష్ణుడు చెప్పగా అర్జునుడు కృష్ణునితో యిట్లనెను. కృష్ణా! నా బంధుజనుల నందరిని చంపినయెడల యీ రాజ్యభోగమువలన నాకు ప్రయోజనమేమి? ఈ రాజ్యమువలన నాకేమి పుణ్యము లభింపగలదు? ఇపుడు నా మనస్సు యుద్ధమునకు వుత్సాహము గలిగియుండలేదు. అయినను నీతో యిటువంటి మాటలను మాటిమాటికిని చెప్పరాదు. భీష్ముని పడగొట్టెదను. మన రథమును భీష్మునిమీదకు తోలుము అని యిట్లు అర్జునుడు చెప్పగా అప్పుడు కృష్ణుడర్జునుని రథమును భీష్ముని రథమునకు యెదురుగా తోలెను. అదివరకు చెదిరిపోయిన పాండవసైన్యము లన్నియు మరల భీష్ముని చుట్టుకొనెను— భీష్ముడు చెల రేగి మహాస్త్రసమూహములు ప్రయోగించి ఆ పాండవ

సైన్యములను ఆపెను. భీష్ముడు సింహనాదముచేసి తీక్ష్ణమైన అనేక బాణసమూహములను వేసి అర్జునుని దేహమందు గ్రుచ్చి అతని దేహమును బాణ మయముచేసెను. భీష్ముడు కృష్ణునిమీదను, అర్జునుని గుర్రములమీదను అతిశీఘ్రముగా క్రూరమైన అనేక బాణ సమూహములను వేసి అనేక బాణముల గుంపులచేత అర్జునుని దివ్య రథమును మునుగునట్లు చేసెను. భీష్ముని బాణముల దెబ్బకు అర్జునుని గుర్రములుబెదరి మారుమొగము కలిగియుండెను. కృష్ణుడు భీష్ముని బాణముల దెబ్బలకు తాను బాధనొందియు గుర్రములను తడవి తెలివి గలిగించెను. కృష్ణుడు మరల గుర్రములను తరిమి భీష్ముని దగ్గరకు రథముతోలెను. అర్జునుడు ఒక తీక్ష్ణబాణముచేత భీష్ముని యొక్క ధనుస్సును నరికెను. భీష్ముడు మరియొక ధనస్సును తీసికొనగా ఆధనస్సును గూడ అర్జునుడు నరికివేసెను. భీష్ముడు ఆశ్చర్యముతో ఔరా! అర్జునా! అని చెప్పుచు ధైర్యముచేత మరియొక ధనస్సును తీసికొని బాణములను వేయుచుండెను. భీష్ముడు పిడుగు పిల్లలవంటి అనేక బాణములను ప్రయోగించగా బాణముల దెబ్బలచేత అర్జునుడు నొచ్చియు చేటును పొందియు శౌర్యముచేత భీష్మునితో యుద్ధము చేయుచుండెను. అర్జునుని దేహము తూలి పోవుచు శక్తిలేక యుండెను. ధృతరాష్ట్రమహారాజా! అంతకంత కర్జునుడు మిక్కిలి బాధనొందుచుండెను. భీష్ముడు గర్వించి ప్రళయ కాలరుద్రునివలె యుద్ధము చేయుచు కొంచెమైనను అలయకుండెను. భీష్మునకు పాండవ రథికులలో ఒక్కడైనను యెదురుపడక దూరముగానుండిరి. ఇదియంతయు కృష్ణుడు చూచి తన చిత్తమందు భయంకరమైన రోషముగలవాడై గుర్రముల పగ్గములను నొగల యందుంచి గుర్రములను తోలు కర్రలను తీసికొని క్రూరముగా క్రిందికిదిగెను.

———

## శ్రీకృష్ణుడు రథముదిగి భీష్మునిపైకి పోవుట

ఇట్లు కృష్ణుడు క్రిందికి ఎగిరిదూకి రౌద్రాకారుడై భీష్ముని మీదకు పోవుచుండెను. ఆసమయమున భూచక్రమంతయు గడగడ వడకెను. అందునలన అష్టదిగ్గజములును కులపర్వతములును ప్రాలి పడిపోవునట్లుండెను. దిక్కులన్నియు విశేషముగా అదరుచున్నట్లుండెను. కౌరవసైన్యము లన్నియు భయముచేత పారిపోవుచుండెను. కృష్ణునియొక్క రౌద్రాకారమును దేవతలు చూచి తల్లడిల్లుచుండిరి. కృష్ణుడతిభయంకరముగా భీష్మునిమీదకు వెళ్ళునప్పుడు కృష్ణుని దేహమందుగల పచ్చనివస్త్రము విచిత్రముగా ప్రకాశింపుచుండెను. అప్పుడు కృష్ణుని యాకారము నల్లనిమేఘమువలె నుండెను. సింహనాద రోష కోపములచేత కలిగిన యెఱ్ఱదాలు మెరుపువలెనుండెను. కృష్ణుడప్పుడు చేసిన సింహనాదము పెద్ద ఉరుమువలెనుండెను, ధృతరాష్ట్రమహారాజా! కృష్ణుని ఆకారమును కౌరవ యోధు లందరును చూచి ప్రాణములు లేనివారివలె వెలవెలపోవుచు భీష్ముడు చచ్చెను, చచ్చెనని చెప్పుకొనుచు అందరును కలియబడి తలలెత్తుకొని భీష్ముని చూచుచుండిరి. తనమీదకు వచ్చు కృష్ణుని భీష్ముడు చూచి చిన్న నవ్వు నవ్వి కృష్ణునితో యిట్లనెను.

మహాత్మా! కృష్ణా! యిక్కడికి దయచేయుము. ఇది మంచి కార్యము నీచేత నేను చచ్చినయెడల యీ లోకమందు నాకు మిక్కిలి కీర్తి కలుగును. పరలోకమందును నీదయవలన సద్గతిని పొందుదును. గనుక యిపుడు నీ యిష్టప్రకారము చేయుము. అని భీష్ముడు చెప్పుచుండగా అర్జునుడు రథముమీదనుంచి శీఘ్రముగా క్రిందకుదూకి కృష్ణుని వెనుకతట్టు పట్టుకొని పదియడుగుల దూరము వెనుకకు తీసికొనిపోయెను. అర్జునుడు కృష్ణునియెదుటకువచ్చి రెండు చేతులతో కృష్ణుని పట్టుకొని నిలువబెట్టి నిట్టూర్పు విడు

చుచు యిట్లనెను. కృష్ణా ! నేను యుద్ధము చేయనని నిర్మలమైన బుద్ధిచేత పూర్వము ప్రతిజ్ఞ చేసితివి. ఆ ప్రతిజ్ఞను తప్పితివేని లోక మంతయు ఏమని చెప్పుకొనునో అది నీవే తెలుసుకొనుము. నేను యుద్ధముచేత అలసియుంటిని. అందుచేత భీష్ముని మొనగాడితనము కనబడెను. కొంచెముసేపు యుద్ధములయందు అలయుట తప్పుగాదు గదా! నామీదకు వచ్చిన భీష్ముడు వడుపాటును చూచెదవుగాక రమ్ము, నిన్నాశ్రయించుకొని యున్నాను. నా పరువును పోగొట్ట వచ్చునా! శీఘ్రముగా రథముమీదకు రమ్ము. అని అర్జునుడు ప్రార్థించగా ఆమాటలకు కృష్ణుడు సంతోషించి మరలి వచ్చెను. కృష్ణార్జును లిద్దరును రథముమీద కూర్చుండగా రథము రెండు శిఖరములతో కూడి సుందరముగానుండు పర్వతమువలె నుండెను. ఆ సమయమందు భీష్ముడు ప్రళయకాలమందుగల మేఘమువలె అరచుచు గొప్ప శక్తివంతములైన ననేక బాణసమూహములను ప్రయోగించి కృష్ణార్జునులను నిశ్చేష్టితులనుగా చేసెను. భీష్ముడు తన నెదిరించిన ననేకరథికులను చంపివేసెను. ఆసమయమందు కృష్ణా ర్జునులు శ్రమదీర్చుకొను చుండిరి. భీముడు సాత్యకి, ధృష్టద్యుమ్నుడు మొదలగు పాండవ రథికు లందరును భీష్మునకు భయపడి చూచు చుండిరి.

ఆ సమయమున గొప్పశక్తిగల మనుష్యుడు సామాన్యమైన చీమలను కాళ్ళచేత చమిరి చంపినట్లు భీష్ముడు పాంచాలదేశపు సైన్యములను చంపెను. ఆ సమయమున సూర్యుడు తాను అస్తమిం చినయెడల పాండవసైన్యములన్నియుపూర్తిగానశించుననునటులఅస్త మింపతలచి అస్తమించెనోయను నట్లుగా అస్తమించెను. అట్టిసంధ్యాకాలమందు బురదయందు మునిగిన గోవులవలె పాండవ సైన్యములు భీష్ముని బాణములచేత మునిగినట్లుండెను. తన సైన్య -

మును ధర్మరాజుచూచి కొంతసేపుచింతాక్రాంతుడై యుద్ధముచాలించి సైన్యములను దింపుటయే తగినకార్యమనితలచి సైన్యములను దించు టకు ఉత్తరువుచేసెను. అప్పుడు భీమార్జున, నకుల, సహదేవ,సాత్యకి, ధృష్టద్యుమ్నాదులందరును నేడు భీష్మునిచేత మిక్కిలి భంగపడితి మని చెప్పుకొనుచు దుఃఖించుచు ధర్మరాజు దగ్గరకువచ్చిరి. ధర్మ రాజు వారందరితోడను విచారపడుచు చిన్నతనముచేత తలవంచు కొని తమ శిబిరమునకు వెళ్లెను. పాండవులు వెళ్ళినతోడనే కౌర వులును తమ బలములను దింపించిరి. అంతట నీకొడుకులగు దుర్యో ధనాదులందరును భీష్మునకు నమస్కరించుచు భీష్మునిబలపరాక్రమ శౌర్య ధైర్యములను ప్రత్యేకముగా పొగడుచు గొప్పవాక్యములచేత భీష్ముని స్తుతింపుచు తమ మనస్సులయందు గల సంతోషములను ముఖములయందు కనపరచుచు తమశిబిరములకు వెళ్ళిరి. ధృతరాష్ట్ర మహారాజా! యీ ప్రకారము ధర్మరాజు తొమ్మిదవనాటి యుద్ధ మందు ఓడిపోయి ఆ రాత్రికాలమందు మనస్సునందు దుఃఖించుచు తన తమ్ములగు భీమార్జున నకుల సహదేవులను వెంటబెట్టుకొని రహ స్యముగా కృష్ణుడున్న శిబిరమునకు వెళ్ళి కృష్ణునితో యిట్లనెను. కృష్ణా! మహాత్మా! కార్చిచ్చు అడవియందుండు జంతువులను చంపినట్లు యీ దినమున భీష్ముడు అగ్నిజ్వాలలవంటి బాణములచేత మన సైన్యములను దహించెను. అగ్నిహోత్రునితో సమానమైన భీష్ముని నేటిదినమందు కన్నులారాచూచితిమి. ఆ భీష్ముని యెదిరిం చుటకు మనవారిలో యెవ్వరును సమర్థులుకారు. నేను దురహంకా రముచేత అందరిని గెలిచెదనని యుద్ధమునకు పూనుకొంటిని. ఇకను యుద్ధముచేసిన యెడల నా సైన్యములు పూర్తిగా నశించును. అట్లు గాక యుద్ధమందు గెలిచి రాజ్యమును తీసికొన్నను నామనస్సునకు సంతోషము కలుగజాలదు. అడవికివెళ్ళి చింతలేనివాడనై నాతమ్ము

లతో గూడుకొని తపస్సుచేయుచు పూజ్యుడనై యుండెదను, నా నిమిత్తమువలన నాతమ్ములగు యీ నలుగురును యిదివరకు అరణ్యవాస, అజ్ఞాతవాసములను అనుభవించి అనేక సంకటములను పడియున్నారు. నా తమ్ములనందరిని కన్నులారా చూచుచుందును గాని భీష్మునకు బలిగా యిచ్చుటకు సమ్మతింపను. కృష్ణా! నీకు మా యందు అనుగ్రహము కలిగియున్న యెడల యుద్ధముతప్ప ధర్మవిరోధముగాని మరియొక మార్గమును చెప్పుము. అని ధర్మరాజు చెప్పగా ఆ మాటలను కృష్ణుడు విని శాంతపుమాటలచేత ధర్మరాజును ఊరడించి యిట్లనెను. ధర్మరాజా! నీవు సత్యమైన ప్రతిజ్ఞగలవాడవు. నీతమ్ములందరును మహాబలపరాక్రమ శౌర్య ధైర్య వంతులు. గనుక నీకు దుర్బలస్థితి యెప్పుడును కలుగజాలదు. నీకు నేను మంత్రినై రాజ్యసంపదలను కలిగించెదను. దుఃఖించుటచేత ప్రయోజనములేదు మరియు అట్టి అవశ్యకతకూడ కనబడలేదు. అర్జునునకు ధైర్యములేనియెడల శీఘ్రముగా నేను భీష్ముని చంపివేసి నీకు మనశ్శాంతిని కలుగజేసెదను. నాకు అడ్డురాక పైనుంచి చూచుచుండుము. అర్జునుడు, స్నేహితుడు, బంధువుడు, శిష్యుడు కూడ అయియున్నాడు. ఇతనికిని, నాకును గల స్నేహసంబంధము వలన నా దేహములోని కండలయిననుకోసి యీ అర్జునునకు యిచ్చెదను. అర్జునుడు నా విషయమై అట్టి భావమునే కలిగి అట్లుగానే చేయగలడు. ధర్మరాజా! మీరు పూర్వము ఉపప్లావ్యమను స్థలమందున్నప్పుడు సంజయు డక్కడికిరాగా సంజయునితో యీ అర్జునుడు యుద్ధశూరత్వమును ప్రకటించి పెక్కుమాటలను విశేషముగా చెప్పియున్నాడు. ఉలూకుడు వచ్చినప్పుడును అతనితో యీ అర్జునుడు తన యుద్ధ శౌర్యమును గురించి మిక్కిలిగాపలికియున్నాడు. ఈ రెండు సమయములందును అర్జునుడు మాటలాడిన

మాటలకు తగినంత కార్యమును నేను చేయవలెను. ఆ రెండుసమయ ములయందును సంజయ ఉలూకులతో నేనును అధికముగా మాట లాడి యున్నాను. అర్జునుడును, నేనును అధికముగా మాటలాడి యున్నాము. గానమేము యిప్పుడు ఆ మాటల ప్రకారము జరుపు టకు సమయమై యున్నది. అని కృష్ణుడు చెప్పగా ఆ మాటలను ధర్మరాజువిని కృష్ణునితో యిట్లనెను. కృష్ణా! నేను యుద్ధముచేయక నగు సహాయమును చేసెదనని యీ సమయమున నీవు యుద్ధము చేసినయెడల నిన్ను నేను బొంకించినవాడనగుదును. దైవమునాకింత కష్టమును యెందుకుగలిగించెనో తెలియలేదు. నాకును భీష్మునకును ఒక యేర్పాటు కలదు. ఆ యేర్పాటును చెప్పెదను వినుము. భీష్ముడు కౌరవుల పక్షముగా యుద్ధముచేయునట్లుగాను నాకు మేలు కలుగు కార్యమును బుద్ధియందు తలచుచుండునట్లుగాను యేర్పాటు కలిగియున్నది. గనుక భీష్ముడు నాకురాజ్యమును కలుగజేయును. అని ధర్మరాజు కృష్ణునితోచెప్పి దుఃఖించుచు యిట్లనెను. కృష్ణా! మా తండ్రియగు పాండురాజు చచ్చినది మొదలుకొని మా తాతయగు భీష్ముడు మమ్ములను పెంచి పోషించి పెద్దవాండ్రను చేసెను. ఆ భీష్ముడే యిప్పుడు మమ్మును చంపుటకు ప్రయత్నించి యున్నాడు. రాజధర్మము యింత క్రూరకర్మముగదా! అని ధర్మరాజు చెప్పగా ఆ మాటలను కృష్ణుడు విని ధర్మరాజు భీష్ముని దగ్గరకు వెళ్ళుటకు తలచి యున్నాడని శీఘ్రముగా వెళ్ళి రావలెనని తలచి మొదట యుద్ధభూమియందు భీష్ముడు ధర్మరాజుతో చెప్పినమాటలను స్మరించి కృష్ణుడు ధర్మరాజుతో యిట్లనెను.

## ధర్మరాజు రహస్యరీతిని భీష్మునియొద్దకుబోవుట

ధర్మరాజా! యిప్పుడు నీవు తలచిన యాలోచనము మిక్కిలి మంచిది. ఇదివరకు యుద్ధభూమియందు భీష్ముని దగ్గరకు

వెళ్ళి వచ్చినరీతినే యిప్పుడు భీష్ముని దగ్గరకు వెళ్ళవలయును. భీష్ముడు కోపించుకొని చక్కగా యుద్ధముచేసినయెడల శత్రువులందరును నశింతురు. గనుక యిప్పుడు భీష్ముని దగ్గరకు వెళ్ళుము. నీవు భీష్ముని చంపు ఉపాయమును అడిగినయెడల భీష్ముడు తన వధోపాయమును నీకు అవశ్యముగా చెప్పగలడు. మనమందరము యిప్పుడు రహస్యముగా భీష్ముని దగ్గరకు వెళ్ళి అతనికి భక్తిపూర్వకముగా నమస్కరించి మనకు మేలుకలుగు కార్యమును చెప్పుమని ప్రార్థింతము. అట్లు ప్రార్థించి ఆ భీష్మునియొక్క కృపను పొంది ప్రవర్తింతము. అని కృష్ణుడు నిశ్చయించి ధర్మరాజుతో చెప్పెను. ధర్మరాజు భీమార్జున నకుల సహదేవులును, కృష్ణుడును, శాంతమైన వేషములను ధరించి అతి రహస్యముగా భీష్ముని గృహమునకు వెళ్ళి తగు మర్యాదలతో ఆ గృహములోనికి ప్రవేశించి భీష్ముని చూచిరి. ధర్మరాజాదులందరును స్తోత్రపూర్వకముగా, భక్తిపూర్వకముగా భీష్మునకు నమస్కరించిరి, అప్పుడు భీష్ముడు సంతోషించి మిక్కిలిప్రీతిగలవాడై ధర్మరాజాదులగు ఆరుగురును ప్రత్యేకముగా యోగక్షేమములను యడిగి వారితో మరల యిట్లనెను.

ధర్మరాజాదులారా! యిక్కడికి మీరందరును యిప్పుడు వచ్చిన పనియేమో చెప్పుడు. ఏమికావలయునో అడుగుడు. ఎంత దుష్కరమైన కార్యమైనను మీరు అడిగినయెడల జేసెదను. శీఘ్రముగా ఆకార్యమును మీకు చేకూర్చగలను. మీరడుగు కార్యమసాధ్యమైనను ప్రేమపూర్వకముగా సాధ్యమగునట్లు చేయగలను. అడుగుడు అని భీష్ముడుచెప్పగా ధర్మరాజు దీనముఖముగలవాడై భీష్మునితో యిట్లనెను. తాతా భీష్మా! మాకు యేవిధముచేత రాజ్యసామ్రాజ్యము లభించునో చెప్పుడు. ఏవిధముచేత నాసైన్యమునకు వ్యాకులము రాకుండునో చెప్పుము. యీ రెండువిషయములను

యందు కృపగలిగి చెప్పవలయును. అని ధర్మరాజు అడుగగా భీష్ముడు యిట్లనెను. ధర్మరాజా! నేను యుద్ధము చేయుపర్యంతము మీకు సైన్యము నశింపుచుండుటయేగాక రాజ్యము లభింపనేరదు. నన్ను చంపినయెడల సకలశుభములును గలుగగలవు. అని భీష్ముడు చెప్పగా ధర్మరాజు యిట్లనెను. మహాత్మా! అగ్నినేత్రమును మూసికొని త్రిశూలాయుధమును దాచిపెట్టి విలాసముగా వచ్చు రుద్రునివలె నీవు శత్రుసైన్యములలో వ్రాలుచుందువు. నిన్ను యెటువంటి రథికులైనను గెలువజాలరు. నీ కృపను ఆశ్రయించుటకు వచ్చినాము. యేప్రకారముగా నిన్ను గెలువవచ్చునో ఆ వుపాయమును మాకు చెప్పవే యని ప్రార్థించగా భీష్ముడిట్లనెను. ధర్మరాజా! ఇప్పుడు నీవు చెప్పినదంతయు నిశ్చయము. నాచేతియందు ధనుస్సుయుండగా నన్ను దేవతలైనను గెలువజాలరు. నన్ను గెలుచు వుపాయము మీకు చెప్పెదను వినుము. నేను యిటువంటి శూరుడనని మీరందరును యెరిగి యిక్కడికివచ్చితిరి. అట్లు వచ్చి నన్ను గెలుచువుపాయమును అడిగితిరి. అట్లు మీరడుగగా మీరుకోరిన కార్యమును మీకు లభింపజేయుటకంటె వేరే మిక్కిలి పుణ్యము మరియొకటిలేదు. నన్ను గెలుచు వుపాయమును చెప్పెదనువినుము. ధర్మరాజా! నేను ఆయుధమును వేయక యూరకున్నపుడు నన్ను జయించుటకు సాధ్యమగును. కవచమును తీసివేసినవానిని, ఆయుధములేనివానిని వెక్కెముదించినవానిని, స్త్రీనిముందుంచుకొనినవానిని, స్త్రీయొక్క పేరుగలవానిని, శిరస్సుయందు తలగుడ్డలేనివానిని పుత్రులు లేనివానిని వీరలను చూచి బాణమువేయక కొట్టక యుద్ధముచేయక మానుకొందును. ఒక్క వ్రతమును పూనియున్నాను. అదియేమనగా చెప్పెదవినుము. పుట్టినప్పుడు లేక మధ్యకాలమందు దైవమువలన కలిగిన పురుషత్వము గలవానితో యుద్ధముచేయను. గనుక మీకొక

యుపాయమును చెప్పెదవినుము. మీపక్షమందు గల ద్రుపదరాజు యొక్క కుమారుడగు శిఖండికి పురుషత్వము లేక మధ్య కాలమందు దైవమువలన పురుషత్వము కలిగియున్నాడు. ఈవిషయమును మీరు యెరుగుదురుకదా! శిఖండి మొట్టమొదట స్త్రీయై పుట్టినందునవానిని యెదిరించి యుద్ధముచేయకయుందును గనుక ఆశిఖండిని ముందు పెట్టుకొనివచ్చి నేను బాణములు వేయనిసమయమందు మీరు నామీద బాణములు వేసి నన్ను నొప్పించి పడవేయుచు బంధుమిత్ర సహితులగు దుర్యోధనాదులను సులభముగా గెలువగలరు. ఇట్లు చేయవలయునని మనస్పూర్తిగా మిమ్ములను ప్రోత్సహించుచున్నాను. ఇట్లు మీరు చేయుట నాకు సమ్మతము. అని భీష్ముడు మనస్పూర్తిగా చెప్పెను. అంతట వారందరును భీష్మునకు నమస్కరించి, అనుజ్ఞను పొంది తమ నివాసములకు వెళ్ళిరి. ఆసమయమున భీష్ముడు పరలోక మును పొందుటకు చూచుచున్నాడనియు, నేను అక్రమముగా భీష్ముని చంపవలసివచ్చెననియు తలచుచు విచారముతోకూడిన మనస్సు గలవాడై అర్జునుడు కృష్ణునితో యిట్లనెను.

కృష్ణా! భీష్ముడు నాకు గురుడు. బ్రహ్మజ్ఞాని, ధర్మాత్ముడు, కులవయోవృద్ధుడు. సకలలోకముల చేత పూజ్యుడు. కృపావంతుడు. ఇట్టి భీష్ముని వంచనచేత చంపుటకు నాకు బుద్ధిపుట్టదు. నేను బాల్య మందు ఆటలాడుచున్నప్పుడు నా దేహమందు దుమ్ముసోకగా నన్ను భీష్ముడు ప్రీతితో యెత్తుకొనెను. అప్పుడు నాదేహమందు గల దుమ్మంతయు, భీష్ముని దేహమునకు సోకుచుండెను. నన్ను కౌగిలించు కొని మాతండ్రియగు పాండురాజుయొక్క గుణములను యీభీష్ముడు పొగడుకొనుచు కన్నీరు కార్చుచుండును. కృష్ణా! భీష్ముడునాకు తాత. అయ్యో! మాతండ్రియగు పాండురాజు చచ్చినపిమ్మట మమ్మును అప్రకారముగా పెంచి పెద్దవాండ్రనుచేసి సకలవిద్యలను చెప్పించెను.

భీష్ముని యీరీతిగా వంచనచేత చంపరాదు. భీష్ముడు తన భుజాబల శౌర్యమువలన మన సైన్యములనన్నిటిని చంపినను నేను చూచు చుందునేగాని ధర్మమార్గమును తప్పుటకు వోర్వజాలను. ధర్మరాజు యొక్క తమ్ముడనగు నేను క్రూరకర్మమును చేయజాలను. అని అర్జునుడు చెప్పగా ఆమాటలను కృష్ణుడువిని అర్జునునితో యిట్లనెను.

అర్జునా! రాజకులమందు పుట్టినవాడు క్రూరకర్మమును చేయుటకు వోర్చుకొని కొంచెమైనను విసుగక, సకలవిధములచేతను శత్రువులను చంపవలయును. శత్రువులను చంపి రాజ్యముతీసికొని జనులకు అభివృద్ధి సౌఖ్యములను కలిగించుచు ధర్మమార్గమును తప్పక ప్రజాపరిపాలనము చేయవలెను. న్యాయపరిపాలనము చేయుచు జనులవలన పన్నులు తీసుకుని ఆధనమును పుణ్యకార్యములయందు ఖర్చుపెట్టవలయును. ఇది రాజధర్మమని దేవేంద్రునితో బృహస్పతి చెప్పియున్నాడు. ఇది లోకప్రసిద్ధమైయున్నది. అర్జునా! ఇదివరకులో నీవు యుద్ధమందు భీష్ముని గెలుతునని అనేకమార్లు చెప్పియున్నావు. లోకులందరకు విశదపరచిన నీపూనికను నీవు విడువరాదు. ఏవిధము చేతనైనను భీష్ముని చంపవచ్చును. ఇట్లు చంపుట రాజధర్మ మగునే కాని క్రూరకర్మము కాజాలదు. వేయిమాటలు చెప్పుటవలన ప్రయోజనములేదు. ముఖ్యమైనమాటను చెప్పెదవినుము. భీష్ముని చంపుటకొరకు నిన్ను దైవమునిర్మించియున్నాడు. ఇదితప్పదు అని యిట్లు కృష్ణుడు చెప్పగా అర్జునుడు కృష్ణునితో యిట్లనెను.

కృష్ణా! భీష్ముని చంపుటకొరకు శిఖండి పుట్టియున్నాడు అని పెద్దలవలన వినియున్నాను. ఆమాటతప్పదు. భీష్ముడును శిఖండిమీద బాణము వేయుటలేదు. నేను శిఖండిని ముందుపెట్టుకొని భీష్మునిమీద బాణములను వేయువానివలె నటించుచు భీష్మునిమీద బాణము వేయక యితరులమీద బాణములను వేయుచు శిఖండిని రక్షించుచుండెదను,

భీష్ముని చంపుటకు పుట్టిన శిఖండి భీష్మునిమీద బాణములను వేయుచు అతనినిపడగొట్టును. అని అర్జునుడు చెప్పగా ఆమాటలను కృష్ణుడు విని నవ్వి అర్జునునితో మరల యిట్లనెను. అర్జునా ! భీష్ముడు అఖండ బలపరాక్రమశాలియగును. భీష్ముని చంపుటకు నీవొకడవు తప్ప మరియొక సమర్థుడు లేడు. నీతలంపులు యేయేప్రకారముగా నున్నను ఆతలంపులన్నియు దైవనిర్మితమైన యేర్పాటువలె ఫలింపజాలవు. దైవనిర్మితము మాత్రమే తుదముట్టునుగాని యితరతలంపులు తుద ముట్టవు. దైవనిర్మితమైన యేర్పాటును తప్పించుటకు నీకు శక్యము కాదు. నీవు భీష్ముని చంపకుండునట్లుగా తప్పించుకొనుటకు యెన్ని విధములుగా జూచినను తుదకు చంపకమానవు. చూచుచుండుము. ఇది తప్పదు అని కృష్ణుడుచెప్పగా ఆమాటలను అర్జునుడు విని అందరు వొప్పుకొని అప్పటికి యెట్లుజరుగవలెనో అట్లు జరుగవలెనని చెప్పెను. అప్పుడు కృష్ణుడును ధర్మరాజ భీమ నకుల సహదేవులును పరమానందము నొందిరి. ధర్మరాజాదులు ఆరుగురును సంభాషించు కొనుచు తమ శిబిరమునకు వెళ్ళిరి. పాండవులు కృష్ణుని వారిశిబిరము నకు పంపి వారును తమతమ నివాసములకు వెళ్ళిరి. ఆరాత్రియందు నరదరును సుఖముగా నిద్రించిరి. అని సంజయుడు తొమ్మిదవనాటి వృత్తాంతమంతయు రాత్రి జరిగినది వివరించి చెప్పగా ధృతరాష్ట్రుడు సంజయునితో యిట్లనెను. సంజయా ! పాండవులు శిఖండిని ముందు పెట్టుకొని యేప్రకారముగా భీష్మునిమీదకు పోయిరో యేప్రకారము యుద్ధక్రీడ జరిపిరో అది యంతయు చక్కగా చెప్పుము. అని ధృతరాష్ట్రు డడుగగా. అతనితో సంజయు డిట్లనెను.

## పదియవనాటి యుద్ధము

ధృతరాష్ట్రమహారాజా ! పదియవనాటి సూర్యోదయ కాల మ్మందు పాండవులు తమ సైన్యములను నడిపించుకొని యుద్ధభూమికి

వచ్చి వ్యూహముగా నిలిపిరి. ఆవ్యూహమునకు ముందర శిఖండిని నిలిపిరి. శిఖండియొక్క రెండుప్రక్కల యందును, భీమార్జునులు నిలిచిరి. ఆ శిఖండి వెనుక అభిమన్యుడును, ద్రౌపదీపుత్రులును నిలిచిరి. అభిమన్య ద్రౌపదీపుత్రులకు యిరువైపుల యందును చేకితానుడును సాత్యకియు నిలిచిరి. అభిమన్య ద్రౌపదీపుత్రులకు వెనుక ధృష్టద్యుమ్నాది పాంచాల రాజకుమారులను ముందుంచుకొని నకుల సహదేవు లుండిరి. నకుల సహదేవులకు మధ్య ధర్మరాజు నిలిచెను. ధృష్టద్యుమ్నాది పాంచాల కుమారులయొక్కయు నకుల సహదేవులయొక్కయు రెండువైపులను విరాటుడు, ద్రుపదుడు, పింగళరాజులును, కేకయదేశపు రాజులును, ధృష్టకేతుడును నిలిచిరి. ఈరీతిగా పాండవులు వ్యూహముగా తమ సైన్యములను ఏర్పరచుకొని యుద్ధమునకు నడచిరి.

ధృతరాష్ట్ర మహారాజా! కౌరవసైన్యములు బయలుదేరి భీష్ముని ముందుంచుకొని దుర్యోధనాదులగు నీ పుత్రులందరును భీష్ముని చుట్టును నిలిచిరి. భీష్మునకు కుడివైపున ద్రోణాచార్యుడును, ఎడమవైపు నశ్వత్థామయును నిలిచిరి. ఆ వ్యూహమునకు మధ్య కృపాచార్య, కృతవర్మ, భగదత్తులను ముందుంచి దుర్యోధనుడు నిలిచెను. ఆ దుర్యోధనుని చుట్టును బృహద్బలుడు, కాంభోజుడు మొదలగు రాజులందరును నిలిచిరి. సుశర్మడు త్రిగర్తదేశపురాజులు దుర్యోధనునకు వెనుకవైపున యుండిరి. ఈవిధముగా కౌరవసైన్యములు గొప్ప వ్యూహముగా నిలిచి యుద్ధమునకు నడచెను, ఇట్లు రెండుపక్షములవారును తమ సైన్యములను వ్యూహములుగా ఏర్పరుచుకొని రకరకములగు వాద్యములు మ్రోగుచుండగా యిరువురు కలిసి యుద్ధముచేయుట ప్రారంభించిరి. అప్పుడు కౌరవ పాండవులకు అతిభయంకరముగా దేవరాక్షసులకువలె గొప్పయుద్ధము

జరిగెను. ఆ యుద్ధమందు చచ్చినప్రాణులు యమధర్మరాజు పట్టణమునకు చేరుటచేత ఆ పట్టణమందు అధికముగా సందడి కలిగెను. ఆసమయమందు నకులసహదేవులు గొప్పబలపరాక్రమములచేత విజృంభించి కౌరవసైన్యములను చికాకుపరచిరి. అప్పుడు భీమార్జునులు ఒక్కతీరుగా కౌరవసైన్యములమీదకు అతిభయంకరముగా విజృంభించినందున పాండవసైన్యము లన్నియు, వుప్పొంగి మన సైన్యముల మీదకు దూకెను. అంత భీష్ముడు కోపించి ప్రళయకాల రుద్రునివలె భయంకరరూపముగలవాడై అనేక బాణసమూహములును పాండవ సైన్యములమీద కురిపించెను. ఆ బాణముల దెబ్బలచేత పాండవ సైన్యములలో నుండెడి కాల్బలము ఒకరొకరి కాళ్ళచేత పెనగి పడు చుండెను. రథముల సమూహములు విరిగి కొండలవలె క్రింద పడు చుండెను. గుఱ్ఱపుదండులు నేలకొరగి పడుచుండెను, ఏనుగులగుంపులు కొండల సమూహములవలె కూలుచుండెను. ఈరీతిగా భీష్ముని బాణములచేత తక్షణమే పాండవుల చతురంగ బలములును నశించు చుండెను. ఆసమయమందు శిఖండిచూచి శీఘ్రముగా భీష్ముని మీదకు వచ్చి మూడు క్రూరబాణములను భీష్ముని దేహమునందు నాటెను.

అప్పుడు భీష్ముడు శిఖండిని జూచి, వెనుకను దిరిగి శిఖండి ముఖము జూడక నవ్వుచు శిఖండి నుద్దేశించి యిట్లనెను. శిఖండికా! నీవు పూర్వము ఆడుదానవు. నిన్ను యిపుడు మొగవానినిగా బ్రహ్మదేవుడు సృష్టించెను. అయినను నీవిపుడు ఆడుదానవే యగుదువు. నీవు నామీద బాణములువేసి నన్ను నొప్పించినను, నీవు ఆడుదానవు గనుక నీమీద నేను బాణమును వేయను. నీవు క్రొవ్వి గర్వముచేత నామీద దనేకబాణములను వేసినను నేను నవ్వుచుందునే గాని నామనస్సునందు కొంచెమైనను కోపము పుట్టదు. అని ఖ్యా

రీతిగా భీష్ముడు శిఖండి నుద్దేశించి చెప్పగా శిఖండి విని కోపించుకొని భీష్మునితో యిట్లనెను.

భీష్మా! రాజుల నందరిని యింతకుముందు నీవు గెల్చితివి. బలవంతుడైన పరశురామునితో యుద్ధముచేసి గెలిచితివి. నీవింత బలవంతుడవైనను నీ మాత్సర్య, బలపరాక్రమములను నాయెదుట చూపలేవు. భీష్మా! నీ నేర్పువలన నాతో యిపుడు యుద్ధముచేసి నను, లేక తప్పించుకొని వెళ్ళినను నా బాణములచేత తప్పక నిన్ను పడవేయగలను. నేను యెవ్వతెనైన నీకేమి? నిన్ను పడవేసినపుడు నే నెవ్వతెనైనది నీవు చూడగలవు. ఏవిధముగా నైనను యీదిన మందు నిన్ను తరిమి పడగొట్టెదను. నీవు మొనగాడ వనెడిమాట పోగొట్టెదను. నిన్ను పడగొట్టి నా ధనుర్విద్యా పాండిత్యముచేత ప్రకాశింపగలను. చూడుమని యీరీతిగా శిఖండి కోపముచేత భీష్మునితో చెప్పుచు, అయిదుబాణములను భీష్మునిమీద వేసెను. శిఖండి మాట లర్జునుడు విని ఈ దినమందు శిఖండి పద్ధతి ఆశ్చర్య ముగా యున్నదనియు, భీష్ముడు చచ్చుటకు సమయము ప్రాప్తించిన దనియు, దైవమే యింత వుత్సాహము శిఖండికి యిచ్చెననియు, అందుచేత శిఖండి గర్వించి యీరీతిగా మాట్లాడెనని తలంచి ఆ శిఖండికి, ఎక్కువ వుత్సాహము గలుగునట్లుగా అతనితో అర్జును డిట్లనెను.

## అర్జునుడు శిఖండికి ప్రోత్సాహముకలిగించి భీష్మునిపై బంపుట

శిఖండీ! ఇప్పుడు నీవు భీష్ముని చంపెదనని అందరు విను చుండగా మాటలాడితివి. భీష్ముని పడగొట్టనియెడల మనలను లోకమంతయు యెగతాళి చేయును. నేనుండగా నిన్నెవరును యేమియు చేయజాలరు. భీష్ముని యెదిరించి అతనిమీద బాణములను

వేయుము. అని అర్జునుడు శిఖండితో చెప్పెను. భీష్ముడు శిఖండి యెదుటనుండి తొలగిపోయి పాంచాలదేశపు సైన్యములను తరిమెను. ఆసమయమందు పాండవబలము లర్జునుని ముందుపెట్టుకొని కౌరవ సైన్యములను కొట్టి తరిమెను. కౌరవసైన్యములు చెదరి మరలి పోయెను. తన సైన్యములు మరలుట దుర్యోధనుడు చూచి భీష్ము నితో యిట్లనెను. మహాత్మా! భీష్మా! నీవుండగా మన సైన్యము హీనదశకు రావచ్చునా! దుర్యోధను డట్లు చెప్పగా భీష్ము డిట్లనెను. దుర్యోధనా! ఇదివరకు పూర్వము పాండవసైన్యములలో పదివేల రథికులను నేనుచంపెదనని నీతో ప్రతిజ్ఞచేసితిని. ఆప్రకారమేపదివేల రథికులను నేను చంపితిని. నీవు యింతవరకు నన్ను పోషించితివి. నీ ఋణమును తీర్చితిని. ఇక నాబలశక్తి తగ్గునట్లుగా తోచుచున్నది. దుర్యోధనా! యీదినము పద్ధతిని చూడగా పాండవులు నన్నైనను చంపుదురు. నేను పాండవులనైనను చంపుదును. నేను మనుష్యబల మును గలిగియున్నాను. పాండవులు దైవబలవంతులగుదురు. గనుక నాచేత పాండవులు గెలువబడరు. అయినను నా బాహుబలమును చూపెదను చూడుము, అని భీష్ముడు దుర్యోధనునితో చెప్పి గొప్ప శక్తివంతములగు నిప్పుమంటలవంటి బాణసమూహములచేత పాండ వులయొక్క మహారథిక సమూహములను నొప్పించెను. భీష్ముడు పొగలేని అగ్నిహోత్రునివలె మండుచు పాండవులు చూచుటకు సాధ్యముగాక యుండెను.

ఆసమయమందు నీ పుత్రులగు దుర్యోధనాదులు భీష్ముని ఆధారముచేసికొని పాండవబలములను నొప్పింపసాగిరి. అదిచూచి పాండవుల సైన్యములగు మత్స్యదేశపు బలములును పాంచాల దేశపు బలములును యాదవబలములును పాండ్యదేశపు బలములును కేకయదేశము మొదలగు బలములన్నియునొక్కపెట్టున కౌరవసైన్య

ములమీాదకు పోయెను. కౌరవసైన్యములును, పాండవసైన్యములను యెదిరించి యుద్ధముచేసెను. ఆ రెండుపక్షముల సైన్యములకును, అప్పు డతిభయంకరమైన యుద్ధము జరిగెను. అట్టి సమయమం దర్జునుడు శిఖండిని జూచి యిట్లనెను.

శిఖండీ! నీవు భీష్మునకు భయపడరాదు. నేనుండగా నీకు భయమేమి? నీవు భీష్ముని దగ్గరకు వెళ్ళి యెదిరింపుము నీవు యెదిరించినపుడు, నేను కుప్పలు కుప్పలు బాణములనువేసి శీఘ్రముగా భీష్ముని పడగొట్టెదను. అని యిట్లు అర్జునుడు శిఖండితో చెప్పగా ఆ మాటలను పాండవసేనానాయకుడైన ధృష్టద్యుమ్నుడు విని పాండవ రధికులతో యిట్లనెను. పాండవరధికులారా! మనయోధుల నందరిని భీష్మునిమీాదకు తరుముడు. మనకు అర్జునుండుండగా మనము భీష్మునకు భయపడవలసిన పనిలేదు. అని యిట్లు ధృష్టద్యుమ్నుడు పాండవరధికులతో చెప్పుచు సింహనాదముచేసి భీష్మునిమీాదకు పోయెను. అతని వెంటనే ధర్మరాజ భీమ నకుల సహదేవులును అభిమన్యుడును ద్రౌపదీ పుత్రులును, ద్రుపదుడును, విరాటుడును సాత్యకియు చేకితానుడును ధృష్టకేతుడును కేకయదేశపు రాజులును మగధదేశపు రాజులును మొదలగు పాండవరధికులందరును ఒక్కసారే ఒక్కపెట్టున భీష్మునిమీాదకు పోయిరి. కౌరవుల పక్షమందుండు అశ్వత్థామయు భూరిశ్రవుడును కృతవర్మయు కృపాచార్యుడును కాంభోజదేశపు రాజులును, వికర్ణుడును, దుర్ముఖుడును వివింశతియు, చిత్రసేనుడును. వీరు మొదలగు కౌరవరధికులలో మొదలగాండ్రందరును భీష్మునకు ముందు మిగిలి ధృష్టద్యుమ్న ధర్మరాజాదులకు అడ్డుపడి యెదిరించిరి. భీష్ముని మీాదకు వచ్చిన పాండవ రధికులను వారికి అడ్డుపడిన కౌరవరధికులను దేవతలు రెప్పలార్పక

చూచుచుండిరి. అట్లుచూచుటచేత దేవతలకు గల అనిమిషులనుపేరు అప్పుడు సార్థకమాయెను.

ధృతరాష్ట్ర మహారాజా! ఆ సమయమందు అర్జునుడు శిఖండిని ముందుపెట్టుకొని భీష్మునకు అడ్డుపడినవారిని తరుముచుండెను. పొంగివచ్చు సముద్రమునకు చెలియలికట్ట అడ్డుపడినట్లు అర్జునునకు దుశ్శాసనుడు శీఘ్రముగా అడ్డమువచ్చెను. దుశ్శాసనుడు యిరువది బాణములను కృష్ణార్జునుల దేహములయందు వేసెను. అర్జునుడు కోపముగలవాడై నూరుబాణములచేత దుశ్శాసనుని నొప్పించెను. దుశ్శాసనుడు బాధనొందియు అయిదు బాణములను అర్జును నొసటి యందు నాటించెను. అర్జునుడు కోపించుకొని దుశ్శాసనుని ధనుస్సును విరిచి అధికముగా బాణములను కురిపించెను. అందుకుదుశ్శాసనుడు మరియొక ధనుస్సును తీసికొని యరువదియైదు బాణములను అర్జునుని మీద వేసెను. అర్జునుడు యిరువదియైదు బాణములను నరికి ఒక ప్రకాశబాణమును దుశ్శాసనుని రొమ్మునందు నాటించెను. ఆదెబ్బ చేత దుశ్శాసనుడు మూర్ఛిల్లి రథముమీద వ్రాలెను.

దుశ్శాసనుడు మూర్ఛిల్లగా అతని సారథి దుశ్శాసనుని రథమును భీష్ముని రథముయొక్క వెనుకప్రక్కకు తోలుకొనిపోయెను. అంతట దుశ్శాసనుడు మూర్ఛను తెలిసికొని మరల ధైర్యముచేత వచ్చి అర్జునుని యెదిరించెను. ధృతరాష్ట్ర మహారాజా! ఆ సాత్యకితో అలంబసుడును, భగదత్తుడును వీరిద్దరును యుద్ధముచేయుచుండిరి. అభిమన్యునితో సుదక్షిణుడు యుద్ధముచేయుచుండెను. విరాట ద్రుపదరాజులతో అశ్వత్థామ యుద్ధముచేయుచుండెను. సహదేవునితో కృపాచార్యుడు యుద్ధముచేయుచుండెను. నకులునితో వికర్ణుడు యుద్ధముచేయుచుండెను. ఘటోత్కచునితో దుర్ముఖుడు యుద్ధము చేయుచుండెను. చేకితానునితో చిత్రసేనుడు యుద్ధము చేయుచుం

డెను. ధర్మరాజుతో ద్రోణాచార్యుడు యుద్ధము చేయుచుండెను. ఆ రెండుపక్షములవారిలో మహారథికులగు వారు ఒకరితో నొకరు యుద్ధము చేయుచుండగా అతిభయంకరముగా నుండెను. రెండు పక్షములయందుండు యోధులును కలసి యుద్ధముచేయుచు ఒకరు మరియొకరి తుక్కములను విరచుచు ఒకరు మరియొకరి గుర్రములను చంపుచు ఒకరు మరియొకరి సారథులను చంపుచు ఒక రింకొకరి ధనుస్సులను విరుచుచు ఘోరయుద్ధము చేయుచుండిరి. ఆ బాణముల కాంతులు మెరుపులవలె నుండెను. అల్లెత్రాడులయొక్క ధ్వనులు భయంకరములైన వురుములవలె నుండెను. రక్తధారలు వర్షధారలవలె నుండెను. యుద్ధభూమి క్రొత్తగా గలిగిన మేఘమువలె భయమును కలిగింపుచుండెను. ఆ యుద్ధమును చక్కగా చూడవలెనను తలంపుచేత సూర్యుడు ఆకాశమధ్యమునకు వచ్చెనో యనునట్లు మధ్యాహ్నమాయెను. ఆసమయమందు దుశ్శాసనుడు వేయు గొప్ప శక్తివంతములగు బాణములను అర్జునుడు నరికివేసి అధికమైన కోపాగ్నిచేత ప్రకాశింపుచు దుశ్శాసనునిమీద అధికమైన తీక్ష్ణబాణములను వేసెను. ఆ బాణముల దెబ్బలచేత దుశ్శాసనుని ధనుస్సు తుక్కములు విరిగి అతని దేహము కత్తులచేత కోసినట్లై కండలు కండలాయెను. దుశ్శాసనుడు భయపడి పారిపోయెను. అర్జునుడు భీష్మునిముందరనుండు కౌరవబలములనన్నిటిని చంపుచుండెను. ద్రోణుడది చూచి భూమ్యాకాశములు నిండునట్లుగా తన అల్లెత్రాటిని ధ్వనింపజేయుచు అర్జునునిమీదకు రాదలచెను. అట్లు రాదలచివచ్చుచుండగా ధర్మరాజు ద్రోణుని తరిమికొట్టుచు తనసైన్యముతో అడ్డపడెను. ధర్మరాజు ద్రోణునకు అడ్డుపడి రానీయక ఘోరముగా యుద్ధముచేయుచుండెను. అశ్వత్థామ క్రోధముచేత కండ్లయందు

నిప్పులను రాల్చునట్లుగా యెఱ్ఱని నేత్రములుగలవాడై ద్రోణునకు సహాయపడుటకు వచ్చెను.

## ద్రోణాచార్య అశ్వత్థామను భీష్మునకు సహాయముగా బంపుట

ఆసమయమున ద్రోణాచార్యుడు అశ్వత్థామతో యిట్లనెను. పుత్రుడా! అశ్వత్థామా! ఇప్పుడు తోచు దుర్నిమిత్తములను చెప్పెదనువినుము. దివ్యాస్త్రముల తంత్రములు తడబడుచున్నవి. మంత్ర శక్తి తప్పిపోవుచున్నది. నాధనుస్సు వడకుచున్నది. నామనస్సు నా వశమందుండలేదు. నాచేతులు కాళ్ళు మొదలగు ఆవయవములు శక్తిలేక వ్రేలాడుచున్నవి. కొంచెమైనను ధైర్యములేదు. నేటిపద్ధతిని చూడగా అర్జునుడు తన పూనికను తీర్చునట్లు తోచుచున్నది. అర్జునుడు నేటిదినమున తప్పక భీష్ముని పడవేయునని నిశ్చయమైన బుద్ధి నాకు తోచుచున్నది. ఓరీ! అశ్వద్ధామా! అర్జునునున్నవైపు తల యెత్తి చూడుము. అర్జునుని బాణములచేత కౌరవసైన్యములలో నుండు గుఱ్ఱములు కూలుచున్నవి. ఏనుగులు భూమియందు వ్రాలుచున్నవి. రథములు విరిగి పడుచున్నవి. అర్జునునివైపు చూడగా ప్రళయకాలమందు గల చిహ్నములన్నియు చూచినట్లు కనబడుచున్నవి. అదిగాక కౌరవసైన్యములపైన గ్రద్దలు వ్రాలుచున్నవి. నిప్పులును, బొగ్గులును, పైనుండి కౌరవసైన్యములమీాద పడుచుండెను. నక్కలయొక్క కూతలు కఠోరముగా వినబడుచున్నవి. యీ కారణమువలన భీష్మునకు కీడు కలుగును. ధర్మరాజుయొక్క ముఖమందు మిక్కిలి యెక్కువగా క్రోధమున్నట్లు కనబడుచున్నది. ధర్మరాజు ద్రౌపదీపుత్రులను నకులసహదేవులను చేర్చుకొని నన్ను ఢీకొట్టుచున్నాడు. ఈధర్మరాజును తప్పించుకొనుట నాకు సాధ్యము

గాదు. గనుక నీవు భీష్మునిదగ్గరకుపోయి అతని కిరుప్రక్కలను సహాయముగా నుండుము. ఇప్పుడు ప్రాణములను దాచుటకు శక్యము కాదు. అని ద్రోణాచార్యుడు తనకొడుకగు అశ్వత్థామతో చెప్పగా అశ్వత్థామ అడ్డములేనివాడై భీష్మునిదగ్గరగా పోయెను. ఆసమయమున అర్జునుడు శిఖండిని ముందుపెట్టుకొని భీష్మునిచంపుటకు త్వరపడుచుండెను. భీముడు సహాయపడి కౌరవసైన్యమును తరుముచుండెను. భీముడు కౌరవసైన్యములను తరిమి భీష్మునిముందరయుండు బలములమీదపడి చంపుటకు ప్రారంభించెను. కౌరవరథికులగు భగదత్తుడును కృపాచార్యుడును, కృతవర్మయు, శల్యుడును, సైంధవుడును, చిత్రసేనుడు. దుర్మర్షణుడును, విందుడును, అనువిందుడును, వికర్ణుడును, యీపదిమందియు, ఒక్కపెట్టున భీమునిచుట్టుకొనిరి. ఆ చుట్టుకొనిన పదిమందియు, నానావిధములైన బాణసమూహముల చేత భీముని నొప్పించిరి. భీముడు నొచ్చియు పదిమందితో యుద్ధము జేయుచుండెను. ఆసమయమున భీమునకు అర్జునుడు సహాయుడై అధికమైన తీక్ష్ణబాణసమూహములచేత కౌరవరథికుల ధనుస్సులను తునుకలుగా విరచుచు బాణములను పొడిపొడి యగునట్లు నరుకుచు, టెక్కెములను గొడుగులను చామరములను విరిచివేయుచు భూషణములను పొడిపొడిగా నరికివేయుచుండెను. ఇవి యన్నియు భూమిని దట్టముగా కప్పెను. దుర్యోధనుడు చూచి సుశర్మమొదలగు రాజులను జూచి భీమార్జునులను యెదిరించి యుద్ధము చేయుటకు పంపించెను.

అంతట కౌరవపక్షమందు గల సుశర్ముడు మొదలగు అనేక రాజులువచ్చి వారును పైన చెప్పబడిన పదుగురు కౌరవరథికులును చేరి భీమార్జునులతో యుద్ధము చేయుచు వారిద్దరియెదుట నిలువలేక వెనుకకుతగ్గుచుండిరి. దుర్యోధనుడుచూచి కౌరవసైన్యముల నన్నింటిని

భీమార్జునులమీదికి పంపించెను. ఇట్లు అనేకమైన కౌరవసైన్యములు భీమార్జునులను చుట్టుకొనగా ఆ సైన్యములతో భీమార్జును లిద్దరును. యుద్ధముచేయుటకు కష్టముగానుండెను. అది యెరిగియు అభిమన్యుడు సాత్యకి మొదలగు పాండవధికులు అనేకులు తమసైన్యములతో భీమార్జునులకు సహాయముగా వచ్చిరి. పాండవసైన్యము లధిక పరాక్రమశౌర్యములు గలవగుచుకౌరవసైన్యములను కొట్టుచుండెను. భీష్ముడు సహించక యేనుగును చూచిన సింహమువలె కోపించుకొని రౌద్రాకారుడై అనేక తీక్ష్ణబాణసమూహములను పాండవసైన్యముల మీద కురిపించెను. ఆబాణముల దెబ్బచేత పాండవసైన్యములలో సారథులు చచ్చిపడుచుండిరి. గుర్రపుదండులు అధికముగా విరిగి పడు చుండెను.

భీష్ముడు అధికముగా అనేకవిధములైన బాణములను పాండవ సైన్యములమీద ప్రయోగించుచు ఆసైన్యములను చంపుచుయెక్కడ చూచినను భీష్ముడే కనబడుచు పాండవసైన్యములను చికాకుపరచు చుండెను. ఇట్లు భీష్ముడు చాలాసేపు యుద్ధక్రీడయందు విహరించెను. మూడుజాములాయెను. భీష్ముడు తనమనస్సులో యిట్లని తలచెను. నేటికి పదిదినములనుంచి నాతీక్ష్ణబాణములచేత శ్రేష్ఠులగు రాజులను అనేకులను చంపితిని. ఇది క్రూరకర్మము, యుద్ధకర్మమందు నామన స్సుకు విసుగుపుట్టుచున్నది. ఇక యీశరీరమును విడుచుట మంచిది అనిభీష్ముడు తనమనస్సులో తలచుకొని తొలగిసైన్యములను తెరపి చేసుకొనుచు యుద్ధముచేయువానివలె వెళ్ళి ధర్మరాజు రథముదగ్గిరకు తన రథమును తోలించి ధర్మరాజుతో యిట్లనెను.

ధర్మరాజా! నేను పుట్టినదిమొదలుకొని యింతవరను క్రూర ముగా రాజులును చంపుచుంటిని ఇట్లు చంపుచుండగా నాఆయుష్కాల ఘంతయు వెళ్ళిపోయెను. ఇప్పుడు నాకు యుద్ధమందు విసుకుపుట్టినది.

ఈరాక్షసకార్యమగు యుద్ధమును యిక నేను చేయజాలను. మీారు నాకు మేలును కలిగించుటకు కోరినయెడల మీారందరును శిఖండిని ముందుంచుకొని అందరును ఒక్కసారే నన్ను చుట్టుకొని నాదేహ మందు తీక్ష్ణబాణములను నాటింపుడు. ఆలస్యముచేయవద్దు అని భీష్ముడు ధర్మరాజుతో చెప్పి యుద్ధముచేయువానివలె రథమును పరు గెత్తించుచు పాంచాలదేశపు సైన్యములమీాదకు పోయెను. ధర్మ రాజు తన సమీాపమందుండు ధృష్టద్యుమ్నుని జూచి అతనితో యిట్లనెను. ధృష్టద్యుమ్నా! భీష్ముడు చెప్పినమాటలను వింటివిగదా! శీఘ్రముగా మనరథికుల నందరిని ఒక్కసారే భీష్మునిమీాదకుపంపుము. నీవును, భీముడును, అర్జునుడును, మన యోధులనందరిని తరిమికొని భీష్మునిమీాదకు వెళ్ళుడు. అని ధర్మరాజు ధృష్టద్యుమ్నునితో చెప్పగా దుష్టద్యుమ్నుడు మత్స్యదేశపురాజగు విరాటునకును కేకయదేశము మొదలగు రాజులకందరికిని చేయివిసరెను. అంత పాండవపక్షమందలి మహారథికులందరును ఒక్కసారే బయలుదేరి వచ్చిరి. దృష్టద్యు మ్నుడు భీమార్జునులను ఆధారముచేసికొని పాండవయోధుల నందరిని భీష్మునిమీాదకు తరిమెను. దుర్యోధనుడును అతనితమ్ములగు దుశ్శాస నాదులను అనేక కౌరవరథికులును భీష్మునిరథమునకు ముందు మిగిలి పాండవరథికులను యెదిరించిరి. ఆ సమయమందు ఆరెండు పక్షముల వారికిని ఘోరముగా మహాయుద్ధము జరిగెను.

ధృతరాష్ట్ర మహారాజా! ఆ సమయమందు అభిమన్యుడు దుర్యోధనుని నొప్పించెను. అశ్వత్థామ సాత్యకితో యుద్ధముచేసి సాత్యకి దేహమును బాణమయముచేసెను. చేదిదేశపురాజుతో పౌరవుడు యుద్ధముచేయుచుండెను. వారిద్దరి శౌర్యపరాక్రమములు సమానములుగానుండెను. ఆ సమయమందు భీముడు దుర్యోధనుని యొక్క యేనుగుసైన్యమును చంపివేసెను. ఈప్రకారముగా పాండవ

రథికులు భీష్ముని చంపుటకును కౌరవరథికులు భీష్ముని కాపాడుటకును, కలసి అనేకవిధములుగా అనేకవిధములగు బాణములచేత కొట్టుకొనుచుండిరి. ఆ సమయమందు సింహము సింహముమీదకు పోయినట్లుగా అర్జునుడు భీష్మునిమీదకు పోవుచుండగా దుశ్శాసనుడు అర్జునునకు అడ్డుపడి యెదిరించెను. దేవతలు దుశ్శాసనుని పొగడిరి.

ధృతరాష్ట్ర మహారాజా! దుశ్శాసనునితో యుద్ధము చేయుటకు అర్జునుడు ఒకడు తప్ప మరియొక సమర్థుడు కనబడలేదు. అర్జునుడు దుశ్శాసనుని దేహమందు తీక్ష్ణబాణ పంక్తిని ప్రయోగించి నాటించెను. ఆ బాణముల దెబ్బలచేత దుశ్శాసనుడు నొచ్చి భీష్ముని యొక్క రథము వెనుకకు వెళ్ళెను. ఆ సమయమందు భగదత్తుడు అర్జునునకు అడ్డపడి యుండెను. అర్జునుడు తన బాణములచేత భగదత్తుని నిశ్చేష్టితునిగా చేసి అతని తెల్లయేనుగును కొట్టి రక్తమయముగా చేయగా ఆ యేనుగు అప్పుడు యెర్రగా నుండెను. ఆ దెబ్బలకు భగదత్తుడు నిలువజాలక తొలగి ద్రుపదుని మీదకు వెళ్లెను. అర్జునుడు శిఖండిని ముందు నడిపించుకొని వెళ్ళి భీష్ముని ముందర సైన్యములను చెదరగొట్టి తెరపి జేసి భీష్మునిమీద బాణములను వేయుమని శిఖండికి పురికొల్పెను. ఆ సమయమున కౌరవరథికులనేకులు భీష్మునిముందు మిగిలి అతిభయంకరముగా అర్జునుని చుట్టుకొనిరి. అందులకు అర్జునుడు కోపించుకొని వారిమీద బాణవర్షమును కురిపించెను. పెద్దగాలిచేత మేఘములు పోయినట్లు అర్జునుని బాణములచేత కౌరవరథికులందరును చెదరిపోయిరి. ఆ సమయమందు శిఖండి భీష్మునిమీద తీక్ష్ణబాణములను వేసెను. భీష్ముడు అధిక శౌర్యముగలవాడై శిఖండిమీద బాణములను వేయుటకు యిష్టము లేక శిఖండి ప్రక్కలయందుండు పాండవరథికులమీద బాణములను వేయుచుండెను. ఆ సమయమందు అర్జునుడు శిఖండిని పురికొల్పుచు

తరుమగా శిఖండి భీష్ముని విశాలమైన రొమ్మునందు బాణములను గుచ్చుచుండెను. శిఖండి తనమీదవేయు బాణములను భీష్ముడు నవ్వుచు యంత్రజలములలో కలిసిన యేనుగులవలె చిక్కుపడి యుండెను. భీష్ముడు తనమీదవేయు శిఖండి బాణములను లక్ష్యము చేయక శిఖండి తన దగ్గరకు వచ్చినను వానిమీద బాణములను వేయక అర్జుననిమీద బాణములను వేయుచుండెను. అంతట దుశ్శాసనుడు మరల అర్జునకుఅడ్డుపడి యెదిరించి అర్జునుడు ఆశ్చర్య పడునట్లుగా యుద్ధముచేసి అర్జునునిచేత నొచ్చి పారిపోయెను. దుర్యో ధను డదిచూచి బిగ్గరగా అరచుచు చేయివిసరి పురికొల్పగా కళింగ దేశపు సైన్యములును మాళవదేశపు సైన్యములును బాహ్లికదేశపు సైన్యములును ఒక్కసారే అర్జుననిమీదకు వచ్చెను. అప్పుడు అర్జు నుడు తనదివ్యాస్త్ర సమూహముల శక్తినిచూపి వానినన్నిటిని చంపివేసెను.

అర్జునుడు కౌరవసైన్యములను చంపి తెరపిచేయగా శిఖండి తీక్ష్ణబాణములను భీష్మునిమీద నాటించెను. ఆసమయమందు దుశ్శా సనుడు కృపాచార్యుని, శల్యుని, వివింశతిని, వికర్ణుని, తనకు సహా యము చేసికొని వచ్చి భీష్మునకు అడ్డుపడి అర్జునుని యెదిరించెను. అర్జునుడు దుశ్శాసనాదులగు అయిదుగురి గుఱ్ఱములనుచంపి అయిదు గురిని విరథులను చేసెను. దుర్యోధనుడు అతని తమ్ములగు దుశ్శాస నాదులందరును మిక్కిలి కోపముగలవారై తెంపుచేసి బలపరాక్రమ ములచేత గర్వించి అర్జుననిమీదకు వచ్చిరి. వారువచ్చిన వెంటనే కౌరవసైన్యములన్నియు అర్జునుని చుట్టుకొనెను. పాండవసైన్యములు కౌరవసైన్యములతో యుద్ధముచేయుచుండెను. ఇట్లు తనయెదుట యుద్ధముచేయు తన మనుమలను భీష్ముడుచూచి మెచ్చుకొని శీఘ్ర ముగా దివ్యాస్త్రమును సంధించి పాండవ సైన్యములమీద వేయు

టకు ప్రయత్నించెను. ఆ దివ్యాస్త్రమును మంత్ర పూర్వకముగా విడుచు సమయమందు భీష్మునకు శిఖండి కనబడెను. శిఖండినిచూచిన తోడనే దివ్యాస్త్రమును ప్రయోగించుట మానుకొని ఉపసంహరించెను.

## విరటుని తమ్ముడగు శతానీకుడు భీష్మునిచేజచ్చుట

ధృతరాష్ట్రమహారాజా! పాండవపక్షమందుండు సోమక సైన్యమును మత్స్యదేశపురాజుల సైన్యములును అతిభయంకరముగా వచ్చి కౌరవసైన్యములను తరుముచుండెను. భీష్ముడు మిక్కిలి పరాక్రమముచేత విజృంభించి ఆ సైన్యములను చీల్చి చెండాడి చంపివేయుచుండెను. ఆ సైన్యములుచచ్చి క్రిందపడినందున యుద్ధభూమియంతయు, మిక్కిలి భయంకరముగా పీనుగుపెంటలై పడియుండెను. ఇట్లు భీష్ముడు పాండవసైన్యములను హీనదశకు తెచ్చుచుండగా విరటుని తమ్ముడగు శతానీకుడు ధైర్యసాహసములచేత రాక్షసునివలె భీష్ముని యెదిరించెను. యుద్ధవీరులందరును ఆ శతానీకుని పొగడిరి. శతానీకుడు భీష్ముని యెదిరించి మిక్కిలి తీవ్రబాణములచేత భీష్ముని బాధించెను. అంతట భీష్ముడు కోపించుకొని శతానీకుని యొక్క ధనుస్సును విరిచి ముక్కలను నరికివేసెను. శతానీకుడు ఒక శక్త్యాయుధమును భీష్మునిమీద వేసెను. భీష్ముడు ఆశక్త్యాయుధమును తుండ్లుగానరికి ఒక భయంకరమైన ప్రకాశమానమైన బాణములచేత శతానీకునియొక్క శిరస్సు నరికివేసెను. ఈరీతిగా భీష్ముడు శతానీకుని చంపగా పాండవ సైన్యములన్నియు చెదరిపోయెను. ఆసమయమందు భీష్ముడు మధ్యాహ్నపు సూర్యునివలె ప్రకాశింపుచుండెను. అదియంతయు కృష్ణుడు తెలిసికొని అర్జునునితో చెప్పెను.

అర్జునా! యిప్పుడు మన సైన్యములన్నియు చెడి పారిపోవు చున్నవి. నీవు యిప్పుడు శీఘ్రముగా భీష్ముని యెదిరించని యెడల కార్యము చెడిపోవును. గనుక శీఘ్రముగా భీష్మునకు అడ్డుపడి అతనిని గెలువుము. అని కృష్ణుడు చెప్పగా అర్జునుడు శీఘ్రముగా భీష్మునకు అడ్డుపడి అతనిరథము మీదను గుర్రములమీదను సారథిమీదను భీష్మునిమీదను అనేక బాణ సమూహములను వేసెను. శిఖండి బాణములచేత భీష్ముడు నొచ్చియు, శిఖండిమీద బాణములను వేయుటను యిష్టములేక యుండెను. ఆ మధ్యకాలమందు అర్జునుడు భీష్ముని యొక్క ధనస్సును విరిచి భీష్మునిమీద అనేక తీక్ష్ణబాణ ములను వేయుచుండెను.

కౌరవరథికు లదిచూచి ఓర్వజాలక శల్యుడును, శల్యుడును, కృపాచార్యుడును, కృతవర్మయు, చిత్రసేనుడును, భూరిశ్రవుడును, మొదలగు కౌరవ రథికశ్రేష్ఠు లందరును మనుష్యులకు లభించని దివ్యాస్త్ర సమూహములన్నియు ప్రకాశింపజేయుచు దివ్యాస్త్రముల నర్జునునిమీద ప్రయోగింపుచు, భీష్మున కడ్డుపడి అర్జునుని యెదిరిం చిరి. కౌరవరథికులు భీష్మున కడ్డుపడుడనియు, భీష్మునకు ముందు వైపు నిలిచియుండుడనియు మిక్కిలి పెద్దగా అరచుచుండిరి. ఆ కేకల ధ్వనులు అకాసము తూట్లుపడునట్లుండెను. కౌరవసైన్యము లన్నియు వచ్చి అర్జునుని చుట్టుకొనెను. అప్పుడు పాండవరథికులగు భీముడును, సాత్యకియు, అభిమన్యుడును విరాటుడును ద్రుపదుడును ఘటోత్క చుడు మొదలగు యోధులందరును కౌరవ రథిక సైన్యములమీద పడిరి. ఆ రెండుపక్షములవారును దేవరాక్షసులవలె మహాయుద్ధము చేసిరి.

ధృతరాష్ట్రమహారాజా! ఆసమయమున నర్జునుడు కౌరవ రథి కుల కందరికి అన్నిరూపులుగా నున్నట్లు ఐంద్ర వారణ ఆగ్నేయాది

దివ్యాస్త్రములచేత కౌరవసైన్యములను చెదరగొట్టుచు శిఖండిని రక్షించుచు ఆశిఖండినిపురికొల్పుచు వానిచేత భీష్మునిమీద బాణము వేయించుచుండెను అర్జునుడు భీష్ము డెన్ని ధనుస్సులు యెత్తికొని నను ఆ ధనుస్సుల నన్నిటిని వెంటనే నరకివేయుచుండెను. ఆసమయ మున భీష్ముడు క్రూరమగు ఒక శక్త్యాయుధము నర్జునునిమీద ప్రయోగించెను. అర్జునుడు శక్త్యాయుధమును నరికివేసి భీష్ముని యొక్క సారథిని చంపి టెక్కెమును విరిచెను. భీష్ము డర్జునునిచేత సారథి టెక్కెములు నరుకబడి తనలో తానిట్లని తలంచెను. కృష్ణుడు యీ పాండవుల పక్షముగా లేనియెడల నాయొక్క ధనుస్సుచేత యీ పాండవులను నేను గెలువగలను. ఆవిషయము నటుండనిమ్ము. గడచిన రాత్రియందు యీ పాండవులు కృష్ణునితీసికొని నాదగ్గరకు వచ్చి నన్ను ప్రార్థించగా నన్ను గెలుచు వుపాయమును వీరికి చెప్పి తిని. ఇకను యుద్ధము చేయుట మానుకొని శాంతిని పొందియుండె దను. ఇక శత్రుసైన్యములను చంపుటవలన ప్రయోజనము లేదు. అని భీష్ముడు తన మనస్సులో తలంచుచుండెను. ఆతలంపును ఆకాశమందుండు దేవతలు యెరిగి భీష్ముని వుద్దేశించి యిట్లు పలికిరి.

భీష్మా! నీవు యిప్పుడు తలచిన ప్రకారము చేయుట మాకు సమ్మతము. అని దేవతలు మిక్కిలి ప్రీతితో భీష్మునకు చెప్పిరి. అట్లు దేవతలు చెప్పిన మాటలను భీష్ముడొక్కడును, వ్యాసమునికృపవలన నేనును వింటిమి. ఆసమయమున సూక్ష్మమైన నీటితుంపురులతో గూడిన చల్లని గాలి భీష్మునిమీద విసరెను. దేవవాద్యములు మ్రోగెను. పుష్పవర్షములు భీష్మునిమీద కురిసెను. ఈ దేవవాద్య పుష్పవర్షాదులు భీష్మునకును నాకును కనబడెనే గాని యితరులకు యెవ్వరికిని కనబడలేదు. ఇట్లు భీష్ముడు యుద్ధము మానవలెనని

నిశ్చయించియు తాను బాణమును వేయనియెడల పాండవ పక్షపాతి యని యితరులు తలచెదరని అభిప్రాయముతో మరియొక ధనుస్సును తీసికొని బాణములను సంధించెను. అప్పుడు శిఖండి అతిశీఘ్రముగా గొప్పవైన ననేకబాణములను వేసెను. ఆ బాణములకు భీష్ముడు నొచ్చునందున నర్జునుడు నవ్వి తన బాణములను భీష్మునియందు నాటెను. భీష్ముడును అధికమైన ఉల్లాసముచేత అర్జునునిమీద ననేక బాణములను వేసెను. ఆ బాణములనన్నిటిని అర్జునుడు నరికివేసి అధికమైన కోపముచేత భీష్మునియొక్క ధనుస్సును విరిచెను. మిక్కిలి తీక్ష్ణమైన బాణములను భీష్ముని దేహముమీద నాటెను. అర్జునుడు పొంగి వెలుపలకు వచ్చిన మహాసముద్రమువలె అడ్డములేనివాడై యుండెను. ఆ సమయమందు కౌరవులును, వారి రథికులును భీష్ముడును, అర్జునుని వారించుటకైనను, అతనిదగ్గరకు, వెళ్ళుటకైనను అతనిని యెదిరించుటకైనను గాని శక్తిలేక యుండిరి. అట్లున్న అర్జునుని భీష్ముడు జూచి ఆశ్చర్యపడి నిశ్చేష్టితుడై యుండెను ఆ సమయమందు భీష్ముని విడువక భీష్ముని కిరుప్రక్కల యందును నీ కుమారులగు దుర్యోధనుడు దుశ్శాసనుడు మొదలగు వారందరుండుట భీష్ముడు కలయ జూచి దుర్యోధనునితో యిట్లనెను.

దుర్యోధనుడా! ఈ మహావీరుడగు అర్జునుని యుద్ధమందు సకల దేవరాక్షసులైనను గెలువజాలరు. అర్జునుడు కోపించినయెడల మనవంటి మనుష్యుల మతనియెదుట యెంతమాత్రమును నిలువ జాలము. భయంకరుడైన యీ అర్జునుడు లేనియెడల పాండవుల సైన్యముల నన్నిటిని నేనొక్కడనే చంపజాలుదును. ఇది సత్యము. ఈ అర్జునునియెదుట మరియొక డెవ్వడైనను ధనుస్సును యెత్తలేడు అని భీష్ముడు దుర్యోధనునితో చెప్పుచుండగా శిఖండి ధనుస్సువలె వెనుకతట్టు అర్జునుడు తన ధనుస్సును నిలిపి ఆ శిఖండి వేసినట్లుగా

అర్జునుడు గొప్ప బాణములను భీష్మునిమీద వేసెను. భీష్ముడు తన ప్రక్కనుండు దుశ్శాసనుని జూచి అతనితో యిట్లనెను. దుశ్శాసనా! ఇప్పుడు నాదేహమందు గ్రుచ్చుకొనిన బాణములు పిడుగులతో సమానములై యున్నవి. ఈ బాణము లర్జునుని బాణములేగాని శిఖండి వేసిన బాణములు గావుసుమా! నక్కదోసకాయ గర్భమును శోధించినట్లు యీ బాణములు నాదేహమును చీల్చుచున్నవి. అటువంటి బాణములు శిఖండికి యెన్నడైనను లేవు. మరియు యీ బాణములు బ్రహ్మదండమువలె మర్మసంధులను భేదింపుచున్నవి. ఇవి శిఖండి బాణములైన యెడల మర్మములను భేదించుచు నా దేహమందు గ్రుచ్చుకొనవు. ఈ బాణములు యమదూతలవలె ప్రాణములనులాగుచున్నవి. ఇవి శిఖండి బాణములైన యెడల ప్రాణములను బాధింపజాలవు. ఇటువంటి బాణములను యీ శిఖండి యెప్పుడు వేయలేడు. ఈ బాణములు నారిగట్టిగాలాగి విడువబడినవిగా నున్నవి. మిక్కిలి ప్రకాశమానమైన రూపముగలవిగా నున్నవి. మిక్కిలి లక్ష్యశుద్ధిగలవిగా నున్నవి. అధికమైన తీక్ష్ణరూపమును గలిగి యున్నవి. గనుక యీ బాణములు అర్జునుని బాణములుగాని శిఖండి బాణములు గావని స్పష్టముగా తెలిసికొనుము. అని భీష్ముడు దుశ్శాసనునితో చెప్పుచు గొప్ప సమర్థతమమగు శక్త్యాయుధమును అర్జునునిమీద వేసెను. ఆ శక్త్యాయుధమును అర్జునుడు నరకి తుండ్లు చేసెను. అంత భీష్ముడు ఒకకత్తిని డాలును తీసికొని చూచు వారందరికి భయమును కలిగింపుచు రథముమీదనుండి క్రిందకు దిగెను. అర్జునుడు తన బాణములచేత భీష్ముని చేతియందుండు కత్తిని డాలును రెంటినినరకి తమసైనికులతో బిగ్గరగా అర్జునుడు యిట్లనెను, పాండవరథికులారా! నేనుండగా మీకు భయములేదు, ఇపుడు మీరందరును భీష్ముని చుట్టుకొనుడు. అని అర్జునుడు

పెద్దకంఠధ్వనితో చెప్పగా ఆమాటలను పాండవరథికులు వినినవారై భీష్మునిమీద బాణములను వేయుడనియు, భీష్మునికొట్టుడనియుపొడువు డనియు, చెప్పుడు. పాండవరథికులందరును భీష్ముని దగ్గరకుపోయి అతనిని చుట్టుకొనిరి. కౌరవ పక్షమందుండు రథికులందరును పాండవ రథికులతో యుద్ధముచేసిరి. ఆయుద్ధము మిక్కిలి ఘోరముగా నుండెను. ఆ సమయమందు అర్జునుడు కోపించుకొని కౌరవ రథికుల సైన్యములను చెదరగొట్టెను. పాండవరథికులందరును భీష్మునిమీద వేలకైనను సందులేనట్లుగా క్రూరబాణములను వేసిరి.

## భీష్ముడు శరతల్పగతుడగుట

ధృతరాష్ట్రమహారాజా! సూర్యుడంతట అస్తమించుటకు పోవుచు శాంతుడగుచుండెను. ఆ సమయమందు అర్జునుడు భీష్ముని దగ్గరకు పోయి అతనిమీదకు క్రూరములైన బాణసమూహములను ప్రయోగించి భీష్మునిపడవేసెను. అప్పుడు భీష్ముడు తూర్పుదిక్కు తట్టు శిరస్సువుండునట్లుగా క్రిందపడెను. నీకొడుకులగు దుర్యోధనాదులును అందరును భీష్ముడు పడుచున్నప్పుడు చక్కగా చూచుచుండిరి. అప్పుడు భూమివడకెను. సూర్యుడస్తమించినట్లు మహాబలపరాక్రమ శౌర్య ధైర్య దివ్యాస్త్రసంపన్నుడగు భీష్ముడు పడెను. భీష్ముడు పడునపుడు భూమియందు తన దేహమును సోక నివ్వక తన దేహ మందుగల బాణములను పాన్పుగాచేసికొని నందుకు శరతల్పగతు డాయెను. భీష్ముడు శరతల్పగతుడైనతోడనే ఆ మహాత్ముడగు భీష్ముడు దేవభావమును పొందెను. ఆ సమయమున ఆకాశమునగల దేవత లందరు తమలోతాము యిట్లని తలచుచుండిరి. అయ్యో! యీ మహాత్ముడగు భీష్ముడు పుణ్యాత్ముడు. ఇట్టి పుణ్యపురుషుడు యీ దక్షిణాయన కాలమున మృతుడాయెనుగదా! అని యిట్లు దేవతలు

చెప్పుకొనుచు దుఃఖించుచుండిరి. ఆ దేవతల అభిప్రాయమును భీష్ముడెరిగి వారితో యిట్లనెను. దేవతలారా! ఇప్పుడు దక్షిణాయన కాలమని నేను తెలుసుకొని నాదేహమందు ప్రాణములను నిలిపి యున్నాను. మీరు కొంచెమైనను దుఃఖింపవద్దు. సత్యవతిని నేను తీసికొనివచ్చి నాతండ్రియగు శంతను మహారాజుకిచ్చి వివాహము చేసితిని. అప్పుడు నాతండ్రిగారు నన్ను మెచ్చుకొని యితరులచేత నాకు మరణము లేకుండునట్లుగాను నేను తలచినప్పుడు నాకు మర ణము కలుగునట్లుగాను వరమిచ్చెను. ఆ వరముయొక్క శక్తిచేత నామరణము నాయిష్టములేక కలుగనేరదు. నా ప్రాణములు నావశ మందే యుండును. అని భీష్ముడు దేవతలతో చెప్పగా ఆమాటలు విని దేవతలు సంతోషించిరి. ఆ సమయమందు గంగాదేవి కొందరు మునులను భీష్ముని దగ్గరకు పంపగా ఆమునులు హంసరూపములతో యిట్లనిరి.

మహాత్మా! భీష్మా! మీతల్లియగు గంగాదేవి పంపుటచేత మేము వచ్చినాము. మేముమునులము. ఇప్పుడు దక్షిణాయన కాల మని నీతో చెప్పుటకు నీతల్లి మమ్ములను పంపించినది. అని యిట్లు హంసరూపులైన మునులుచెప్పగా అప్పుడు దక్షిణాయన కాలమని నేనుయెరిగి ప్రాణములను విడువక నిలిపియున్నాను. గనుక మీరు చింతింపవద్దు. అని ఇట్లు భీష్ముడు చెప్పగా ఆమాటలను మునులువిని వెళ్ళిరి. ఆసమయమందు దుర్యోధనుడు పంపించగా దుశ్శాసనుడు ద్రోణాచార్యుని వద్దకు వెళ్ళి భీష్ముడు పడెనని చెప్పెను. ఆమాటను ద్రోణుడువిని మూర్ఛపొంది కొంతసేపటికి మూర్ఛతెలిసి లేచి దీన మైన ముఖముగలవాడై దుర్యోధనుని దగ్గరకు వెళ్ళెను. ధృతరాష్ట్ర మహారాజా! ఆసమయమందు పాండవపక్షమందుండు మత్స్యదేశ మువాళ్ళు, వారును, పాంచాలదేశపువారును యాదవులును అధిక

సంతోషమందు మునిగినట్లుండిరి. ఆ పాండవ సైన్యములయందు సంతోషముచేత అనేక కేకలు వేయుచుండిరి. కొందరు సింహనాద ములు చేయుచుండిరి. అనేక విధములైన వాద్యకోటులు మ్రోగు చుండెను. అప్పుడు మీకొడుకులగు దుర్యోధనాదులును కౌరవపక్షమం దుండు రాజులును సైన్యములును పెద్దగా గొంతెత్తి యేడ్చు చుండిరి. ఆకాశమందుండు దేవగంధర్వాదులందరును ఆహా యనిఅరచు చుండిరి. ఈ శబ్దములన్నియు భూమ్యాకాశములునిండి గొప్పధ్వని గలిగియుండెను. అప్పుడు మన దుర్యోధన కౌరవులును, కౌరవ సైనికులును కాళ్ళుచేతులును కదలింపుకొన జాలక కండ్లయందు నీళ్ళుకార్చుచు దుఃఖమనస్సులు గలవారై పాండవులను చూచుచుం డిరేగాని కొంచెమైనను యుద్ధమునకు ప్రయత్నింపకుండిరి. ఆ సమయ మున సూర్యుడస్తమించెను. అని సంజయుడు చెప్పగా ధృతరాష్ట్రుడు యిట్లనెను.

సంజయుడా! నామనస్సు యినుమో! రాయియో! తెలియ లేదు. నీవు యిప్పుడు చెప్పిన మాటలన్నియు తీక్ష్ణబాణ సమూహ ములవలె నామనస్సునగ్రుచ్చుకొనినట్లున్నవి. అటువంటి మాటలను నామనస్సు విని నశింపకున్నది. ఇకను యేమైనను కొరత యున్న యెడల చెప్పుము. అని ధృతరాష్ట్రు డడుగగా సంజయు డిట్లు చెప్పెను. ధృతరాష్ట్రమహారాజా! మన దుర్యోధన దుశ్శాసనాది కౌరవులును ఆకౌరవపక్షమందుండు రథికులును అందరును కవచము లను విప్పి ఆయుధములను విడిచి భీష్మునిదగ్గరకు పోయిరి. పాండవు లును తమ బంధుమిత్రులతో గూడుకొని భీష్ముడు పడియున్న స్థలము నకు వెళ్ళిరి. అర్జును డొక్కడు మాత్రము ధనుర్బాణములను తీసికొని భీష్మునిదగ్గరకు వెళ్లెను. అట్లు వెళ్ళిన రెండుపక్షములవారును భీష్ముని

చుట్టును నిలిచియుండిరి. మరియు వారిని సేవింపుచుండిరి ఆ సమయమున యిరుపక్షములవారును మిక్కిలి శాంతమైన మనస్సుగలవారై ఒకరొకరి మీద రోషములను విడిచియుండిరి. ఇట్లాయిరు కక్షుల వారును భీష్ముని సేవింపుచుండగా భీష్ముడు మిగుల సంతోషించుచు వారలచేత సేవింపబడుచుండెను. ఆసమయమందు భీష్ముడు తనశిరస్సు క్రిందనున్నదని నీ కుమారులగు దుర్యోధనాదులకు చెప్పెను అప్పుడు దుర్యోధనాదులు మెత్తని డిండ్లు తెప్పించుటకు ప్రయత్నించిరి. ఆ విషయమును భీష్ముడు తెలిసికొని చిరునవ్వుగలవాడై అర్జునుని పిలిచెను. అర్జునుడు కండ్లయందు నీళ్లుకార్చుచు తన గాండీవమను దివ్యధనుస్సును తీసికొని శీఘ్రముగా భీష్మునిదగ్గరకు వెళ్ళెను. అప్పుడు భీష్ము డర్జునుని జూచి యిట్లనెను.

అర్జునా! నా తలచివరను శస్త్రాస్త్రములయొక్క కొనలయందుగల ఉక్కుతలగడులచేత బాణముల పాన్పుకు సరిపడి యుండునట్లు పెట్టుము. అని భీష్ము డర్జునునితో చెప్పెను. అర్జును డట్లనే చేసెదనని చెప్పి గాండీవమను తన దివ్యధనుస్సును తీసికొని భీష్ముని అనుజ్ఞను పొంది ఆ భీష్ముని తలయొక్క వెనుకభాగమునుతాకి యెత్తి మూడుబాణములను అభిమంత్రించి వేసెను. ఆ మూడుబాణముల యొక్క పుంఖములను భూమిమోచి నిలుచునట్లుగా చేసెను. అందుకు భీష్ముడు సంతోషముగలవాడై బాణముల పాన్పునకు తగిన తలగడను పెట్టితివని అర్జునుని పొగడెను. భీష్ముడు తన మనుమలగు పాండవులను దుర్యోధనాది కౌరవులను ఆ రెండుపక్షముల యందు గల రాజులను చూచి వారందరితో యిట్లనెను. ఓ పాండవ కౌరవులారా! సూర్యుడు ఉత్తరాయణము వచ్చు పర్యంతము యీ బాణముల పాన్పునందు పరమానందముగా నుండెదను. అంత పర్యంతము

మీరు నన్ను దృఢముగా రక్షింపవలయును. మీరు శ్రమయని తలచక నాచుట్టును అగ్గడ్తతోఁగూడియున్న కోటను కట్టుడు. అని భీష్ముడు చెప్పగా దుర్యోధనాదులును పాండవులును అధికమగు భక్తి చేత తమ తమ వారిలో తగిన జనులను యేర్పరచి భీష్ముడు చెప్పినట్లు కోటను కట్టుటకును అతనిని రక్షించుటకు నియమించిరి. అంతట వైద్యులువచ్చి భీష్మునిదేహమందలి గాయములకు వైద్యము చేసి మాన్పుటకు ప్రయత్నించిరి. అప్పుడు భీష్ముడు ఉల్లాసపడదని ఆవైద్యులను నివారించి వారి కోరికలకు తగిన బహుమానము లిచ్చి పంపించెను. మరియు సంగీతముల యందును వాద్యముల యందును నాట్యముల యందును నేర్పరులగువారు మహాత్ముడగు భీష్మునకు వినోదములు కలిగింపుచుండిరి. ఆసమయమందు భీష్ముడు నీళ్ళు త్రాగవలెనని అడిగెను. అప్పుడు మంచినీటిని అనేకులు తీసికొనివచ్చిరి. ఆనీటిని భీష్ముడు చూచి దుర్యోధనాదులతో యిట్లనెను.

దుర్యోధనాదులారా! నేను బాణముల పాన్పునందు నివసించి యున్నందున యితర జలములను వుపయోగించరాదు. తేజోమయమైన బాణముచేత భూమిలోనుంచి లేచివచ్చిన భూజలమును మాత్రము వుపయోగింపవలయును. అని యిట్లు భీష్ముడు చెప్పగా నీ పుత్రులగు దుర్యోధనాది కౌరవులును తక్కిన రాజులును ఆశ్చర్యభయములుగలవారై యుండిరి. భీష్ముడర్జునుని జూచి యిట్లనెను. అర్జునా! నాదేహమందు గ్రుచ్చుకొనిన బాణముల బాధచేత దేహమంతయు తపించుచున్నది. నాపెదవులు రెండును యిప్పుడు యెండుచున్నవి. నాకిప్పుడు త్రాగుటకు నీళ్లు కావలయును. తగిన జలములను తెచ్చుటకు నీవు సమర్థుడవు. శీఘ్రముగా జలములను తెచ్చి నాదప్పిని పోగొట్టుము. అని భీష్ముడు చెప్పగా అర్జును డట్లనే చేసెద

నని చెప్పి భీష్మునకు చుట్టును ప్రదక్షిణముగా తిరిగెను. అట్లు తిరిగి తేజోమయమైన బాణమును తీసికొని పర్జన్యుడను దేవతా సంబంధమైన మంత్రమును చక్కగా అభిమంత్రించి భూమిలోపలికి వేసెను. ఆబాణమునవలన భూమిలోనుండు జలము ధారారూపముగా ఎగసి వచ్చెను. ఆ జలము ప్రకాశమానమైన రూపముగలిగి దివ్యరస గంధముతో గూడినదై మనోహరముగా నుండెను. ఆ జలమును కౌరవులు చూచి గడగడ వడకుచు మిక్కిలి అధికమైన ఆశ్చర్యమును పొందిరి. అప్పుడు పాండవులును పాండవసైన్యములును పొంగుచు సింహనాదములు చేయుచు తమ తమ శంఖములను పూరించిరి. అంతట ఆ జలములను భీష్ముడు త్రాగి దప్పితీర్చుకొని తృప్తిని బొందెను. అర్జునుడు యీరీతిగా తన దివ్య బాణముచేత భూజలములను తెప్పించి భీష్ముని తృప్తిపరచెను. భీష్ముడు తృప్తిని పొంది అర్జునునితో యిట్లనెను.

అర్జునా! నీవు నరుడను మహామునీశ్వరుడవని నారద మహాముని వలన నేను వినియున్నాను. కృష్ణుడును నీవును కలసి యున్నయెడల మీ కసాధ్యమగు కార్యమేదియు నుండనేరదు. మహాబల పరాక్రమ శాలివగు నీతో విరోధముగూడదని యీదుర్యోధనునితో అనేకమార్లు చెప్పితిని.

ఎన్నిమార్లు చెప్పినను యీదుర్యోధనుడు నీతో విరోధము మానలేదు. ఈదుర్యోధనుడు యికమీద భీముని చేతచచ్చి చెడిపోగలడు. అని భీష్ముడు అర్జునునితో చెప్పి విచారమైన మనస్సుగల దుర్యోధనునితో యిట్లనెను. దుర్యోధనా! అర్జునుడు మహాబలపరాక్రమవంతుడు. అర్జునునకు నారాయణమూర్తి యగు కృష్ణుడు స్నేహితుడు. ఈకృష్ణార్జునులను జయించుటకు యెవ్వరికైనను

సాధ్యముకాదు గనుక యిక నీవు యుద్ధముచేయుట మానుకొని ధర్మ
రాజునకు ఇంద్రప్రస్థపట్టణమును యిచ్చి సగమురాజ్యమును యిమ్ము.
తక్కిన రాజ్యమును నీవు అనుభవింపుము. ఇట్లుచేసి యుద్ధము మాను
కొంటివేని మీరైనను బ్రతుకుదురు. మీరు కొందరైనను బ్రతుకుట
నీకు సమ్మతిలేదా! అని యిట్లు భీష్ముడు దుర్యోధనునితో చెప్పి ఊర
కుండెను. ఆమాటలను విని కౌరవపాండవులును, ప్రతిమాట చెప్పక
అందరును భీష్మునకు నమస్కరించి తమతమ నివాసశిబిరములకు
వెళ్ళిరి. ఆవెళ్లు మార్గమందు కృష్ణుడు ధర్మరాజునుజూచి యిట్లనెను.
ధర్మరాజా! యీభీష్ముని దేవతలైనను యుద్ధమందు గెలువ
జాలరు. అద్భుతపరాక్రమవంతులగు మీరు యీ భీష్ముని గెలిచితిరి.
మీరుతప్ప యితరులెవ్వరును యీభీష్ముని జయింపజాలరు. అని
కృష్ణుడు ధర్మరాజుతో చెప్పగా ధర్మరాజు కృష్ణునితో యిట్లనెను.
కృష్ణా! మేము మనుష్యులలో హీనులము. పరమేశ్వరుడవగు నిన్ను
ఆశ్రయించి భీష్మునిజయించుటకు తగినవారమైతిమి. అని ధర్మరాజు
కృష్ణుని పొగడుకొనెను. ఈరీతిగా ధర్మరాజును కృష్ణుడును ఒకరి
నొకరు వీరిద్దరును స్తుతింపుచు తమతమ శిబిరములకు వెళ్ళిరి.

## కర్ణుడు భీష్మునియొద్దకు బోయి వినతుడగుట

ఓధృతరాష్ట్ర మహారాజా! అటుపిమ్మట ఆపదవనాటి రాత్రి
కాలమందు కర్ణుడు భీష్మునిదగ్గరకు పోయి భక్తినియమములతో
భీష్మునిపాదములకు నమస్కరించి యిట్లనెను. మహాత్మా! భీష్మా!
నేను కర్ణుడను. నిన్ను సేవించుటకు యిక్కడికివచ్చితిని. కండ్లు
తెరచి నన్నుచూడుము. నీయోగ్యతకు యిక్కడ పడియుండ
వచ్చునా? ఇట్లుయేర్పాటుచేసిన ఆబ్రహ్మదేవుని యేమనిచెప్పుదును!

నాయందు నీవు కోపమునువిడిచి నాయందు నీవు పుత్రభావముంచి నన్ను చల్లగా చూడుము. నాతో తగినట్లు మాటలాడవే యని యిట్లు కర్ణుడు భీష్ముని ప్రార్థించెను. ఆమాటలను భీష్ముడువిని ప్రీతిచేత కర్ణుని దగ్గరకు పిలిచి ఒకచేతిచేత కౌగలించుకొని తనదగ్గర నున్న రక్షకజనులను అవతలికి పంపించి కర్ణునితో యిట్లనెను. కర్ణుడా! నీయందు నాకెప్పుడును కోపములేదు. నీవు బిడ్డవంటివాడవనియు, బిడ్డలను చెరుపరాదనియు, నీయందు ద్వేషమువహింపలేదు. నీయందు నాకు కోపములేదని చెప్పరాదు. నిన్ను నిష్ఠూరపుమాటలచేత అదలించితిని గాని మరియొకటికాదు.

అట్లు అదలించుట శిక్షయేగాని రోషముగాదని తెలుసుకొనుము. నీవు దేవాంశమువలన పుట్టినవాడవు. నీతో మనుష్యులు సమానులుకారు. నీవు కుంతీదేవియందు పుట్టినవాడవేకాని రాధయందు పుట్టినవాడవుకావు. ఈవిషయమును వేదవ్యాసమునీంద్రుడు నాతో రహస్యముగా చెప్పియున్నాడు. నీ తేజోవిశేషమును నేను యెరిగియున్నాను. నీవు పాండురాజుయొక్క కుమారుడవైనందున నీయందు నాకు పుత్రస్నేహముండునేకాని మాత్సర్యభావ ముండనేరదు. ఒక్కవిషయమును యిప్పుడు చెప్పెదనువినుము. నేను పడుటచేత కౌరవపాండవులకు వైరమును నశింపచేసినవాడనైతిని. నీవు బ్రతికియుండి నేను చెప్పబోవుప్రకారముచేసి కౌరవపాండవులకు వైరమును పూర్తిగా పోగొట్టుము. అదియెట్లనగా చెప్పెదనువినుము. ఆపాండవులను జయించుటకు యెవ్వరికిని సాధ్యముకాదు. పరమేశ్వరుడగు కృష్ణుడు పాండవులకు అధీనుడైయున్నాడు. గనుక పాండవులతో విరోధము పెట్టుకొనుటవలన కీడు కలుగునేకాని యెంతమాత్రమును మేలుకలుగదు. నీవు యితరసంకల్పములను విడిచి పాండవులతో

కలిసియుండుదును. ఇట్లు చేసితివేని కౌరవపాండవులకు విరోధము పూర్తిగా అంతరింపగలదు. అని భీష్ముడు కర్ణునితో చెప్పగా ఆ మాటలను కర్ణుడువిని భీష్మునితో యిట్లనెను. మహాత్మా! భీష్మా! నేను కుంతీదేవియందు పుట్టినట్లు పెద్దలవలన అంతయు వినియున్నాను. అంతయు నేను యెరిగినపుడు పాండవులతో యిక నాకు స్నేహము సరిపడదు. పాండవులు మహాబలవంతులు. విష్ణుదేవుడగు కృష్ణుడు పాండవులకు అండయైయున్నాడు. ఆపాండవులను యుద్ధమందు జయించుటకు సాధ్యముకాదని నేనును యెరిగియున్నాను. అయినను దుర్యోధనుడు నన్ను విశేషముగా గౌరవించి సన్మానించియున్నాడు. అటువంటి దుర్యోధనుని యిప్పుడు విడువవచ్చునా? ఇది మనవంటివారికి తగునా? అదిగాక పూర్వము కౌరవసభయందు పాండవులను గురించి నేను అనుమానింపక అవమానపుమాటలను అధికముగా మాటలాడితిని. అనేకమార్లు నేను పాండవులను అవమానించియున్నాను. కౌరవులకును, పాండవులకును విరోధమనుపించినవాడను నేనే. ఇపుడు నేను పాండవులలో కలిసియున్నయెడల కౌరవులకును, పాండవులకును, విరోధినగుదును. గనుక నేను యెప్పటివలె దుర్యోధనుని పక్షమందుండి పాండవులతో యుద్ధముచేయుటయే శ్రేష్ఠము. మహాత్మా! భీష్మా! సర్వము దైవాధీనమైయున్నది. దైవనిర్మితమైన కార్యమును మనబుద్ధిచేత యోచించి తప్పించుటకు సాధ్యముకాదు. నీవిక మరియొకమాట చెప్పక నన్ను శత్రుసైన్యముల మీదికి పంపుము. అట్లుపంపితివేని దుర్యోధనుడు నన్ను పోషించిన ఋణమును తీర్చెదను. నాభుజాబలముచేత పాండవులతో యుద్ధముచేసి లోకముచేత పొగడబడెదను. కృష్ణార్జునులకు భయముకలుగునట్లుగా యుద్ధముచేసెదను. అని కర్ణుడు చెప్పగా ఆమాటలను భీష్ముడువిని కర్ణునితో యిట్లనెను.

కర్ణా! నీవు అంత కార్యమును చేయదగిన వాడవని అందరము యెరుగుదుము. నీ భుజాబలమే సర్వదా దుర్యోధనునకు సహాయమై యుండును. దుర్యోధనునకు ఏ కార్యము మంచిదని తోచునో ఆకార్యమును చేయుము. నీమనస్సునందు సంతోషింపుము. అనుమానమును విడువుము. నీవు పాండవులతో యుద్ధము చేయుటకు నేను అనుజ్ఞయిచ్చితిని. అని భీష్ముడు చెప్పగా భీష్ముని బంధుభావమునకు కర్ణుడు పరమానందము నొంది తన నివాసస్థలమునకు వెళ్ళెను. అని సంజయుడు ధృతరాష్ట్రుని చూచి చెప్పెనని వైశంపాయనుడు జనమేజయునకు చెప్పెను.

ఇది శ్రీ కాశ్యపస గోత్రపవిత్ర మంత్రి వంశ పయః
పారావార పరిపూర్ణ సుధాకర లక్ష్మణామాత్య
పుత్ర లక్ష్మీనారాయణామాత్య ప్రణీతంబైన.
తెనుగువచన కావ్యంబగు శ్రీ మహా
భారతమందు భీష్మపర్వము
ము గి సె ను.

# భీష్మపర్వము - అనుబంధము



## భరతవంశ సంగ్రహము

దుష్యంత మహారాజునకు శకుంతలయను భార్యగలదు. వా
భరతుడను మహారాజు పుట్టెను. అతని వంశస్థు లందరును భరత
శస్థులని చెప్పబడుదురు. ఆ భరతుని వంశమందు కురురాజు పుట్టె
అతని వంశమందు పుట్టినవా రందరును కౌరవులని చెప్పబడుదు
కురురా మేజయరాజునకు సుబలయను భార్యకలదు. వారికి పరీక్షిత్తను కుమ
రుడు పుంపాపుట్టెను. ఆ పరీక్షిత్తునకు సుధామ యను భార్యకలదు. వా
భీమ రవృశసేనుడను కుమారుడు పుట్టెను. ఆ భీమసేనునకు సుమిత్రయ
పాండర్యగలదు. వారికి ప్రదీపుడు పుట్టెను. ఆ ప్రదీపునకు సునందయ
ర్యగలదు. వారికి దేవాపి, శంతనుడు, బాహ్లికుడు అను ముగ్గు
ధృతోడుకులుపుట్టిరి. వారిలో దేవాపియనువాడు బాల్యమందే తప
సేయుటకై తపోవనమునకు పోయెను. అందువలన రెండవవాడై
శంతనుడు రాజ్యభారమును వహించెను. శంతనునకు, భార్యయ
గంగాదేవివలన దేవవ్రతుడైన భీష్ముడు పుట్టెను. ఆ శంతనునకు
రెండవ భార్యయగు సత్యవతీ దేవివలన చిత్రాంగద, విచిత్రవీర్యు
లనువారిద్దరు కొడుకులు పుట్టిరి. వారిద్దరిలో చిత్రాంగదుడు బాల్యమం
గంధర్వునిచేత యుద్ధమందు చచ్చెను. అందువలన రెండవవాడై
నవిచిత్రవీర్యునకు భీష్ముడు రాజ్యాభిషేకము చేసెను. భీష్ముడు .
రాజు కుమార్తెలగు అంబిక, అంబాలిక యను యిద్దరు కన్యక
తెచ్చి విచిత్రవీర్యునకు వివాహముచేసెను. ఆ విచిత్రవీర్యుడు
ద్దరిభార్యల యందును అధికముగా రమించుటచేత క్షయవ్యాధి

వాడై చచ్చెను. విచిత్రవీర్యుడు చచ్చినపిమ్మట భరతవంశము
నశించునట్లు ఏర్పడెను. అప్పుడు సత్యవతీ దేవియొక్క ఆజ్ఞాప్రకా అంద
రము వేదవ్యాసుడు దేవరన్యాయముచేత అంబికయందు ధృతరా సహా
ష్ట్రుని పుట్టించెను. అంబాలికయందు పాండురాజును పుట్టించెను. అం మనో
బికయొక్క పరిచారికస్త్రీయందు విదురుని పుట్టించెను. ఈ ప్రకా అను
రము వేదవ్యాసునివలన ధృతరాష్ట్రుడును, పాండురాజును, విదురు ఖటకు
డును పుట్టిరి. వారిలో ధృతరాష్ట్రునకును, అతని భార్యయగు గాం వము
ధారికిని వ్యాసుని వరమువలన దుర్యోధనుడు మొదలగు నూర్గురు స్సైను,
కొడుకులు పుట్టిరి. మరియు పాండురాజుయొక్క అనుమతివలన అతని నుడు
భార్యలగు కుంతీదేవి, మాద్రీదేవులయందు ధర్మ, వాయు, దే
అశ్వనీదేవతల అనుగ్రహముచేత ధర్మరాజ, భీమ, అర్జున,
సహదేవులనెడి అయిదురుగు కొడుకులు గలిగిరి. ఆ అయిదు
ద్రౌపది ధర్మపత్ని ఆయెను. ఆ ద్రౌపదియందు ధర్మరాజునకు ప్ర
వింధ్యుడు పుట్టెను. భీమునకు శ్రుతసోముడు పుట్టెను. అర్జునునకు
శ్రుతకీర్తి పుట్టెను. నకులునకు శతానీకుడు పుట్టెను. సహదేవునకు
శ్రుతసేనుడు పుట్టెను. ఈ అయిదుగురును ఉపపాండవులనియు
ద్రౌపదీ పుత్రులనియు చెప్పబడుదురు. మరియు ధర్మరాజునకు స్వంత
భార్యయగు దేవకియను దానియందు జౌధేయుడనెడివాడు పుట్టెను.
భీమునకు తనస్వంతభార్యయగు జలధరయను స్త్రీయందు సుగుణు
డనెడి కొడుకు పుట్టెను. అర్జునునకు తనస్వంత భార్యయగు సుభద్ర
యందు అభిమన్యుడు పుట్టెను. నకులునకు తనస్వంతభార్యయగు
రేణుమతియందు నిరమిత్రుడు పుట్టెను. సహదేవునకు తనస్వంత
భార్యయైన విజయకు సుహోత్రుడనెడివాడు పుట్టెను మరియుభీమ
నకు హిడింబయనెడి రాక్షసస్త్రీయందు ఘటోత్కచుడు పుట్టెను
వీరిలో వంశకరుడైన అభిమన్యునకు విరాటరాజపుత్రికయగు ఉత్త

యందు పరీక్షిత్తు పుట్టెను. ఆ పరీక్షిత్తునకు అతని భార్యయగు మాద్రవతికి జనమేజయుడు పుట్టెను. ఆ జనమేజయునకు అతని భార్యయగు వపుష్టకును శతానీక శంఖులనెడి ఇద్దరు కొడుకులు పుట్టిరి. వారిద్దరిలో శతానీకునకు, వాని భార్యయగు వైదేహికిని అశ్వమేధవంతు డనెడివాడు పుట్టెను.

## భీష్మ, ద్రోణ, కర్ణ, శల్య, సౌప్తిక పర్వములయందువచ్చు వారి నామముల వివరణ

కురరా మేజయుడు—అభిమన్యుని కుమారుడైన పరీక్షిత్తుని కొడుకు.

పాయనుడు—వ్యాసుని శిష్యుడు. బ్రాహ్మణుడు.

రవులు—ధృతరాష్ట్రుని కుమారులగు దుర్యోధనాదులు.

పాండవులు—పాండురాజు కుమారులగు ధర్మరాజు, భీముడు, అర్జునుడు, నకులుడు, సహదేవుడు.

ధృతరాష్ట్రుడు—విచిత్రవీర్యుని కుమారుడు, వ్యాసమునివలన అంబికయందు పుట్టినవాడు. పాండురాజునకు సవతితల్లి కుమారుడగు అన్న, దుర్యోధనాదులకు తండ్రి, పుట్టుగ్రుడ్డి.

సంజయుడు—వేదవ్యాసుని శిష్యుడు. ధృతరాష్ట్రుని మంత్రి శూద్రుడు.

వేదవ్యాసుడు—పరాశరమునికి సత్యవతీదేవియందు కన్యాత్వమున పుట్టిన బ్రహ్మర్షి, విష్ణుని యవతారము.

పాండురాజు—విచిత్రవీర్యుని కుమారుడు, వ్యాసమునివలన అంబాలికయందు పుట్టినవాడు. ధృతరాష్ట్రునకు సవతితల్లి కుమారుడగు తమ్ముడు, పాండవులకు తండ్రి.

దుర్యోధనుడు—ధృతరాష్ట్రుని పెద్దకొడుకు.

శకుని—దుర్యోధనుని మేనమామ, గాంధారీదేవి తమ్ముడు, గాంధార దేశపురాజు.

విదురుడు—వేదవ్యాసునివలన విచిత్రవీర్యుని అభిమానస్త్రీయును, అంబికయొక్క పరిచారికయును యగు శూద్ర స్త్రీయందు పుట్టినవాడు. వరుసచేత ధృతరాష్ట్రునకు తమ్ముడు.

గాంధారి—గాంధారదేశపు రాజకూతురు; శకునికిఅక్క, ధృతరాష్ట్రునిభార్య.

భీష్ముడు—శంతనుని కుమారుడు, గంగాదేవియందు శంతనునివలన పుట్టినవాడు, విచిత్రవీర్యునకు సవతితల్లికొడుకు, ధృతరాష్ట్ర పాండురాజులకు పెదతండ్రి.

పరశురాముడు—జమదగ్ని కుమారుడు విష్ణునియవతారము.

శిఖండి—ద్రుపదరాజకుమారుడు.

ద్రోణాచార్యుడు—భరద్వాజుని కుమారుడు, అశ్వత్థామ తండ్రి, విప్రుడు.

కృపాచార్యుడు—ద్రోణాచార్యునకు బావమరది, అశ్వత్థామకు మేనమామ.

అశ్వత్థామ—ద్రోణాచార్యునికొడుకు.

శల్యుడు—మద్రదేశపురాజు, పాండవులకు మేనమామ, పాండురాజునకు బావమరది, కౌరవ వంశస్థుడు.

దుశ్శాసనుడు—ధృతరాష్ట్రునికొడుకు, దుర్యోధనుని తమ్ముడు.

కర్ణుడు—కుంతీదేవికి సూర్యునివలన కన్యాత్వమునందు పుట్టినవాడు. పాండురాజుకుమారుడు. పాండవులకు అన్న కాదగినవాడు. అంగదేశపురాజు.

కృతవర్మ—యాదవవంశస్థుడు

సైంధవుడు—సింధుదేశపురాజు, దుర్యోధనుని బావమరిది, ధృతరాష్ట్రుని అల్లుడు,

విందానవిందులు—అవంతీదేశపురాజులు.

భగదత్తుడు—నరకాసురుని కుమారుడు.

బాహ్లికుడు—శంతనుని తమ్ముడు. భీష్ముని పినతండ్రి. సోమదత్తుని తండ్రి.

సోమదత్తుడు—బాహ్లికుని కుమారుడు, భూరిశ్రవసుని తండ్రి.

భూరిశ్రవసుడు—సోమదత్తుని కుమారుడు.

సుదక్షిణుడు—కాంభోజదేశపురాజు. కాంభోజుడు

బృహద్బలుడు—కోసలదేశపురాజు

నీలుడు—మాహిష్మతీపట్టణపురాజు

సుశర్మ—త్రిగర్తదేశపురాజు

జటాసురుడు... అలంబసుడు—బకాసురునితమ్ముడు. రాక్షసరాజు.

అలాయుధుడు—రాక్షసరాజు

దుర్మర్షణుడు—ధృతరాష్ట్రుని కుమారుడు

వివింశతి—ధృతరాష్ట్రుని కుమారుడు

వికర్ణుడు—ధృతరాష్ట్రుని కుమారుడు

సంశప్తకులు—అర్జునుని చంపెదమని, లేక వానిచేత చచ్చెదమని ప్రతిజ్ఞ చేసిన రాజులు

ధర్మరాజు—పాండురాజు కుమారుడు. యమధర్మరాజువలన కుంతీదేవి యందు పుట్టినవాడు.

భీముడు—పాండురాజు కుమారుడు. ధర్మరాజు సోదరుడు. వాయుదేవుని వలన కుంతియందు పుట్టినవాడు

అర్జునుడు—పాండురాజు కుమారుడు, ధర్మరాజు భీములకు తమ్ముడు దేవేంద్రునివలన కుంతియందు పుట్టినవాడు.

నకులుడు—పాండురాజు కుమారుడు, ధర్మజ భీమార్జునుల తమ్ముడు మాద్రియందు అశ్వినీదేవతలవలన పుట్టినవాడు పాండురాజునకు మాద్రి రెండవభార్య.

సహదేవుడు—పాండురాజు కుమారుడు, ధర్మజ, భీమార్జున నకులుల తమ్ముడు, మాద్రియందు అశ్వనీదేవతలవలన పుట్టినవాడు.

కృష్ణుడు—వసుదేవుని కుమారుడు, యాదవ వంశమువాడు, విష్ణుని అవతారము, భగవంతుడు, కుంతీదేవికి మేనల్లుడు, పాండవులకు బావమరిది, అర్జునునకు సారథి.

అభిమన్యుడు—అర్జునుని కుమారుడు, కృష్ణుని మేనల్లుడు, సుభద్రాదేవి కుమారుడు.

ద్రౌపదేయులు—ప్రతివింధ్యుడు, శ్రుతసోముడు శ్రుతకీర్తి, శతానీకుడు, శ్రుతసేనుడు, వీరు ఉపపాండవులని కూడ పిలువబడుదురు.

ప్రతివింధ్యుడు—ధర్మరాజు కుమారుడు, ద్రౌపదికి పుట్టినవాడు.

శ్రుతసోముడు—భీమునకు ద్రౌపదియందు పుట్టిన కుమారుడు

శ్రుతకీర్తి—అర్జునునకు ద్రౌపదియందు పుట్టినవాడు

శతానీకుడు—నకులునకు ద్రౌపదియందు పుట్టినవాడు

శ్రుతసేనుడు—సహదేవునికి ద్రౌపదియందు పుట్టినవాడు.

ద్రుపదరాజు—పాంచాలదేశపు రాజు ద్రౌపది ధృష్టద్యుమ్నులకు తండ్రి.

విరాటరాజు—మత్స్యదేశపురాజు, అభిమన్యుని భార్యయగు ఉత్తరకు తండ్రి.

సాత్యకి—వసుదేవుని కుమారుడు, కృష్ణునితమ్ముడు, వసుదేవునకు సత్యకయను భార్యయందు పుట్టినవాడు

చేకితానుడు—యాదవవంశస్థుడు

మాగధసహదేవుడు—మగధదేశపురాజగు జరాసంధుని కుమారుడు

ధృష్టకేతుడు—శిశుపాలుని కుమారుడు—చేదిదేశపురాజు

ఘటోత్కచుడు—భీమునకు హిడింబయను రాక్షస స్త్రీయందు పుట్టినవాడు

పాండ్యరాజు—పాండ్యదేశపురాజు

ధృష్టద్యుమ్నుడు—ద్రుపదరాజు కుమారుడు

శంఖుడు—విరాటరాజు కుమారుడు

యుయుత్సుడు—ధృతరాష్ట్రునకు కోమటి స్త్రీయందు పుట్టినవాడు

యుధామన్యుడు—ద్రుపదునికుమారుడు

ఉత్తమౌజుడు—ద్రుపదునికుమారుడు

మనువు—సూర్యుని కుమారుడు

ఇక్ష్వాకుడు—మనువుకొడుకు సూర్యవంశపు రాజులలో మొదటి వాడు.

దుష్ప్రకుడు—ధృతరాష్ట్రుని కుమారుడు

దుర్ముఖుడు— ,,

చిత్రసేనుడు— ,,

పురమిత్రుడు— ,,

మనభీముడు— ,,

బృహత్క్షత్రుడు—కేకయదేశపురాజు

ఇలావంతుడు—అర్జునునకు ఉలూచియను నాగకన్యకయందు పుట్టిన వాడు.

శ్రుతాయువు—కళింగదేశపురాజు

విందుడు—ధృతరాష్ట్రుని కుమారుడు

అనువిందుడు— ,,

కైకయులు—కేకయదేశపురాజులు

ఉత్తరుడు—విరాటరాజకుమారుడు

దీర్ఘబాహుడు—ధృతరాష్ట్రుని కుమారుడు

ఉలూకుడు—శకునికుమారుడు

శూరసేనుడు—శూరసేనదేశపురాజు

కేతుమంతుడు—నిషాద దేశపు రాజు

చక్ర దేవుడు—కళింగ దేశపు రాజగు శ్రుతాయువుని కుమారుడు

భానుమంతుడు—శ్రుతాయుని తమ్ముడు

లక్ష్మణుడు—దుర్యోధనుని కుమారుడు

మగధుడు—మగధ దేశపు రాజపుత్రుడు

సేనాపతి—ధృతరాష్ట్రుని కొడుకు

సుషేణుడు— ,,

జలసంధుడు ,,

సులోచనుడు— ,,

భీమరధుడు— ,,

భీమబాహుడు— ,,

విచిత్రుడు— ,,

వికటుడు— ,,

ఉగ్రలోటవుడు— ,,

సముడు— ,,

శతానీకుడు—విరాటరాజు తమ్ముడు.

కుంతీదేవి—పాండురాజు పెద్దభార్య, కృష్ణునకు మేనత్త, పాండవులకు తల్లి.

ద్రౌపదీదేవి—ద్రుపదరాజపుత్రి, పాండవులైదుగురికిని భార్య.

సునాభుడు—ధృతరాష్ట్రుని కుమారుడు.

ఉలూచి—అర్జునుని భార్య—నాగకన్యక.

కుండభేది—ధృతరాష్ట్రుని కుమారుడు

అనాధృష్టుడు— ,,

కనకధ్వజుడు— ,,

విరోధి— ,,

[illegible]లోచనుడు— ,,

సత్యవతీదేవి—శంతనమహారాజుభార్య. చిత్రాంగద విచిత్రవీర్యు లకుతల్లి.
గంగాదేవి—భీష్ముని తల్లి.
రాధ—కర్ణుని పెంపుడుతల్లి.
సుభద్ర—అర్జునుని భార్య, కృష్ణుని చెల్లెలు, అభిమన్యుని తల్లి.
ఉత్తర—విరాటరాజ పుత్రిక, అభిమన్యునిభార్య.
సుకుమారుడు—ద్రుపదవంశస్థుడు.
సింహసేనుడు— ,,
వ్యాఘ్రదత్తుడు— ,,
సత్యరథుడు—త్రిగర్తదేశపు రాజగు సుశర్మని తమ్ముడు.
సత్యసేనుడు... ,,
సత్యకర్ముడు ,,
సత్యవర్ముడు—త్రిగర్తదేశపురాజగు సుశర్మనితమ్ముడు.
సత్యజిత్తు—పాంచాల వంశస్థుడు.
సుధన్వుడు— ,,
కృతుడు— ,,
సూర్యదత్తుడు—విరాటరాజుతమ్ముడు.
క్షత్రవర్ముడు—ద్రుపదుని కుమారుడు.
శ్రుతవర్మ—ధృతరాష్ట్రుని కుమారుడు.
జయుడు— ,,
జయత్సేనుడు— ,,
బృహద్ధనుడు— ,,
జయమిత్రుడు— ,,
వృషుడు—శకునితమ్ముడు.
అచలుడు— ,,

నారాయణ గోపాలురు—యాదవులు,
ప్రద్యుమ్నుడు— కృష్ణుని కుమారుడు
అశ్మకుడు— ,,
రుక్మరథుడు—శల్యునికుమారుడు.
అశ్మంతకుడు—మగధరాజకుమారుడు.
కాలకేయులు—సముద్రములో నివసించు రాజులు.
సంవర్తుడు—అంగీరస మహాముని కొడుకు. బృహస్పతికితమ్ముడు.
దారుకుడు—కృష్ణుని సారథి.
శ్రుతాయుధుడు—వరుణ దేవునికుమారుడు.
వరుణదేవుడు—అష్టవసువులలో నొకడు. నీటికధి దేవత.
అయుతాయువు—కళింగ దేశపురాజగు శ్రుతాయువునితమ్ముడు.
నిరమిత్రుడు—త్రిగర్త దేశపు రాజగు సుశర్మునికుమారుడు.
వ్యాఘ్రదత్తుడు—మగధ దేశపు రాజకుమారుడు.
జలసంధుడు— ,,
వీరకేతు—ద్రుపదుని కుమారుడు.
చిత్రకేతుడు— ,,
చిత్రవర్మడు ,,
చిత్రరథుడు— ,,
దుర్జయుడు—ధృతరాష్ట్రుని కుమారుడు.
ద్రుముడు—కర్ణుని తమ్ముడు, సూతునికుమారుడు, శూద్రుడు.
జయరాతుడు— ,,
దుర్మదుడు—ధృతరాష్ట్రునికుమారుడు.
విజయుడు— ,,
విచిత్రుడు—ధృతరాష్ట్రుని కుమారుడు.
చిత్రుడు— ,,

చిత్రాత్మకుడు—ధృతరాష్ట్రుని కుమారుడు
చారుచిత్రుడు— ,,
చిత్రధ్వజుడు— ,,
చిత్రాయుధుడు— ,,
చిత్రకర్మ్ముడు— ,,
శత్రుంసహుడు— ,,
శత్రుంజయుడు— ,,
సుదేహుడు— ,,
మదనుడు— ,,
ద్రుముడు— ,,
చిత్రబాహుడు— ,,
అంజనపర్వుడు—ఘటోత్కచుని కుమారుడు, రాక్షసుడు
సురథుడు—ద్రుపదుని కుమారుడు.
శ్రుతజయుడు— ,,
బలానీకుడు— ,,
జయానీకుడు— ,,
విజయుడు— ,,
ప్రుషుడు— ,,
చంద్రదేవుడు— ,,
వృషరథుడు— ,,
సుశర్మ— ,,
చంద్రసేనుడు—శల్యుని రథచక్రర
ద్యుమత్సేనుడు— ,,
సురథుడు—పాంచాలవంశస్థుడు.

మిత్రసేనుడు—సుశర్మని కుమారుడు.

మిత్రదేవుడు— ,,

చంద్రదేవుడు— ,,

మిత్రవర్మడు— ,,

సువర్మ—సుశర్మని వంశస్థుడు,

త్వష్ట్రి—విశ్వకర్మ, దేవతలకు శిల్పిపని చేయువాడు

భానుదేవుడు—పాంచాలరాజ కుమారుడు.

చిత్రసేనుడు— ,,

సేనాబిందుడు—పాంచాలకుమారుడు

తపస్యుడు— ,,

శూరసేనుడు— ,,

సుసేనుడు—కర్ణునికుమారుడు,

సత్యసేనుడు— ,,

వికటుడు—ధృతరాష్ట్రునికుమారుడు.

సముడు— ,,

క్రోధి— ,,

నందుడు— ,,

ఉపనందుడు— ,,

సుకేతుడు—పాంచా[illegible]—కర్ణుని తమ్ముడు, సూతునికొ

దండ[illegible]రాతుడు— ,,

దుర్మథుడు—ధృతరాష్ట్రునికుమారుడు.

విజయుడు— ,,

విచిత్రుడు—ధృతరాష్ట్రుని కుమారుడు.

చిత్రుడు— ,,

రోచమానుడు—పాంచాలవంశస్థుడు.
సింహసేనుడు— ,,
విష్ణువర్మ్ముడు—చేదిదేశపు రథిక శ్రేష్ఠుడు.
దేవాపి— ,,
ఉపప్లావ్యము—మత్స్యపట్టణము, విరాటునిరాజధాని.
భద్రుడు—చేదిదేశపు రథిక శ్రేష్ఠుడు.
దండధరుడు— ,,
చిత్రుడు— ,,
చిత్రాయుధుడు— ,,
హరి— ,,
సింహుడు— ,,
రోచమానుడు— ,,
శలభుడు— ,,
కేతువు— ,,
దండధారుడు—మగధదేశపురాజు.
ఉద్దండుడు—దండధారునితమ్ముడు.
మలయధ్వజుడు—పాండ్యదేశపురాజు.
పాండ్యదేశము—ద్రవిడదేశము.
సుదేవుడు—కర్ణునికుమారుడు.
చిత్రసేనుడు— ,,
సత్యసేనుడు— ,,
సుశర్మ— ,,
చంద్రసేనుడు—శల్యుని రథచక్రరక్షకుడు.
ద్యుమత్సేనుడు— ,,
సురథుడు—పాంచాలవంశస్థుడు.

దుర్విమోచనుడు—ధృతరాష్ట్రుని కుమారుడు.
దుష్టదర్శనుడు— ,,
సత్యకర్ముడు—త్రిగర్త దేశపు రథిక శ్రేష్ఠుడు.
సత్యేషుడు—సంశప్తకులలో చేరినవాడు.
సుదర్శనుడు—ధృతరాష్ట్రుని కుమారుడు.
దక్షప్రజాపతి—బ్రహ్మదేవునికొడుకు, బ్రాహ్మణుడు.
బృహస్పతి—అంగీరస మహామునికొడుకు, దేవతలకుగురువు.
ప్రమథగణములు—శివుని సేవించు భక్తులు.
కుబేరుడు—ధనాధిపతి, అష్టదిక్పాలకులలో ఒకడు.
ద్వారక—యాదవుల పట్టణము, సముద్రములో నున్నది, కృష్ణుడు కట్టించెను.
బలరాముడు—వసుదేవునికి రోహిణియను భార్యయందు పుట్టినవాడు కృష్ణసాత్యకులకు అన్న.
సాంబుడు—కృష్ణునికొడుకు.

శ్రీ కొండపల్లి ముద్రాశాల, రాజమహేంద్రి.